# 1857
# స్వరాజ్య సంగ్రామం

మూలం :
స్వాతంత్ర్య వీరసావర్కార్

అనువాదం :
'వి జ య'

నవభారతి ప్రచురణలు
హైదరాబాద్

చతుర్థ ముద్రణ :
అక్టోబరు ' 83

వెల : రు. 15-00

ప్రతులకు :
సాహిత్య నికేతన్
3-4-852, బరకత్ పురా,
హైదరాబాదు-500 027.

సాహిత్య నికేతన్
ఏలూరు రోడ్డు,
విజయవాడ-520 002

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్ గూడ, హైదరాబాదు-1.

# ప్రకాశకుల నివేదన

చరిత్రను వివరించే గ్రంథాలు చాలా ఉన్నాయి. కాని చరిత్రనే సృష్టించిన గ్రంథాలు మాత్రం తక్కువ. ఈ రెండు అంశాలను సాధించిన మహాగ్రంథమిది. గ్రంథ చరిత్ర, గ్రంథస్థ చరిత్ర రెండూ అద్భుతములే. ఇందలి విషయమొక మహావిప్లవం. 1857 లో ఆంగ్ల దాస్యశృంఖలాలను పటాపంచలు చేసుకుని బయటపడేందుకు భారతజాతి జరిపిన అద్భుత సంగ్రామం ఇందులో వర్ణించబడింది. రచయిత మహావిప్లవకారుడు, దేశభక్తుడు అయిన స్వాతంత్ర్య వీరసావర్కార్. ఆయన జన్మ శతాబ్ది సందర్భంగా ఈ సంవత్సరం ఉత్సవాలు జరుపుకుంటున్నాం. విప్లవోద్యమాన్ని, విప్లవకారులను సృష్టించే మహాలక్ష్యంతో రచింపబడిన గ్రంథమిది. దీనిని పఠించి ఎందరో విప్లవకారులుగా మారారు. నాటి ప్రభుత్వంచే నిషేధింపబడిన ఈ గ్రంథపు ప్రతులను దేశభక్తులైన యువకులు స్వరాజ్య సమర కాలంలో వందరూపాయల ఖరీదుకు రహస్యంగా సంపాదించి, జట్లుజట్లుగా చదువుకునేవారంటే, స్వరాజ్య ఉద్యమ నిర్మాణంలో ఈ గ్రంథ ప్రాముఖ్యం విదితమవుతుంది.

నేడు పరిస్థితులు మారాయి. ఏ జాతీ తన చరిత్రలోని ఉజ్వల ఘట్టాలను విస్మరించజాలదు. అట్లు విస్మరించజాలని ఘట్టాలలో 1857 స్వరాజ్య సంగ్రామ మొకటి. ప్రతి పౌరుడు చదివి గర్వించదగిన చరిత్ర ఇది.

తెలుగులో ఈ అనువాదాన్ని మొదట జాగృతి ప్రచురణలలో విడుదల చేశారు. ద్వితీయ ముద్రణకు అనుమతి నిచ్చినవారికి, అనువాదకులు శ్రీ విజయకు ధన్యవాదాలు. సావర్కార్ శతజయంతి సందర్భంలో స్వాతంత్ర్య వీరసావర్కార్‌కు ఈ గ్రంథం మా చిరుకానుక.

హైదరాబాదు
జూన్ 1983

సంపాదకులు
నవభారతి ప్రచురణలు

# గ్రంథ చరిత్ర

ప్రపంచ సాహిత్య రంగంలోనే అది ఒక మహా విప్లవం. 24 ఏండ్ల యువకు డొకడు విప్లవ ఘంటంతో వ్రాసిన విప్లవ గ్రంథమొకటి 'రవి యస్తమించని' ఆంగ్ల సామ్రాజ్యాన్నే గజగజ లాడించిన సంఘటన సామాన్యమా ?

1908 లో మరాఠీ భాషలో వ్రాశారు శ్రీ సావర్కార్ ఈ గ్రంథాన్ని. ఆంగ్ల దాస్య శృంఖలముల త్రెంచివేసే ప్రయత్నంలో భారతజాతిని మరొక్క సారి ఉవ్వెత్తున విజృంభింపజేయడమే ఈ గ్రంథ లక్ష్యమని శ్రీ సావర్కార్ స్వయముగా తనచే ప్రారంభింపబడి పారిస్ నుండి నిర్వహింపబడుతున్న "తల్వార్" పత్రికలో తెలియజేశారు. అభినవ భారత విప్లవ సమాజ అధికార పత్రిక "తల్వార్". "సంస్కరణలు, శాంతియుత పరిష్కారము" లనే పేరుతో సతమతమవుతున్న నాటి కాంగ్రెసు ధోరణికి విభిన్నంగా విప్లవ జ్వాలలను ప్రతిపాదించిన మహాసంస్థ యది. కాంగ్రెసు కార్యకలాపములకు ప్రఖర దేశభక్తి, ఉజ్వలము, ఉద్వేగపూర్ణము, విప్లవాత్మకము నైన లక్ష్య లక్షణముల ప్రేరేపించుటకు అనువైన సామాజిక వాతావరణము నెలకొల్పిన భాగ్యము ఇట్టి విప్లవ సంస్థలది, విప్లవకారులది, విప్లవ రచనలదీన్ను.

ఈ గ్రంథ రచనలో రచయిత లక్ష్యము స్వరాజ్య సంగ్రామమును కొనసాగించుటకు ఇది సాధనము కావలెనని. చారిత్రక ఆధారములను విడనాడకుండగనే ఆ లక్ష్యమునకు అనుగుణముగా చరిత్రను ఇందు వివరించి యున్నారు. వారి దృక్పథమును వారి మాటలలోనే అర్థము చేసుకొనుట యుక్తము. రచన పూర్తికాగానే 1909 లో రచయిత తమ ఉపోద్ఘాతమందు ఇట్లు వ్రాసి యున్నారు:

"50 సంవత్సరాలు దాటిపోయి, ఉభయపక్షముల పాత్రధారులు కీర్తిశేషులై పోయిన ఈనాడు 1857 సంగ్రామ వివరము ప్రస్తుత రాజకీయ ఉదంతముగా గాక చారిత్రక విషయ మగుచున్నది. చారిత్రక పరిశోధకుని దృష్టితో ఆ మహోజ్జ్వల దృశాన్ని వీక్షిస్తుంటే '1857 సిపాయీ పితూరి' అనబడిన ఆ మహోజ్జ్వల ఘట్టంలో స్వరాజ్య సంగ్రామ కాంతులు కాన వచ్చాయి. మృతులు అమర సందేశముల నిచ్చినట్లు, వారి చితాభస్మముల నుండి నిరంతరము స్ఫూర్తికణము రెగజిమ్మబడుతున్నట్లు అనిపించేది. చరిత్రలో మరుగుపడి ఉన్న ఈ మహోజ్వల దృశ్యమును పరిశోధనా కాంతుల ప్రదర్శించిన నా దేశీయులు అమోదింతురను భావము కల్గినది. నే నందుకు ప్రయత్నించినాను. ఈ నాటికి నా భారత పాఠకులకు 1857 నాటి సంఘటనలకు సంబంధించిన సంభ్రమాశ్చర్యదాయకము, విశ్వాస పాత్రమునగు ఈ చిత్రము సందించగలిగాను.

"గతాన్ని గురించి స్మృతిలేని జాతికి భవిష్యత్తు లేదు. అయితే గత వైభవాన్ని ఘనంగా వర్ణించుకుంటూ కూర్చొనడం గాక, భవిష్యత్తును నిర్మించుకునేందుకు అదెలా ఉపయోగిస్తుందో యోచించుకుంటూ పురోగ మించాలనేదీ నిజమే. జాతి తన చరిత్రకు యజమాని కావాలిగాని బానిస కారాదు. గతంలో ఎప్పుడో చేయబడినాయనే కారణాన ప్రతి పనిని ప్రస్తుత పరిస్థితులలో నిమిత్తం లేకుండా చేయవల్పడం పూర్తిగా అవి వేకం. శివాజీ కాలములో ముస్లింలను ద్వేషించడం సమర్థనీయమే. అయితే అనాటి హిందువులలో అది ఉండేది కనుక నేడు కూడా ఉండాలనడం అన్యాయము, మూర్ఖత్వము.

"ఈ గ్రంథరచనకు ఆధారము దాదాపు అన్నీ ఆంగ్ల రచయితలవే. తమ పక్షమును విపరంగా, విశ్వసనీయంగా వర్ణించినట్లు రెండవ పక్షమును వర్ణించడం వారికి అసాధ్యం. ఈ గ్రంథమందు వర్ణింపబడిన అనేక దృశ్యాలు వారు వదలివేసి ఉండవచ్చు. ఇందు వర్ణింపబడిన దృశ్యాలలో

వారు విభేదించనూవచ్చు. కాని ఒక దేశభక్తుడగు చరిత్రకారుడు ఆ ఉత్తర భారతానికి వెళ్ళి, ఆ సంగ్రామ దృశ్యాలను చూచి. అందు పాల్గొన్నవారి నోటినుండి వెలువడిన వర్ణనలను సేకరిస్తే వాస్తవ దృశ్యాన్ని ఉహగాహన చేసుకునే అవకాశం ఉంటుంది. అచిరకాలంలో ఆ ఆధారాలు మృగ్యమై పోతాయి. ఒకటి రెండు దశాబ్దాలలో ఆ మహా సంగ్రామంలోని పాత్ర ధారులు శాశ్వతంగా వెళ్ళిపోయిన తర్వాత వారిని దర్శించే ఆనందం లభించదు. సరికదా, వారి చర్యల చరిత్ర శాశ్వతంగా అసమగ్రంగా మిగిలిపోతుంది. ఇంకా ఆలస్యం కాకముందే దేశభక్తుడైన చరిత్రకారు డైనా ఆ బాధ్యతను స్వీకరిస్తారా?

"ఈ గ్రంథమునందలి అత్యంతల్పాంశములను సైతము చరిత్రకు చరిత్ర ఘటనలకు సంబంధించిన అట్టి అధికారిక చారిత్రక వివరణలు సమర్థించి తీరుతాయి. ఈ నా కలమును అవల పెట్టబోయేముందు నాకున్న ఒకే ఒక కోరిక : అట్టి దేశభక్తియుతము, విశ్వాసపాత్రము, మరింత విపులము, సమగ్రములైన 1857 చరిత్ర యొకటి అచిరకాలముతో ఒక భారతీయుని కలమునుండి వెలువడి ఈ నా చిన్న పుస్తకము స్మృతిపథ మును వీడిపోవుగాక!"

ఇట్టి మహోన్నత భావములతో వ్రాయబడిన ఈ గ్రంథము ముద్రింపబడక పూర్వమే బ్రిటిష్ గూఢచారుల దృష్టి దీనిపై బడినది. ఆ రోజులలో సావర్కార్ ఈ గ్రంథస్థ విషయములను ఆంగ్లములో లండన్ లోని ఫ్రీ ఇండియా సొసైటీ సాప్తాహిక సమావేశములలో ప్రసంగిస్తుండే వారు. దానితో బ్రిటిష్ గూఢచారులు ఈ గ్రంథవిషయమును వాసనబట్టారు. అవి లండన్‌లోని స్కాట్లండ్‌యార్డు పోలీసు కేంద్రానికి చేరాయి. మిగి లిన ఆ మరాఠీ వ్రాతప్రతిని రక్షించుకొనుట విప్లవకారుల కర్తవ్యమైంది. కస్టమ్స్ అధికారుల కన్నుగప్పి ఎట్లెట్లో దానిని భారతదేశం చేర్చారు. ఒక్క ముద్రణాలయము కూడా దీనిని ముద్రించే ధైర్యం చూపలేక

పోయింది. చివరకు అభినవ భారత సమాజ సభ్యుడగు ముద్రణాలయాధికారి యొకరు దాని ముద్రణ ప్రయత్నములో ఉండగా భారతపోలీసులు ఈ గ్రంధానికై హఠాత్తుగా దాడులు ప్రారంభించారు. ఈ ముద్రణాలయముపై కూడా దాడి చేయుటకు పూర్వమే ఒక భారతీయ పోలీసు అధికారి వల్ల ఆ వార్తను తెలిసి ఈ ముద్రణాలయాధికారి దీనిని భద్రముగా ఆవలికి దాటవేశాడు. చివరకు ఆ గ్రంథం తిరిగి పారిస్‌లోని రచయితవద్దకే అముద్రితంగా చేరింది. ఇక మరాఠీ ముద్రణ అసాధ్యమని భావించి నాగరలిపిలో దీనిని జర్మనీలో అచ్చువేయించడానికి ప్రయత్నం జరిగింది. మరాఠీ తెలియని జర్మన్ కంపోజిటర్లతో అది కూడా అసాధ్యమని ఋజువైంది.

ఇక కనీసం దీని ఆంగ్లానువాదమునైనా ముద్రించాలనే ఆలోచన ప్రారంభమైంది. శ్రీ వి. వి. యస్. అయ్యర్ ఆధ్వర్యంలో లండన్‌లో ఐ. సి. ఎస్. వగైరా చదువుతున్న మహారాష్ట్రి యువకులద్వారా అనువాదము తయారైంది. అప్పటికే బ్రిటిష్ గూఢచారులు దీనిని కూడా పసిగట్టారు. ఆంగ్లేయులెవరూ దీనిని ముద్రించే అవకాశం లేకుండా భయం వ్యాపింపజేశారు. పుస్తకం ముద్రణకై పారిస్ చేరింది. అప్పట్లో జర్మన్ దాడి నిరోధానికై ఫ్రాన్స్, ఆంగ్ల ప్రభుత్వాలు ఏకమై ఉన్నాయి. ఉభయ దేశాల పోలీసులు కలిసి పనిచేస్తున్నారు. ఆ పరిస్థితిలో ఫ్రాన్సులో సైతం దీని ప్రచురణ అసాధ్యమైంది. ఇక విప్లవకారులు మెల్లగా హాలెండు చేరారు. ఎవరినో ఒప్పించి ముద్రణ నిర్వహించారు. అయితే అంతవరకు ముద్రణ ఫ్రాన్సులోనే జరుగుతుందని ప్రకటిస్తుండడంవల్ల పోలీసుల దృష్టి హాలెండుపై పడలేదు. పుస్తకం ముద్రింపబడగానే రహస్యంగా ఫ్రాన్సుకు చేర్చబడి విడుదలకు సిద్ధంగా వుంది.

ఇన్ని రకాల ప్రయత్నాలు జరుగుతుండగానే ఆంగ్లప్రభుత్వం ఈ గ్రంథం విషయంలో గజగజలాడిపో జొచ్చింది. ఇంకా అచ్చయినా కాక

పూర్వమే దీనిని నిషేధించారు. ఇది నిజంగా అపూర్వమైన విషయం. భావప్రకటనా స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యము ఉన్న ఏ దేశములోనైనా అనూహ్యమైన విషయం. బ్రిటిష్ పత్రికలే దానిని విమర్శించాయి. సావర్కార్ వేళాకోళం చేశాడు.

ఏమైతేనేం? పుస్తకం అచ్చయింది. అనేక ప్రతులు భారతదేశానికి గూడా చేర్చబడ్డాయి. పెట్టెలకు దొంగ అరలు తగిలించి కొన్ని చేర్చారు. పిక్విక్ పేపర్సు, డాన్ క్విక్సోట్, స్కాట్ వర్క్సు మున్నగు శీర్షికలతో ప్రత్యేకం బైండు చేయించి మరి అనేక ప్రతులను చేర్చారు. వేలాది ప్రతులు భారత ప్రముఖులకు, గ్రంథాలయాలకు, కళాశాలలకు, విప్లవ కారులకు చేరాయి. ప్రథమ ముద్రణ ప్రతులన్ని ఉచితంగానే వితరణ చేయబడ్డాయి. తపాలాఖర్చులను సైతం అభినవ భారత సమాజమే పెట్టుకున్నది. ఆ తర్వాత ఫ్రాన్సులో ముద్రణ బహిరంగముగానే జరిగింది. ఐర్లండు, ఫ్రాన్సు, రష్యా, అమెరికా, ఈజిప్టు, జర్మనీ, ఇంగ్లాండు మున్నగు దేశాల చరిత్రకారులు, రాజకీయవేత్తలు, విప్లవకారులు ఎంతో ఆసక్తితో దీన్ని పఠించారు.

ఈ లోపున 1910 నుండి భారత విప్లవోద్యమంలో అద్భుత సంఘటన లనేకం జరిగాయి. ఆంగ్లేయులు అభినవ భారత రహస్య సంఘముపై తీవ్రంగా కన్నువేశారు. ఎందరినో నిర్బంధించారు. ద్వీపాంతర వాస శిక్షలు విధించారు. సావర్కార్‌ను కూడా అరెస్టు చేశారు. ఆయన సముద్రంలో దూకి పారిపోయినారు. మళ్ళీ అరెస్టయినారు. అండమాన్ ద్వీపాంతరవాస శిక్షలు రెండు పడ్డాయి. రెండూ అమలుజరిగితే మొత్తం 50 ఏండ్లయినా అయివుండేది. అభినవ భారత సమాజము ఈ అఘాతాల నుండి బయటపడగానే మేడం కామా అనే పార్సీ స్త్రీ, లాలా హరదయాల్, చటోపాధ్యాయ మున్నగువారు ఈ గ్రంథాన్ని ద్వితీయముద్రణ వేయాలనుకున్నారు. లాలా హరదయాళ్ అప్పుడు అమెరికాలో గదర్ పార్టీ పేరున

విప్లవ కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు. ఆ పార్టీ తరఫున ''గదర్'' (విప్లవం) పత్రిక నడుపబడేది. ఈ మహాగ్రంథం ద్వితీయ ముద్రణ నడపడమేగాక, ''గదర్'' పత్రికద్వారా ఉర్దూ, హిందీ, పంజాబీ భాషలలో అనువాదాలు వ్యాప్తిసందాయి. ఈ పత్రిక అనేక సైనిక కేంద్రాలకు చేరు తుండేది. ఈ విప్లవగాథను చదివి వారుత్తేజితులవుతుండేవారు. ఇంతలో ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. దేశ దేశాలలోఉన్న భారత విప్లవకారులు; ఆంగ్లేయులకు వ్యతిరేకముగా జర్మనులతో కలిశారు. జర్మనుల సహాయంతో విప్లవ కార్యకలాపాల నెక్కువజేశారు. ఈ కార్య కలాపాలవల్ల హాంకాంగ్, సింగపూర్, బర్మా మున్నగు ప్రాంతాలలోని భారతసైన్యాలు ఆంగ్లేయులకు ఎదురు తిరుగనారంభించాయి. ఆ యుద్ధంలో జర్మనీ పతనమువల్ల ఈ ప్రయత్నములన్ని ఫలించకపోయినా, అనంతర కాలములో నేతాజీ సుభాష్ చంద్రబోస్ నిర్వహించిన అజాద్ హింద్ఫౌజ్ కార్యకలాపాలకు పునాదుల నేర్పరచాయి. ఈ విప్లవ మహోద్యమందంత టను విప్లవకారులకు స్ఫూర్తినిస్తూ వచ్చినది. ప్రస్తుత గ్రంథరాజము, ఒక్కొక్క ప్రతిని ఎన్నో కేంద్రాలవారు చదివేవారు. పాత ప్రతులనే తిరిగి కొనేవారు. ఒక్కొక్కసారి 300 రూపాయలవరకు దీనిధర పెరిగేది. ఆ ధనమంతయు విప్లవోద్యమమునకు వినియోగమవుతుండేది. విప్లవానికి నిధులను సేకరించడంలో ఈ గ్రంథమొక చక్కని సాధనంగాకూడా ఉపకరించేది.

ఈ విధముగా ఈ మహాగ్రంథపు ఆంగ్లానువాదం విశ్వవిఖ్యాతి చెందుతూ వచ్చినా మూల మరాఠీ ప్రతిమాత్రం విచిత్రంగా కాలగర్భంలో కలసిపోయింది. సావర్కార్ అరెస్టు కాగానే ఆ ప్రతి పారిస్లో నున్న మేడం కామాకు భద్రంగా వప్పగించబడ్డది. ఆమె దానిని బ్యాంకు ఆఫ్ ఫ్రాన్సులో పోలీసులకు తెలియకుండా దాచింది. అయితే జర్మనులు ఫ్రాన్సుపై దాడి చేయగానే ఫ్రాన్సు అల్లకల్లోలమై పోయింది. ఇంతలో

మేడంకామాకూడా మరణించింది. ఆ కల్లోలంలో ఈ మూలప్రతి ఏమైందీ నాటికీ నేటికీ తెలియరాలేదు. ఎంత వెతికినా కానరాలేదా మహాగ్రంథం.

ఆంగ్లానువాదం మాత్రం మరలమరల అచ్చుకాజొచ్చింది. ఎన్ని ముద్రలు జరిగాయో ఎవరెవరు జదిపారోకూడా పూర్తిగా తెలియరానంతగా రహస్యంగా ఆ ముద్రణలు జరుగుతూ వచ్చాయి. కొన్ని ప్రధానమైన ముద్రణలు మాత్రం ప్రకాశంలోకి వచ్చాయి. అట్లు వెలికివచ్చిన వాటిలో మూడవది భగత్‌సింగ్ నేతృత్వంలో రెండు భాగములలో వెలువడినది. ఇవి చాలా ఎక్కువ ధరలకు అమ్ముడుపోయి, విప్లవ నిధులు చాలా సంపాదించి పెట్టాయి. ఈ ముద్రణ ప్రతులు కొన్ని నేడచ్చటచ్చట కానవస్తాయి. భగత్‌సింగ్‌పై జరిగిన కుట్ర కేసు సందర్భంలో నిందితులందరి వద్ద ఈ ప్రతులున్నట్లు బయటపడింది. నాల్గవ ముద్రణ వివరాలంతగా తెలియరావు గాని, అయిదవ ముద్రణ మాత్రం రాస్‌బిహారిబోస్ నిర్వహించిన సమర సందర్భంలో జరిగింది. శ్రీ బోస జపాన్‌లో హిందూ మహాసభను నడిపారు. భారత స్వాతంత్ర్యానికై ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆయన దాడిరావటానికి ప్రయత్నించారు. అనంతర కాలంలో ఆ సైన్యాలనే నేతాజీ సుభాష్‌చంద్రబోస్ నడిపారు. ఆయా సైన్యాలలో ప్రతి ఒకరికి పెద్ద గ్రంథ మీ పుస్తకం! వీరివద్ద ఈ గ్రంథపు తమిళ ప్రతి యొకటి లభించింది. దానిని అనువదించిందెవరో, ప్రచురించిందెవరో మాత్రం తెలియదు.

ఈ ప్రచురణలలో అతి ముఖ్యమైన వాటిలో ఆరవ ముద్రణ ఒకటి. అంతవరకు ఒకప్రక్క రహస్యంగా దీని ముద్రణ, వితరణ, వ్యాప్తి జరుగుతూనే వున్నా, రెండవప్రక్క ఈ 30,40 యేండ్లు దీనిపై నిషేధం తొలగించవలసిందిగా వత్తిడి కూడా జరిగింది. 1937 ప్రాంతంలో మొదటి సారిగా కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడినపుడు కూడా దాగా వత్తిడి జరిగింది. ఈ గ్రంథమన్నా, విప్లవోద్యమమన్నా, విప్లవకారులన్నా

ఈర్ష్యాద్వేషాలతో ఉన్న కాంగ్రెసు వారు నిషేధమును తొలగించే ఉదారత చూపలేకపోయినారు. ఆ తర్వాత ద్వితీయ ప్రపంచ సంగ్రామము కూడ జరిగి, మళ్ళీ 1946 లో కాంగ్రెసు ప్రభుత్వాలు కూడా ఏర్పడినాయి. దీనిపై నిషేధం తొలగించాలని ప్రజల కోరిక కూడా ప్రబలం కాజొచ్చింది. కాంగ్రెసు వారి మంకుతనం గూడా అలాగే ఉంది. చివరకు అనేక మంది దేశభక్తులు ఈ నిషేధాన్ని ధిక్కరించాలని నిశ్చయించారు. ఈ పుస్తక ప్రచురణకు నిధులు సేకరించారు. బొంబాయిలో రహస్యంగా ముద్రించారు. నిషేధాన్ని ఉల్లంఘించి, దానిని బహిరంగంగా విక్రయించి, సత్యాగ్రహాలు జరపాలని వారి నిర్ణయం. ఈ నిర్ణయం కాంగ్రెసు మంత్రి వర్గానికి కూడా తెలియజేశారు. పరిస్థితులింతవరకు వచ్చేసరికి కాంగ్రెసు యొక్క సంకుచిత దృష్టి బయటపడే ప్రమాదం వచ్చింది. తీవ్రంగా ఆలోచించుకొని సావర్కార్ సాహిత్య మంతటిపైన నిషేధం తొలగిస్తున్నామంటూ దీనిపై నిషేధం తొలగించారు.

అనంతరమీ ఉద్గ్రంథం సర్వ జనులకు అందుబాటులోకి వచ్చింది. పెద్దదిగా ఉన్న ఈ గ్రంథం సంక్షిప్త స్వరూపంలో గూడా అచ్చయింది. ప్రస్తుత ప్రచురణ అట్టి సంక్షిప్త గ్రంథపు అనువాదమే. నాటి స్వరాజ్య సంగ్రామ వీరులు, దేశభక్తులు నేటి తరములకు స్ఫూర్తిదాతలు కాగలరనే ఆకాంక్షతో వివిధ భాషలలో ఈ మహాగ్రంథము దర్శన మిచ్చుచున్నది.

(శ్రీ జి. ఎం. జోషి ఇచ్చిన వివరము లాధారముగా)

—: o :—

ప్రథమభాగం

# అగ్నిపర్వతం

## స్వధర్మము స్వరాజ్యము

చిన్న ఇల్లయినాసరే-దానిని భరించగల పునాదులు లేనిదే నిర్మింపబడజాలదనేది అతిసామాన్యమైన వాస్తవము. మహత్తర రాజకీయ, ధార్మిక విప్లవము లన్నిటిలోను, వాని మూల సూత్రముల నవగాహన చేసికొననిదే, విడివిడిగా కానవచ్చే ఘటనలను సూత్రబద్ధము చేయుట సాధ్యము కాదు. హృదయములను కదలించివేసే ఫ్రెంచి విప్లవమును గురించో, హాలండు ధార్మిక విప్లవమును గురించో వ్రాసేటప్పుడు, జిగేలుమనిపించే ఆయా సంక్షోభముల చిత్రణలో రచయితలకు కండ్లు మిరుమిట్లు గొలిపి, మనోనేత్రము మసగలు క్రమ్మిపోయి, ఆయా విప్లవముల మూల సూత్రములలోనికి పోగల ప్రశాంతతగాని, స్థైర్యంగాని లేకుండా పోతుంటుంది. కాని ఆంతరిక కారణాలుగాని, వెనుక పనిచేసిన నిగూఢశక్తులు గాని తెలియపోతే విప్లవ సారాంశం వివరించడం సాధ్యం కాదు; అందువల్లనే చరిత్ర కేవలం వర్ణనలకుగాక మూల సూత్రాలకు ప్రాముఖ్యత [illegible]స్తుంది.

మూల సూత్రాలను గుర్తించే ప్రయత్నంలో చరిత్రకారుడు తరచు మరొక పొరబాటు చేస్తాడు. ప్రతి సంఘమునకు అనేక కారణాలుంటూ ఉంటాయి - ప్రత్యక్షమైనవి, పరోక్షమైనవి; సర్వసాధారణమైనవి, ప్రత్యేక మైనవి; కాకతాళీయంగా జరిగేవి, విధిగా జరిగేవి - ఇలా. వాటిని సరిగా విచక్షణ చేయగల్గడంలోనే చరిత్రకారుని నిజమైన ప్రజ్ఞ ఉంటుంది. ఇలా విచక్షణ చేయడంలో చాలా మంది చరిత్రకారులు అన్నీ కలగాపులగం చేసి ఏదో కాకతాళీయంగా సంభవించిన కారణాన్ని కూడా ముఖ్య కారణం చేసివేస్తారు. నిష్పాక్షికుడు, సాహసవంతుడు నైన చరిత్రకారుడు విప్ల వానికి పునాదు లేమిటో గుర్తించడానికి ప్రయత్నించాలి.

కార్లైల్ వ్రాసిన ఫ్రెంచి విప్లవాన్ని గురించి విమర్శిస్తూ మాజినీ- ప్రతి విప్లవానికి ప్రాతిపదికయైన సూత్రమేదో ఉండాలి - అంటాడు. విప్లవమనేది మానవుని చరిత్రను సంపూర్ణంగా పునర్వ్యవస్థీకరించే విశేషం. విప్లవోద్యమమనేది ఏదో అల్పమైన విషయం ఆధారంగానో తాత్కాలిక మైన ఇబ్బందికి సంబంధించో రాదు. పందలు వేలమందికి సంబంధించి, వారిని సమరోన్ముఖులను చేసి, అశేష జనావళిని తన రక్త తర్పణకైనా సిద్ధపరిచే సర్వసంచాలకమగు సూత్రాన్నాపరించుకొని మహా విప్లవాలు ఏర్పడుతుంటాయి. విప్లవాల వెనుక నున్న లక్ష్యాల మంచి, చెడులనుబట్టి చైతన్య స్వరూపములగు ఆ మహా విప్లవములు పవిత్రములో అపవిత్ర ములో నిర్ణయింపబడుతూ ఉంటాయి. వ్యక్తిగత జీవనంలో వలెనే చరిత్రలోకూడా ఒక వ్యక్తి లేదా ఒక జాతిచర్య యొక్క మంచిచెడ్డలు దాని లక్ష్యపు మంచి చెడ్డలనుబట్టి నిర్ణయింపబడతాయి. ఈ అంశాన్ని మనం విస్మరిస్తే మనమిక సామ్రాజ్య విస్తరణాకాంక్షతో అలెగ్జాండరు జరిపిన యుద్ధాలకు, గారిబాల్డీ నాయకత్వాన స్వాతంత్ర్యేచ్ఛతో ఇటలీ సాగించిన మహాసమరానికి వ్యత్యాసమే చూడలేము.

1857 లో హిందూదేశమందు జరిగిన అత్యద్భుత విప్లవగాథను ఇలాంటి శాస్త్రీయ దృక్పథంతో ఏ చరిత్రకారుడూ—భారతీయుడుగాని, విదేశీయుడుగాని- వ్రాయలేదు. అందువల్ల ఈ విప్లవ మహాసమరానికి సంబంధించి అనేకములైన అపవాదులు, అన్యాయమైన భావాలు ప్రపంచ మంతటా వ్యాప్తి చెందివున్నాయి. ఇంగ్లీషు రచయితలు ఈ విషయంలో పైన పేర్కొన్న అన్ని పొరపాట్లూ చేశారు. పాక్షికమైన వారి దృష్టి ఈ మహావిప్లవపు మూలకారణాన్ని చూడలేకపోయింది.

క్రొవ్వు తూటాలవల్ల ఈ తిరుగుబాటు జరిగిందనే వదంతిని వ్యాప్తి చేయడంవల్ల మరింతమోసం జరిగి, 1857 విప్లవతత్వమే వికృతం చేయ బడ్డది. బ్రిటిష్ చరిత్రకారులు పన్నిన ఈ యుక్తినే భారతీయ చరిత్ర కారులూ అనుకరించారు. ఈ విప్లవం కేవలం తూటాలవల్ల వస్తే ఢిల్లీ సామ్రాజ్యాధిపతి బహదూర్‌షా, నానాసాహెబ్, ఝాన్సీ మహారాణి, రోహిల్‌ఖండ్ సంస్థానాధిపతి ఖాన్ బహదూర్‌ఖాన్‌లు ఇందులో ఎందుకు చేరారు? వీరు బ్రిటిషు సైన్యంలోనివారు కారే! తూటాలను పండ్లతో కొరక వలసిన అవసరం వీరికేమీ లేదే! ఈ తూటాలవల్లనే విప్లవం ప్రారంభ మయి ఉంటే ఈ తూటాలు వాడరాదని గవర్నర్ జనరల్ ఆజ్ఞ రాగానే విప్లవం ఆగిపోయి ఉండవలసిందికదా! తమకు నచ్చిన తూటాలు చేసుకో వచ్చని సైన్యాలకు అనుజ్ఞ ఇచ్చాడాతడు. సైనికులు అలా చేయలేదు. కనీసం కంపెనీ ఉద్యోగాన్ని వదలించుకొని బయటపడలేదు—ఉవ్వెత్తున సమరానికి లేచారు! సైనికులేకాదు, సైన్యాంతో ఎలాంటి సంబంధమూ లేని వేలాది శాంతికాముకులైన పౌరులు, రాజ్యాలు, మహారాజులు విజృంభిం చారు. కనుక సైనికుల, పౌరుల, రాజుల, పేదల, హిందువుల, మహమ్మ దీయుల రక్తము నుప్పొంగచేసింది కాకతాళీయమైన ఈ కారణాలు కావనేది స్పష్టమవుతోంది.

ఔధ్ సంస్థానాన్ని కలిపివేసుకున్నందువల్ల ఈ విప్లవం చెలరేగిం దనే వదంతి కూడా ఇలా పెడత్రోవలు పట్టించేదే; ఔధ్ సంస్థానపు అసౌభాగ్యాసౌభాగ్యాలతో సంబంధము లేని ఎందరు తమ రక్తాన్ని ఈ విప్లవంలో ధారపోయలేదు. ఔధ్ నవాబు కలకత్తా కోటలో బంధింప బడ్డాడు. అతడంటే ప్రజలు రోసిపోయినారని బ్రిటిష్ చరిత్రకారులే వ్రాశారు. అలాంటప్పుడు అతడికోసం ఆ ప్రజలు, తాలుక్‌దారులు, సైని కులు తమ కత్తులనెందుకు వెలికిదీశారు?

క్రొవ్వుతూటాల వ్యవహారం, ఔధ్ సంస్థాన విలీనీకరణాలు తాత్కాలికము, కాకతాళీయమునైన కారణాలు. వీటినే మూలకారణాలంటే మనకు ఆ విప్లవ స్వభావమే అర్థంకాదు.

అయితే, ఈ మహావిప్లవపు మూలకారణాలు. లక్ష్యాలు ఏమిటి? సంవత్సరం వెంట సంవత్సరం వేలాది ప్రజలు స్వచ్ఛందంగా తమ రక్తాన్ని ధారపోసేలా చేసినవి ఏమిటి? మౌల్వీలు ప్రబోధించినవీ, బ్రాహ్మ ణులు శుభాశీస్సులు పల్కినవీ ఏమిటవి? ఏ మహదాకాంక్షలతో పవిత్ర వారణాసీ దేవాలయాలనుండి - ఢిల్లీ మసీదులనుండి - పైనున్న స్వర్గం వరకు ప్రార్థనలు వెళ్లాయి?

స్వధర్మ స్వరాజ్యములే ఆ మహదాకాంక్షలు. ధర్మానురక్తి, దేశ భక్తి మన చరిత్రలో కాక ఇంకే చరిత్రలో ఇంత ఉత్కృష్టంగా వ్యక్త మయినాయి? ఈ ఉదాత్త లక్ష్యాల వ్యాప్తికి అంతకు పూర్వ మెప్పుడూ అంతటి అవకాశాలు రాలేదు. ఢిల్లీసమ్రాట్టు చేసిన స్వరాజ్య సంస్థాపనో ద్ఘోషణలో ఇలా అంటాడు: "ఓ హిందూస్థానపు అనుంగుబిడ్డలారా! మీరు తలచుకుంటే చిటికెలో శత్రు విధ్వంసన చేయగలరు. శత్రుభంజనం చేసి మనకు ప్రాణాధికంగా ప్రియమైన దేశ,ధర్మాలకు ప్రమాదంనుండి విముక్తి కల్గిద్దాం.'' ఢిల్లీనుండి వెలువడిన ఈ మహోద్ఘాటనలో స్పష్టంగా వ్యక్తీక

రింపబడ్డ దేశ, ధర్మరక్షణ అనే స్ఫూర్తిదాయకమగు పవిత్ర భావంలో 1857 మహావిప్లవబీజం నిక్షిప్తమై ఉంది.

అయితే ఈ రెండు లక్ష్యాలు పరస్పరం విభిన్నమైనవా? స్వరాజ్య, స్వధర్మాలు విభిన్నములనే భావన కనీసం ప్రాచ్యులకు తెలియదు. సాధన, సాధ్యములకువలె ఇవి పెనవేసుకొన్నట్టివి. స్వధర్మములేని స్వరాజ్యము ఏహ్యము. స్వరాజ్యములేని స్వధర్మము శక్తిహీనము. పారలౌకిక భద్రతా లక్ష్యమగు స్వధర్మ సంరక్షణకై ఇహలోక స్వరాజ్య ఖడ్గము సదా సంసిద్ధంగా ఉండవలసిందే. ఈ ప్రాచ్య మనస్తత్వం చరిత్రలో తరచు కనిపిస్తుంటుంది. ప్రాచ్యఖండంలో అన్ని విప్లవాలు ధర్మసంబంధం కావడానికి కారణం-కాదుకాదు-ధర్మంతో సంబంధంలేని విప్లవమనేది ప్రాచ్యఖండానికి తెలియకపోవడానికి కారణం సర్వమును పరివ్యాప్తమైయున్న ధర్మమనే దాని అర్థంలో ఉంది.

''స్వధర్మానికై లేవండి! స్వరాజ్యమును సాధించండి!'' దీనిని గుర్తించిన హిందూస్థాన చరిత్రలో ఎలాంటి దైవీ సంఘటనలు సంభవిస్తున్నాయి! రెండువందల యాభై ఏండ్ల క్రితం సమర్థ రామదాసస్వామి ప్రబోధించినదీ ఇదే : ''నీ ధర్మానికై ప్రాణాలొడ్డు. నీవు ప్రాణాలొడ్డడంలో నీ ధర్మానికి శత్రువులైనవారి ప్రాణాలు బలిగొను. ఇలా పోరాడి, సంహరించి, నీ రాజ్యమును మళ్ళీ సంపాదించు!''

1857 మహావిప్లవం వెనుకనున్న మూలసూత్రమిది. దాని తత్వమిది. దాని నిజతత్వాన్ని చూపించే దర్పణము సమర్థ రామదాసస్వామి చెప్పిన పై వాక్యము.

# కారణ పరంపర

ఆసేతు శీతనగం వ్యాపించియున్న భారతదేశము స్వతంత్రముగా ఉండాలా లేదా అనే ప్రశ్న 1857 సమరంలో పరిష్కరింపబడనున్న దనేది వాస్తవమైతే ఆ ప్రశ్న ఏనాడు ఉత్పన్నమైనదో ఆ 1757 వ సంవత్సరంలోనే ఈ సమరానికి హేతు పరంపర ప్రారంభమైనదన్న మాట. హిందూస్థానము హిందువులదా? బ్రిటిషువారిదా? అనే విషయం బహిరంగంగా మొట్టమొదట 1757 జూన్ 23 న ప్లాసీ యుద్ధంలోనే సవాలు చేయబడ్డది.

ప్లాసీ రణరంగంలో భారతదేశము స్వాతంత్ర్య సమర ప్రతిజ్ఞ తీసుకున్నప్పుడే ఇంగ్లాండు తన సంపూర్ణాధిపత్యాన్ని త్వరితంగా ఏర్పరచుకోవాలని తహతహలాడిపోయింది. ఇంగ్లీషువారు ప్లాసీ యుద్ధ రంగంలో విప్లవ బీజాలను నాటడమేగాక, అవి యావద్భారతంలోనూ మొలకలెత్తేందుకు ఉపకరించేవి చాలా చేశారు!

ఏ పశువుల అండదండలవల్ల తమ విజయాలు సాధించారో కనీసం వారికి ఇంగ్లీషువారు సరియైన తిండికూడ పెట్టలేకపోయినారు. వారిక్రింద పనిచేస్తున్న సైనికులను నూరేండ్లపాటు నిరంతరము అణగ ద్రొక్కుటూ, అవమానాలపాలుచేస్తూ వచ్చారు. మరాఠా సైనికులో, నైజాం సైనికులో ఎవరైనా విజయాలు సాధించినపుడు వారికి జాగీరులో బహుమానాలో ముడుతుండేవి. కాని కంపెనీ సిపాయిలకు మాత్రం నాలుగు తియ్యని మాటలు తప్ప మరేమీ లభించేవి కాదు. భారతదేశాన్ని బ్రిటిషు వారికి వశంచేసి పెట్టిన సిపాయిలు ఎంత అమానుషంగా చూడబడ్డారంటే- జనరల్ ఆర్థర్ వెల్లస్లీ క్షతగాత్రులైన సిపాయిలను వైద్యశాలలకుగాక తుపాకుల కెదురు నడిపించాడు !

ఈ విధంగా హిందుస్థానమంతా అసంతృప్తి, విద్వేషబీజాలు విస్తరిల్లుచుండగా ఆంగ్లేయులకు తమ విజయఘడియలు దగ్గరకు వస్తున్నట్లు కనిపించింది. భారతస్వాతంత్ర్యానికి ప్రమాదం వస్తున్నదనే విషయాన్ని మొదట పూనాకు చెందిన నానాఫడ్నవీసు, మైసూరుకు చెందిన హైదర్ సాహెబ్ గుర్తించారు. నాటినుండి భారతదేశంలోని పరిపాలకులందరూ ఈ ప్రమాదాన్ని కొద్దిగానో గొప్పగానో గుర్తిస్తూనే వచ్చారు. దీనంతటి ప్రభావం వెల్లూరు "తిరుగుబాటు" లో ప్రస్ఫుటమైంది. ఈ వెల్లూరు విజృంభణ 1857మహావిప్లవానికి పూర్వాభినయం అనాలి. ఈ తిరుగుబాటులో సైనికులు పరిపాలకుల, ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు. వీధులలో ఫకీర్ల వేషాలలో విప్లవబోధనలు జరిగినవి. విప్లవ సమయాన్ని తెలియజేసేందుకు చపాతీల ద్వారా సమాచారం పంపబడింది. హిందూ, ముస్లిము లిరువురూ స్వేచ్ఛా, ధర్మాల పేరిట విజృంభించారు. ఇది మొదటి ప్రయత్నం కావడంతో విప్లవం విజృంభిస్తుండగానే విఫలమైపోయింది.

పై విషయాలన్నీ చూచినప్పుడు, డల్హౌసీ భారతదేశంలో కాలుపెట్టడానికి పూర్వమే హిందూస్థానమంతటా లోతుగా విప్లవ బీజాలు నాటబడి

ఉన్నాయని స్పష్టంగా కనిపిస్తుంది. బ్రిటిష్‌వారివల్ల సింహాసనాలు కోల్పోయిన రాజాల, మహారాజాల హృదయాలు దహించుకుపోయినాయి. ప్లాసీ యుద్ధం జరిగి నూరేండ్లవుతోందనే విషయం ప్రజల హృదయాలను క్రొత్త భావాలతోను ఆశలతోను నింపివేసింది; ఇక సైన్యాలలో సిపాయీలు రౌద్రంతోను, ద్వేషంతోను రహస్యంగా కత్తులు నూరుతున్నారు. ప్రస్తుత ప్రశ్న, కంపెనీ పాలన బాగా ఉందా, చెడ్డగా ఉందా అనికాదు - అసలు కంపెనీపాలన ఉండాలా అనేదే. ఈ సమస్యను పరిష్కరించడానికి అవసరమైన మరొక ఉపకరణం డల్హౌసీ ఆగమనంతో లభించివేసింది.

బ్రిటిష్ చరిత్రకారులు డల్హౌసీ ని బ్రిటిష్ సామ్రాజ్యనిర్మాతల్లో ఒకడన్నారు. అతడి శక్తి, సామర్థ్య లక్షణాదులను అంచనా వేసుకోవడానికి ఇది చాలు.

డల్హౌసీ హిందూస్థానంలో అడుగిడగానే మొదట గుర్తించిన అంశం పంజాబ్‌లో రంజిత్‌సింగ్ యొక్క వీరయోధులు బ్రతికిఉన్నంతకాలం తన మనోవాంఛ సిద్ధించడం కల్ల అనేది. అందువల్ల ముందు ఆ పంజాబు కేసరి నెలాగైనా పట్టుకోవాలని నిశ్చయించాడు. కాని ఆ పంజాబు కేసరి కున్న గోళ్ళు సామాన్యమైనవికాదు. తగు గుహ ప్రమాదాన చిక్కుకున్నదని గుర్తించిన ఆ వీరకేసరి జలియన్‌వాలానుండి బయటపడి శత్రువు మీదకు లంఘించి, రక్తం కళ్ళజూచాడు. కాని దుర్విధి! గుహయొక్క ముఖద్వారంవద్ద ఆ సింహముండగా గుజరాతునుండొక విద్రోహి వెనుకనుండి వచ్చి బంధించాడు. ఆ గుహయే ఆ సింహానికి పంజరమయింది. రంజిత్‌సింహుని రాణి చంద్‌కువార్ లండన్‌లో కృశించి మరణించింది. సింహకిశోరము-దిలీప్‌సింగ్-శత్రువుల పాదాక్రాంతమైపోయింది!

స్వతహా మూర్ఖత, అనంత ఆత్మవిశ్వాసము, అన్యాయార్జితమైన బ్రిటిష్ సామ్రాజ్య గర్వములతోను, నూరేండ్ల క్రూర బ్రిటిషు పరిపాలనా పునాదుంతోను మిడిసిపడుతూ వచ్చిన డల్హౌసీ—తెలివి లేకపోయినా గుండె

ధైర్యం కలవాడు. భారత తీరాలమీద అడుగుపెడుతూనే "హిందూ స్థానాన్ని నేలమట్టం చేయనున్నాను" అని ప్రకటించాడు.

పంజాబును ఆక్రమించిన తర్వాత డల్హౌసీ తాను పంపిన నివేదికలో నేడు బ్రిటిషుసామ్రాజ్య మిచట ఆసేతు శీతనగం వ్యాపించియున్నదని సగర్వంగా వ్రాసుకున్నాడు. అయితే ప్రస్తుతమది ఉత్తరాన హిమాలయాల వరకును, దక్షిణాన కన్యాకుమారివరకును వ్యాపించియున్నది కనుక తూర్పు పడమరల్లోకూడా వాటికి సరితూగే హద్దులవరకు వ్యాపించాలనే ఆకాంక్ష పెట్టుకొనక తప్పదు. బర్మాకు మెల్లగా 'శాంతి' సంఘము నొకదానిని పంపాడు—బర్మాను కబళించాడు! ఇక యావద్భారతము కైలాసం మొదలు కన్యాకుమారివరకు, సింధు మొదలు ఐరావతివరకు బ్రిటిష్ సామ్రాజ్యమునకు బలియైపోయింది. 'ఓ డల్హౌసీ! అచిరకాలంలోనే మీ సామ్రాజ్యమే బలియైపోయే రోజులు రానున్నాయని నీకు జంకయినా కలుగలేదా ?'

సరిహద్దులు విస్తరింపబడ్డా, లోపల అంతా ప్రాచీన శిధిల సంస్థానాలు, రాజ్యాలు ఉన్నాయి. డల్హౌసీ వాటిని పెరికివేయ సమకట్టాడు. అవి విస్తృతంగా వ్యాపించి ఉండడమేకాదు, ఒకానొక రోజున ఆ శిధిలాలే లేచి తమపై విరుచుకుపడే ప్రమాదం కూడా ఉంది.

సతారా శిధిలాలలో మహత్తర హిందూసామ్రాజ్యం భూస్థాపితమై ఉంది. సమాధినుండి జీసస్ పునరాగమనాన్ని విశ్వసించే డల్హౌసీ, సతారా శిధిలాలనుండి భవిష్యత్తులో తమను అంతంచేసి, స్వరాజ్యముకు స్థాపించగల మహాశక్తివంతులగు హైందవ సమ్రాట్టు లవతరించగలరని శంకించాడు. 1848 ఏప్రిల్‌లో సతారా మహారాజు అప్పాసాహెబ్ మరణించగానే డల్హౌసీ సతారాను కంబళించదలచాడు. రాజుకు ప్రత్యక్షవారసులు లేరనే సాకు ఒకటి అతడికి చాలు!

సంస్థానాలలో జరిగిన ఏ వప్పందం ప్రకారమైనా దత్తులు సింహాసనాలకు వారసులుగా చెల్లరని ఎక్కడాలేదు. 1825 లో కంపెనీయే

కోట మహరాజా దత్తత నంగీకరిస్తూ బహిరంగంగా ఇలా ప్రకటించింది– ''శాస్త్ర నియామానుసారంగా ఔరసపుత్రుని దత్తుపొందే అధికారం హిందువులందరితోపాటు కోట మహారాజుకు కూడా ఉంది.''

మళ్ళీ 1837 లో ఓర్చా మహారాజా వారసుని దత్తుతీసుకున్నప్పుడు కూడా బ్రిటిష్‌వారు దాని నామోదించి ఇలా వాగ్దానం చేశారు : ''రక్తం పంచుకున్న వారసులుంటేతప్ప, హిందూసమ్రాట్టులకు దత్తస్వీకారాధి కారం ఉంది. అది సవ్యమైన పద్ధతిలో ఉండి హిందూశాస్త్ర విరుద్ధంకాకుండా ఉంటే బ్రిటిష్‌ప్రభుత్వం దానిని మన్నించి తీరుతుంది.''ఇలాంటి వాగ్దానాలు వారి పత్రాలలో స్పష్టంగా చేయబడి ఉండగా, అవి లేనేలేవనే తెంపరి తనం ఒక్క బ్రిటిష్ రాజకీయాలలోతప్ప మరెక్కడా కానరాదు.

సతారాను వశం చేసుకోవాలని తెల్లవారికి బుద్ధిపుట్టడంతో-సతారా లోని కడగండ్లను 'గృహ' శాఖకు విన్నవించుకోవడానికని రంగో బాపూజీ అనే చక్కని నమ్మకస్థుడు ఇంగ్లండుకు పంపబడ్డాడు. ప్రయోజనం కల్గినా, కల్గకపోయినా ఒకసారి ప్రయత్నించి చూడడం మంచిదను కున్నారు. కాని, ఫలితంకోసం ఆశతో ఎన్నాళ్ళని వేచిచూస్తారు?

రంగో బాపూజీ లండన్ ప్రయాణానికి సిద్ధమవుతుండగా డల్హౌసీ దృష్టిని ఒక క్రొత్త విషయం ఆకర్షించింది. ఘోరాటవిలా తయారైన నాగ పూర్ రాజ్యాన్ని కబళించేందుకు డల్హౌసీకి ఏదోఒకసాకుదొరికింది.నాగపూర్ సింహాసనానికి వారసుడైన రఘోజీ భోంస్లే హఠాత్తుగా తన 47 వ ఏట మరణించాడు. బీరార్‌రాజు బ్రిటిష్ ప్రభుత్వానికి ప్రియసఖుడు. ఈ సఖ్యతే ఆ రాజ్యానికి చేటు తెచ్చింది! అతడు దత్తుచేసుకోలేదనే సాకుతో డల్హౌసీ తన ప్రియసఖుని కంఠంమీదే కత్తిపెట్టాడు! రాజా రఘోజీకి బిడ్డలు కలిగే ఆశ ఉన్నా ఆకస్మికంగా మరణించాడు. అతడు మరణించినా అతడిరాణికి దత్త స్వీకారాధికారం లేకపోలేదు. ఇంగ్లీషువారు లోగడ అలాంటి అధికా

రాన్ని అంగీకరించకపోయి ఉంటే మనం అనవలసిందేమీ లేదు. కాని అంతకు పూర్వం 1826 లో దౌలత్‌రావ్ సింధియా భార్య, 1836 లో జంకోజీ సింధియా భార్య, 1834 లో ధార్‌రాజా భార్య, 1841 లో కిషన్ ఘర్‌రాణి-ఒకరుకాదు, ఇద్దరుకాదు-ఎందరో చేసుకున్న దత్తత లన్నిటిని బ్రిటిష్‌వారు ఆమోదించారు. అయితే ఆయా సమయాలలో ఈ దత్తతలన్నీ అంగీకరించడమే బ్రిటిష్‌వారికి ప్రయోజనకరమనే విషయం మనం మరువ రాదు. కాని ప్రస్తుతం రఘోజీ భార్య దత్తత చేసుకోవడం మాత్రం బ్రిటిష్‌వారికి ప్రయోజనకరం కాదు. ఇలాంటి సందర్భాలన్నిటిలోనూ ముఖ్యాంశం, బ్రిటిష్‌వారి ప్రయోజనం - ప్రతిదీ దానినిబట్టే నిర్ణయింప బడుతూ వుంటుంది. దత్తత జరుగనందువల్ల నాగపూర్ రాజ్యం హరింప బడితే జరిగిన దత్తత సింహాసనంకోసం కాదనే సాకుతో సతారా రాజ్యం హరింపబడ్డది !

నాగపూర్‌ను స్వాధీనం చేసుకోవడంతో 76,832 చదరపు మైళ్ళ భూఖండం, 46,50,000 ప్రజానీకం, అంతులేని వార్షిక ఆదాయం డల్హౌసీకి స్వాధీనమైంది. లోపల నిర్భాగ్యలైన రాణీలు గోడుగోడున విల పిస్తూంటే బయట కోటగుమ్మాలు ఢీకొనబడ్డాయి. తలుపులు తెరవబడగానే బ్రిటిష్ సైన్యాలు లోపలికి జొరబడ్డాయి. ఏనుగులను, గుఱ్ఱాలను విచ్చల విడిగా వీధులవెంట వదలివేశారు. స్త్రీజనాన్ని వీధుల్లో అమ్మకానికి పెట్టారు. అంతఃపురాన్ని కొల్లగొట్టి అమూల్యాభరణాదులను వేలం పాడారు. రాణి కంఠము నలంకరించిన ఒకఅమూల్యకంఠాభరణం వీధుల్లోదుమ్ముకొట్టుకుని పడిఉంది! ఏనుగులను వందరూపాయిల ధరకు అమ్మారు, డల్హౌసీ చేసే భోజనంకన్న విలువైన ఆహారం తీసుకునే గుఱ్ఱాలను ఇరవైరూపాయిల ధరలో అమ్మారు. రాజా స్వయంగా ఉపయోగించే గుఱ్ఱాలజంటను ఐదు రూపాయీల కమ్మివేశారు! భోంస్లే మహావంశానికి చెందిన దోవాగర్‌రాణి జరుగుతున్న ఘోరానికి కుళ్ళి కుళ్ళి, మరణశయ్యపై పడిఉండగా, ఇవతల

పడకగదిలో దోపిడీదారునిగొడ్డలి పనిచేయనారంభించింది. ఆమె ఎక్కిళ్ళకు ఆ గొడ్డలి వ్రేటులు శృతికలిపాయి! విధివిలాసం! ఇదంతా ఎందువల్ల? దత్తతచేసుకోకుండా రఘోజీ మరణించినందువల్ల!

తన ప్రాచీన వంశానికి జరిగిన ఘోరావమానాలకు, అన్యాయానికి కృంగి కృశించి అసువుల వదిలింది మహారాణి అన్నపూర్ణాబాయి. అయితే ఇంగ్లండునుండి న్యాయం పొందాలనే బన్కారాణి మాత్రం ఆశ వదలలేదు. బ్రిటిష్‌బారిష్టర్లకు లక్షల రూపాయిలు వ్యయం చేసేవరకు ఆమె ఆశ హతాశ కాలేదు.అప్పుడామె చేసిందేమిటి?ఫిరంగులకు విధేయంగా బ్రతకడం! ఝాన్సీమీద శత్రువులు విధ్వంసకకాండ ప్రారంభించినప్పుడు, స్వరాజ్యం కోసం కత్తులు ఝళిపించిన తన కుమాళ్ళను చూచి ఈ బన్కారాణి "మీరీ ప్రయత్నం విరమించకపోతే నేనే స్వయంగా బ్రిటిష్‌వారికి మీ విషయం చెప్పి మీ తలలు నరికిస్తాను" అని హెచ్చరించింది !

# నానాసాహెబ్
# లక్ష్మిబాయి

ఆకాశము నందుకుంటున్న మాధేరన్ శిఖరాల క్రిందుగానున్న సుందర మైదానంలో ఉన్న అతి సుందర కుగ్రామం వేణు. ఆ గ్రామపు ప్రాచీనము, గౌరవనీయము నైన కుటుంబాలలో మాధవరావ్ నారాయణ భట్ కుటుంబము ముఖ్యమైనది. మాధవరావ్ సతీమణి గంగాబాయి. జీవిస్తున్నది పేదరికంలోనే అయినా వారి అన్యోన్య దాంపత్య జీవనంలో ఆనందానికి కొదువలేదు. 1824 లో ఒకానొక శుభముహూర్తాహున గంగా భాయి ఒక మగ శిశువునుక న్నది. ఇంట్లో అందరి ముఖాలలోను ఆనందం తాండవించింది. ఆ శిశు వెవరో కాదు—ఎవరి పేరు వింటే ఫిరంగీలు గడగడలాడి పోయేవారో ఆ పీష్వా నానాసాహెబ్ ! ఈ దేశపు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం వీరాధి వీరుడై పోరాడి చరిత్రలో అమరుడై పోయిన నానాసాహెబ్ !

దాదాపు అదే సమయంలో ఆఖరి బాజీరావు సింహాసన పరిత్యాగం చేసి గంగానదీ తీరమున బ్రహ్మావర్తమందు ప్రశాంత జీవనం గడుపుతున్నాడు. ఎన్నో మరాఠా కుటుంబాలు ఆయన ననుసరించాయి. బాజీరావు వద్ద భుక్తికి లోపం ఉండదని విని ఇంకా ఎన్నో కొత్త కుటుంబాలూ అక్కడకు చేరాయి. అలా చేరిన కుటుంబాలలో మాధవరావు కుటుంబమొకటి. 1827 లో బాజీరావు ఆదరణకోసం ఆ కుటుంబం అక్కడకు చేరింది. మాధవరావు ముద్దుబిడ్డడు నానాసాహెబ్ బాజీరావు హృదయాన్ని చూరగొన్నాడు. అచిరకాలంలోనే దర్బారంతటికి అతడు అభిమానపాత్రుడైనాడు. ఆ శైశవదశలోనే ఉన్న అతడి భావాలు, ధోరణి, చురుసదనం, తెలివితేటలు, గంభీరవదనం-బాజీరావు నెంతగానో ఆకర్షించాయి. చివరకు అతడిని దత్తుచేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. 1827 జూన్ 7 వ తేదీన బిడ్డను అంకముపైకి తీసుకొని దత్తస్వీకారలాంఛనం జరిపించాడు. మరాఠా సామ్రాజ్యపు పీష్వాల సింహాసనానికి వారసుడు కావడము గొప్ప అదృష్టమనేది నిస్సందేహం. దాదాపు అదే సమయంలో పవిత్ర వారణాసీ నగరంలో చిమ్నాజీ అప్పా పీష్వా ఆస్థానంలో మోరోపంత్ తాంబే, ఆయన సతీమణి భగీరథీబాయి నివసిస్తున్నారు. అనంతర కాలంలో భరతమాత చేత ధరించిన తీక్ష్ణ ఖడ్గంలా భాసించిన తేజః పుంజాన్ని కన్న భాగ్యశాలురు ఈ దంపతులు. అయితే అప్పట్లో వారా భవిష్యద్భాగ్యం ఊహించలేదు. 1835 లో భగీరథీబాయి మను అనే స్త్రీ శిశువును కన్నది. ఆ శిశువే-అనంతర చరిత్రలో తటిల్లతలా మెరిసిపోయిన ఝాన్సీ లక్ష్మీబాయి.

మనుకు మూడు నాలుగేండ్ల వయసులో వారి కుటుంబమంతా వారణాసిని వదలి బ్రహ్మావర్తములోని బాజీరావు సన్నిధికి చేరింది. అక్కడ ప్రతివారికి ఆమె అనుంగుబిడ్డ అయింది. అందరూ ముద్దుగా 'చబేలీ' అని పిలిచేవారు. యువరాజా నానాసాహెబ్, ముద్దులొలికించే చబేలి! వారిద్దరూ ఆయుధాలతో ఆటలాడుకొనుచుండగా - భావికాలంలో

దేశ ధర్మరక్షణకోసం ఉపకరించిన ఆ కత్తియుద్ధపు పాఠాలు నేర్చుకొను చుండగా - చూచిన ఎవరికనులు ఆనందంతో చెమ్మగిలవు? నానాసాహెబ్ (అతనీ పినతండ్రి కుమారుడు) రావ్‌సాహెబ్ ఉపాధ్యాయునివద్ద పాఠాలు నేర్చుకొంటూవుంటే చబేలి శ్రద్ధగా తిలకిస్తుండేది. ఆమె చదువుకున్న దీ విధంగా. నానాసాహెబ్ ఏనుగుపై అంబారిలో కూర్చుంటే ఈ ముద్దు పాల బిడ్డ "నన్నుకూడా ఎక్కించవా?" అంటూ చేతులు ఎత్తేది. ఒక్కొక సారి నానా ఏనుగునెక్కిస్తూ ఉండేవాడు. ఆమె ఏనుగుస్వారీని నేర్చు కున్న దీవిధంగా. ఒక్కొకసారి నానా గుర్రమెక్కి, లక్ష్మికోసం ఎదురు చూస్తుండేవాడు. ఇంతలో చేతఖడ్గంధరించి గాలివిసురుకు రయ్యిన ఎగిరే కురులతో కళ్ళెలు బిగించిపట్టి గుఱ్ఱంపై చెంగు చెంగున ఆమె వచ్చేది. వెంటనే ఇరువురూ చురుకుగా గాలిని దూసుకుంటూ పోయేవారు. అప్పుడు నానాసాహెబ్‌కు 18 ఏండ్లుండేవి. లక్ష్మికి 7 ఏండ్లుండేవి. అన్నాచెల్లెండ్లవలె సంచరించిన వీరిరువురూ ప్రతియేడు యమ ద్వితీయ సోదరసోదరీవ్రత మవలంబించేవారని చెప్తారు.

నానాసాహెబ్, మనూబాయ్‌ల బాల్యజీవితమందే వారి భవిష్యజ్జీవన వైభవ సూచనలు కానవచ్చాయి. స్వరాజ్యకాంక్ష, ఉదాత్తమైన ఆత్మ గౌరవము,తమ పూర్వీకులయెడ సగర్వగౌరవభావన చిన్ననాడే వారిలో కాన వచ్చాయి. 1842 లో చబేలీని ఝాన్సీ మహారాజా గంగాధరరావు దాదా సాహెబ్‌కిచ్చి వివాహం చేశారు. ఆమె ఝాన్సీ మహారాణి లక్ష్మీబాయి అయింది. ఆ సంస్థానమందు ఆమెకు విశేషఖ్యాతి కల్గింది. తన ప్రజల వినయ విధేయతలను, ప్రేమాభిమానాలను ఆమె ఎంతగానో చూరగొన్న దని చరిత్ర సాక్ష్యమిస్తుంది.

1851 లో రెండవ పీష్వా బాజీరావు మరణించాడు. మరణానికి పూర్వ ఇచ్ఛాపత్రం వ్రాసి తన వారసత్వాధికారాన్ని పీష్వాఅధికారాన్ని తన దత్తపుత్రుడైన నానాసాహెబ్‌కు ఇచ్చాడు. కాని బాజీరావ్ మరణ

సమాచారం అందగానే బ్రిటిష్ప్రభుత్వం బాజీరావ్ కివ్వబడుతుండే ఎని మిది లక్షల రూపాయల పరిహారం నానాసాహెబ్‌కు ఇవ్వబడదని ప్రకటిం చింది. దీని విషయంలో నానాసాహెబ్ ఎంతతీవ్రంగా భావించిందీ ఆయన వ్రాయించిన లేఖలో ఇలా వ్యక్తం చేయబడ్డది - "ఉన్నతమైన పీష్వా కుటుంబాన్ని కంపెని ఇంతతేలికగా చూడడం కేవలం అన్యాయం. కంపెనీ వారు ఏటా ఎనిమిది లక్షల రూపాయల పరిహారం ఇచ్చుకోవాలనే నిబంధన మీదనే మా సింహాసనము, రాజ్యము కంపెనీవారి కివ్వబడ్డది. ఈ పరిహారం శాశ్వతం గాకపోతే, ఈ పరిహారానికై ఇవ్వబడిన రాజ్యం మాత్రం శాశ్వ తంగా మీకెలా చెందుతుంది? నిబంధనకు ఒక పక్షం కట్టుబడి ఉండడం, మరొకపక్షం కావాలని దానిని అతిక్రమించడం అనుచితం, అన్యాయం, అసంగతం." ఈ తర్కంతోను, తీవ్రమైన లేఖతోను నానాకు విధేయుడగు ఆజీముల్లాఖాన్ రాయబారిగా ఇంగ్లండుకు పయనమైనాడు.

1857 విప్లవయుద్ధానికి సంబంధించి విస్మరించదగని వ్యక్తి అజీముల్లాఖాన్. స్వాతంత్ర్య సమరానికి రూపకల్పన చేసిన కొద్దిమంది మేధావులలో ఈయన ఒక ముఖ్యుడు. విప్లవము యొక్క వివిధ దశలలో రూపొందిన వివిధ పథకాలలో అజీముల్లాఖాన్ రూపొందించిన పథకాలు ప్రత్యేకంగా గమనించదగినట్టివి.

అజీముల్లాఖాన్ పుట్టినది పేదరికంలో. తన ప్రజ్ఞా సామర్థ్యాల ద్వారా క్రమంగా పైకివచ్చి, చివరకు నానాసాహెబ్‌కు అతివిశ్వాసనీయుడగు సలహాదారుడై నాడు. మొదటి రోజుల్లో ఒక ఆంగ్లేయుని ఇంట పనివాడుగా చేరి పొట్టగడుపుకొనవలసినంతటి పేదరికమతనిది. అట్టి దీనస్థితిలోకూడా అతని హృదయంలో మహత్తరాకాంక్షజ్వాల మండుచునే ఉండేది. తాను చేస్తున్న ఉద్యోగాన్ని విదేశీ భాషలు నేర్చుకోవడానికి వినియోగించు కున్నాడు. అచిరకాలంలోనే ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు ధారాళంగా మాట్లా

డడం అలవాటు చేసుకున్నాడు. ఈమాత్రం భాషాజ్ఞానం కల్గిన తర్వాత ఈ ఫిరంగీ సేవకు తిలోదకాలిచ్చి కాన్పూరు విద్యాలయంలో విద్యార్థిగా చేరాడు. తన అసాధారణ శక్తిసామర్థ్యాలవల్ల అచిరకాలంలో అదే విద్యాలయంలో ఆధ్యాపకుడైనాడు. అక్కడ ప్రభుత్వ పాఠశాలలో పనిచేస్తుండగానే నానాసాహెబ్ అతని ఖ్యాతిని గురించి విన్నాడు. బ్రహ్మావర్తపు దర్బారుకు అతడు పరిచయం చేయబడ్డాడు. ఆయన సలహాలు దర్బారు ప్రశంసలందేవి. నానా మన్నన లందేవి. అజీముల్లాను సంప్రదించనిదే నానాసాహెబ్ ముఖ్యమైన ఏ నిర్ణయమూ చేసేవాడుకాదు. 1854 లో అతడు నానాసాహెబ్‌యొక్క ముఖ్య ప్రతినిధిగా ఇంగ్లండు పంపబడ్డాడు. ఆయనది ప్రసన్నమైన ముఖము. మధురము ప్రతిభావంతమునైన భాషణము. బ్రిటిష్ సంప్రదాయాలను చక్కగా తెలిసియున్న అతడు అచిరకాలంలో లండన్‌లో అందరిని ఆకర్షించాడు.

అజీముల్లా ఆంగ్లేయుల హృదయాల నెంతగా చూరగొన్నా, ఈస్టిండియా కంపెనీమాత్రం తన మొండితనాన్ని వదలలేదు. కంపెనీ వారు కొంతకాలం మాయమాటలు చెప్పి అతణ్ణి పంపివేయజూచారు. చివరకు మామూలు మూసపోత సమాధానం ఇచ్చారు: ''బాజీరావ్ దత్త పుత్రునికి తండ్రికివచ్చే పరిహారంపై అధికారం లేదని గవర్నర్ జనరల్ చేసిన నిర్ణయాన్ని మేము పూర్తిగా ఆమోదిస్తున్నాము'' అని. అలా అతడి ప్రయత్నం ఒకవిధంగా విఫలమైంది.

అదేసమయంలో లండన్ మహానగరంలో ఒక బ్రాహ్మణుడు తిష్ఠ వేసి ఉన్నాడు. ప్రాధేయత ద్వారాను, విజ్ఞప్తులద్వారాను ఈడేరని అతని లక్ష్యసాధనకు అన్యమార్గా లన్వేషిస్తున్నాడు. విజ్ఞప్తులతో ఇక ప్రయోజన మేమీలేదని భావించి రోషద్వేషాలతో నిండిపోయిన హృదయంతో ఎన్నెన్నో పథకా లూహిస్తున్నాడు. ఆయనే సతారా సంస్థాన ప్రతినిధి రంగోబాపూజీ.

నానాసాహెబు ప్రతినిధి అజీముల్లా ఆయనను తరచు కలిసేవాడు. ఉభయులూ రహస్యసమాలోచనలు చేస్తుండేవారు.

నానాసాహెబ్ సాంగ్లీపాలకుని మేనకోడలిని వివాహమాడాడు. ఉత్తరాదిన 1857 మహావిప్లవానికి ప్రయత్నాలు జరుగుతుండగా, ఇటు మహారాష్ట్రంలో నానాసాహెబ్ ఈ చుట్టరికాన్ని పురస్కరించుకొని పట్వర్ధన సంస్థానంలో విప్లవ ప్రయత్నా లారంభించాడు. తండ్రి మరణానంతరం నానా బ్రహ్మవర్తాన్ని నివాసస్థానం చేసికున్నాడు. నానాకు గుఱ్ఱములంటే చాలా ప్రీతి. గుర్రపుస్వారీలో అతడినిగాని, లక్ష్మీబాయినిగాని మించినవారులేరు. ఆయన అశ్వశాల అనేక ఉత్తమజాతి అశ్వాలకు నిలయం. అనేకమైన ఇతరజంతువులన్నా ఈయనకు చాలా ఆసక్తి. ఆయన పెంచే లేళ్ళను, దుప్పులను, ఒంటెలను, వేటకుక్కలను, ఆయన సంపాదించిన రకరకాల కుందేళ్ళను ఇత్యాదులను చూచేందుకు ఎక్కడెక్కడివారూ దేశం నలుమూలలనుండి బ్రహ్మవర్తానికి వస్తుండేవారు. అయితే వీటన్నిటిని మించి తాను నిర్మించిన ఆయుధాగారాన్ని చూచి నానాసాహెబ్ ఎక్కువ గర్వపడుతుండేవాడు. అందులో ఎన్నోరకరకాల ఆయుధాలుండేవి— ఉత్తమమైన ఉక్కుతో చేసిన ఖడ్గాలు, ఆధునికమైన రైఫిళ్ళ, వేర్వేరు పరిమాణాలలో ఉండే తుపాకులు-ఒక్కటేమిటి ఎన్నెన్నో ఉండేవి.

తన వంశోన్నతిని గుర్తించి, గర్విస్తూ ఉండే నానాసాహెబ్ - ఆ వంశానికి, ఆ తల్లిదండ్రులకు తగిన స్థాయిలో గౌరవనీయమైన జీవనమైన గడపాలి లేదా పూర్తిగా మటుమాయమైనా అయిపోవాలి అని తనకు తాను నిర్ణయించుకున్నట్టి వ్యక్తి.

మహారాష్ట్ర చరిత్రలోని మహావ్యక్తుల చిత్రాలు ఆయన ప్రధాన మందిరమంతా అలంకరింపబడి ఉండడం గమనించదగినవిశేషం. ఆయనవి చాలా నిరాడంబరమైన అలవాట్లు. పౌరుషపరితత్వం. ఒక దురభ్యాసంగాని

ఒక విలాసజీవనంగాని ఆయనకు తెలియదు. ఆయనను అనేక సంచర్భా లలో సన్నిహితంగా పరిశీలించిన ఒక ఆంగ్లేయు డొకసారి - ఆయన 28 ఏండ్లవాడే అయినా 40 ఏండ్ల వ్యక్తివలె కనిపిస్తాడంటాడు. ''కొంచెం బొద్దుగా కనిపించేవాడు. ముఖం గుండ్రంగా ఉండేది. ఆయన కండ్లు తీక్షణంగా, కాంతివంతంగాను, అశాంతితోనూ ఉండేవి. మామూలు స్పెయిన్ దేశస్థుల వర్ణంలో ఉండేవాడు. వాగ్ధోరణి హాస్యరసం ఒలికిస్తూ ఉండేది'' అన్నాడాతడు. దర్బారులో రాజవంశీక దుస్తులతో ఉండేవాడు. అందలి మణ్యాభరణాదులను, రత్నఖచిత కిరీటాదులను చూచి ఆంగ్లే యులు అచ్చెరువందుతుండేవారు. ఉదారము, సానుభూతియుతము నైన ఆయన హృదయము ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నది. కాన్పూర్ జీవితంతో విసుగెత్తిన ఆంగ్లేయాధికారు లెందరో తమ భార్యలతో సహా ఒకసారి బ్రహ్మావర్తం వచ్చి నానాను దర్శించి కొంతకాలం గడిపిపోతుండే వారు. వెళ్ళేముందు విలువైన శాలువలు, ముత్యాలు, రత్నాలు ఏవో బహుమానా లందుకొని వెళ్తుండేవారు. వ్యక్తిగతమైన ద్వేషం అనేదానికి నానా ఉన్నత హృదయంలో స్థానం లేదని దీనినిబట్టి మనకు అర్థమవు తుంది.

ఈ శ్రీమంతుడు చక్కని విద్యావంతుడు. సంస్కృతి, సంస్కారాలు కలవాడు. రాజకీయాలలోను, రాజకీయ వ్యవహారాలందును మంచి ఆసక్తి కల్గిఉండేవాడు. క్షణక్షణము మారుతుండే ప్రపంచరాజ్యాల వ్యవహారాలను నిశితంగా పరిశీలిస్తుండేవాడు. ఇందుకై ఇంగ్లీషు పత్రికలు గమనిస్తుండే వాడు. ప్రతిరోజూ ఉదయం టాడ్ అనే ఆంగ్లేయుని ద్వారా పత్రికలను చదివించి వింటుండేవాడు. (అనంతరకాలంలో ఈ టాడ్ కాన్‌పూర్‌లో హతుడైపోయినాడు).ఈవిధంగా ఆయన భారతదేశంలోను, ఇంగ్లండులోను కల్గుతున్న రాజకీయ పరిణామాలను తన నిశితదృష్టితో గమనిస్తుండేవాడు. ఔధ్ సంస్థాన విలీనీకరణకు సంబంధించి తీక్షణమైన చర్చలు జరుగు

తున్నప్పుడు నానా-ఈ విలీనీకరణే జరిగితే ఇది యుద్ధానికి తప్పక దారి తీస్తుందని భావించాడు.

నానా సంస్థానాన్ని ఈస్టిండియా కంపెనీవారు వశం చేసుకుంటూ విశేషమైన ఆర్భాటము, ఉత్సవాలు చేస్తుంటే అక్కడ తన 'చబేలి'కూడా ఊరికే కూర్చోలేదు. తనకు న్యాయం జరుగనున్నదా? అన్యాయం జరుగ నున్నదా? అనే ప్రశ్న ఆమెనూ ఎదుర్కొన్నది. 1853 లో తన భర్త ఆకస్మిక మరణానంతరం, ఆమె దామోదర్‌ను దత్తు చేసుకొన్నప్పుడు ఇంగ్లీషువారా దత్తత నంగీకరించక,ఝాన్సీ రాజ్యాన్ని వశంచేసుకున్నారు. ఏదో ఒక మాటతో లేదా పత్రంతో వశమయ్యే రాజ్యంకాదు ఝాన్సీ. ఝాన్సీని పరిపాలిస్తోంది - ఆ నాగపూర్ బన్‌కాకాదు - నానాసాహెబ్ ముద్దుల చెల్లెలు 'చబేలి' మహారాణీ లక్ష్మీబాయ్! బ్రిటిష్‌వారి విలీనీకరణ తననేమి చేయగలదన్నట్లు ఆమె ఝాన్సీ సింహాసనాన్ని అలంకరించిఉంది. నీచంగాను, నిర్దాక్షిణ్యంగాను ఆంగ్లేయు లవలంబిస్తున్న కుటిలపన్నాగాలకు ఆమె తోకత్రొక్కిన కోడెత్రాచువలె లేచింది. ఉచిత గర్వోన్నత హృద యంతో, ఆత్మగౌరవంతో ఉద్విగ్నయైంది. మెరపులా మిరుమిట్లుగొల్పుతూ కత్తిని దూసింది. మేఘునిలా ఘన గంభీర గర్జన చేసింది! "నేను ఝాన్సీని వదలవలెనా? ఎవరువచ్చి వశం చేసుకుంటారో చూస్తాను. కాలు ముందుకు కదపండి, తెలుస్తుంది! మేరీ ఝాన్సీ దూంగీ నహీ!" అని ఉద్ఘాటించింది.

# అయోధ్య

ఈస్టిండియా కంపెనీకి ఔధ్ సంస్థానాధీశునికీ సంబంధాలు నెల కొన్నది 1764 లో. అప్పటినుండి అయోధ్యా క్షేత్రాన్ని కబళించడానికి కంపెనీ నౌకర్లు క్రమంగా ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఔధ్ నవాబు స్వీయ రక్షణకు ఉంచుకోవాలంటూ మొట్టమొదట ఇంగ్లీషు సిపాయీలను బల వంతంగా ఆయన నెత్తిన రుద్దారు. వారి జీత నాతాల కోసమంటూ ఏడాదికి 16 లక్షల రూపాయలు (1,60,000 పౌండ్లు) రాబట్టేవారు. ఈ బలవంతపు రక్షణ, స్వచ్ఛంద నిర్బంధాలతో నవాబు ఖజానాకు కన్నం పడ్డట్లయింది. సరియైన రక్షణకు తన నాటు సైన్యాలన్నీ తొలగించి పూర్తిగా ఇంగ్లీషు సైన్యాలను పెట్టుకోవడం చాలా అవసరమని కంపెనీవారు మరొక సూచన చేశారు. (నిజానికది ఒక ప్రచ్ఛన్నమైన ఆజ్ఞ). అరువు సైన్యాలకే జీతాలు భరించలేని నవాబు నిర్బంధంగా నెత్తిన పెట్టబడుతున్న ఈ కొత్త దళాలను భరించలేడని బ్రిటిష్ వారికి స్పష్టంగా తెలుసు. నిజం చెప్పాలంటే, ఈ విషయం తెలుసు కనుకే ఈ కొత్త సూచన చేశారు. నవాబు ఖజానా అంతా ఖాళీ అయిపోతే ఆయనకు భూఖండం కొంత

ఉన్నది కనుక, నవాబు శ్రేయోరక్షణ కోసం ఆ భూఖండం కొంత పుచ్చు కొని అయినా ఈ సైన్యాలను అందీయక తప్పదన్నారు కంపెనీవారు. ఆ ప్రకారం ఏడాదికి రెండుకోట్ల ఆదాయం వచ్చే రోహిల్ ఖండ్ - దోఆబ్ విశాల భూఖండాన్ని స్వాధీనం చేసుకొని బ్రిటిష్ సైన్యాలను ఆయన కొలువున బలవంతంగా చేర్చారు.

ఈ భూభాగాన్ని ఈ విధంగా దోచిన తర్వాత దీని మీద సర్వాధి కారాలు తమవగునట్లుగాను, మిగిలిన సంస్థానం మాత్రమే ఆయన వారసు లకు చెందునట్లుగాను బ్రిటిష్‌వారు ఒడంబడికపై సంతకం చేయించారు. ఆ సంధిలోని మరొక అంశం : అచ్చటి ప్రజలపై నవాబు ఆధిపత్యం వహించరాదనేది. 1801 లో ఈ సంధిపై సంతకం జరిగిన తర్వాత కంపెనీ వారు ప్రతిసారి నవాబు నుండి రావల్సిన మొత్తంలో కోట్లకొలది రూపా యలు ముందుగా పుచ్చుకుంటుడే వారు. ఔధ్ సంస్థానమంతా కంపెనీ సైనాధికారుల చేతుల్లో ఉంది: బలవంతపు ఋణాలు, విరాళాలతో, ఖజానా ఖాళీ చేయబడ్డది. ఇక ఆ సంస్థానాన్ని స్వతంత్రంగా పాలించడంగాని, ఏవైనా పరిపాలనా సంస్కరణలు అమలు చేయడంగాని నవాబుకు అసాధ్యమై పోయింది.

1801 నాటి ఈ ఒడంబడిక రద్దయి, 1837 లో కొత్త ఒడంబడిక ఒకటి వెలసింది. ఇది నవాబు అధికారాన్ని చాలా దెబ్బతీసింది. కాని పన్నాగంతో కూడిన పాతదానినుండి బయటపడేందుకు నవాబు దీనిపై సంతకం చేశాడు. 1847 లో వజీద్ ఆలీషా ఔధ్ సింహాసనం అలంకరిం చాడు. ఈ కొత్త నవాబు తన సంస్థానాన్ని పీడిస్తున్న తెల్ల పురుగులను ఏరి వేయ నిశ్చయించాడు. అందుకుగాను సంస్థానానికి ముఖ్యమగు సైన్యాలను సంస్కరించ మొదలుపెట్టాడు. ఈ యువ పాలకుడు సైన్యాల క్రమ శిక్షణకు సంబంధించి దృఢమైన నియమ నిబంధనలు ఏర్పాటు చేశాడు. స్వయంగా తాను పరిశీలిస్తూ ఉండేవాడు.

నవాబు ఈ విధంగా తన శక్తిని అభివృద్ధి చేసుకోవడాన్ని కంపెనీ సహించలేక పోయింది. వెంటనే అక్కడ ఉన్న ఆంగ్లేయాధికారి, నవాబు జరిపే ఈ మాదిరి సైనిక కార్యకలాపాలను ఆపుజేయించాడు. తన సైనిక శక్తి పెరగాలని నవాబు వాంఛిస్తే కంపెనీవారు ఇంకా ఎక్కువ సైన్యాలను దించడానికి సిద్ధంగా ఉన్నారని చెప్పారు. అందుకై అదనపు నిబంధనలు లేవనీ, కాకపోతే వారి ఖర్చులు మాత్రం నవాబు భరించాలని చెప్పారు. యువకరక్తంలో ఉన్న నవాబుకు ఒళ్ళు మండిపోయింది. కాని వత్తిడికి లొంగిపోయి తన సైనిక సంస్కరణలు మానివేసి, నిష్క్రియుడుగా ఉండిపోవలసి వచ్చింది.

1801 నాటి సంధిలో - ప్రజల సుఖానందాల కోసమే నవాబు పరిపాలన ఉండాలనే అంశం - ఇంగ్లీషువారు, ఔధ్‌ను తమ ఇష్టం వచ్చినప్పుడు కాజేయడానికి ఉపకరించే సాధనంగా ఉన్నదికాని ఆ తర్వాత సంధిలో ఆ లోపం లేదు. 1837 నాటి ఈ సంధిబాపతు ఈ లోపాన్ని ఎలా సవరించుకోవాలి ? అసలు 1837 సంధి అనేదే లేదని నిరాకరిస్తే? ఇది తెల్లవారి ఆలోచన. వెంటనే పరోక్ష మార్గాలన్ని మానివేసి బ్రిటీష్ వారు 1837 సంధి అనేదే లేదని ఔధ్ నవాబుకు తెలియజేశారు. చేసుకున్న సంధిని తెల్లవారు ఏమీమరచి పోలేదు. నిజానికి 1847 లో లార్డ్ హార్టింగ్‌టన్ బహిరంగంగా, స్పష్టంగా దానిని పునరుద్ఘాటించాడుకూడా. 1851 లో కలనల్ స్లీమన్ దానిని మళ్ళీ సమర్థించాడు. అంతవరకు ఎందుకు? అదే సంవత్సరం కూడా- 1853 లో- సంధి విషయాన్ని తెల్లవారు ప్రస్తావించారు. ఆ సంవత్సరం నాటికి అమలులో ఉన్న ఒడంబడికల జాబితాలో కంపెనీ ఈ సంధిని కూడా పేర్కొని ఉన్నారు !

'అయోధ్యవంటి సుందర భూఖండాన్ని పరిపాలించే ఘోరనేరాన్ని ఒక నవాబు చేస్తుండగా, విజ్ఞుడైన ఆంగ్లేయుడు దానిని వశంచేసుకోవడానికి ఎలా సందేహించగలడు?'-అనుకున్నాడు డల్హౌసీ! వెంటనే 1856 లో ఔధ్

సంస్థాన విలీనీకరణకు సంబంధించిన శ్రీముఖం ఒకటి జారీ అయింది: సాకు ఏమిటో తెలుసునా ? నవాబు పరిపాలనా సంస్కరణలు అమలు జేయడం లేదనేది !

డల్హౌసీ (అతడికి కళంకపూరితమగు) ఈ నిర్ణయం అందగానే ఔధ్‌లోని బ్రిటిష్ అధికారి నవాబు నివాసానికి వెళ్ళాడు. తన సంస్థానాన్ని బ్రిటీష్‌వారికి వప్పగించడానికి తాను సిద్ధంగా ఉన్నట్లు వ్రాసివున్న పత్రంపై సంతకం పెట్టమని బలవంత పెట్టాడు. నవాబు ఆ పత్రం చదివి త్రిప్పికొట్టాడు. నవాబునుండి ఎలాగోలా సంతకం రాబట్టేందుకు రాణీగారికి, వజీరుగారికి లంచాలు పంపే ప్రయత్నాలు చేశారు. చివరకు సంతకం చేయకపోతే భరణాలుకూడా లభించవని బెదిరించారు. మూడు రోజులపాటు చూచి, అప్పటికీ నవాబు లొంగకపోయేసరికి, బ్రిటిష్ సైన్యాలు నవాబు అధికారాన్ని త్రోసిరాజని లక్నోలో ప్రవేశించి రాజభవనంతో సహా రియాసత్‌నంతా వశం చేసుకున్నాయి. జనానాను లూటీ చేశాయి. బేగంలను అవమానించారు; నవాబును సింహాసనంనుండి విసిరి వేశారు. రాజభవనాలన్నీ శ్వేతపశుశాల లయినాయి. అంతవరకు 'ఘోరంగా ఉన్న పరిపాలన'కు బదులుగా అయోధ్యలో ఈ మాదిరి 'చక్కని పరిపాలన' ప్రారంభమైంది !

అయోధ్య పాలకుడు ముస్లిమే అయినా ఆయన క్రిందనున్న భూకామందులంతా హిందువులే. జాగీర్, తాలూక్‌దారీ అధికారాలన్నీ వారసత్వంగా ఈ కుటుంబాల క్రిందనే ఉండేవి. ఒక్కొక్కరిచేత వందల గ్రామాలు పరిపాలింపబడుతుండేవి. వారికి కూడా కోటలు, జాగీర్ల రక్షణకై చిన్న చిన్న సైన్యాలు ఉంటుండేవి. ఇలాంటివారిపై కంపెనీవారి కన్ను పడడంలో ఆశ్చర్యంలేదు. వీరందరినీ నేలమట్టం చేయడంద్వారా ఒకేస్థాయికి తెచ్చేందుకు కంపెనీవారి భూమ్యాదాయ శాఖ విజృంభించింది. తాణాదార్ల అధీనంలోని గ్రామాలన్నీ స్వాధీనం చేసుకోబడ్డాయి. వారి

భూములు కాజేయబడ్డాయి. వారి కోటలు నేలమట్టం చేయబడ్డాయి. అయోధ్య అంతటా ఒకే ఒక ఆక్రందనం నలుదిక్కులా వ్యాపించింది.

ఇదే సమయంలో, అన్యప్రాంతాలలో జమీందార్ల, వతన్‌దార్ల ప్రాభవాన్ని కూడా నేలమట్టం చేసి, అయోధ్యలోని జాగీర్‌దార్ల దుస్థితి అక్కడ కూడా కల్పించేందుకు ఈనాం కమీషన్ అనే రోడ్డుబండ ఒకటి దొర్లింపబడ్డది. ఈ ఈనాం కమీషన్ పని ఎంత ఘోరమైనదో ఒక్క చిన్న విషయం చూస్తే తెలుస్తుంది. 35000 పెద్ద జాగీర్లు, ఈనాముల విషయం దీని పంజాలో నలిగింది. పదేండ్ల వ్యవధిలో ఇందులో ఐదింట మూడు వంతులు స్వాధీనం చేసుకున్నారు. ఈ పద్ధతిలో భారతదేశ మంతటా ఏ రకమైన ఆస్తికి భద్రతలేని పరిస్థితి వచ్చింది. రాజాల సింహాసనాలు, వతన్‌దార్ల వతనులు, జమీందార్ల జమీనులు, తాలూక్‌దార్ల తాలూక్‌లు, పౌరుల ఇండ్లు, దేవాలయాల భూములు, రైతుల పొలాలు - అన్నీ ఘోరాగ్నికి ఆహుతై పోతున్నాయి. నేడు లభించే పట్టెడు ముద్ద రేపు దక్కుతుందని ఎవరికీ నమ్మకం లేదు. స్వరాజ్యానికీ పరరాజ్యానికీ, స్వాతంత్ర్యానికీ, బానిసత్వానికీ ఉన్న తారతమ్యం ప్రజల కళ్ళకు కట్టి నట్లు చూపబడ్డది.

ఇంతవరకు భారతీయ పరిపాలకులచే 'అసహ్యంగా పరిపాలింప బడుతు'న్న విశాలదేశంలో బ్రిటిష్ పరిపాలకుడు 'దయ'తో ఇలాంటి 'అత్యద్భుత' కార్యకలాపాలు నిర్వర్తించాడు !

# అగ్నిలో ఆజ్యం

తమ నాగరకతను చూడగానే భారతీయులు తమ తమ ధర్మాలను గురించి సిగ్గుపడిపోయి వాటిని త్యజించివేస్తారనీ, వేదము, ఖురానులకన్న బైబిలు మిన్నయని భావిస్తారనీ, మందిరాలను, మసీదులను వదలి చర్చిలలో ప్రోగవుతారని బ్రిటీష్‌వారు ఎంతగా భ్రమసిపోయినారో, క్రిందటి శతాబ్దపు పూర్వార్ధంలోని వారి రచనలను, ప్రసంగాలను చూస్తే స్పష్టంగా అర్థమవుతుంది.

1836 లో బెంగాలులో ఆంగ్లభాషా పాఠశాలలు ప్రారంభింపబడినప్పుడు మెకాలే ఒక మూడు దశాబ్దాలలో బెంగాలులో విగ్రహారాధకుడనేవాడు కానరాడని గట్టిగా ఆశపడ్డాడు.

అవకాశం చిక్కినప్పుడల్లా, మామూలు మర్యాదలు కూడా అతిక్రమించి ప్రఖ్యాత ఆంగ్లరచయితలు హిందూ-ముస్లిం మతాలపై నిర్లజ్జగా నీచమైన నిందలు మోపేంతగా ఈ మతాలను ద్వేషించారు.

ఈస్టిండియా కంపెనీవారు భారతదేశాన్ని క్రైస్తవమయం చేసి వేయాలని పదేపదే ఎందుకు అనేవారో తేలికగా అర్థమయ్యే విషయమే. ఒకసారి భారతదేశ మత ధర్మాలునశిస్తే ప్రజలలో జాతీయభావమూ నసిస్తుంది, వారి వ్యక్తిత్వాలూ నసిస్తాయి.వ్యక్తిత్వం ఉండి దానిని నిలుపుకోవాలనే సంసిద్ధతగల జాతిని పరిపాలించడంకన్నా, వ్యక్తిత్వాన్ని కోల్పోయిన జాతిని వశం చేసుకొనడం చాల తేలిక. ఇది మతసంబంధమైన విషయం కాదు. రాజకీయ లౌక్యానికి సంబంధించిన విషయం. ఈ అంశానికి సంబంధించి ఇంగ్లండు తన కత్తిని ప్రయోగించకుండా కేవలం రాజలౌక్యాన్ని మాత్రమే ఎందుకు ప్రయోగించిందో కూడా తేలికగానే అర్థమవుతుంది.

ఇంగ్లీషు అధికారులు, మిషనరీలు బాహాటంగా అంటున్న మాటలను వింటున్నప్పుడు ఇక ఇంగ్లీషు రాజ్యంలో అంతా క్రైస్తవం పుచ్చుకోవాలనే వత్తిడి రానున్నదని ప్రతి భారతీయుడు గుర్తించాడు. స్వరాజ్యం నసిస్తున్నకొద్దీ మందిరాలకు మసీదులకు ఈనాము లిచ్చే రాజాలు, మహారాజాలు కూడా క్రమంగా నసిస్తున్నారు. ఈ శక్తిహీనమైన స్థితిలో మసీదులు మందిరాలకు కొత్త ఈనాము లొచ్చే మార్గాలు లేకపోగా ఉన్న ఈనాములను, ధనమును బలవంతంగా స్వాధీనం చేసుకోవడం ప్రారంభమైంది. తమ మతధర్మాలకు రక్షణలేకుండా పోవడంతో హిందూ, ముస్లింలొకే విధంగా బాధపడడంలో ఆశ్చర్యం లేదు; బ్రిటీష్ వారి అధికార అనధికార పత్రాలన్నిటిలోను హిందూ ముస్లిం లందరిని నిందాపూర్వకంగా 'హీదెన్' లని నీచమతస్తులని పేర్కొనడంతో హిందూ ముస్లింల రక్తం ఉడికిపోవడంలో ఆశ్చర్యం లేదు.

అధికారపు కండకావరంతో ఆంగ్లేయులు హిందూమత సంప్రదాయాలలో జోక్యం కల్పించుకోవడం కూడా ప్రారంభించారు. కలకత్తాలో సహగమనాచారాన్ని నిషేధిస్తూ చట్టం చేసే ప్రయత్నాలు జరుగుతున్న సమయంలోనే ప్రజలు ప్రభుత్వచర్యల వెనుకనున్న వ్యూహాలనుకూడా

గుర్తించ నారంభించారు. కలకత్తా కౌన్సిల్‌లో ఈ చట్టం ఆమోదింపబడ డానికి పూర్వమే తమ ఖైదీలు తమ తమ మత సంప్రదాయాల ననుస రించకుండా ఆపుజేయించారు. నాల్గు రోజులు గడవగానే ప్రజల ఇష్టా యిష్టాలతో నిమిత్తం లేకుండా వితంతు వివాహ శాసనం చేశారు. ఈ శాసనం ఆమోదించబడగానే లార్డ్ కానింగ్ బహుభార్యాత్వ నిషేధశాసనం ప్రవేశ పెట్టబడనున్నదని ప్రకటించి, వెంటనే అది ఆమోదింపబడేందుకు తన చేతనున్నదంతా చేశాడు. ఇక్కడ ప్రశ్న ఆ చట్టాలు మంచివా చెడ్డవా అనేది కాదు. తమ తమ మత సాంప్రదాయ విషయాలలో ఇలా దౌర్జన్యంగా కలుగజేసుకొనే ప్రమాదకరమైన పద్ధతిని స్వీకరించిన బ్రిటీష్ వారికి, మత సంప్రదాయ ప్రమేయాల విషయంలో హద్దు ఏదనేది హిందూ ముస్లిం లందరిని ఎదుర్కొన్న ప్రశ్న.

ఈ భయాన్ని క్రైస్తవ మిషనరీలే రెచ్చగొట్ట నారంభించాయి కూడా. వీధి సభల్లో వారు బహిరంగంగా అచిరకాలంలో భారతదేశమంతా క్రైస్తవం అయిపోతుందని ప్రకటించేవారు. ప్రభుత్వం హిందూ ముస్లిం మత ప్రాతిపదికలను భగ్నం చేసే శాసనాలను ఒకదాని తర్వాత మరొక దానిని చేయజొచ్చింది. హిందువుల వర్ణభావనలను భగ్నం చేసే పద్ధతిలో రైల్వే నిర్మాణం జరుగజొచ్చింది. పెద్దపెద్ద మిషన్ స్కూళ్ళకు ప్రభుత్వం చాలా సొమ్ము విరాళాలుగా ఇచ్చేది. ప్రతి మిషన్‌కు లార్డ్ కానింగ్ స్వయంగా వేలాది రూపాయి లందజేసేవాడు.

మిషనరీ ప్రచారాలు, ప్రసంగాలు పూర్తి అయీ కాక పూర్వమే మతం మార్చుకున్నవారికి అంతకుపూర్వం ఉన్న ఆస్తిహక్కు లేపీ పోవని ఒక కొత్తశాసనం రూపొందింపబడ్డట్లు వార్తవచ్చింది. బిషప్పులకు, ఆర్చి బిషప్పులకు భారతదేశపు ఖజానానుండి పెద్దపెద్ద జీతాలివ్వబడనున్నాయనే సత్యం కూడా వారికి తెలిసిపోయింది. ప్రభుత్వంలోని ఆంగ్లేయాధికారి మొదలు వీధిలోని క్రైస్తవ ప్రచారకునివరకు ఎంత ఎక్కువ వత్తిడితెచ్చా

రంటే ప్రతి 'తెల్ల'అధికారి తనక్రింద పనిచేసే ప్రతి 'నల్ల'వానిని క్రైస్తవం పుచ్చుకొమ్మని పీడించేవారు. ఏ పవిత్రనామం వింటే హిందూహృదయాలు భక్త్యనురాగాలతో ఉప్పొంగి పోయేవో అట్టి రామచంద్రునిగూర్చి నీచము, నిగ్రహరహితమునైన నిందాప్రచారం చేసేవారు. ఎవరిపేరును ముస్లింలు సంభ్రమ, గౌరవాలతో మన్నించేవారో అట్టి మహమ్మదును గురించి అలాంటి ప్రచారాలే జరిగేవి. ఖురాను, వేదములు బాహాటంగా ధిక్కరింపబడేవి. పవిత్ర విగ్రహాలు అవహేళన చేయబడేవి.

ఈ ధోరణులను ఏ సిపాయి అయినా నిరసించి, మాటకు మాట జవాబిస్తే, మిషనరీ కలనల్‌ల పెత్తనం క్రింద వారికి తిండిపెట్టక శిక్షించేవారు. చివరకు బ్రిటీషువారి కొష్ఠాలలో ఉండమంటే స్వమతానికి తిలోదకాలివ్వడం అనేంతవరకు పరిస్థితి వెళ్ళింది. ఏ సిపాయి అయినా క్రైస్తవం పుచ్చుకుంటే అతనిని బహుధా ప్రశంసించేవారు. ఎంతో గౌరవంగా చూచేవారు. అతని ఉద్యోగంలో హోదా పెంచేవారు. మిగిలిన వారి శక్తిసామర్థ్యా లెక్కువయినా, ఇతనికే జీతాలు ఎక్కువ చేసేవారు. స్వమతాన్ని విసర్జించే విశ్వాసహీనుడైన సిపాయి హవల్దార్‌యిపోతాడు! స్వమతంయెడ విశ్వాసఘాతకుడుగా ప్రవర్తించే హవల్దార్ సుబేదార్‌మేజర్ అయిపోతాడు!

సిపాయిలు తరచు పేదవారుగాను, దూరదృష్టిలేని అజ్ఞానులుగాను ఉండడాన్ని గుర్తించి; సైన్యాన్నంతటిని క్రైస్తవం చేయాలని, అది కొలది కాలంలో జరుగనున్న పని యని భావించి ఈ సమస్యను అన్నివిధాలా పరిశీలించిన తర్వాత ఇంగ్లీషువారు సైన్యాలలోని సిపాయీలపై ఎరపెట్టాలనే నిర్ణయానికి వచ్చారు. ఈ అభిప్రాయానికి అనుగుణంగా హిందూ ముస్లిం విశ్వాసాలపై అన్నివైపులనుండి, రహస్యంగాను బహిరంగంగాను, అన్ని రకాలుగాను దెబ్బతీయ నారంభించారు. అంతేకాదు - కొందరు కమాండర్లు, కలనల్‌లు బాహాటంగా పత్రికలద్వారా తామువచ్చిన

పని సిపాయీల మతములను భగ్నంచేయడమే నని ప్రకటించేందుకు సందేహించేవారు కూడా కాదు. బెంగాల్ ఇన్‌ఫెంట్రీ కమాండరు ప్రభుత్వ చిట్టాలో తాను 28 ఏండ్లనుండి సైన్యాలలో మతం మార్పిడి పనిని నిరాఘాటంగా చేస్తున్నానని, నీచమతస్థులగు సిపాయీల ఆత్మలను సాతానులనుండి కాపాడడం తన సైనిక విధులలో ఒకటని స్వయంగా వ్రాశాడు.

సర్వత్రా కోపోద్రిక్తత ప్రజ్వరిల్లుతున్న సమయంలో డల్హౌసీ స్వయంగా హిందూమతంపై మరొక దౌర్జన్యం చేశాడు. యావద్భారతంలోను యుగయుగాలుగా ఆదరింపబడుతూ హిందూధర్మ శాస్త్రోనుగుణ్యము, ప్రేమాస్పదమునైయున్న ఉదాత్త దత్తస్వీకార సాంప్రదాయం 'నాగరిక క్రైస్తవ వీరుడ'గు డల్హౌసీ పాదాలక్రింద నలిగిపోతుంటే హిందూస్థాన మీమూలనుండి ఆమూలవరకు కంపితమైపోయింది.

అగ్నిలో ఆజ్యంపోసినట్లు సిపాయీలు కొత్తరకం తూటాలు వాడాలని ఆజ్ఞలు జారీ అయినాయి. వెంటనే కొత్తరకాల తుపాకులకు ఈ కొత్తరకం తూటాలను తయారుచేసేందుకు అనేక ప్రదేశాలలో కర్మాగారాలు నెలకొల్పబడ్డాయి. అవి నున్నగా ఉండేందుకుగాను ఒకరకమైన క్రొవ్వుతో పూతపూయబడి ఉండేవి. అంతకుపూర్వంవలె గాక వీటిని పండ్లతో కొరికి వాడవలసి ఉంటుంది. ఆ తర్వాత వెంటనే ఈ కొత్తరకం తుపాకులను వాడడాన్ని, వాటికై తూటాలను కొరకడాన్ని నేర్పేందుకు సైనిక విద్యాలయాలు ప్రారంభింపబడ్డాయి. నలుమూలలనుండి వచ్చిన ప్రభుత్వ నివేదికలలో ఈ కొత్తరకం తుపాకులనుచూచి సైనికులు చాలా సంతోషించారని పేర్కొనబడ్డది.

ఒకరోజున కలకత్తానగర సమీపమున ఉన్న డండం గ్రామానికి చెందిన బ్రాహ్మణ సిపాయి ఒకడు ఒక చెంబులో నీరు తీసుకుని సైనిక నివాసాలగుండా నడిచివెళ్తున్నాడు. అప్పుడొక పాకీ పనివాడు ఆ చెంబు

నీళ్ళు అడిగాడు. అతడు చెంబును నోటకరుచుకు త్రాగేందుకు ఆబ్రాహ్మణ సైనికుడు ఇష్టపడలేదు. దానిమీదట ఆపాకీవాడు "నీ ఆచారం తగలడ్డట్లే ఉంది-కొద్దిరోజులలో పందిక్రొవ్వు, ఆవునెత్తురు పూసిన తూటాలను కొరకపోతూ! కొత్త తూటాలకు పూత పూయబడ్తున్నాయని నీకు తెలియమా?" అని దెప్పిపొడిచాడు. ఈ ముక్క వినగానే ఆ బ్రాహ్మణుడు ఉద్రిక్తుడై పోయి ఏదో దయ్యంపట్టినట్లుగా ఆ నివాసాలవైపు పరుగెత్తాడు. కొద్దినిమిషాలలో అక్కడ నల్గురూ చేరారు. అంతా ఉద్రేకపడిపోయినారు. మిగిలిన సైనికులలో కూడా గుసగుసలు వ్యాపించాయి. తమ మతవిశ్వాసాలపై దెబ్బతీసేందుకు ఇది బ్రిటీషువారు కావాలని పన్నిన పన్నాగం అనే అనుమానం ప్రాకిపోయింది. ఆలాంటి పన్నాగమేదీ లేదని, అసలు తూటాలకు ఆవుక్రొవ్వు, పందిక్రొవ్వు పూస్తున్నారనే మాటే నిరాధారమని ప్రభుత్వం తెలియజేసింది.

అయితే అబద్ధమాడిందెవరు? సిపాయిలా? ప్రభుత్వమా? తూటాలకు పందిక్రొవ్వు, ఆవు నెత్తురుల పూతే ఉంటే అది ప్రభుత్వానికి తెలియక అమాయకంగా జరిగిన పనా? లేక కావాలని చేయబడ్డదా? తూటాలకు ఏమి పూశారో ప్రభుత్వానికి తెలియదనే ముక్క నిలిచేది కాదు. 1853 లో ఈ కొత్త తూటాలు ప్రవేశపెట్టబడ్డప్పుడు, అవి ఇలాంటి అభ్యంతరకరమైనవాటితోపూయబడ్డాయని తెలియక,వారిపైనమ్మకంతో కాన్పూర్, రంగూన్, ఫోర్టు విలియం మొదలగు స్థానాలలోని జాతీయ సైనికులు వాటిని కొరుకుతున్నప్పుడు, అవి వేటితో చేశారో ప్రభుత్వానికి తెలియకపోలేదు. సర్వసైన్యాధ్యక్షునికి కూడా ఇది తెలుసు. ఇవి ఆయా మతాలప్రకారం అభ్యంతరకరాలని తెలిసి కూడా వాటిని ఉపయోగించారు. వాటి తయారీకి కర్మాగారాలు కూడా నిర్మించారు. ఆ ఫ్యాక్టరీలలో పనిచేసే నౌకర్లను అడిగి తెలుసుకొన్న తర్వాతనే భారట్‌పూర్ సిపాయీలు ఈ వార్తను భారతదేశమంతటా తెలియజేశారు.

మెరుపైనా అంత త్వరగా వ్యాపించదేమో, ఒక పక్షంరోజులు తిరిగే సరికి ఏ సిపాయినోటవిన్నా ఇదేమాట. హిందువుడుగాని, ముస్లింగాని-ఇది తప్ప మరొక ప్రస్తావనలేదు. జాతీయులలో కోపం, రోషం ఎక్కువైన కొద్దీ తెల్లవారు - గవర్నర్ జనరల్ మొదలు మామూలు తెల్లసిపాయి వరకు-పదేపదే ఆ వార్త నిరాధారమనడం మొదలుపెట్టారు.

ఈ ఆందోళన జనవరి మొదటి భాగంలో ప్రారంభమైంది. నెలాఖరు వచ్చేసరికి ప్రభుత్వం కొంత లొంగక తప్పలేదు. సిపాయీలు తాము తయారుచేసుకున్న క్రొవ్వునే తూటాలకు వాడుకోవచ్చునని ఆజ్ఞ జారీ చేశారు. పైగా, అదే సమయంలో మరొక ప్రభుత్వ పత్రం ద్వారా అభ్యంతకరమైన ఒక్క తూటా కూడా సైన్యాలలోకి పంపబడలేదని బర్చ్ హామీలు పలికాడు! కాని 1856 నాటికే ఒక అంబాలా డిపో నుండి 22,500 తూటాలు, సమాల్‌కోట డిపో నుండి 14,000 తూటాలు సైన్యాలలోకి వెళ్లిపోయినాయి! రైఫిల్ తరగతుల్లో అప్పటికి - ఆ క్షణంలో కూడా అనేకచోట్ల ఈ తూటాలు ఉపయోగింపబడుతూ ఉన్నాయి. గూర్ఖా దళాలలో వీటిని బాహాటంగా ఉపయోగింపజేసేవారు. ఆ తూటాలను వాడకపోతే బలవంతం చేసి వాడించవలసి వస్తుందని సైన్యాధికారులు హెచ్చరించేవారు. కొన్నిచోట్ల సిపాయి ఎవరైనా ఈ తూటాను ఉపయోగించడానికి నిరాకరిస్తే ఆ దళం మొత్తాన్ని శిక్షించారు కూడా.

ఇక తాము ఈ తూటాలను వాడవలసివచ్చినా,లేదా వాడే అవసరం లేకపోయినా ఈ సమస్యలన్నిటికి మూలకందంగా ఉన్న ఈ రాజకీయ బానిసత్వం వదలేవరకు తాము విశ్రాంతి తీసుకోకూడదని సిపాయీలు నిర్ణయానికి వచ్చారు. బానిస జాతికి మతధర్మాల రక్షణ ఎలా ఉంటుంది? ధర్మారాధనలో మొదటి చర్య స్వతంత్ర రాజ్యంలో స్వతంత్రుడుగా ఉండడం!

# రహస్య సంఘటన

దేశమంతా విప్లవ పరిస్థితులు వాటంతటవే పరిపక్వమవుతున్న సమయంలో, బ్రహ్మావర్తంలో విప్లవ సాధన సంపత్తిని సమీకరించి, విజయాన్ని సాధించేందుకు పథకాలు తయారవుతున్నాయి.

లండన్‌లో ఏవో మారుమూల గదులలో రంగోబాపూజీ, అజీముల్లాఖాన్‌లు రహస్య సమాలోచనలు చేస్తున్నారని విన్నాం. ఆ సతారా బ్రాహ్మణుడు, బ్రహ్మావర్తపు ఖాన్‌సాహెబ్‌లు ఏమేమి మాట్లాడుకున్నారో వివరంగా చరిత్ర పత్రాల్లో నమోదు చేయబడజాలకపోయినా, లండన్‌లోని వారి సంప్రదింపులలో విప్లవచిత్రం తయారు కాజొచ్చిందనేది స్పష్టం.

లండన్ వదలగానే రంగోబాపూజీ తిన్నగా సతారా వెళ్లాడు. కాని అజీముల్లాఖాన్‌కు తిన్నగా హిందుస్థాన్ రావడం సాధ్యపడలేదు. ఎవరిపై సమరం జరగవలసి ఉన్నదో వారి అధిపత్యము, రాజకీయములు హిందూస్థానికి మాత్రమే పరిమితమైలేవు. అందువల్ల బ్రిటిషు సామ్రాజ్యాన్ని ఎన్నిచోట్ల వీలైతే అన్నిచోట్ల దెబ్బతీయడం అవసరం. రాసున్న స్వతంత్ర

సంగ్రామానికి యూరప్‌లో ఎక్కడెక్కడ నుండి సానుభూతి సహకారాలు రావచ్చునో పరిశీలించవలసి ఉన్నది. ఈ ఉద్దేశాలతో అజీముల్లాఖాన్ భారతదేశం చేరడానికి పూర్వం ఐరోపా పర్యటన చేశాడు. ప్రపంచ ముస్లింలందరి ఖలీఫాగా పేరుపొందిన టర్కీసుల్తాను రాజధానికి వెళ్ళాడు. అప్పుడు జరుగుచున్న రష్యా టర్కీ యుద్ధంలో ఇంగ్లీషువారు ముఖ్యమైన సెబస్టపోల్ సమరంలో ఓడిపోయినారని విని కొంతకాలం రష్యాలో కూడా గడిపాడు. అజీముల్లా రష్యాలో ఉండగా, లండన్ టైమ్స్ పత్రిక సైనిక వ్యవహారాల విలేఖరి, ప్రఖ్యాత రచయిత అయిన రస్సెల్‌ను కూడా కలిశాడు. టర్కీ రష్యా యుద్ధం తర్వాత, ఈ తన అతిథికి సంబంధించిన అద్భుత కార్యకలాపాల సమాచారాన్ని హిందూస్థాన్ నుండి పత్రికకు పంపవలసి వస్తుందని పాపమా అమాయకుడు అప్పుడు కలలో నైనా ఊహించలేదు! ఇంగ్లీషువారు పరాజయం పొందారని, రష్యనులు ఆంగ్లో - ఫ్రెంచి సంయుక్త సైన్యాలను తరిమికొట్టివేశారని వినగానే అజీముల్లాఖాన్ జూన్ 18 వ తేదీన ఆంగ్లేయుల శిబిరంలోనికి ప్రవేశం కోరాడు. హిందూస్థానీ దుస్తులలో మహారాజువలే అతడు ప్రవేశించాడు. రస్సెల్ బయటికి రాగానే అజీముల్లా "నాకీ మహానగరాన్ని చూడాలని ఉంది. ఆంగ్లో-ఫ్రెంచి సైన్యాలను తరిమివేసిన ఆ రష్యను దుస్తులను చూడాలని ఉంది" అన్నాడు. వ్యంగ్యోక్తిలో అజీముల్లా నిజంగా ప్రజ్ఞా శాలి! అతడి ఆసక్తిని చూచి రస్సెల్ "అలాగే" నని తన శిబిరానికి ఆహ్వానించాడు. ఆ రోజున సూర్యాస్తమయం అయ్యేవరకు అజీముల్లా "కన్నార్పకుండా రష్యను తుపాకుల నుండి వెలువడుతున్న మంటలవంక చూస్తూ" గడిపాడు. ఒక తుపాకి గుండు వచ్చి అతడి పాదాల దగ్గరగా పడ్డది. అతడు చలించలేదు. మహోల్లాసంలో ఉన్న అజీముల్లా తిరిగి వస్తూ రస్సెల్‌తో "మీరు వారి నెప్పటికైనా జయించగలరా? అని నాకు సందేహం కలుగుతోంది" అన్నాడు. ఆరాత్రి రస్సెల్ శిబిరంలోనే శయనించి

మర్నాడు తెల్లవారుతుండగనే వెళ్ళిపోయినాడు. అక్కడ బల్లమీద "రస్సెల్‌కు అజీముల్లాఖాన్ తన అభివందనలు, అతడు తనయెడ చూపిన శ్రద్ధకు కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాడు" అని ఒక కాగితంమీద వ్రాసి పెట్టి వెళ్ళాడు.

రష్యాను వదలిన తర్వాత అజీముల్లా ఎక్కడకు వెళ్ళాడనేది చెప్పడం కష్టం. అయితే అనంతరం కాన్పూర్ ఉద్ఘాటనలోని కొన్ని అంశాల ప్రకారం అతడు ఈజిప్టులో కూడా కొన్ని దౌత్య పథకాలు రూపొందించడానికి యత్నించినట్లు కనిపిస్తుంది.

ఈ విధంగా ఐరోపా పర్యటన ముగించుకొని అజీముల్లా బ్రహ్మవర్తం చేరాడు. అతడు చేరేసరికి రాజమందిరంలోని రాజకీయ వాతావరణమంతా మారిపోయి ఉంది. దుమ్ము కొట్టుకొనిఉండే జరీపట్కా మిలమిల మెరిసిపోతోంది. శౌర్యధ్వానాలను మరచిపోయిన రణభేరీలు మళ్ళీ సాధన ప్రారంభించాయి; రాజముద్రికలు ఉద్రట్లూరిపోతున్నాయి; సింహనేత్రాల్లా తీక్షణమై జ్వాలలు గ్రక్కుతున్న నానాసాహెబ్ నేత్రాలు అజీముల్లాఖాన్ ఆగమనం తర్వాత మరింతగా రోషాకషాయితములై జ్వాలలు గ్రక్కనారంభించాయి. "యుద్ధాయ కృత నిశ్చయః" అంటూ కృష్ణభగవానుడిచ్చిన సందేశపు స్ఫూర్తి ఆ దృక్కులలో తీక్షణంగా ప్రకాశింప జొచ్చింది. బ్రహ్మవర్తమంతా ఇవే మాటలు మార్మోగాయి. "తస్మాత్ యుద్ధాయ యుజ్జస్వ." నానాసాహెబ్ అంతిమ లక్ష్యం స్పష్టమే అయినా అతడు ముందు పెట్టుకున్న పని కత్తిని దూసి బ్రిటీషువారిని గెంటివేయడం ద్వారా స్వరాజ్యము నెలకొల్పడంగా కనిపిస్తుంది; ఆ తర్వాత భారత సంస్థానాధీశు లందరి సంయుక్త అధిపత్యము క్రింద భారత ప్రభుత్వమును నెలకొల్పడం. అందువల్ల నానా కార్యక్రమంలో మొదటి అంశం : సంయుక్త పోరాటం నిర్వహించడం; దేశాన్ని విముక్తం చేయడం; పరస్పర నాశనకారకమైన

పోరును నిలిపివేసి సంయుక్త భారత రాష్ట్రమును నెలకొల్పి, ప్రపంచ స్వతంత్ర రాష్ట్రములందు సముచిత స్థానాన్ని నెలకొల్పడం.

'హిందూస్థానమంటే హిందూ ముస్లిం మతానుయాయు లందరి మాతృదేవి. ముస్లింలు విదేశీ పాలకులుగా ఆధిక్యత చెలాయిస్తున్నంత కాలం వారిని సోదరులుగా భావించడం జాతీయ బలహీనతను వ్యక్తం చేయడమే. అందువల్ల అప్పటివరకు ముస్లింలను విదేశీయులుగా పరిగణించడం అవసరమైంది. పైగా ఈ మహ్మదీయ పాలనను పంజాబులో గురుగోవిందుడు, రాజపుటానాలో రాణాప్రతాప్, బుందేల్‌ఖండ్‌లో ఛత్రసాలుడు, మహారాష్ట్రంలో మరాఠీలు తొలగించివేశారు. ఢిల్లీ సింహాసనాన్ని కూడా విముక్తం చేశారు. ఇట్టిస్థితిలో ముస్లింలతో చేతులు కలపడం జాతికి అవమానమేమీ కాదు. పైగా హిందువుల ఉదారతకు చిహ్నమవుతుంది. అందువల్ల ఇక హిందూ ముస్లిం విభేదాన్ని దూరంగా ఉంచివేయవచ్చు. వారి ప్రస్తుత బాంధవ్యం పరిపాలకులకు, పరిపాలితులకు-మధ్య ఉన్నట్టిదిగాని, విదేశీయులకు-దేశీయులకు మధ్య ఉన్నట్టిది కాదు వారు ప్రస్తుతం సోదరులు- కేవలం మన సంప్రదాయాలలో మాత్రమే భేదము. ఉభయులూ హిందూస్థానపు బిడ్డలే'-నానాసాహెబ్, ఢిల్లీకిచెందిన బహదూర్‌షా, మౌల్వీ అహ్మద్‌ఖాన్, ఖాన్ బహదూర్‌ఖాన్ ఇత్యాది 1857 విప్లవనేతలు ఇంచుమించు ఈ భావాలతో, తమ వైరాల మరచిపోయి స్వదేశ పతాకం క్రింద ఏకమైనారు. క్లుప్తంలో నానాసాహెబ్, అజీముల్లా ఖాన్‌ల పథకం - హిందూ ముస్లిం లంతా కలిసి పోరాడి బ్రిటిష్‌వారిని గెంటివేయడం, ఆ తర్వాత భారత పరిపాలకుల సమష్టి అధిపత్యంలో సంయుక్త రాష్ట్రాన్ని నెలకొల్పడం.

అయితే ఈ లక్ష్యం ఎలా సాధించాలి? బ్రహ్మావర్త రాజభవనంలో ప్రతివారి మనస్సుల్లోను ఉన్న ప్రశ్న ఇది. స్వారాజ్య సాధనకు లక్ష్యిస్తున్న ఈ మహాయుద్ధంలో విజయానికి రెండు అంశాలు చాలా అవసరం.

ఒకటి : లక్ష్యాన్ని సాధించాలనే తీవ్రమైన ఆకాంక్ష; రెండు : లక్ష్య సాధనకై యావద్దేశము ఒకేసారి విజృంభించేలా ఆయత్తం చేయడం. చారిత్రకానుభవాలను విస్మరించడం కాకుండా వానిమీద ఆధారపడిన రహస్య సంఘటన ఒకటి బ్రహ్మావర్తంలో అవతరించింది.

మామూలుగా రహస్య సంస్థలకు సంబంధించిన వివరాల సేకరణ ఎంత అసాధ్యమో, ఈ రహస్య సంస్థకు సంబంధించిన పూర్తి వివరాలను- ఇప్పట్లోగాని, భవితవ్యంలో గాని- సేకరించడం అంటే అసాధ్యం. కాని అడపాతడపా అందిన వివరాల ప్రకారం చూచినప్పుడు వారానాడు చూపిన ప్రజ్ఞ అద్భుతమనిపిస్తుంది.

ప్రజలను ఈ లక్ష్యంవైపు త్రిప్పేందుకు నానాసాహెబ్ 1856 కు కొద్దిగా పూర్వం దేశం నలుమూలలకు ప్రచారకులను పంపాడు. ప్రజలను జాగృతపరచేందుకే కాకుండా, రాజాలను మహారాజాలను జాగృతపరచి సమైక్య భారతరాష్ట్ర నిర్మాణ లక్ష్యంకోసం వారిని ఒప్పించి, స్వాతంత్ర్య మహాసమరంలో వారిని పాల్గొన జేసేందుకుగాను నానాసాహెబ్ ఢిల్లీ మొదలు మైసూరు వరకు గల రాజ్యాలన్నింటికి సమర్థులు, విశ్వసనీయులు నైన వారిని పంపాడు. వారసులు లేరనే సాకుతో ఇంగ్లీషు వారు స్వదేశీ సంస్థానాలను కబళించివేసి భారతదేశాన్ని నిర్మూలించడంలో ఆడుతున్న నాటకం; ఇంకా మిగిలి ఉన్న సంస్థానాలకు కూడా అచిరకాలంలో పట్టనున్న దుర్గతి. బానిసత్వపు ఉక్కు-పాదాల క్రింద దేశధర్మాలు ఎలా నలిగి పోతున్నది-ఇత్యాది విషయాలతో వారి ద్వారా లేఖలు వెళ్ళాయి. అందరి స్వాతంత్ర్యంకోసం ప్రయత్నించే ఈ మహావిప్లవంలో వారంతా పాల్గొనాలని ఆ లేఖల్లో ఉద్ఘాటింపబడింది. నానాసాహెబ్ కొల్హాపూర్, పట్వర్ధన్ సంస్థానాలకు, అయోధ్యపాలకులకు, బుందేల్‌ఖండ్ రాజాలకు, మరి ఇతరులకు ఇలా పంపిన లేఖల ప్రత్యక్ష సాక్ష్యాలు కూడా ఉన్నాయి.

4)

ఇటు నానాసాహెబ్ ప్రతినిధులిలా సంస్థానాల పాలకులను స్వాతంత్ర్య సమర రంగంలోనికి ఆహ్వానిస్తూ ఢిల్లీ మొదలు మైసూరు వరకు సంస్థానాలన్నీ తిరుగుతుండగా - విప్లవోద్యమ బీజాలు ఢిల్లీలోని దివాన్-ఇ-ఖాసెలో వేళ్ళూన నారంభించాయి. బ్రిటీషువారు ఢిల్లీ పాదుషా రాజ్యాన్ని గాకుండా పాదుషా బిరుదాన్ని కూడా తొలగించాలని అప్పటికే నిశ్చయించారు. ఈ మాదిరి హీనస్థితికి నెట్టబడిన పాదుషా, ఆయన ప్రేయసి, కడు చతుర అయిన బేగము - ఉభయులూ తమ వైభవ సాధనకై వచ్చిన ఈ విప్లవావకాశాన్ని జారవిడువదలచలేదు. మరణించడం అనివార్యమే అయితే స్మామ్రాట్టు, మహారాణుల గౌరవానికి తగ్గట్లుగానే మరణిద్దామని నిశ్చయించుకున్నారు.

ప్రస్తుతం ఆంగ్లేయులు పరిష్యనులతో యుద్ధంలో ఉన్నారు. ఇదే సమయంలో భారతదేశం కూడా ఆంగ్లేయులకు ఎదురు తిరగడం తనకు ప్రయోజనకరమని భావించి పరిష్యాకు చెందిన షా ఢిల్లీ సమ్రాట్టుతో దౌత్య లేఖావళి ప్రారంభించాడు. ఢిల్లీ పాదుషా చేసిన ప్రకటనలో ఢిల్లీ దర్బారు నుండి పరిష్యాకు రహస్య ప్రతినిధి ఒకరు పంపబడినట్లు స్పష్టంగా పేర్కొనబడ్డది. అటు షా దర్బారులో ఆవిధంగా రహస్య వ్యూహాలు జరుగుతుంటే, ఇటు ఢిల్లీలో ప్రజోత్సాహాన్ని ఉధృతపరచేందుకు ప్రయత్నాలు ప్రారంభమైనాయి. ఇందుకై ఒక్కొక్కసారి బహిరంగంగా గోడలపై ఉద్ఘాటన పత్రాలు కూడా అంటించబడేవి. 1857లో ధైర్యంగా అటించబడిన వాటిలో ఈ ఉద్ఘాటన పత్ర మొకటి : ''పరిష్యా సైన్యాలు ఫిరంగీల నుండి భారతదేశాన్ని విముక్తం చేయనున్నవి. కనుక హిందూస్థానీ సోదరులందరూ - పిన్నలు పెద్దలు, పేదలు ధనికులు, సామాన్యులు ప్రఖ్యాతులు, విద్యావంతులు విద్యాహీనులు, పౌరులు, సైనికులు అంతా-బ్రిటీషు కాఫర్లనుండి స్వేచ్ఛను పొందేందుకు రంగంలోకి దూకాలి.'' ఈ ఉద్ఘాటనలు బహిరంగంగా ఇలా అనేకమారులు అంటింపబడుతున్నా, వీనిని

అంటిస్తున్న దెవరో ఆంగ్లేయులు గుర్తించలేకపోయినారు. పత్రికలే ఉద్ఘాటనలను ప్రచురించి, విచిత్రభాషలో విమర్శిస్తుండేవి. ఢిల్లీ భవనాలలోని షాహ్‌జాదాలు, వారి నౌకరులు బహిరంగంగాను,రహస్యంగాను తెల్లవారిపై అసహ్యం కల్గిస్తుండేవారు. అనేక వ్యూహాలు పన్నుతుండేవారు. డల్హౌసీ దురాశకు గురియైన అయోధ్య సంస్థానపు రాజధానియగు లక్నోలో కూడా ఢిల్లీ, బ్రహ్మావర్త మహానగరాలలో వలెనే విప్లవ సమర జ్వాలలు రగుల్కొన నారంభించాయి. లక్నో నవాబు, ఆయన వజీరు, ప్రస్తుతం కలకత్తా సమీపంలో నివసిస్తున్నారు. లక్నోవజీరు కేవలం భోగవిలాసాలలో తన్నుకులాడుతున్నట్లు పైకి కనిపిస్తుండేది. కాని వాస్తవానికి ఇవతల నానాసాహెబ్ వ్యూహాలలో ఎంతగా తలమునకలై ఉన్నాడో అవతల వజీర్ ఆలీ నక్షిఖాన్ కూడా అంతే బెంగాల్ సిపాయీల నుద్బోధించి, అప్పటికే నిర్ణయింపబడి ఉన్న తేదీనాటికి సమరంలో వారుకూడా చేరేందుకై ఆలీ నక్షిఖాన్ రహస్యంగాను, సాహసంతోను, విస్తృతంగాను వేస్తున్న పథకాలు మనలను ఆశ్చర్యచకితులను చేయకమానవు. ఫకీర్లవేషంలోను,సన్యాసులవేషంలోను విశ్వసనీయులైన ప్రతినిధులు సైనికులను జాగ్రతపరచేందుకై పంపబడేవారు. కంపెనీవారి నౌఖరికన్నా స్వరాజ్య మేవిధంగా ప్రయోజనకరమో వివరిస్తూ సైన్యంలోని భారతీయాధికార్లతో ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించాడు. అక్కడికక్కడే గంగోదకం సాక్షిగానో, ఖురాన్ సాక్షిగానో బ్రిటిష్ పాలనను నాశనం చేసేందుకే తాము జీవిస్తామని సైనికులచే ప్రతిజ్ఞలు గైకొనబడేవి. సుబేదార్ మేజర్లు, సుబేదార్లు, జమేదార్‌లు, ఇతర ఉన్నతాధికార్లు ప్రతిజ్ఞ తీసుకొనగానే ఆ దళమంతా సహజంగా విప్లవానికి బద్ధమై యుండేది. ఇలాంటి పద్ధతులద్వారా అయోధ్య వజీరు బెంగాల్‌లోని సైన్యము సంతతిని వశం చేసుకున్నాడు. కలకత్తాలోని ఫోర్టు విలియమ్స్‌లోనే ఆలీ నక్షిఖాన్ విప్లవ ప్రతినిధులు సంచరించేవారు.

బ్రహ్మావర్తం నుండి సంస్థానాలన్నింటికి లేఖలు పంపడం పూర్తయినతర్వాత నానాసాహెబ్ స్వయంగా, ప్రజలలోని మహాశక్తిని జాగృత తరచేందుకు సమకట్టాడు.

బ్రహ్మావర్తం,ఢిల్లీ,లక్నో, సతారా మున్నగు మహాసంస్థానాధీశులే రంగంలోకి ఉరికినప్పుడు ఈ విప్లవోద్యమానికి ధనం కొదువ ఏముంటుంది? ప్రజాప్రముఖులను ప్రబోధించేందుకై అత్యల్ప వ్యవధిలో అనంత సంఖ్యలో ఫకీర్లు, పండితులు, సన్యాసులు పంపబడ్డారు. విప్లవం ప్రజ్వరిల్లే వరకు ఆంగ్లేయాధికార్లలోని జిత్తులమారి వాళ్ళకుకూడా ఊహకైనా అందనంత రహస్యంగాను, జాగ్రతగాను ఈ విప్లవ ప్రయత్నాలు సాగిపోయినాయి. అలాంటి ఫకీరులు, సన్యాసులు ఒక్కొక్క గ్రామం వెళ్ళినప్పుడు అక్కడ విచిత్రమైన ఆందోళన, అశాంతి కన్పించడం కద్దు. అలాంటివి మాత్రం కొన్నిమారులు అధికార్లకు తెలుసు. భిస్తీలు దొరలకు మంచినీళ్ళివ్వ లేదని; ఆయాలు పనిమానివేసి చెప్పకుండా ఇంగ్లీషువాళ్ళ ఇళ్ళు వదలి వెళ్ళారని; వంటవారు బనీన్లు గూడా లేకుండా దొరసానుల యెదుటపడే వారనీ; పని కుర్రవాళ్ళు దొరలను ధిక్కరించి వెళ్లిపోయినారని- ఈ విధంగా బజారులలో గుసగుసలు వ్యాపించేవి. ఈ ఫకీర్లు, పండితులు కంటోన్మెంటుల చుట్టూ ఎక్కువ తిరుగుతుండేవారు. బారక్‌పూర్ మొదలు మీరట్ వరకు, అంబాలా, పెషావర్ మొదలైన అన్నిచోట్ల - ముఖ్యంగా ప్రతి కంటోన్మెంటు చుట్టూ - రహస్య సంస్థలు నడచేవి. అధికార్లకు వీరిని చూచి అనుమానం కల్గినా హిందూ, ముస్లిం సైనికులకు మత ధర్మాలయెడ ఉన్న భక్తి శ్రద్ధల కారణాన వీరిని ఏమీ అనగలిగే వారు కారు. ఏదైనా అంటే ఇదికూడా మత ధర్మాలపై దాడిగా చిత్రిస్తారేమోనని భయపడేవారు. పొరపాటున ప్రభుత్వం వీరినేమైనా అంటే ఈ ఫకీర్లు, సన్యాసులే ఆ సైనికుల గ్రామాలకు వెళ్లి, వారి ఇండ్లలో విప్లవ బీజాలు నాటి వచ్చేవారు. మీరట్‌లో అధికార్లు చివరికొకసారి కంటోన్

మెంటు వద్దనున్న ఒక ఫకీర్‌ను పంపివేయవలసి వచ్చింది. ఈ ఆజ్ఞ రాగానే అతడు అమాయకంగా ప్రక్క గ్రామానికి వెళ్లి ఆ సైనికుల ఇండ్ల మధ్య తిష్ఠ వేశాడు: విప్లవ యుద్ధాన్ని గూర్చి ప్రచారం చేస్తూ ఆ మౌల్వీ అహ్మద్‌షా అలాగే దేశమంతా సంచారం చేశాడు. చివరకు అతడు లక్నోలో బహిరంగంగా ప్రచారం చేస్తూ, వేలాది ప్రజలను సభలలో ఉద్బోధిస్తూ ఫిరంగీలను చంపివేయడం తప్ప మన దేశ ధర్మాల రక్షణకు వేరే మార్గం లేదని ప్రబోధిస్తూండగా ప్రభుత్వద్రోహ నేరం క్రింద అరెస్టు చేయబడి ఉరిశిక్ష విధింపబడినది. కాని తప్పించుకు పారిపోయినాడు !

స్వధర్మ, స్వరాజ్యాలపై ఏ విధంగా అత్యాచారాలు జరుగుతున్నాయో స్పష్టంగా సామాన్య ప్రజలకు వారి భాషలోనే వివరించడానికై ప్రజా సమూహము ముమ్మరంగా పాల్గొనే ఉత్సవాలు, జాతర్లను ఉపయోగించడానికి సంబంధించి కూడా విప్లవపక్షం సమగ్రంగా యోచన చేసింది. అక్కడ అమ్మే బొమ్మలు కొత్త భాషను మాట్లాడ నారంభించాయి. ఆడే బొమ్మలు కొత్త నృత్యాలాడ నారంభించాయి. పోలీసు ఠాణాలలో, వీధి మొగల్లో, సత్రాల ఆవరణల్లో ధైర్యంగా విచిత్రమైన అర్థాలతో క్రొత్త గానాలు, క్రొత్త నృత్యాలు ప్రారంభమైనాయి.

ఈ ఉత్సవాదుల ద్వారా మహిళాలోకంలో విప్లవ భావాలు వ్యాపింపజేయడం సాధ్యం కాలేదు. అందువల్ల విప్లవనేతలు ప్రజానీకంలో విప్లవ భావాలను, అశాంతి జ్వాలలను రగుల్కొల్పేందుకు వైద్యుల వేషాలలోను, ఎరుకసానుల వేషాలలోను విప్లవ ప్రచారకులను పంపినట్లు కూడా కనిపిస్తుంది. ఎరుకసానులను ప్రయోగించడం చాలా బాగా పనిచేసేది. వారు బ్రిటిష్ రాజ్యము నశించ బోతున్నదని 'ఎఱుక' చెప్పేవారు. బ్రిటిష్ పాలకుల దుశ్చర్యలను పలికేది వారి అంబ! వాటికి విరుగుడుగా విప్లవం ఒకటే మార్గమనేవారు. మాతృదేశానికి పట్టిన బ్రిటిష్ పరిపాలనా భూతాన్ని వదిలించడానికి విప్లవోద్యమ 'అంక్షలు' కట్టుకోవాలనేవారు !

ఒక ప్రక్క గత జాతీయ వైభవాన్ని గురించి, ప్రస్తుత దుర్దశను గురించి గీతాలాపాలు జరుగుతుంటే, మరొక ప్రక్క ఉజ్జ్వల భవిష్యత్తుతో విశ్వాసం కల్గిస్తూ, ఆ వైపు శౌర్యధైర్యాలతో ప్రజలను పురోగమింపజేసే జ్యోతిషాలు వినిపించేవి. ఫిరంగీరాజ్యం ఏర్పడిన నూరేండ్లలో అది నశింపయి పోతుందని వెయ్యేండ్ల క్రితమే ఒక మహాయోగి జ్యోతిషం చెప్పారని కన్యాకుమారి మొదలు హిమాచలం వరకు మార్మ్రోగిపోయింది. భారతీయ పత్రికలు ఈ జ్యోతిషానికి చాలా ప్రచారమిచ్చాయి. పైగా ఆ జ్యోతిషం ప్రకారం 23 జూన్ 1857 నాటికి బ్రిటీష్ పాలన ముగుస్తుందంటూ వ్యాఖ్యానాలు. వివరణలు ఇచ్చాయి. ప్లాసీ యుద్ధం జరిగిన నూరేండ్లకు మరొక మహావిప్లవం జరిగి బ్రిటీషు రాజ్యం నశించిపోనున్నదనే భావం హిందుస్థాన మందలి అణువణునా అద్భుతమైన విశ్వాసాన్ని, అనంతస్ఫూర్తిని కలిగించింది. ఈ జ్యోతిషాన్ని చెప్పినదెవరా అని తీవ్రంగా చర్చించిన తర్వాత, - ఇదంతా హిందువులు పన్నిన వ్యూహం మాత్రమేననే నిర్ణయానికి వచ్చారు బ్రిటీష్ చరిత్రకారులు. ఎందువల్లనంటే, హిందూ పంచాంగం ప్రకారం మాత్రమే ప్లాసీ పతనం తర్వాత నూరవ ఏడు 1857 అయింది. చరిత్ర పుటలలో చెరగని సిరాతో ముద్రింపబడిన ఈ జాతీయ భవిష్యద్వాణి ప్రభావం, పిన్న పెద్దలందరి హృదయాలలోను విపరీతమైన అలజడిని కల్గించి, ఆ ఉజ్జ్వల భవిష్యత్తును రూపొందించుకోవాలనే సంసిద్ధతకు పురికొల్పింది.

ప్రప్రథమంగా బ్రహ్మావర్తంలో ప్రారంభింపబడిన విప్లవోద్యమ రహస్య సంస్థ ఇప్పుడు అద్భుతవేగంతో అభివృద్ధి చెంద జొచ్చింది. ఉత్తరహిందూస్థానమందలి అనేక నగరాలలో దీనికి స్థావరాలు ఏర్పడినాయి. వాటిమధ్య పరస్పర సంబంధాలకు కూడా చక్కని ఏర్పాట్లు జరిగాయి. ఈ సంఘటనకు దక్షిణాదిన కూడా స్థావరాలు ఏర్పాటు చేసేందుకు రంగో బాపూజీ కృషి చేస్తున్నాడు. బ్రహ్మావర్త రాజభవనము కాన్పూర్ ప్రాంత

కార్యకలాపాలకు కేంద్రము. ఢిల్లీలోని దివాన్ - ఇ - ఖాస్ ఢిల్లీ కార్య కలాపాలకు కేంద్రము. సాధువైన అహమ్మద్‌షా ఆగ్రా లక్నోలలో స్వధర్మ సంగ్రామ - జీహాద్ - వ్యూహములను రచించాడు. జగదీశ్ పూర్ వీరుడైన కుమర్‌సింగ్ ఆ ప్రాంతానికి నేతయై, నానాతో సంప్రదించి యుద్ధసామగ్రిని సేకరించ నారంభించాడు. పాట్నా మహానగ రాన్ని విప్లవసంస్థ ఆవరించివేసిందా అన్నట్లుగా నగరమంతా స్వధర్మో ద్యమ బీజాలు విరజిమ్మబడ్డాయి. స్వదేశ, స్వధర్మాలకోసం అన్నివర్గాలకు అన్ని వర్ణాలకు చెందిన మౌల్వీలు, పండితులు, జమీందార్లు, వ్యవసాయ దార్లు, వ్యాపారస్తులు, న్యాయవాదులు, విద్యార్థులు-ఒకరేమిటి-అందరూ ప్రాణాలొడ్డేందుకు సిద్ధంగా ఉన్నారు.కలకత్తావద్దఅయోధ్యనవాబు,ఆయన వజీరు ఆలీ నక్షీఖాన్‌లు సిపాయీల నందరిని తమవైపు త్రిప్పుకొని సమ రానికి సిద్ధంగా ఉన్నారు. హైద్రాబాదు ప్రాంతములోని ముస్లింలు రహస్య సమావేశాలు ప్రారంభించారు. కొల్హాపూర్ దర్బారుచుట్టూ కూడా విప్లవ వలయాలు వ్యాపించాయి. పట్వర్థన్ సంస్థానాధిపతి, సాంగ్లీయందున్న నానాసాహెబ్ మామగారు, తమ అనుచరులతోసహా అజేయ జాతీయధ్వజం క్రింద యుద్ధసన్నద్ధులై ఉన్నారు. 1857 వ సంవత్సరపు ప్రారంభములో మద్రాసు మహానగరపు గోడలమీద కూడా ఈ క్రింది ప్రకటనలు కాన వచ్చాయి,''స్వధర్మోపాసకులారా! స్వదేశీ సోదరులారా! లేవండి! ఫిరంగీ కాఫర్లను తరిమివేసేందుకై అంతా ఏకంకండి! వారి పాదాల క్రింద న్యాయం నలిగిపోతుంది. మన స్వరాజ్యాన్ని వారు దోచివేశారు. మన దేశాన్ని సర్వనాశనం చేసేందుకు వారు సిద్ధపడ్డారు. భరింపరాని కాఫర్ ఫిరంగీ నిరంకుశత్వం నుండి దేశాన్ని విముక్తం చేయడానికి ఒకే ఒక మార్గం - రణరంగంలో రక్తాన్ని చిందించడమే. ఇది స్వధర్మ స్వేచ్ఛకై జరిగే సమరం! న్యాయానికై జరిగే ధర్మయుద్ధం! అలాంటి సమరంలో ప్రాణాలొడ్డేవారు అమరవీరులు! అమరవీరులకు స్వర్గద్వారాలు తెరిచి

ఉన్నాయి. కాని జాతీయధర్మాన్ని విస్మరించి, దేశద్రోహులై, పిరికిపందలై తప్పించుకుపోయే వారికోసం? వారిని చుట్టుముట్టేందుకు నరకంలో మంటలు భగభగిలాడు తున్నాయి. స్వదేశీయులారా! మీ కేదికావాలి? ఎన్నుకోండి. ఇప్పుడే నిర్ణయించుకోండి.''

వివిధ ప్రాంతాలలో విడివిడిగా పనిచేస్తున్న ఈ బృందాలన్నిటిని ఏకసూత్రబద్ధం చేసేందుకు రహస్యంగా సంచారులు నియోగింపబడ్డారు. లేఖలు ఎప్పుడోగాని పంపబడేవికాదు, ఒకవేళ ఏదైనా లేఖను పంపవలసి వస్తే ఏదో అర్థంకాని భాషలో ఉండేది. పేర్లేమీ ఉదహరింపబడేవికాదు. కాని కొంతకాలం తర్వాత ఫిరంగీలు కనిపించిన ప్రతి కాగితాన్ని అనుమానంతో తెరచిచూడడం ప్రారంభింపగానే, విప్లవోద్యమ నాయకులు సాంకేతికాలతో-చుక్కలు, గీతలు, అంకెలతో—సమాచారం పంపడం ప్రారంభించారు.

సిపాయీల సమావేశాలు అర్ధరాత్రి వేళలందు జరుగుతుండేవి. తీర్మానాలన్నీ సాధారణ సమావేశాలలో జరుగుతుండేవి. అంతరంగిక సమావేశాలలో జరిగే నిర్ణయాలను అందరూ తు.చ. తప్పకుండా తలదాల్చేవారు. రహస్య సమావేశాలకు వచ్చేటప్పుడు తామెవరో తెలియకుండా ముఖాన గుడ్డకట్టుకొనివచ్చి, బ్రిటిషు దుర్మార్గులను గురించి ఏకధాటిగా ప్రసంగించి వెళ్ళిపోతుండేవారు. సమావేశాలకు వచ్చిన వారెవరైనా శత్రువుకు విప్లవకారుల ఆచూకీ ఇచ్చినట్లు తెలిస్తే అతణ్ణి వెంటనే ''పూర్తి'' చేసేవారు. సైనికబృందాలమధ్య సంబంధాలు నెలకొనేందుకై విందులు, వినోదాలు, పరస్పర ఆహ్వానాలు జరుగుతుండేవి. ఈమాదిరి సమావేశాలలో అనేకమైన సంప్రదింపులు చాలా విజయవంతంగా జరుగుతుండేవి. రాజకీయంగా, ధార్మికంగా జరుగుతున్న అన్యాయాలను గురించి ప్రతి సామాన్యసైనికునికి వివరించడం, అతడు బ్రిటిష్‌వారితో సమరానికి ఆతృతపడడం జరుగుతున్నా విప్లవం ఎలా విజృంభించాలి, ఎప్పుడు విజృంభించాలి, వివిధ దశాలకు

నాయకులెవరు - మున్నగు విషయాలు మాత్రం తెలిపేవారుకాదు. వీటికి సంబంధించిన నిర్ణయాలన్ని అధికార్లకు వప్పగించబడ్డాయి. ప్రతివారినుండి గంగోదకమో, తులసీపత్రమో, ఖురానో - ఏదో ఒకటి సాక్షిగా - తమ సైనికదళం చేయవల్సినది చేస్తామని ప్రమాణం స్వీకరించేవారు. ఈవిధంగా ఒక సైనికదళం ప్రమాణాలు చేసినతర్వాత దాని అధికారసంఘం మరొక సైనికదళపు అధికార సంఘాన్ని సంప్రదించి వారి దళంచేతకూడా ప్రమాణాలు పుచ్చుకునేది. ఈ సంఘాలన్ని పరస్పర విశ్వాసంతో సహకారంతో పనిచేసేవి. సిపాయీలమధ్య పరస్పరం జరిగిన ప్రమాణాలకువలెనే దళాలకుమధ్య పరస్పర జరిగిన ప్రమాణాలుకూడ తిరుగులేనట్టివి. ప్రతి సైనికదళమూ ఉన్నత సంఘటనలో ఒక ఉపాంగమయింది. వివిధ దళాల మధ్య వప్పందాలంటే - అన్యదళాలన్నీ చేసేపనిని తామూ చేస్తామని అంగీకరించడమే. ముఖ్యమైన పథకాలు వేయడం, ఉత్తర ప్రత్యుత్తరాలు నడపడం మున్నగు పనులన్నీ అధికార సంఘం చేస్తుంటుంది. 31 వ తేదీన సిపాయిలంతా విజృంభించాలనే ఏకైక నిర్ణయానికి వచ్చారు. అది ఆదివారం కనుక యూరోపియన్ అధికార్లు చాలామంది చర్చిలలో ఉంటారు. వీరిని, మరి ఇతర యూరోపియన్ అధికార్లను కలిపి మట్టు పెట్టాలి. ఆ తర్వాత ధనధాన్యాలతో నిండిఉండే ప్రభుత్వ కోశాలను కొల్లగొట్టాలి; జైళ్ళ తాళాలు పగలగొట్టి బందీలను విడుదల చేయాలి; మందుగుండును, ఆయుధాలను స్వాధీనం చేసుకోవాలి; వీలున్న ప్రతిచోట కోటలను, కీలక స్థానాలను వశం చేసుకోవాలి; విప్లవ సంఘటన రహస్య పథక మిది. సైన్యమంతా దీనికి బద్ధం చేయబడినది.

ఈ రహస్య సంఘటనకు సమర యంత్రాంగా న్నేర్పరచేందుకు లక్నో షాహుకారులు, నానాసాహెబ్, వజీరాలీఖాన్‌ల భవనాలు, ఢిల్లీ మహలు, ఇతర విప్లవ నేతలు చాలు. సిపాయీలంతా పథకాల రహస్యాలను కాపాడుతుంటే, ఒక చిన్న పొరపాటువల్ల ఒక దేశద్రోహిద్వారా కొన్ని

రహస్యాలు బయటపడ్డాయి. అసంతృప్తి చెందినట్లు అనుమానం కల్గిన సైనికదళ మంతటిని వెంటనే బ్రిటిష్ ప్రభుత్వము తీసివేసింది. ఆవిధంగా ప్రభుత్వమే చేజేతులా దేశంలో విప్లవ జ్వాలలను ప్రజ్వరిల్ల జేసేందుకు అనేకమంది విప్లవ సన్యాసులను అందిచ్చినదైంది! హిందూస్థాన మందలి దర్బారులన్నీ, సామాన్య జనత, సైన్యము, విప్లవ నేతల కృషిచే ఏకమై పోయినాయి. ఇకపోతే, ప్రభుత్వాధికార వర్గమొకటి మిగిలిపోయింది. పల్లెల్లో గ్రామాధికార్ల మొదలు స్వదేశ న్యాయమూర్తుల వరకు చెందిన హిందూ ముస్లిం ఉద్యోగులు, న్యాయవాదులు, గుమాస్తాలు మున్నగు వారంతా రహస్యంగా విప్లవ సంఘటనలో చేరారు.అయితే ఇది ప్రభుత్వా నికి ఊహకైనా అందకపోవడానికి చిన్న కారణముంది - ప్రభుత్వానికి కళ్ళు చెవులూ వీరేకావడం!వీరిద్వారానే ప్రభుత్వానికి సమాచారమందేవి, అసలు ఘడియ వచ్చేవరకూ వీరెవరూ ప్రభుత్వాన్ని ఏమాత్రం వ్యతిరే కిస్తున్నట్లు కనపడరాదని నిశ్చయింపబడ్డది. ఎవరైనా విప్లవ నేతను నిర్బం ధించవలసి వస్తే వారు బ్రిటిష్ అధికార్లకన్నా ఎక్కువ క్రూరంగా ఉంటుండేవారు. ఎక్కువ శిక్షలు విధిస్తుండేవారు. మీరట్ సిపాయిలు న్యాయస్థానంలో విచారింప బడ్డప్పుడు చాలా కఠినమైన శిక్షలు విధించింది ఈ స్వదేశీ న్యాయమూర్తులే. అయితే ఈ న్యాయమూర్తులే విప్లవ పథకాలు వేస్తున్నట్లు బయటపడ్డది. జనాన్ని ఆందోళన జరపమని ఉద్బోధిస్తూ లక్నో వీధుల్లోని గోడలన్నిటిపై ఆకాశరామన్న పత్రా లంటించబడ్డాయి. ఇందలి భాష చాలా తీవ్రంగాను, రెచ్చకొట్టేదిగాను ఉండేది. రోజూ ఇలా పత్రాలు అంటించబడుతున్నా బ్రిటిష్ అధికార్లు వాటిని తొలగించివేయడం కన్నా మరేమీ చేసేవారు కాదు. మళ్ళీ మర్నాటికి పత్రాలు ప్రత్యక్ష మవు తుండేవి. ఈ పత్రాలు ఎవరు అంటిస్తున్నారో ఎప్పుడంటిస్తున్నారో తెలిసి కొనడం తమకు సాధ్యంకాదని పోలీసులు చెప్పివేశారు. వెంటనే ప్రభుత్వా నికి అసలు రహస్యం తెలిసిపోయింది- పోలీసులు కూడా విప్లవ పక్షంలో చేరిపోయినారని!

ఇలా విప్లవ యంత్రపు చక్రాలు తిరగడం ప్రారంభమైంది; అయితే అన్ని చక్రాలు క్రమపద్ధతిలో తిరిగేలా చేయాలి. ఇందుకుగాను బెంగాలు నుండి సందేశ వ్యాపకుడొకడు ఎర్రకలువ పుష్పాన్ని పుచ్చుకుని కంటోన్మెంటులకు బయల్దేరాడు. ఆ పుష్పాన్ని అచ్చటి మొదటి సైనిక దళాధిపతి చేతిలో ఉంచుతాడు. ఆ అధిపతి ప్రక్కనున్న సిపాయి చేతికందిస్తాడు. ఇలా ఒకరి చేతినుండి మరొకరికంది అంతా కలయతిరిగి చివరకు అది మళ్లీ సందేశ వ్యాపకుని వద్దకు చేరుతుంది. ఇక అది చాలు! వేరే మాటా పలుకూ అవసరం లేకుండానే అతడు బాణంలా మరొక దళానికి వెళ్ళి ఆ దళపు అధిపతికి దానినందిస్తాడు !

అది 1857 మార్చి నెల. ఒక్కసారి ఈ 'యాత్రాస్థలా'లన్నీ సందర్శించి రావడం చాలా అవసరం అనుకున్నాడు నానాసాహెబ్. మొదట ఢిల్లీని సందర్శించాడు. అక్కడ సంప్రదింపులెలాజరిగింది బహుశా దివాన్-ఇ-ఖాస్ లేదా ఢిల్లీ వాతావరణం మాత్రమే చెప్పగల్గుతాయి. ఈసమయంలో ఆగ్రా న్యాయమూర్తి మోరెల్ అనునాతడు నానాను దర్శించడానికి వచ్చాడు; అతడికి నానా ఇచ్చిన స్వాగతమెంత ఘనంగా ఉన్నదనగా - మరి ఒకటి రెండు నెలలో బ్రిటిష్ ప్రభుత్వానికి ఇవ్వబడనున్న 'స్వాగతా' నికి సంబంధించి అదే క్షణాన నానా చేస్తున్న ప్రయత్నాలు ఊహించేందుకైనా వీలులేనంత ఘనంగా ఉన్నది. ఢిల్లీలోని ఏర్పాటులన్నిటిని పరిశీలించిన తర్వాత నానా అంబాలా వెళ్ళాడు. ఏప్రిల్ 18 నాటికి విప్లవ కేంద్రాలలో ప్రముఖమైనదగు లక్నోకు చేరాడు. ఆ రోజుననే లక్నో ప్రజలు చీఫ్ కమీషనర్ సర్ హెన్రీ లారెన్సు బండి వెంటబడి రాళ్ళు, బురద వర్షింపజేరు. అట్టి స్థలాని కప్పుడు నానా చేరాడు. ఇక లక్నో ప్రజల ఆనందోద్రేకాలకు హద్దే లేకపోయింది. బ్రహ్మాండమైన ఊరేగింపుగా ఆయనను పురవీధుల గుండా తీసుకువెళ్ళారు. తమ కానున్న సర్వసేనానిని దర్శించగానే విపపక్షంలో అద్భుత విశ్వాసం నెలకొన్నది. నానా స్వయంగా సర్

హెన్రీ లారెన్సు వద్దకు వెళ్ళి తనకు ఊరకే లక్నో చూడాలని ఆసక్తి పుట్టి వచ్చానని 'విన్నవించు' కున్నాడు. పాపం ! పిచ్చి హెన్రీ దానిని నమ్మి, నానాకు అన్ని విధాలా మర్యాదలు జరపవలసిందిగా క్రిందివారికి ఆజ్ఞలు పంపాడు. నానా ఆసక్తి ఏమిటో అతడికర్థం కాలేదు. లక్నో తర్వాత నానా కాల్పి వెళ్ళాడు. అప్పటికే ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా తనకు సన్నిహితుడైన జగదీశ్‌పూర్ పాలకుడు కున్వార్‌సింగ్‌తో నానా దౌత్య వ్యవహారాలు చాలా చురుకుగా సాగిపోయాయి.

ఈ విధంగా ప్రముఖ విప్లవ కేంద్రాలగు ఢిల్లీ, అంబాలా, లక్నో, కాల్పిలలోని నాయకులను స్వయంగా కలుసుకొని స్పష్టమైన కార్య క్రమాన్ని, నిర్దుష్టమైన భవిష్యత్ప్రణాళికను రచించుకొని నానాసాహెబ్ ఏప్రిల్ మాసాంతానికి తిరిగి బ్రహ్మావర్తం చేరాడు.

ఇటు నానా ఈ యాత్ర జరుపుతూ, విప్లవ ఘడియను నిర్ణ యిస్తుండగా, అటు యావద్భారతంలో తుఫానువేగంతో విచిత్ర సందేశ బృంద మొకటి ఆ ఘడియకై ప్రజలను అయత్తం చేస్తున్నది. ఈ సందేశ వ్యాపక బృందం కొత్తదేమీ కాదు. విప్లవ కార్యము ప్రారంభమైనప్పుడంతా ఈ సందేశ వ్యాపకుల ద్వారానే - అనగా చపాతీల ద్వారానే విప్లవ సందేశం మూలమూలలకు వ్యాప్తి చేయబడినది ! వెల్లూరు తిరుగుబాటులో కూడా చపాతీలే విప్లవ సందేశాన్ని వ్యాప్తిచేశాయి. ఈ విచిత్ర 'దూత'లే కానరాని తమ రెక్కలతో భారత నభోమండలమంతా విహరిస్తూ, సాంకేతిక సందేశాలతో యావద్భారత హృదయాన్ని విప్లవాయత్తం చేస్తాయి. అవి ఎక్కడ నుండి బయల్దేరాయో, ఎక్కడికి వెళ్ళాయో ఎవరికి తెలియదు. వాటికోసం ఎదురు చూచినవారికే వాటి సంకేతం అర్థమయ్యేది. అవి ఏమిటో తెలియకుండా హఠాత్తుగా ఎవరి చేతుల్లోనైనా పడితే ఏమీ అర్థ మయ్యేది కాదు. ప్రభుత్వాధికార్లుగా ఉన్న వెర్రివెంగళప్పలు కొందరు ఈ చపాతీలు సంపాదించి ముక్కలు చేసి, పిండి పిండి చేసి ఆ సంకేత

మేమిటో తెలిసికొనడానికి ప్రయత్నం చేశారు. అయితే ఆ చపాతీలకు నాలుకలేమీ లేకపోయినాయి మాట్లాడేందుకు. ఎవరితో మాట్లాడాలో వారితో మాత్రమే అవి మాట్లాడేవి. అవి మామూలు గోధుమతో తయారైనవే. వానిమీద ఏమీ వ్రాసి ఉండేదికాదు. అయితే వాటి సంగతి తెలిసిన వారిని అవి తమ స్పర్శమాత్రం చేతనే ఉద్రేకపరచేవి. గ్రామాలలోని ప్రతి చౌకీదారుకు అవి అందేవి. తనొక చిన్న ముక్క నోట్లో వేసుకొని, మిగిలిన దానిని ప్రసాదముగా కోరిన వారందరికి పెట్టేవాడు. మళ్ళీ అన్ని చపాతీలూ తయారు చేయబడి ప్రక్క గ్రామాలకు పంపబడేవి. అలాగే అక్కడక్కడా. ఈ విధంగా విప్లవాగ్ని గ్రామగ్రామాన ప్రాకిపోయింది. విప్లవదూత ! వెళ్ళు, త్వరగా వెళ్ళు. ప్రతి ఒక్కరిని విముక్తం చేసేందుకై సాగనున్న పవిత్ర సంగ్రామానికి యావద్భారతంలోని అణువణువు సిద్ధంగా ఉందని మాతృదేవి కన్నబిడ్డ లందరికి సందేశ మిచ్చేందుకై త్వరపడి సాగిపో !

ద్వితీయ భాగం

# ప్రజ్వలనం

## అమరవీరుడు మంగళపాండ్యా

ఇటు రహస్య సంఘటన పరిపక్వం అవుతుండగా అటు బెంగాలులో ప్రభుత్వం బలవంతాన సైనికులచే క్రొవ్వుతూటాలను ఉపయోగింపజేయ జొచ్చింది. ప్రథమ ప్రయోగం 19 వ దళంమీద జరిగినట్లు కనిపిస్తోంది. అది ఫిబ్రవరి నెల. బెంగాల్‌లో ఉన్న సైనికదళా లన్నిటిలోను 34 వ దళం విప్లవం ప్రారంభించడానికి చాలా ఆతృతతో ఉన్నది. ఈ దళం బారక్ పూర్‌లో ఉండడంవల్ల కలకత్తాలో ఉన్న వజీర్ అలీఖాన్ ఇందలి వారందరి చేత విప్లవ ప్రమాణాలు స్వీకరింపజేశాడు. ఇందుండి కొందరు 19 వ దళానికి పంపబడ్డారు. వెళ్ళిన వారు ఆ దళం అంతటిని జాతీయోద్యమం వైపుకు త్రిప్పారు. బ్రిటీష్ వారి కీవిషయం తెలియక బలవంతాన ముందుగా ఆ దళాన్ని క్రొవ్వుతూటాలుపయోగించమన్నారు. ఆ దళం మొత్తం అందుకు నిరాకరించింది. పైగా అవసరమైతే కత్తి దూసేందుకు కూడా సిద్ధమేనని వ్యక్తం చేశారు. దీనిని చూసి బ్రిటీష్‌వారు మామూలుగా 'నాటు' సైనికులను

అణచివేయ నారంభించారు. అయితే 'నాటు' వారు లోగడవంటివారు కారని క్షణంలో తెలుసుకున్నారు. బ్రిటీష్‌వారీ అవమానాన్ని భ్రిగమింగాల్సి వచ్చింది. వీరిని అదుపులో ఉంచగల 'తెల్లవారు' ప్రాంతం మొత్తం మీద లేరు. అందువల్ల మార్చి ప్రారంభంలో బర్మా నుండి ఒక శ్వేత సైనిక దళాన్ని కలకత్తా రావించారు. ఈ 19 వ దళాన్ని నిరాయుధంచేసి రద్దుచేసి వేయాలని ఆజ్ఞలు వెళ్లాయి. ఈ ఆజ్ఞలు బారక్‌పూర్‌లో అమలు జరగాలని నిశ్చయింపబడ్డవి.

తమదేశీయులిలా అవమానింపబడడాన్ని బారక్‌పూర్‌దళంమౌనంగా సహించే స్థితిలో లేదు. మంగళపాండే కత్తి ఒరలో శాంతంగా ఉండేందుకు సిద్ధంగాలేదు. 19 వ దళం వలనే 34 వ దళం కూడా బ్రిటిష్ సేవను త్యజించేందుకు సిద్ధంగానే ఉంది. అందువల్ల దేశభక్తులంతా 19 వ దళం రద్దుకానీయడమే మంచిదనుకున్నారు, అయితే నల్గురినీ సంప్రదించేందుకు గాను ఒక నెల ఓపిక పడదామన్నారు. అందులోని బుద్ధిమంతులు కొందరు. ఆ ప్రకారం బారక్‌పూర్ నుండి విప్లవ ఘడియను నిర్ణయించవలసిందిగా నలుమూలలకు లేఖలు కూడా వెళ్ళాయి. అయితే మంగళపాండ్యా ఖడ్గం మాత్రం ఓపిక పట్టలేకపోయింది.

మంగళపాండ్యా బ్రాహ్మణవర్ణ సంజాతుడు. కాని క్షత్రియధర్మాన్ని స్వీకరించాడు. మంచి యువ సైనిక వీరుడుగా తయారైనాడు. తన ప్రాణం కన్న ధర్మాన్నధికంగా ప్రేమిస్తూ, విశుద్ధస్వీయ జీవనంతో, కదన రంగాన ప్రచండశౌర్యంతో భాసించే తేజస్వియగు ఈ బ్రాహ్మణయువకుని హృదయం స్వదేశ స్వేచ్ఛాభావనతో ఉప్పొంగిపోయింది. తన సోదరులు ఆనాడు అవమానింపబడుతున్నారనే విషయాన్ని ఆ హృదయం సహించలేక పోయింది. తన దళం ఆనాడే ఎదురు తిరగాలని అతడు పట్టుబట్టాడు. తన యోజనను విప్లవ నేతలు సమర్థించిరని వినగానే, అతడు తుపాకిని దట్టించి మైదానంలోకి ఉరికి "లేవండి! సోదరులారా! ఎందుకు వెనుక

ఉన్నారు? మీ ధర్మం మీద ఆన! రండి! ముందుకు దూకండి! మన స్వాతంత్ర్యం కోసం విద్రోహులగు శత్రువుల మీద విరుచుకు పడదాం'' అని గర్జించాడు. తోడి సైనికులను తన ననుసరించవలసిందిగా ఉద్బోధించాడు. సార్జంట్ మేజర్ హగ్‌సన్ దీనిని చూడగానే మంగళపాండ్యాను నిర్బంధించవలసిందిగా సైనికుల నాజ్ఞాపించాడు. అయితే ఒక్కరూ ముందుకు రాలేదు. ఇంతవరకు బ్రిటీషువారి మాటలను తలదాల్చే దేశద్రోహియగు సైనికి డిప్పు డొక్కడూ లేడు. మంగళపాండ్యాను నిర్బంధించేందు కొక్కరూ ముందుకుకూడా రాలేదు సరిగదా, పాండ్యా తుపాకి గుండుకు క్షణంలో హగ్‌సన్ ఆహుతై పోయినాడు. అదే క్షణంలో లెఫ్టినెంట్ బాగ్ రంగంలోకి వచ్చాడు. అతడి గుర్రం మైదానంలోకి దూకబోతుండగా మరొక గుండు దానిని బలిగొన్నది. క్షణంలో గుర్రము, రౌతు నేలపై బడ్డారు. పాండ్యా మళ్ళీ తుపాకిని దట్టిస్తుండగా బాగ్ లేచి పిస్తోలు గురిపెట్టాడు. చలించని పాండ్యా కత్తి దూశాడు. బాగ్ పిస్తోలు పేల్చాడు. కాని గురితప్పింది. అతడూ కత్తిని దూశాడు. అతడు కత్తిని పైకెత్తి లోపుగనే పాండ్యా అతణ్ణి పూర్తిచేశాడు. తెల్లసైనికు డొకడు పాండ్యాపై తుపాకి గురిపెట్టుండగా ప్రక్కనున్న స్వదేశీ సైనికుడు తన తుపాకీ మడమతో అతడిశిరమును మోదాడు. ఆ వెంటనే సిపాయీలందరూ ముక్తకంఠంతో "మంగళ్ పాండ్యాను ముడితే మర్యాద దక్కద"ని గర్జించారు. ఇంతలో కలనల్ హ్వీలర్ వచ్చాడు. మంగళపాండ్యాను నిర్బంధించవలసిందిగా ఆజ్ఞాపించాడు. ముక్తకంఠంతో జవాబు వచ్చింది: ''ఆ పవిత్ర బ్రాహ్మణుని వెంద్రుకనైనా తాకబో''మని. అనగా తోడి అధికార్ల రక్తం, ఇటు సైనికుల ఉద్రేకం చూచి హ్వీలర్ వెంటనే తిరోగమించి జనరల్ బంగళాకు పరుగెత్తాడు. మైదానంలో మంగళప్యాండ్యా శత్రురక్తంతోతడిసిన చేతులెత్తి ''రండి! సోదరులారా రండి!" అని సైనికుల నాహ్వానిస్తున్నాడు. జనరల్ హర్లేస్ ఇదంతా విని త్వరత్వరగా కొందరు తెల్ల

వారిని తీసుకొని పరుగెత్తుకు వచ్చాడు. వారంతా తన వైపునకే రావడం చూచి వాళ్ళచేతులో మరణించడాని కిష్టంలేని ఆ మహావీరుడు తుపాకిని తన గుండెలవైపు త్రిప్పుకున్నాడు. మరుక్షణంలో ఆ పవిత్రదేహం గాయపడి భూమిపై ఒరిగింది. వెంటనే అతణ్ణి ఆస్పత్రికి చేర్చి, ఆ మహా వీరుని ధైర్యసాహసాలకు అచ్చెరువందుతూ బ్రిటిష్ అధికార్లు తమ నివాసా లకు చేరారు. అది 857 మార్చి 29 వ తేది.

తర్వాత పాండ్యాను కోర్టుమార్షల్ ముందు విచారించారు. విచారణ సమయంలో మిగిలిన 'కుట్రదారు'ల పేర్లు కూడా చెప్పమని బలవంతం చేశారు. ఆ యువకవీరుడు నిర్మొహమాటంగా నిరాకరించాడు. తాను కాల్చి వేసిన అధికార్లయెడ తనకు వ్యక్తిగతంగా ఎలాంటి ద్వేషమూ లేదనికూడా స్పష్టంచేశాడు. వ్యక్తిగతద్వేషమే ఉంటే మంగళపాండ్యాపేరు హంతకుల జాబితాలో ఉండేదిగాని అమరవీరుల జాబితాలో ఉండేదికాదు. అతడికి ఉరిశిక్ష విధించారు. ఏప్రిల్ 8 వ తేదీన ఉరిశిక్ష అమలుజరగాలి. దాని నమలుచేసేందుకు కడజాతివాడైనా బారక్‌పూర్ మొత్తంమీద దొరకలేదు. ఆ పాడుపని చేసేందుకు కలకత్తా నుండి నల్గురిని రావించవలసి వచ్చింది. 8వ తేదీ ఉదయం సైనికుల కాపలామధ్య మంగళపాండ్యాను ఉరికంబము వద్దకు తీసుకువెళ్ళారు. పాండ్యా నిస్సంకోచంగా చరచర నడచి వెళ్ళి ఉరికంబ మెక్కాడు. విప్లవవీరులపేర్లు బయటపెట్టనని అతడు మరొకసారి స్పష్టం చేయగానే ఉరిత్రాడు బిగుసుకు పోయింది. అత డమరుడైనాడు.

విప్లవ రణరంగంలో ఇది మొదటి సమరం. మొదటి ఆహుతి ఇలా జరిగింది.

మంగళపాండ్యా మరణించినా, ఆయనతేజము హిందుస్థానమంతటా వ్యాపించింది. ఆయన లక్ష్యం అమరమైంది. తన రక్తాన్నేగాక, తన పవిత్ర నామాన్ని కూడా విప్లవానికిచ్చాడు. 1857 సమరంలో దేశ ధర్మములకై పోరాడిన ప్రతివారిని మిత్రులు,శత్రువులు కూడా'పాండ్యా'అంటుండేవారు!

# మీరట్

మంగళపాండ్యా రక్తములో మొలకెత్తిన విప్లవబీజం వేరూన డానికి ఎక్కువకాలం పట్టలేదు. 34 వ దళపు సుబేదారు రాత్రివేళలందు రహస్య సమావేశాలు నిర్వహిస్తున్నాడనే ఆరోపణకు గురియై శిరచ్ఛేదము చేయబడెను. 19 వ, 34 వ దళాలు రహస్యంగా విప్లవమును లేవదీస్తున్నట్లు పత్రాధారాలు లభించగానే ఆ రెండు దళాలు నిరాయుధం చేయబడి రద్దయిపోయినాయి. ప్రభుత్వ దృష్టిలో ఇది శిక్షే అయినా సైనికులు దీనిని ఘన గౌరవముగా భావించారు. ఆ రోజున ఐరోపియను దళాలు సిద్ధంగా ఉంచబడ్డాయి. ఈ శిక్షతో స్వదేశీ సైనికులు తమ అవిధేయతకు పశ్చాత్తాపం చెందుతారని బ్రిటిష్ అధికార్లు విశ్వసించారు. కాని వేలాది సైనికులు ఏవో అపవిత్రమైనవాటిని క్రింద పారవేసినట్లుగా ఆయుధాలను క్రిందపడేశారు. బూట్లను, సైనికదుస్తులను చింపివేసి, దాస్యపాపాన్ని కడిగివేసుకొనడానికా అన్నట్లు ప్రక్కనున్న నదిలో స్నానానికై వెళ్లారు.

మంగళపాండ్యా రక్తార్పణ బెంగాలులోని సైనికదళాలలో స్వేచ్ఛా బీజాలు నాటడమేకాక, హిందూస్థానపు ఆవలిభాగాన ఉన్న అంబాలాను కూడా ఉత్తేజితం చేసింది. అంబాలా బ్రిటిష్ సైన్యాలకు ప్రధాన కేంద్ర స్థానం. సర్వసేనాని ఆన్‌సన్ అక్కడ ఉంటాడు. అచ్చటి సిపాయిలు కొత్త పథకం వేసుకున్నారు. తమకు అడ్డువచ్చిన అధికార్ల నివాసా లన్నిటిని దగ్ధం చేసివేయడం! అనేక దహనాలు కూడా జరిగాయి. నేరస్థుల

ఆచూకి తెలిపినవారికి వేలాది రూపాయలిస్తామన్నారు. కాని విప్లవవీరు లెవడూ విద్రోహి కాలేదు.

అగ్నిజ్వాల లిప్పుడు హిందూస్థానమందలి అనేక ఇతర ప్రాంతా లకు వ్యాపించాయి. బ్రహ్మాండమైన జ్వాల రగుల్కొనడానికి పూర్వం అక్కడక్కడ చిన్నచిన్న రవ్వలు రేగడం సహజం. నానాసాహెబ్ వచ్చినప్పటి నుండి లక్నోలో చాలా సంచలనం బయల్దేరింది. మే 31 వ తేదీన హిందూ స్థానమంతా ఒక్కసారిగా విజృంభించి, దానిని బానిసత్వం క్రింద ఉంచాలని ఆశించిన బ్రిటిష్‌వారు దానినుండి బ్రతికి బయటపడడ మనేది లేకుండా చేయాలని పథకం. రహస్యసంఘపు లక్నోశాఖకూడా ఈ పథకాన్ని అంగీకరించినా వీరసైనికులు నిగ్రహించుకోలేకపోయినారు. పైగా ప్రతిరాత్రి రక్త ముప్పొంగజేసే ప్రసంగాలు, అన్నివైపులా జరుగుతున్న దహనాలు వారిని మరింత ఉద్వేగపరచాయి. అలా నిగ్రహాన్ని కోల్పో యిన నల్గురు సైనికవీరులు మే 3 వ తేదీన లెఫ్టినెంట్ మేఛమ్ శిబిరానికి వెళ్ళి "నీతో మాకేమీ వైరంలేదు. కానీ నీవొక ఫిరంగీవి. అందువల్ల నీవు మరణించక తప్పదు" అని విరుచుకుపడ్డారు. నిప్పులు కక్కుతున్న ఆ వీరుల కండ్లను చూచి హడలిపోయిన ఆ లెఫ్టినెంట్ దీనంగా "మీరు తలచుకుంటే నన్నొక సెకండులో చంపివేయగలరు. కాని నావంటి నిర్భాగ్యు నొక్కని చంపినందువల్ల మీకు వచ్చేదేముంది ? మరొకడెవరో వచ్చి నా స్థానం ఆక్రమిస్తాడు. తప్పు నాదికాదు. ప్రభుత్వ వ్యవస్థది. అందువల్ల నన్ను మీరెందుకు వదలివేయరాదు?" అని బ్రతిమలాడాడు. దానితో సిపాయిలు కొంచెం చల్లబడ్డారు. ఒక్కసారిగా వ్యవస్థను నాశనం చేయడమే తమ లక్ష్యమనే విషయం వారికి గుర్తుకు వచ్చింది. వారు తిరిగివెళ్లారు. కాని ఈ సమాచారం అధికార్లకు అందింది. సర్ హెన్రీ లారాన్స్ ఒక చిన్న వంచనతో దళమంతటిని నిరాయుధం చేసివేశాడు.

కాని మీరట్‌లో పరిస్థితులు మరింత చైతన్యవంతం కాజొచ్చాయి. సిపాయిలకు క్రొవ్వు తూటాలు నిజంగా అభ్యంతరకరమేమో కొందరు బ్రిటిష్‌వారు పరీక్షించదలచారు; ఆ ప్రకారం మే 6 వ తేదీన వాటిని వాడ వలసిందిగా ఒక దళాన్ని బలవంతం చేశారు. అందున్న 90 మందిలో కేవలం 5 గురు మాత్రమే వాటిని తాకినట్లు కనిపిస్తోంది. మరొకసారి అవే తూటాలను వారికిచ్చారు. మళ్ళీ వారంతా నిరాకరించి తమతమ నివాసాలకు వెళ్లిపోయినారు. ఈ వార్త జనరల్‌కు అందగానే 85 మందికి కోర్టు మార్షల్ విచారణ జరిపించి ఎనిమిది మొదలు పదేండ్లవరకు కఠిన శిక్షలు విధించాడు.

హృదయ విదారకమైన ఈ ఘట్టం మే 9 వ తేదీన జరిగింది. ఈ 85 మందికి బ్రిటిష్ పదాతి, తుపాకి దళాలు కాపలా ఉన్నాయి. ఈ దృశ్యాన్ని చూచేందుకుగాను భారతీయ సిపాయిలను కూడా అక్కడే నిలిపారు. 85 మంది దేశభక్తులను సైనిక దుస్తులు వదలివేయమన్నారు. వాటిని చించివేశారు. చేతుల్లోని ఆయుధాలు లాగివేశారు. చేతులకు సంకెళ్ళు తగిలించారు. ఆ దృశ్యం అక్కడున్న భారతీయ సైనికుల హృదయాలను దహించివేసింది. కాని ప్రక్కనే ఉన్న శ్వేత సైనిక దళాలను చూచి వారక్కడికక్కడే కత్తులను దూయలేదు. అంతలో అందరికి పదేసి ఏండ్లు కఠిన శిక్ష విధింపబడ్డట్టు ప్రకటింపబడ్డది. వారిని త్వరత్వరగా జైలుకు తీసుకుపోయినారు.

ఇది ఉదయపు వేళ జరిగింది. సిపాయిలిక నిగ్రహం చూపలేక పోయినారు. రాత్రంతా నివాసములనిండా సమావేశాలు జరిగాయి. వారు మే 31 వ తేదీవరకు ఆగవలసిందేనా ? తోటి దేశభక్తులు జైళ్ళ పాలు కాగా వారు నిర్జీవులవలె అలా ఉండిపోవలసిందేనా? వెంటనే "మేము 11, 12 వ తేదీలను అక్కడుంటాం. అంతా సిద్ధంగా ఉంచండి" అంటూ ఢిల్లీకి సందేశం పంపారు.

మే 10 వ తేది వచ్చింది. నాడాదివారం. 1857 విప్లవసమర ప్రయత్నాలన్నీ అతిరహస్యంగా సాగిపోతున్నాయి. దానికి సంబంధించి బ్రిటిష్ వారికి సమాచారమే లేదు. ఆనాటిరాత్రి సమావేశాల సంగతిగాని, ఇతర ప్రాంతాల సిపాయీలతో వీరిసంబంధాలను గురించిగాని వారికి చూచాయగా కూడా తెలియదు. ఆరోజు మామూలుగానే పాటలు ప్రారంభించారు. అందరినీ ఊచకోత కోయాలా? అక్కరలేదా? అనే విషయముపై సిపాయీల శిబిరంలో చర్చలు జరుగుచున్నాయి. బ్రిటిష్‌వారు చర్చిలో ఉండగా అంతా "హరహర మహదేవ్" అంటూ విజృంభించి బ్రిటిషు అధికార్లను, సైనికులను, వారి స్త్రీ పురుషులందరిని హతంచేసి ఢిల్లీవైపు పురోగమించాలని 20 వ దళం ప్రతిపాదించింది. చివరకు దీనికి అంతా అంగీకరించారు. ఆ క్షణాన చర్చిలో గంటలు మ్రోగుతున్నాయి. ఇంగ్లీషువారు సకుటుంబులై చర్చివైపు సాగివెళ్తున్నారు. ఈలోపున మీరట్ నగరంనుండి,చుట్టుప్రక్కల పల్లెలనుండి వేలాది స్త్రీ పురుషులు పాత ఆయుధాలు పుచ్చుకొని దండెత్తి వస్తున్నారు. మీరట్ నగరవాసులు దేశకార్యంకోసం సిద్ధంగా ఉన్నారు. ఇంతయినా బ్రిటిషువారికీ విషయం తెలియదు. 5 గంటలయింది. ప్రార్థనకు గంటలు మ్రోగుతున్నాయి. వారి పాపాలకు సంజాయిషీ చెప్పుకోవడానికి యమలోకానికి పయనమై వెళ్ళేముందు ఆఖరి ప్రార్థన అది. అవతల సిపాయీల శిబిరాలలో "మారో ఫిరంగీకో! విదేశీయులను చెండాడండి" అంటూ నినాదాలు దిక్కులు పిక్కటిల్ల వినిపిస్తున్నాయి.

ముందుగా కొద్దివందలమంది వీరులు తమ సోదరులను విడుదల చేసేందుకు అశ్వాలపై జైళ్ళవైపు దౌడుతీశారు. "మారో ఫిరంగీకో!"అనే నినాదం వినిపించగానే విప్లవసంఘపు సభ్యులుగా ఉన్న అచ్చటి కాపలాదారు లంతా జైలుతలుపులు తెరిచి విప్లవయోధుల్లో కలిసిపోయినారు.మరుక్షణంలో జైలుగోడలు నేలమట్టం చేయబడ్డాయి. దేశభక్తుడైన కమ్మరి యొకడు వచ్చి అందరిసంకెళ్ళు త్రెంచివేశాడు. బ్రహ్మాండమైన రణధ్వానా

లతో అంతా చర్చివైపు ఉరకలెత్తారు. ఈలోపున ఒక పదాతిదళం విప్లవ జ్వాలను రగిల్చింది. కలనల్ ఫిన్నిస్ ఒక గుర్రంపై 11 వ దళం వద్దకు వచ్చి మామూలుగా బెదిరించాడు. సిపాయిలు అతడిపై మృత్యుదేవతలా విరుచుకుపడ్డారు. 20 వ దళపు సిపాయి ఒకడు తన పిస్తోలు ఖాళీచేశాడు. గుర్రము, రౌతు నేలకరచారు. పదాతి దళాలు, తుపాకి దళాలు - హిందువులు, ముస్లిములు-అంతా బ్రిటిషు రక్తదాహంతో తపనజెందారు. ఈ వార్తమీరట్ బజార్లకు చేరింది. మీరట్ అంతా విజృంభించింది. కనపడ్డ ప్రతి ఆంగ్లేయుడు నరికివేయబడ్డాడు. బజార్లలో ప్రజలు కర్రలు, కత్తులు, కటారులు-ఒకటేమిటి-ఏది దొరికితే అది పుచ్చుకొని సందుల వెంట గొందులవెంట పడి పరిగెత్తారు. బ్రిటిష్ అధికారంతో సంబంధమున్న ప్రతి భవనం—బంగళాలు, ఆఫీసులు, హోటళ్ళు-అన్నీ భస్మీ పటలం చేయబడ్డాయి. మీరట్ అంతా భయంకరమైపోయింది. ఆకాశాన్నంటే పొగలు, భగభగలాడే మంటలు. వేలాది గొంతుకల నుండి వస్తున్న ఆక్రందనలు, అన్నిటిని మించి భయంకరంగా వినవచ్చే "మారో ఫిరంగీ కో" నినాదాలు ! విప్లవం చెలరేగగానే పథకం ప్రకారం ఢిల్లీకి వెళ్ళే టెలిఫోన్ తీగెలు తెంచివేయబడ్డాయి. రైలుమార్గం చుట్టూ కాపలా పెట్టబడ్డది. ప్రొద్దుగూకిపోయింది. కటిక చీకటి వ్యాపించింది. తప్పించుకు బ్రతికిన బ్రిటిషర్లపని అయోమయమై పోయింది. కొందరు గుర్రపు శాలల్లో దాక్కొన్నారు; కొందరు చెట్ల క్రింద ఆ రాత్రి గడిపారు. మిగిలి పోయిన మరికొందరు మూడవఅంతస్తుకు చేరారు ! కొందరు మురుగు వంతెనల క్రిందకు చేరారు; మరికొందరు రైతుల వేషాల్లో పారిపోతే, ఇంకొందరు బస్తర్ల కాళ్ళమీద పడ్డారు. రాత్రయ్యేసరికి స్వదేశీ సిపాయీలు అప్పుడే ఢిల్లీమార్గం పట్టేరు.

# ఢిల్లీ

నానాసాహెబ్ పీష్వా ఏప్రిల్ మాసాంతానికి ఢిల్లీ వెళ్ళేడు. అంతా విప్లవ విజృంభణా దినమగు మే 31వ తేదీకి ఆత్రుతగా ఎదురుచూస్తున్నారు. హిందూస్థానమంతా ఒకేసారిగా మే 31 వ తేదీనే విజృంభించినట్లయితే, బ్రిటిష్ సామ్రాజ్య విచ్ఛిన్నం, భారత స్వాతంత్ర్య సాధనలకై 1857 అనంతరం చరిత్ర ఎదురు చూడవలసి వచ్చేదికాదు. కాని సమయానికి ముందుగా మీరట్ విజృంభించడం విప్లవ వీరులకన్నా బ్రిటిష్ వారికి ఎక్కువ ఉపకరించింది. ఢిల్లీలోని సిపాయీలు భారతీయులు. మంగళ పాండ్యా బలిదానము చేసినప్పటి నుండి వారును అశాంతి చెందియున్నారు. కాని బహదూర్‌షా, మహారాణి జనత్ మహల్ చాకచాక్యముగా వారిని అదుపులో ఉంచారు. ఇట్టి సమయములో మీరట్ నుండి "మేము రేపు రానున్నాము. సర్వమూ సిద్ధము చేయండి'' అని సందేశము వచ్చినది. ఈ అనుకోని సందేశము ఢిల్లీకి అందీ అందకమునుపే మీరట్‌నుండి రెండు వేలమంది సిపాయీలు ''ఢిల్లీ - ఢిల్లీ'' అని నినదిస్తూ పయనమైనారు. సూర్యోదయమయేసరికి మీరట్ పదాతిదళము తమను వెంటాడుతూ కనుపించకపోయ్యేసరికి వారు ఆశ్చర్యచకితులైనారు ! తమ మార్గాయాస మునే మరచిపోయినారు. క్షణం వృధాపోకుండా మరింత వేగముతో ప్రయాణము సాగించారు. మీరట్ నుండి ఢిల్లీకి 32 మైళ్ళు. 8 గంటల

వేళకు మొదటి బృందము పవిత్ర యమునా నదీతీరమును చేరినది. నావల వంతెనపై గుఱ్ఱములు దౌడు తీయ నారంభించినవి.

ఆ వంతెన దాటగానే సిపాయిలు ఢిల్లీ పొలిమేరలకు చేరారు. ఈ కబురు అందగానే బ్రిటిష్ అధికారులు సిపాయీలను మైదానమునకు చేర్చి విధేయతను గురించి ఉపన్యాసములు ప్రారంభించారు. కలనల్ రిప్లే మీరట్ సిపాయీల నెదుర్కొనవలసిన 54 వ దళమునకు నాయకత్వము వహించాడు. ఆ దళమువారు కలనల్‌తో "మీరట్ సిపాయీలను రానివ్వండి - ఆ తర్వాత సంగతి చూద్దురు" అన్నారు. కలనల్ "శభాష్" అన్నాడు. అందరూ విప్లవ వీరులవైపు సాగివెళ్ళారు. కొంత దూరం వెళ్ళగానే మీరట్ ఆశ్వికదళాలు ఎదురైనాయి. వెనకనే ఎర్ర దుస్తులతో, బ్రిటిష్ రక్తానికి తహ తహ లాడుతున్న పదాతి దళాలు కానవచ్చాయి. ఈ రెండు బృందాలు తారసిల్లగానే పరస్పరం అభివందనం చేసుకున్నారు! స్నేహంతో చేతులు కలుపుకున్నారు! "బ్రిటిష్ రాజ్యాన్ని నాశనంచేద్దా"మని మీరట్ దళాలునినాదాలిస్తే, "ఫిరంగీల అంతముచేద్దా" మని ఢిల్లీ దళాలు ప్రతినినాదమిచ్చాయి కలనల్ రిప్లేకి మూర్ఛ వచ్చినంత పని అయింది. "ఏమిటిది ! ఏమిటిది?" అని గుండె బాదుకుంటుండగానే అతని శరీరంపై తుపాకిగుండ్లు పేలాయి. క్షణంలో నేలకొరిగాడు. ఢిల్లీ దళంలోని మిగిలిన బ్రిటిష్ అధికార్లందరికి కూడా ఒకేసారిగా అదే గతి పట్టింది. బ్రిటిష్ రక్తతర్పణముతో తమ దేశ భక్తిని పునీతం చేసుకొన గానే మీరట్ సైనికులు గుఱ్ఱములను దిగి ఢిల్లీ మంత్రులను ఆనందముతో కౌగలించుకున్నారు. అప్పుడే చరిత్ర ప్రసిద్ధిగన్న కాశ్మీరు ద్వారము తెరువబడినది. వీరులందరు "దీన్ దీన్" నినాదములతో ఢిల్లీ మహానగర ప్రవేశము చేశారు.

మీరట్ సైన్యపు రెండపగణము కలకత్తా ద్వారము గుండా ఢిల్లీని ప్రవేశింప యత్నిస్తున్నారు. మొదట తలుపులు గట్టిగా బంధింపబడి

ఉన్నాయి. సిపాయీలు విరుచుకుపడడముతో అవి మెల్లగా తెరచుకొన నారంభించాయి. వెంటనే ద్వారము వద్దనున్న కాపలాదారుడు "దీన్ దీన్" నినాదముతో విప్లవవీరులలో చేరిపోయినాడు. కలకత్తా ద్వారము గుండా నగర ప్రవేశము చేసిన సిపాయీలు దర్యాగంజ్‌లోని బ్రిటిష్ అధికార్ల బంగళాల వైపు వెళ్ళారు. కొద్ది క్షణాల్లో ఆ భవనములన్నీ భగభగలాడి పోయినవి.

ఢిల్లీ రాజభవనము వద్ద సిపాయీలు, ప్రజలు చేరారు. సామ్రాట్టుకు జయజయధ్వానాలు చేశారు. భవన ద్వారముగుండా ప్రవేశింప యత్నించిన కమీషనర్ ఫ్రేజర్ గాయపడ్డాడు - అతడి పక్కనేఉన్న మూజల్‌బేగ్ అను నాతడు శూలంతో చెంపన పొడిచాడు! ఈ సైగ అందగానే సిపాయీ లందరూ ఫ్రేజర్‌ను త్రొక్కివేస్తూ పైకివెళ్ళారు. గదిలో జిన్నింగ్స్ సకుటుంబముగా ఉంటున్నాడు. లోపల ఎవరో తలుపు గడివేయ ప్రయ త్నించారు. ఒక్క త్రోపుతో అవి తెరచుకొన్నవి. జిన్నింగ్సు, అతడి పుత్రిక, ఒక అతిథి హతులైపోయినారు.

ఈ విధంగా రాజభవనము - సిపాయీల, ప్రజలచేతికి చిక్కింది. సామ్రాట్టు, సామ్రాజ్ఞి సిపాయీలు భవిష్యత్ప్రథక నిర్ణయానికై సమావేశ మైనారు. ఇక మే 31 వరకు వేచియుండడమంటే బుద్ధిహీనతే అవుతుంది అందువల్ల సామ్రాట్ క్షణకాలం యోచించి, విప్లవ యోధులతో, బహిరం గంగా కలిసిపోవటానికే నిశ్చయించాడు. ఇది జరుగుతుండగా మీరట్ తుపాకీదళ మొకటి ఢిల్లీ చేరింది. భవన ప్రాంగణములో ప్రవేశించి పాదుషాకు, స్వాతంత్ర్యయోధులకు గౌరవ సూచకము 21 తుపాకులు ప్రేల్చారు. దీనితో అంతవరకు సమ్రాట్టును వేధిస్తున్న కొద్దిపాటి సందే హము కూడా పటాపంచలైంది. ఆయన హృదయంలోని స్వేచ్ఛాపిపాస విజృంభించింది. పాదుషా విప్లవానికి నేతృత్వం వహించేందు కంగీకరిస్తూ ప్రకటించగానే భవనమంతా హర్షధ్వానాలతో ప్రతిధ్వనించిపోయింది.

రాజభవనంలో ఇలా జరుగుతుంటే అటు నగరంలో బ్రహ్మాండమైన గందరగోళం ప్రారంభమైంది. వందలాది పౌరులు చేతికందిన ఆయుధాలు పుచ్చుకొని విప్లవకారులతో కలిసిపోయి కంటబడిన ప్రతి బ్రిటిష్ వానిని హతమార్చేందుకై తిరుగుతున్నారు. షుమారు 12 గంటల వేళ ఢిల్లీ బ్యాంకు చుట్టుముట్టబడ్డది. బ్యాంకు మేనేజరు బెర్స్‌ఫోర్డు కుటుంబమంతా హతంచేయబడ్డది. బ్యాంకు నేలమట్టం అయింది. ఆ తర్వాత ప్రజలు ఢిల్లీ గెజిట్ ముద్రణాలయంవైపు వెళ్లారు. లోపల పనివారు మీరట్ వార్తలను అచ్చుగుద్దుతున్నారు. ఇంతలో హఠాత్తుగా వెలుపల 'దీన్ దీన్' నినాదాలు వ్యాపించాయి. క్షణంలో లోపలి బ్రిటిషు అధికార్లంతా హతులైనారు. అచ్చులు చెల్లాచెదరుగా పారవేయబడ్డాయి. మిషను తుక్కుతుక్కు చేయబడ్డది. బ్రిటిషువారి హస్తస్పర్శవల్ల అపవిత్రమైపోయిన ప్రతిదీ నాశనం చేయబడ్డది.

కాని అవతల ఇంతకన్న ఘోరమైన దృశ్యం జరుగుతున్నది. రాజభవనంవద్ద బ్రిటిషు సైన్యాల ఆయుధాగారం ఒకటి ఉన్నది. ఇందులో యుద్ధాని కుపకరించే సామాగ్రి కోకొల్లలుగా ఉన్నది. కనీసం 9,00,000 తూటాలు, 8-10 వేల రైఫిళ్లు, తుపాకులు ఉన్నాయి. విప్లవయోధులు దీనిని వశం చేసుకుందామనుకున్నారు. కాని ఇది అంత తేలిక పనికాదు. అక్కడ ఉన్న బ్రిటిషు అధికార్లకు లొంగిపోవలసిందిగా ఆదేశిస్తూ పాదుషా పేరుమీద కబురుపంపారు. కాని లెఫ్టినెంట్ విల్లొబీకి దానికి సమాధానమిచ్చే హుందాతనమైనా లేకపోయింది.

ఈ అవమానానికి ఒడలు మండిపోయి వేలాదిసిపాయీలు ఆయుధాగారంలో ప్రవేశించడానికి గోడలు ప్రాక నారంభించారు. లోపల 9 మంది బ్రిటిషర్లు, కొందరు భారతీయులు వున్నారు. కోటమీద ఢిల్లీ పాదుషా జండా కనపడగానే ఈ భారతీయులు విప్లవయోధులతో కలిసిపోయి

నారు. బ్రిటిషర్లు అన్నిటికీ తెగించి మొండిగా పోరాడ నారంభించారు. అందరు విప్లవవీరుల ముందు ఈ 9 మంది నిలువలేకపోయారనేది స్పష్టమే. ఆయుధాగారాన్ని బ్రిటన్‌కోసం రక్షించుకోలేకపోతే దానిని పేల్చివేయాలని వారు నిర్ణయించుకున్నారు. ఆయుధాగారాన్ని వశంచేసినా తమ ప్రాణాలు దక్కుతాయని వారికి ఆశ లేకపోయింది. పైగా సిపాయీలు కూడా ఆయుధాగారం ప్రేలిపోతే ఎందరో ఆహుతైపోవల్సి ఉంటుందనే తెగింపుతోనే పోరాడ నారంభించారు. వందలాది ఢిల్లీ పౌరులు వారికి సహాయంగా వచ్చారు. ఇంతలో వేయి ఫిరంగులు ప్రేలినంత ధ్వనితో దిక్కులను బద్దలుచేస్తూ ఉభయులూ ఎదురుచూస్తున్నట్లే - ఆయుధాగారం ప్రేలిపోయింది. మంటలు, పొగలు ఆకాశాన్ని క్రమ్మివేశాయి. తొమ్మిదిమంది బ్రిటిషు వీరులు దానిని వశం చేయకుండా, తామే దానికి నిప్పంటించి, ఆ మంటల్లోనే ఆహుతైపోయినారు. ఆ భయంకరమైన ప్రేలుడులో పాతికమంది సిపాయీలు, వీధులలో ఉన్న మూడు వందలమంది అన్యులూకూడా ప్రేలిపోయినారు.

విప్లవవీరులు ఆహుతైపోయినా వారి కృషిమాత్రం పూర్తిగా వృధా కాలేదు. ఆయుధాగరం వశమైంది. కొల్లలుగా ఆయుధాలు లభించాయి ఒక్కొక్కరికి నాలుగు తుపాకీలు అందాయి. ఆయుధాగారం బ్రిటిషుల చేతులలో ఉన్నంతకాలం భారతీయ సిపాయీలు బ్రిటిష్ అధికారులక్రింద ఉండేవారు. వారు సోదర భారతీయులపై దాడి చేయడానికి నిరాకరించిన మాట వాస్తవమే. అయితే వాళ్ళు బ్రిటిషర్లమీద తిరుగబడనూలేదు. ఢిల్లీ నగరాన్ని కదిలించివేసిన ఆ భయంకరమైన ప్రేలుడు జరిగేసరికి సాయంత్రం నాలుగు గంటలయి ఉంటుంది. ఆ శబ్దం వినగానే సిపాయీలు కంటోన్మెంటు వెలుపలికి పరుగెత్తుకువచ్చి ''మారో ఫిరంగీకో'' అంటూ బ్రిటిషర్ల మీద విరచుకుపడ్డారు. గార్డన్‌స్మిత్, రేవర్లీలను హతమార్చి వేశారు,

కనిపించిన బ్రిటిష్ వాళ్ళందరినీ ముగించివేశారు. ఈ కాండ ఐదు రోజుల పాటు జరిగింది. మే 16 వ తేదీ వచ్చేసరికి ఢిల్లీ నగరంలో ఎక్కడా ఆంగ్లాధిపత్యము అనేది కనపడలేదు. ఇంగ్లీషుమాట మాట్లాడిన వాణ్ణల్లా నిర్దాక్షిణ్యంగా తుదముట్టించారు. అంగ్లేయుల యెడ ఏర్పడిన ద్వేష మంతటిది: ఆంగ్ల పతాకపు పేలికలు వీధుల్లో దుమ్ముకొట్టుకు పొర్లాడాయి. వెచ్చటి నెత్తురుతో బానిసత్వపు మరకలు కడిగి వేయబడిన స్వరాజ్యపతాక విప్లవానికి నేతృత్వం వహిస్తూ గగనవీధుల్లో రెపరెప లాడింది. ఐదు రోజులపాటు సాగిన స్వాతంత్ర్యోద్యమ కెరటాల ధాటికి ఢిల్లీ నగరంలోని విద్రోహులంతా కొట్టుకుపోయినారు. దేశ ధ్వజచ్ఛాయల్లో, విచ్చుకత్తులు పుచ్చుకొని స్త్రీలు, పురుషులు, ధనికులు, పేదలు; యువకులు, వృద్ధులు, సిపాయీలు, పౌరులు, మౌల్వీలు, పండితులు, హిందువులు, ముస్లింలు - అందరూ విదేశీ బానిసత్వం మీద ఘోరమైన పోరు సాగించారు.

# పంజాబు ఉదంతము

బ్రిటిష్ పాలననుండి ఢిల్లీ విమోచనమైన వార్త మెరపు వేగంతో సర్వత్రా వ్యాపించింది. హఠాత్తుగా వచ్చిన ఈ వార్త క్షణంపాటు భారతీయులను, విదేశీయులను కూడా నిశ్చేష్టుల జేసింది. దేశమంతా మే 31 న ఒక్కసారిగా విజృంభించాలనే పథకం మీరట్ విజృంభణవల్ల విఫలమైనా ఢిల్లీ వశం కావడం ఉద్యమానికి అఖిల జాతీయ స్వరూపమిచ్చి, హిందూస్థాన మంతటిలోను అద్భుత చైతన్యాన్ని కల్గించింది. ఈ చైతన్యం ఆధారంగా విజృంభించడమా లేక మే 31 వరకు ఆగడమా? మిగిలిన ప్రాంతాలను సంప్రదించకుండా విజృంభిస్తే మీరట్‌లోవలె గంద్రగోళం రేగవచ్చు కదా? మిగిలిన ప్రాంతాలలోని విప్లవకారులకు ఈ ప్రశ్నలతో కాలం హరించుకుపోయింది. విప్లవ సమయంలో మీనమేషాలు లెక్కపెట్టుకోవడంకన్నా విషతుల్యమైన దేమీ ఉండదు. త్వరితగామ, హఠాత్తుగాను జరిగితేనే విప్లవాలకు విజయావకాశాలుంటాయి. ప్రారంభమంటూ అయిన తర్వాత ఆలస్యం జరిగి, ఊపిరి పీల్చుకునే వ్యవధి ఇస్తే శత్రువుకు ఆత్మరక్షణ చేసుకునే సమయం లభిస్తుంది. ముందుగా విజృంభించినవారు తోడు లేక నిరాశ చెందుతారు. చురుకైన శత్రువు ఆతర్వాత విజృంభించదలచిన వారికి ఆటంకాలు పెడతాడు. అందువల్ల విప్లవ ప్రారంభానికి, విప్లవ వ్యాప్తికి మధ్యలో శత్రువుకు వ్యవధి ఇవ్వడమనేది విప్లవానికి ప్రమాదకరం.

కాని ప్రస్తుతం జరిగింది కేవలమదే. అనుకున్న పథకానికి విరుద్ధంగా హఠాత్తుగా విప్లవం ప్రారంభం కావడం వేర్వేరు ప్రాంతాలలోని విప్లవనేతలను గంద్రగోళంలో పడవేశాయి. వారికి విజృంభించడమూ ఇబ్బందయింది. ఓపిక పట్టడమూ అసాధ్యమయింది.

బారక్‌పూర్ నుండి ఆగ్రా వరకు ఉన్న 750 మైళ్ళ దూరం మధ్య మే నెలలో కేవలం ఒకే ఒక శ్వేత సైనికదళం ఉంది. ఇది ధనపూర్‌లో ఉంది. పంజాబులోని సరిహద్దు ప్రాంతంలో మాత్రం చాలా దళాలు ఉన్నాయి. కాని వాని నక్కడ ఉంచడం అవసరం. ఈ పరిస్థితులలో వీలున్నన్ని శ్వేత సైనిక దళాలను ఒకచోటికి చేర్చడం లార్డ్ కానింగ్ యొక్క మొదటి కార్యం. అయితే అదే సమయంలో ఆంగ్లేయుల అదృష్ట వశాన పరియాషితో వారి యుద్ధం ముగిసిపోయి, భారత దేశంలోని శ్వేత సైన్యాలు వెంటనే స్వస్థానాలకు చేరాలని ఆజ్ఞలు జారీ అయి ఉన్నాయి. ఈ యుద్ధం ముగిసే సమయంలో ఆంగ్లేయులు చైనాతో పేచీ తెచ్చుకొని సైన్యాలు అటు నడవాలని ఆదేశించారు గాని భారతదేశంలో ఈ విప్లవం చెలరేగడంతో కానింగ్ ఆ సైన్యాలను దారిలోనే అపుజేయాలని నిశ్చయించుకున్నాడు. ఈ రెండూ గాక రంగూన్ వెళ్ళవలసి ఉన్న బ్రిటిష్ దళాలను కూడా కలకత్తాలో నిలిపివేయడం, మద్రాసు ప్రభుత్వం 43 వ పదాతి దళాన్ని, మద్రాసు ఫిరంగి దళాలను సంసిద్ధంగా ఉంచాలని ఆజ్ఞలు పంపడం జరిగింది.

శ్వేత సైనికులు అన్ని వైపుల నుండి కలకత్తా వైపు చేరుతుంటే, కానింగ్ సిపాయీలను బుజ్జగించేందుకై మరొక ప్రయత్నం చేశాడు. ఒక ప్రకటనను జారీచేసి ప్రతి గ్రామములోను, నగరములోనూ అంటించవలసిందిగా ఆదేశించాడు. మామూలు ఫణితిలోనే అది ఇలా ఉంది :

''మీ కుల, మత వ్యవహారాలలో మాకు ప్రమేయం పెట్టుకునే తలంపులేదు. మీ మతాన్ని అవమానించాలని అసలే లేదు. మీ కిష్టమైతే

మీ తుటాలను మీరే తయారు చేసుకొనవచ్చు. కంపెనీ ఉప్పుతిని కంపెనీకే మీరెదురు తిరగడం మహాపాపం.'' ఇక ఈ కల్లబొల్లి ప్రకటనను లక్ష్యపెట్టే దెవరు?

ఢిల్లీ స్వతంత్రమైపోయినదనే తంతి చేరేసరికి కమాండర్ ఇన్ చీఫ్ ఆన్‌సన్ సిమ్లాలో ఉన్నాడు. ఏమి చేయాలా? అని అత డాలోచిస్తుండగానే ఢిల్లీని వెంటనే స్వాధీనంచేసుకోవాలని కానింగ్ ఆదేశంపంపాడు. ఈ తిరుగుబాటును ఒక నెలలో అణచివేయ గలమని భ్రమించారు ఆంగ్లేయులు. విప్లవ పథకాలను గురించి, విప్లవ శక్తిని గురించి వారంతటి విపరీతమైన అజ్ఞానంలో ఉన్నారు. పంజాబ్‌లోని చీఫ్ ఆఫీసర్ సర్ జాన్ లారెన్సుకూడా వెంటనే ఢిల్లీని స్వాధీనం చేసుకొమ్మని సందేశం పంపాడు. కాని ఢిల్లీని వశం చేసుకోవడ మంటే ఏమిటో కానింగ్, లారెన్సుల కన్నా ఆన్‌సన్‌కు బాగా తెలుసు. అందువలన తగిన ఏర్పాట్లు జరిగేవరకు వేచి ఉండాలని నిర్ణయించాడు. ఆన్ సన్ సిమ్లా కొండలు దిగి సైనిక కార్యాలయానికి చేరీచేరక ముందే సిమ్లాలో బ్రహ్మాండమైన గందరగోళం చెలరేగింది! గూర్ఖా నజీరీదళం కూడా విజృంభించిందని సిమ్లాలోని ఆంగ్లేయులు కూడా ఆశలొదులుకున్నారని వార్తలు వ్యాపించాయి. ఇంతవరకు చల్లని బంగళాలలో, ఉద్యాన వనాలలో ఆంగ్లేయు లనుభవించిన రాజకీయాలకు మూల్యం చెల్లించుకొనవలసిన సమయం వచ్చినట్లయింది. గూర్ఖా దళాలు వచ్చివేస్తున్నాయనుకుంటూ స్త్రీ పురుషులు యావన్మందీ వీలున్న వైపుకు పారిపోనారంభించారు. ఈ పారిపోవడంలో పురుషులు స్త్రీలను, బాల బాలికలను వెనుక వదలివేసి పరుగెత్తడం జరిగింది. ఇదే సమయానికి కలకత్తాలో కూడా ఇవే మాదిరి దృశ్యాలు వ్యాపించాయి. బారక్‌పూర్‌లో ఆంగ్లేయదళంపై సాయుధ పోరాటం జరుగుతున్నదనే మాట వినిపించేది. వెంటనే ఆంగ్ల, స్త్రీ, పురుషులు బిడ్డలను వెంటవేసుకొని కోటవైపు పరుగెత్తడం జరిగేది. ఇంగ్లండుకు టిక్కెట్లు కొనుక్కునేవారు, కోట వైపు

పరుగెత్తేవారు. మరి కొందరు ఆఫీసుల్లో పనులువదలి మూలల్లో నక్కేవారు మీరట్, ఢిల్లీ తిరుగుబాట్లతో చెలరేగిన భీతావహ పరిస్థితి అలాంటిది ! కాన్పూరు ఘట్టం ఇంకా రానేలేదు.

దీర్ఘ నిద్రానంతరం వచ్చిన ఉషస్సువంటిది 1857. ఉషఃకిరణా లను దర్శించిన వారంతా పక్కలు చుట్టి లేచారు. అన్యులు మాత్రం బానిసత్వపు దుప్పట్ల ముసుగుతన్ని గురకలు కొడుతున్నారు. ఈ మాదిరి వారిలో పాటియాలా, నాభా, జింద్ సంస్థానాధీశులు ఒకరితో ఒకరు పోటీ పడుతున్నారు. విప్లవాన్ని ప్రజ్వలింపజేయడము లేదా భగ్నం చేయడము- రెండూ వీరి చేతుల్లో ఉన్నాయి. ఇవి రెండూ ఢిల్లీ అంబాలాలకు మధ్యన ఉన్నాయి. వీరి మద్దతు లేకుండా ముందున్న బ్రిటిష్ దళాలకు రక్షణలేదు.

ఈ ముగ్గురూ తమ అండన ఉన్నారని తెలియగానే బ్రిటిష్ వారు ధైర్యం తెచ్చుకున్నారు. పాటియాలా పాలకుడు తన తమ్మునికి సైన్యము లిచ్చి థానేశ్వర రహదారీ రక్షణకు పంపాడు. జింద్ రాజా పానిపట్టు వద్ద దృఢమైన ఏర్పాట్లు చేశాడు. ఈ రెండు ముఖ్యకేంద్రాలకు రక్షణ లభించ గానే, ఢిల్లీనుండి అంబాలాకు వెళ్ళే రహదార్లకు, పంజాబుతో రాకపోకల సంబంధాలకు మంచి భద్రత ఏర్పడింది; ఇక కమాండర్ ఇన్ చీఫ్ మే 25న అంబాలా నుండి ఢిల్లీకి పయనమై వెళ్ళాడు. కాని మే 27న అతడు కర్నాల్ చేసేసరికి కలరా వచ్చి చనిపోయినాడు. సర్ హెన్రీ బర్నార్డ్ అతని స్థానంలో అధికారం స్వీకరించాడు.

అంగ్ల సైన్యం పాత అధికారికి అంత్యక్రియలు జరిపి, క్రొత్త అధికారి క్రింద ఈ విధంగా ఢిల్లీ వైపు సాగి వెళ్ళింది. ఆ సమయంలో బ్రిటిష్‌వారు చాలా ధైర్యంతో ఉన్నారు! ఉదయాన శత్రువులతో పోరాడి సాయంత్రానికి వారి రక్తంతో విందులారగిస్తామని వారు బహిరంగంగా చెప్పుకున్నారు. అంబాలానుండి ప్రయాణమై వెళ్తుండగా ఈ తెల్ల సిపా యీల నల్ల గుండెల్లోని విషాన్ని ప్రపంచం గుర్తించింది. అంబాలా

నుండి ఢిల్లీ మార్గంలోని వేలాది గ్రామాలలో చిక్కిన వారందరిని బంధించి వరుసలలో నిలిపి, కోర్టు మార్షలు జరిపి, ఉరిశిక్షలు విధించి, క్రూర కర్కశమైన పద్ధతిలో హతమార్చారు.

ఢిల్లీ, మీరట్‌లలో కొద్దిమంది ఆంగ్లేయులు చంపివేయబడ్డందుకు ప్రతిగా వేలాది అమాయకులపై పైశాచిక విద్వేషాన్ని ప్రదర్శిస్తూ కమాండర్ బర్నార్డు ఢిల్లీ చేరడానికి ముందు మీరట్ వెళ్లాలనుకున్నాడు. మీరట్‌లో అప్పటికే తగినంత శ్వేతసైన్యమున్నది. ఈ సైన్యము అంబాలా నుండి వస్తున్న శ్వేతసైన్యంతో చేరేందుకు పయనమై వస్తున్నది. కాని ఆ రెండు సైన్యాలు కలిసే లోపుననే ఢిల్లీ నుండి జాతీయ సైన్యాలు వచ్చి మీరట్ సైన్యాలపై విరుచుకుపడ్డాయి. మే 30వ తేదీన ఉభయ సైన్యాలు హిందన్ నదీతీరాన తారసిల్లాయి. చేతిలో శక్తివంతమైన తుపాకులున్నందున కుడిపైపున్న భారత సైన్యాల పరిస్థితి భద్రంగానే ఉంది. ఆంగ్లేయులు వారి నేమీ చేయలేకపోయినారు. ఇటువైపు పోరు సాగుతుండగా, ఎడమ ప్రక్కగానున్న భారత సైన్యాలు ఆంగ్లేయులధాటికి తట్టుకొనలేకపోతున్నాయి. వారి మధ్య గంద్రగోళం చెలరేగింది. ఐదు తుపాకుల నక్కడే పడవేసి ఢిల్లీవైపు వారు తిరోగమించారు. ఆంగ్లేయులా తుపాకులను చేజిక్కించుకొనబోతుండగా 11వ దళానికి చెందిన సాహసవంతుడగు భారత సిపాయి ఒకడు కావాలని ఆయుధాగారంవైపు కాల్చాడు. దానితో బ్రహ్మాండమైన ప్రేలుడు జరిగి కెప్టెన్ ఆండ్రూస్, ఆయన అనుచరులు దగ్ధమైపోయినారు. మరి అనేక మంది ఆంగ్లేయులు గాయపడ్డారు.

జూన్ 1వ తేదీన బ్రిటీష్ శిబిరపు వెనుక భాగానికి ఒక సైనిక దళం సాగి వెళ్తుండడం కానవచ్చింది. ఆ దళం అంతా నల్లవారు కావడంతో అంగ్లేయులు అయోమయంలో పడ్డారు! ఇక ప్రాణాలకు

తెగించి పోరుదామని సంసిద్ధమవుతుండగా, అ దళం తమకు సహాయం చేయడానికై వస్తున్న మేజర్ రీడ్ నాయకత్వాన నడుస్తున్న గూర్ఖా సైన్యాలేగాని విప్లవ సైన్యాలు కావని గుర్తించారు. అంబాలా సైన్యాలకు సిక్కుల అండ! మీరట్ సైన్యాలకు గూర్ఖాల మద్దతు! ఈ పరిస్థితిలో పాపం, ఢిల్లీ విప్లవకారులేమి చేయగలరు? బ్రిటిష్ సైన్యాలు రెండూ జూన్ 7 వ తేదీన కలుసుకున్నాయి. అదే సమయంలో నాభా రాజా సిద్ధం చేసిన పునరాక్రమణ సైన్యాలు కూడా చేరాయి. ఆంగ్లేయుల కెదురు తిరిగి అంబాలానుంచి ఆ సైన్యాలు రాగానే పట్టుకొనవలసిందిగా 5 వ దళానికి చెందిన భారతీయ సిపాయీలు గూర్ఖాలను ప్రాధేయపడ్డారు. కాని గూర్ఖాలు తమ దేశ, ధర్మాలను సేవించడానికి నిరాకరించారు. ఆ పునరాక్రమణ దళాలు ఢిల్లీ చేరాయి. ఏకమైన ఈ ఆంగ్ల సైన్యాలన్నీ నిరాఘాటంగా ఢిల్లీ సమీపంలోని అలీపూర్ వరకు చేరాయి.

ఆంగ్ల సైన్యాలు అలీపూర్ వరకు వచ్చాయని వినగానే విప్లవ సైన్యాలు ఢిల్లీనుండి వెలికి వచ్చి బ్రిటిష్ సైన్యాలను బుందేల్-కె-సరాయ్ వద్ద ఢీకొన్నాయి.

గూర్ఖాల సహాయంతో బుందేల్-కె-సరాయ్ సమరంలో ఆంగ్లేయులకు విజయం లభించింది, కాని వారి పగటి కలలు మాత్రం భగ్నం చేయబడ్డాయి. తాము ఆ రాత్రి ఢిల్లీలో విప్లవకారుల రక్తం చిందించగలమనే ఆంగ్లేయుల ఆశ అడుగంటింది. విప్లవ సైన్యాలలో క్రమశిక్షణా రహితులేగాక, విచ్చు కత్తులతో స్వధర్మ స్వరాజ్యాలకై తెగించి పోరాడే మహావీరులు ఢిల్లీ కోటలో సిద్ధంగా ఉన్నారనే కటువైన వాస్తవం ఈ పోరాటంతో వారికి అర్థమైంది. ఈ పోరాటంలో నల్గురు అధికార్లు, 47 మంది సైనికులను ఆంగ్ల సైన్యాలు కోల్పోయాయి. 130 మంది గాయపడ్డారు. వీటన్నిటినిమించి ఈ పోరులో అడ్జుటెంట్-జనరల్ కలనల్

చెస్టర్ హతమైపోవడం బ్రిటీష్ వారిలో విపరీతమైన విచారాన్ని నిస్పృహను వ్యాపింపజేసింది.

ఈ సమయంలో లాహోర్‌లోని ప్రధాన సైన్యాధికారి రాబర్ట్ మాంట్ గోమరీ. ఇతను సర్ జాన్ లారెన్సు-ఉభయులూ డల్హౌసీ బడిలో శిక్షణ పొందినవారే. ఉభయులూ ఎట్టి క్లిష్ట స్థితిలోనైనా ప్రశాంత చిత్తంతో, స్థైర్యంతో, సమయోచితంగా ప్రవర్తించ గలిగినట్టివారే. పంజాబు సిపాయీలలో జాతీయతా భావం ఎంత తీవ్రంగా వ్యాపించిందీ గుర్తించడం వారికి అవసరం. వారి మనస్థితిని పరిశీలించడానికి ఒక బ్రాహ్మణ గూఢచారి నియమింపబడ్డాడు. అయితే ఈ బ్రాహ్మణుడు వారాశించినంత చక్కగా దేశద్రోహ కలాపం చేయక మాంట్ గోమరీకి ఈ విధమైన నివేదికను పంపాడు : "అయ్యా, వారంతా (సైనికులు) విప్లవ భావాలలో మునిగిపోయి ఉన్నారు - ఇంతవరకు విప్లవ భావంతోనే ఉన్నారు". ఈ నివేదికతో గోమరీ గొంతుకు ఉచ్చు బిగించాడు. ఈ నివేదిక లారెన్స్, మాంట్ గోమరీల భ్రమలను పటాపంచలు చేశాయి. విప్లవ సంఘటన ఉత్తరాదినే గాక, పంజాబులో కూడా బాగా జరిగిందని, మంటలు రేపేందుకు తగిన సమయం కోసము మాత్రమే సిపాయీ లెదురు చూస్తున్నారని వారికి స్పష్టంగా అనిపించింది. తొందరపాటు చూపి తద్వారా విప్లవ రహస్యాన్ని గుర్తించేందు కుపకరించిన మీరట్ సిపాయీలకు మనస్సులో కృతజ్ఞతలు తెలుపుకుంటూ మాంట్ గోమరీ వెంటనే సిపాయీలందరినీ నిరాయుధులను చేయవలసిందిగా ఆజ్ఞలు జారీ చేశాడు.

మియాన్‌మీర్‌వద్ద నిరాయుధులయిన తర్వాత వారు సిక్కుల పవిత్ర స్థానమగు గోవిందఘర్‌ను వశం చేసుకొనడానికై అమృతసర్ వెళ్తున్నారని వదంతి వ్యాపించింది. జట్, సిక్కు రైతాంగం విప్లవకారులతో చేరడానికి బదులు గోవిందఘర్ కోటను బ్రిటిషువారి "రక్షణ"లో

ఉండనిచ్చారు. జట్, సిక్కుల నొకప్రక్కనుంచి, హిందువుకు, ముస్లిము లను మరొక ప్రక్కనుంచి బ్రిటిషువారు వారి మధ్య వైమనస్యాలను రెచ్చ గొట్ట నారంభించారు.

పంజాబులోని బ్రిటిష ప్రభుత్వ ప్రతినిధులు విప్లవోద్యమంలోని ఈ బలహీన స్థానాన్ని గుర్తించి దానిని తమ కనుకూలంగా తిప్పుకున్నారు. మహమ్మదీయులపై సిక్కులు, జట్‌లకు ద్వేషాన్ని రెచ్చగొట్టారు. ఏదో ఒక రోజున ఖాల్సా-లోగడ మొగలు సామ్రాట్టు సిక్కు గురువును వధించిన ఢిల్లీ వరకు వెళ్ళి దానిని నేలమట్టం చేస్తాడనే ఒక పాతకాలపు జోస్యాన్ని ఆంగ్లేయులు సిక్కులకు పదేపదే గుర్తుచేయ నారంభించారు. ఆ జోస్యం ప్రకారం ఖాల్సా సాహెబ్ మాత్రం ఢిల్లీ వెళ్ళి దానిని వశం చేసుకోవడం జరిగినా, ఆంగ్లేయులకు వచ్చేదేమున్నది ? బహదూర్ బదులు రంజిత్‌సింగ్ ఢిల్లీ పాలకుడవుతాడు. అంతేకదా! అందువల్ల బహదూర్‌షా, రంజిత్‌సింగ్‌ల నిద్దరిని భారత సింహాసనంనుండి కూలద్రోయాలని కాంక్షించేవారు ఈ జోస్యాన్ని వక్రీకరించడం సహజం. ఆ ప్రకారం దానిని కొద్దిగా వక్రీకరించి కంపెనీవారు, ఖాల్సా కలిసిపోతేనే ఢిల్లీ నేలమట్టం అవుతుందని ప్రచారం చేశారు ! ఏమి జోస్యము ! కాని, దుర్విధి! ఆ జోస్యమే ఫలించింది. ఆంగ్లేయులు ఆ పరిస్థితిని నీతినియమాలు లేకుండా వినియోగించుకున్నారు. ఢిల్లీపై సిక్కులను మరింతగా రెచ్చగొట్టేందుకుగాను ఆంగ్లేయులు ''సిక్కులనందరిని హతమార్చా''లని పాదుషా ఆజ్ఞలు జారీచేసినట్లుగా తప్పుడు ప్రకటన ఒకటి పుట్టించారు.

దేశంలోని విప్లవ పక్షాన్నిచూస్తే ఆంగ్లేయుల కెంత భయమో, ఆవలనున్న ఆఫ్గన్ జాతులను చూచినా వారికి అంతే భయం. 1857 మహా విప్లవపు రహస్య ప్రయత్నాలు జరుగుతున్న సమయంలోనే లక్నోలోని రహస్య సంస్థ కాబూల్ అమీర్ సహాయాన్ని అర్థించింది. 1855 ఆగష్టులో ఫార్‌సైత్ చేతిలోపడిన ఒక ఉత్తరం ప్రకారం లక్నో ముస్లింలు అమీర్

దోస్త్ మహ్మద్‌తో మంతనాలలో ఉన్నట్లు స్పష్టమవుతుంది. అందులో ఇలా ఉంది : ''అయోధ్య విలీనమైంది. హైద్రాబాద్ కూడా కబళింప బడితే ఇక మహ్మదీయ పరిపాలన అనేమాటే వినరాదు. దీనిని సకాలంలో నివారించడానికి ఏదో విరుగుడు కనుక్కోవాలి. స్వరాజ్యంకోసం లక్నో ప్రజలం లేస్తే, మీ సహాయంమీద మేమెంత వరకు ఆధారపడవచ్చు?'' లక్నో నుండి వచ్చిన ఈ ప్రశ్నకు రాజ లౌకికుడైన అమీరు గోప్యంగా ''చూద్దాం'' అని జవాబిచ్చాడు. కాని ఇంతకుపూర్వమే బ్రిటిషువారితో సంధి చేసుకున్నాడు. బ్రిటీష్‌వారికి అమీర్‌కన్నా పెషావర్‌వద్ద సరిహద్దు లలో నున్న మహ్మదీయ తెగలంటే భయమెక్కువ.

ముందు జాగ్రతకై పెషావర్ వద్దనున్న సైనికులను నిరాయుధు లను చేశారు. హోటిమర్దన్ వద్దనున్న 55 వ దళంమీదకి దృష్టి పోనివ్వడానికి అవకాశం లభించింది. ఈ దళంకూడా విప్లవాత్మకమేనని పంజాబ్ ప్రభుత్వ దృఢ విశ్వాసం; కాని అక్కడి ప్రధానాధికారి కలనల్ స్పాటిస్ వూడ్ ప్రభుత్వ శంకలతో ఏకీభవించలేదు. తన సిపాయీలు బ్రిటీష్ ప్రభుత్వముపై ఎదురు తిరుగరని అతడు పదేపదే వక్కాణిస్తున్నాడు. అయినా ప్రభుత్వం ఆ దళాన్నికూడా నిరాయుధం చేయాలని ఆజ్ఞా పించింది. కలనల్ స్పాటిస్‌వూడ్ చాలా చికాకు పడ్డాడు; మే 24 న సిపాయీ ప్రతినిధులొచ్చి బ్రిటీష్ సైన్యాలు పెషావర్‌నుండి తనమీదకు కూడా వస్తున్నాయనే వదంతులు నిజమేనా అని అడిగితే అతడేదోచెప్పి తప్పించుకోజూచాడు. వారు అసంతృప్తితో తిరిగి వెళ్ళారు. పెషావర్‌లో చేసినట్లుగా ఇక్కడ కూడా అణచివేయడానికి బ్రిటీష్ సైన్యాలు పెషావర్ నుండి వస్తున్నమాట నిజం. ఈ క్రూరమైన, అసహ్యకరమైన పరిస్థితు లను చూడలేక కలనల్ స్పాటిస్ వూడ్ తన గదిలోకి వెళ్ళి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈవార్త వినగానే 55 వ దళం ఖజానాను దోచుకొని, తుపా కులు, జండాలు, ధనం పుచ్చుకొని ఢిల్లీవైపు బయల్దేరారు. అయితే ఢిల్లీ

దాపున లేదు. బ్రిటిష్ సైన్యాలతో నిండిన పంజాబును దాటాలి. పైగా బ్రిటీషు సైన్యం ఒకటి వెంటాడుతోంది. ఈ పరిస్థితులలో విజయావకాలు చాలా తక్కువ. పెషావర్‌లోని సిపాయి సోదరులు చేసినట్లే తాము కూడా తుపాకులు క్రింద పడవేసి బ్రిటిష్ వారికి లొంగిపోవడం విజ్ఞత అవుతుందా అనే ఆలోచన కల్గింది వారికి. కాని ఆ వీరులు కాళ్ళకు బానిసత్వపు సంకెళ్లు తగిలించుకొని జీవించేకన్నా, మెడకు మృత్యుదేవత ఉరిని తగిలించుకోవడానికై నిశ్చయించుకున్నారు. తమ వెనుక వస్తున్న బ్రిటిష్ వారి నుద్దేశించి ''పోరాడుతూ మరణించేందుకై 'మేము సిద్ధం'' అని నినాదాలు చేశారు. ఆ 55 వ దళపు వీరులు చేసింది కూడా అదే. మాతృదేశ విముక్తికై రణరంగంలో ప్రాణముల నర్పించారు. సరిహద్దులు దాటి కాశ్మీరులో రక్షణకై వెళ్ళిన సిపాయీలు మహారాజా గులాబ్‌సింగ్‌చే దగా చేయబడి ఆంగ్లేయుల ప్రీత్యర్థం వధించివేయబడ్డారు!

మే 30 నాటికి ఉభయ పక్షముల యందలి పరిస్థితులివి. ఈ పరిస్థితులు వెంటనే ఎలా మారినవో, బ్రిటీషువారి ఆశలు ఎలా భగ్నమై పోయినవో, ఈ మూడు వారాలలోను ఇంత నష్టం అనుభవించి కూడా విప్లవ జ్వాలలు మరల రెట్టింపు తీవ్రతతో ఎలా రేకెత్తాయో - మున్ముగు అనంతర పరిణామాలను పరిశీలిద్దాం. విప్లవాలనేవి ఏవో కొన్ని స్థిరమైన సూత్రాల ప్రకారం నడువవు. గడియారాలవలె నిర్ణీతంగా నడిచేయంత్రాలు కావవి. వాని నడక వానిది. ఏవో కొన్ని సాధారణ సూత్రాలమీద వాటిని అదుపు చేయవచ్చు. సన్న సన్న సూత్రాలన్నీ దాని కుదుపుకు చెల్లా చెదరై పోతాయి. విప్లవానికి కీలకం ఒకటే: ''త్రోసుకు పోవడం''దారిలో అనుకోని పరిస్థితులు ఎదురుకావచ్చు. అప్పుడొకసారి నిలిచి, దానిని అధిగమించి మళ్ళీ త్రోసుకుపోవాలి.

# ఆలీఘర్ : నసీరాబాద్

మే నెల ప్రాంతం. బోలండ్ ప్రజలు తమనుండి విశ్వాసపాత్రుడు, స్వేచ్ఛా కాముకుడు, మాననీయుడునైన బ్రాహ్మణు నొకనిని ఎన్నుకున్నారు. బోలండ్ నగరానికి పంపారు. చరచర వెళ్లాడా బ్రాహ్మణుడు. హృదయంలో ఉద్వేగం - తాను వెళ్ళినపని అవుతుందా, కాదా ? అని. బోలండ్ సైనిక కేంద్రం. బ్రిటీషు వారూ దానిపైన ఆశలు పెట్టుకున్నారు. రెండవ ప్రక్క మాతృదేవి కూడా అటు ఆశగా చూస్తున్నది. వెళ్ళిన బ్రాహ్మణునికి మంచి స్వాగతమే లభించింది. ఆయన విప్లవ సందేశం కూడా స్వాగతింపబడ్డది. విప్లవ పథకం ప్రకారం-ఒక పెద్ద పెండ్లి ఊరేగింపులో వారంతా హఠాత్తుగా విజృంభించాలి. ఆంగ్లేయులను హత మార్చాలి. ఢిల్లీ వైపు పురోగమించాలి - అని చెప్పాడా బ్రాహ్మణుడు. బ్రిటీషు రాజ్యాన్ని కూలద్రోయాలనే విషయంలో వ్యతిరేకులేవరూ లేరు. కాని బోలండ్‌లో ఈ పద్ధతిలో లక్ష్యసాధనకు ప్రయత్నించడం సమంజసమా అనే విషయం కొంచెం చర్చకు వచ్చింది. అచ్చటి ముగ్గురు సిపాయీలు సమాచారం బయటికి పంపడంతో ఆ బ్రాహ్మణుడు వెంటనే బంధింపబడ్డాడు. బోలండునుండి ప్రధాన సైనిక కేంద్రమగు ఆలీఘర్‌కు పంపబడ్డాడు. సైనికులందరిమధ్య అతడిని ఉరితీయాలని ప్రకటింపబడ్డది. ఇటు ఆలీఘర్‌లో ఇది జరుగుతుండగా, అటు బోలండులో బ్రిటీషు విధేయులగు

ముగ్గురు సిపాయీలు అవమానాలకు గురిచేయబడ్డారు. వారి ముఖములపై ఉమ్మివేశారు. బోలండు శిబిరమంతా వారిపై దుమ్మెత్తిపోసింది. అధికారుల అనుమతికూడా లేకుండా ఆలీఘర్‌వైపు తరలింది. మే 20 సాయంత్రం బ్రాహ్మణుడు ఉరితీయబడవలసి ఉన్నది. సైనికదళమంతా ఉరికంబంపద్ద చేర్చబడ్డది. వారు తలలెత్తి చూచేసరికి ప్రళయభయంకరమగు ప్రతీకార సందేశ మొకటి ఉరికంబమునకు వ్రేలాడుచున్నది. ఒక్క మాటయినాలేకుండా ఆ కళేబరమిచ్చిన మహాసందేశము. ఆ బ్రాహ్మణుడు జీవించి యుండగా ఎన్ని మాటలలోనైనా ఇవ్వజాలనంతటి ప్రచండమైనట్టిది. ఆ సందేశ మందుకొనిన సిపాయి యొక్కడు క్షణములో ప్రళయాగ్ని జ్వాలయై కత్తిదూసి లంఘించాడు. వ్రేలాడుచున్న కళేబరమును కత్తితో చూపుతూ "మిత్రులారా ! ఈ వీరుడు రక్తార్పణం చేశాడు" అని బిగ్గరగా అరచాడు. ఒక్క నిముషములో వేల ఖడ్గాలు విజృంభించాయి. "ఫిరంగీ పాలనకు మృత్యువు దాపురించింది" అంటూ పిడుగులవలె విరుచుకు పడ్డారు సైనికులు.

ఈ ఘటనతో బ్రిటీషు అధికారులు తల్లడిల్లిపోవడంలో ఆశ్చర్యం లేదు. అతి విశ్వాసపాత్రమైన 9 వ సైనికదళం ఎదురు తిరగడమేగాక బ్రిటీషువారు ప్రాణాలు దక్కించుకోదలిస్తే వెంటనే ఆలీఘర్ వదలి వెళ్ళాలని హెచ్చరించిందికూడా. ఉదారంగా వారిచ్చిన ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని ఆలీఘర్‌లోని ఆంగ్లేయాధికార్లందరూ తమ భార్యా బిడ్డలతో-లేడీ ఔట్‌రామ్‌తో సహా-చల్లగా ఆలీఘర్‌ను విడిచివెళ్లారు. అర్ధరాత్రి వేళకు ఆలీఘర్ ఆంగ్లేయ పాలనా సూచనలైనా లేకుండా పోయినట్లయింది.

అదే సమయంలో ఇటావాలో కూడా అలాంటి సంచలనమే జరుగుతోంది. ఇటావా చీఫ్ మేజిస్ట్రేటు, కలెక్టరు అయిన అలెన్.ఒ.హ్యూమ్ మీరట్ నుండి కబురు అందగానే, అసిస్టెంటు మేజిస్ట్రేటు డేనియల్

సహాయంలో ఇటావా చుట్టుపట్ల దారుల రక్షణకై ప్రత్యేకమైన సైనిక దళాన్ని ఏర్పరిచాడు. 19 వ తేదీన మీరట్ నుండి వస్తున్న కొద్దిమంది సిపాయీలు ఈ దళం కంటబడ్డారు. ఆ కొద్దిమంది లొంగిపోయారు. వారి ఆయుధాలను క్రింద పెట్టమన్నారు. మీరట్ సిపాయీలు అట్లే వంగినట్లు వంగి హఠాత్తుగా తమను పట్టుకున్న వారిపై పడి ఊచకోచ కోశారు. ఈ వార్త అధికార్లకు చేరేలోగానే సిపాయీలు తమ ఆయుధము లతో ఒక దేవాలయము లోనికి చేరి దాగారు. ఇది విని కలెక్టర్ హ్యూమ్ తన అసిస్టెంటు డేనియల్‌ను కొందరు భారతీయ సైనికులను తీసుకొని ఆలయము మీద దాడికి బయల్దేరాడు. ఈ సిపాయీలు తనవారి కంట బడడానికి ముందే ప్రజలే చంపేసి ఉంటారని భావించాడు మొదట్లో హ్యూమ్. కాని తీరా, ఆలయ ప్రాంతం చేరేసరికి, గ్రామస్థులు వారిని హతమార్చ లేదు సరికదా వారి కీర్తిని గానాలు చేస్తూ వారికి ఆహారాదులు అందిస్తున్నారు. గ్రామస్తులు అలా తన ఊహలకు విరుద్ధంగా ప్రవర్తిం చిన, తన సిపాయీలు, పోలీసులు తనకు అండగా నిలుస్తారని ఆశించాడు డేనియలు. మహావిశ్వాసంతో దేవాలయంపై దాడి చేయవలసినదిగా ఆజ్ఞాపించి తాను ముందుకు దూకాడు. ఒకే ఒక్క సిపాయి మాత్రం అతడి ననుసరించాడు ! కాని తృటి కాలంతో ఈ తెల్ల అధికారి, ఆ నల్ల బానిస పైలోకాలకు ఎగుమతి చేయబడ్డారు. గర్వంతో పైకి వెళ్ళబో యిన హ్యూమ్ ఆలయంలోని సిపాయీలను ప్రశాంతికి వదలి, వెనుదిరిగి ప్రచండ వేగంతో తిరోగమించాడు !

మే 19 న ఇటవాలోని సైన్యం తిరుగుబాటు చేస్తుందని వదంతి వ్యాపించింది. అయితే దీని కేంద్రం అలీఘర్. అలీఘర్‌నుండి ఆజ్ఞ అంద నందున ఇటావా సైనికులు శాంతంగా ఉన్నారు. మే 31 వరకు నిజానికి వారలాగే ఉండేవారే. కాని ఆ బ్రాహ్మణ వీరుని ఆత్మాహుతితో విప్లవ జ్వాలలు రెచ్చిపోయాయి, అలీఘర్ విజృంభించిందని 22 న వార్త అంద

గానే, ఇటావాకూడా విజృంభించింది. మే 23 న సైన్యమంతా ఒకచేత కాగడా, మరొకచేత కత్తి పుచ్చుకొని ''హరహర మహాదేవ్'' అంటూ విరుచుకుపడ్డది. సిపాయీలు ఆంగ్లేయ శిబిరముపై దాడి చేశారు. ఖజానాను దోచారు. ఖైదులను తెరిచారు. తెల్లవారు వెంటనే నగరాన్ని ఖాళీ చేయకపోతే విచక్షణా రహితంగా రూపుమాపబడతారని హెచ్చరించారు. భీతావహ పరిస్థితిలో ఆంగ్లేయులు తమ భార్యా బిడ్డలతో చిక్కిన త్రోవను పట్టుకుని పరుగెత్తారు. భారతీయుల ఉదారత ఆసరాగా హ్యూమ్ ఒక భారత నారి దుస్తుల్లో పారిపోయినాడు. హ్యూమ్ పారిపోగానే ఇటావా స్వతంత్ర్యమయినట్లు ఢంకా మ్రోతలతో ప్రకటించబడ్డది. సిపాయీలంతా ఢిల్లీవైపు పయనించే ప్రధాన సైనిక బృందములో వెళ్ళి చేరారు.

# రోహిల్ ఖండ్

రోహిల్‌ఖండ్ ప్రాంత రాజధాని బెరిల్లీ. దానిని పాలిస్తున్న రోహిల్లా పఠానులనుండి ఆంగ్లేయులు దానిని కాజేశారు.

మీరట్ తిరుగుబాటు చేసిందనే వార్త మే 14 న బెరిల్లీకి చేరింది. దానిమీద ఆంగ్లేయులు తమ కుటుంబాలను నైనిటాల్ వైపుకు పంపి, తమ పటాలాలను సిద్ధం చేసుకున్నారు. ఆ పటాలం భారతీయ పటాలమే అయినా ఆంగ్లేయుల ప్రత్యేక విశ్వాసాన్ని చూరగొన్నట్టిది. 15 వ తేదీనీ సిపాయీలందరినీ మైదానములోకి పిలిచారు. ప్రధాన ఆంగ్లేయాధికారి వారికి సత్ప్రవర్తనను గురించి, విధేయతను గురించి హితబోధలు చేశాడు. క్రొత్త తూటాలు ఉపయోగింపబడవని చెప్పాడు. ఈ వార్తలను సిపాయీలు అంతకు పూర్వమే విన్నారు. వారి ఆలోచనలు అప్పటికే విప్లవ మార్గం పట్టాయి. స్వాతంత్ర్య పతాకను ఎగురవేయండని ఢిల్లీ సింహాసనం నుండి రోహిల్ ఖండ్ ప్రజలకు ఆహ్వానం అందింది. ఈ ఆహ్వానం దారిలో ఉండగానే రోహిల్లాల ఆఖరిపాలకుడగు హాఫీద్ రహ్మత్ సంతతికి చెందిన ఖాన్ బహద్దూర్‌ఖాన్ రహస్య సంఘ కార్యకలాపాలు నిర్వహిస్తున్నాడు. ఖాన్ బహద్దూర్‌ఖాన్‌కు రెండు వేతనాలు ముడుతుండేవి. హాఫీత్ రహ్మత్ వారసుడుగా ఒకటి, బ్రిటిష్ వారి క్రింద న్యాయాధికారిగా రెండవది అందుకుంటుండేవాడు. ఆంగ్లేయుల అభిమానపాత్రుడని ప్రాంతమంతా అతడికి పేరు. బెరిల్లీలోని రహస్య సమాజాల కంఠటికీ అతడు ప్రాణము,

కేంద్రము గూడా! కాని బెరిల్లీ ప్రజలకు వచ్చిన ఆహ్వానంలో వెంటనే ఢిల్లీవైపు పురోగమించమని ఉన్నప్పటికి, వారు మొదటి పథకము ప్రకారము మే 31 వరకు వేచి ఉందా మనుకున్నారు.

మే 31 వచ్చింది. ఉదయమే కెప్టెన్ బ్రౌన్ నివాసానికి నిప్పంటింపబడ్డది. అది ఆదివారం. ఆదివారపు సైనిక కవాతులు మామూలుగా జరిగిపోయినాయి. అధికార్ల నివేదికలు కూడా అందజేయబడినాయి. సిపాయీలు మామూలుగా కన్నా ఎక్కువ ప్రశాంతముగా ఉన్నారని కూడా ఆంగ్లేయాధికారులు నివేదించారు. ఆంగ్లేయులు చర్చిలవైపు వెళ్ళారు. కల్లోల చిహ్నాలే ఎక్కడా కనిపించలేదు.

గడియారం 11 కొట్టింది. సిపాయీల నివాస ప్రాంతంలో ఒక తుపాకి ప్రేలింది. ఆ ప్రతిధ్వని ఇంకా పూర్తికాకముందే గగనమంటుతూ తుపాకుల కోలాహలం చెలరేగింది. బెరిల్లీ తిరుగుబాటు ఎంత చక్కగా కల్పన చేయబడ్డదంటే ఎవరెవరు ఏఏ ఆంగ్లేయులను హతమార్చవలెనో కూడా ముందే నిర్ణయింపబడ్డది. ఈ కోలాహలము, గంద్రగోళము వినిపించగానే ఆంగ్లేయాధికార్లు హడలిపోయి ఆశ్వికదళాల నివాసాలవైపు పరుగెత్తారు. సివిల్, మిలిటరీ అధికార్లంతా రక్షణకు అక్కడికే చేరాలనుకున్నారు. కాని విప్లవవీరుల విజృంభణ ముందు అక్కడ నిలవడమే అసాధ్యమైపోయి అంతా నైనిటాల్‌వైపు పరుగులెత్త ఆరంభించారు. మొదటి దెబ్బతో బ్రిగేడియర్ శిబ్బాల్ట్ హతుడై పోయినాడు. కెప్టెన్ హిర్బి, లెఫ్టినెంట్ ఫ్రేజర్, సార్జంట్ వాల్డన్, కలనల్ ట్రూప్, కెప్టెన్ రాబర్ట్‌సన్ — ఇలా విప్లవవీరులకు అందిన ప్రతి ఆంగ్లేయాధికారి హతుడై పోయినాడు. ముప్పది ఇద్దరుమాత్రం ప్రాణాలు దక్కించుకొని నైనిటాల్ చేరేరు. ఈ విధంగా ఆరేఆరుగంటలలో బెరిల్లీలో బ్రిటిష్‌పాలన ముగిసిపోయింది!

# వారణాసి అలహాబాద్

చారిత్రక ఘనతతో మెరసిపోతూ, పవిత్ర గంగానదీ తీరాన, కలకత్తాకు 460 మైళ్ళ దూరాన ఉన్న ప్రాచీన మహానగరం వారణాసి. చల్లని, స్వచ్ఛమైన, పవిత్ర జలములతో కూడిన భాగీరథీ తీరస్థ నగరము లన్నిటికి రాణి నిజముగా వారణాసియే. ప్రాంత సైనిక కేంద్రము సిక్రోలి, అల్లాబాద్‌కు కొద్ది దూరములోనే ఉన్నది. 37 వ పదాతి దళము, లూఢియానా సిక్కు దళము, అశ్విక దళములు, అక్కడే ఉన్నాయి. ఫిరంగి దళము మాత్రము ప్రత్యేకంగా ఆంగ్లేయులచేతిలో ఉంచబడినది. సిపాయీ లలో రహస్యముగా స్వధర్మ, స్వరాజ్య భావన అనేక పద్ధతుల ద్వారా తీవ్రముగా వ్యాపింపజేయబడ్డది. 1857 వ సంవత్సరము వచ్చేసరికి వారణాసి జనతలో బ్రహ్మాండమైన ఆందోళన కానవచ్చింది. ఆదినుండీ బ్రిటీషు వారణాసిలోని ఆంగ్లేయుల భద్రతకై నగరపు చీఫ్ కమీషనర్ టకర్, జడ్జి గుబ్బిన్స్, మేజస్ట్రీటు లిండ్, ఇతర సివిల్ అధికారులు, కెప్టెన్ ఓల్‌ఫర్ట్స్, కలనల్ గార్డన్ తదితర మిలిటరీ అధికారులు ఎన్నో జాగ్రతలు తీసుకున్నారు. ఎందువల్లనంటే ఆ నగరములోని ఆందోళన చాలాసార్లు రహస్యపు పరిమితులను దాటి ఒక్కొకసారి అదుపుకూడా తప్పుతుండేది. ''హే భగవాన్! మమ్మి ఫిరంగీ పరిపాలననుండి విముక్తులను చేయి'' అని దేవాలయాలలో బాహాటంగా ప్రార్థనలు జరిగేవి. అన్య

లారా! ఈ ఆంగ్లేయులనే భారతదేశంలో ఉండనిస్తే వారు అందరినీ హత మార్చి, మీ మతాలను సర్వనాశనం చేస్తారని తెలుసుకొనండి. ముస్లింలారా, మీరు ఖురాన్‌ను పవిత్రంగా భావిస్తే, హిందువులారా, మీరు గోమాతను పవిత్రంగా భావిస్తే - వెంటనే మీ మధ్య నున్న చిన్న చిన్న తేడాలను మరచి ఈ పవిత్ర సమరంలో ఏకంకండి. ఏక పతాకక్రింద రణరంగం లోకి దుముకండి. మీ రక్తధారలతో ఈ గడ్డపైన ఆంగ్లేయుల పేరును కడిగి వేయండి. ఈ యుద్ధంలో హిందువులు ముస్లింలతో కలిసి, మన దేశ స్వాతంత్ర్యానికి రణ భూమిని ఆక్రమించి నట్లయితే, వారికి పారితోషిక ముగా, గోహత్య ఆపివేయబడుతుంది. ఈ పవిత్ర యుద్ధంలో పోరాడే వారికి. అలా పోరాడేవారికి ధన సహాయం చేసేవారికి ఇహపర స్వేచ్ఛ లభిస్తుంది. కాని ఈ స్వదేశీ సమరానికి ఎవరైనా అడ్డు తగిలితే అతడు తన తలను తానే పగలకొట్టుకున్నట్లవుతుంది; కోరి ఆత్మహత్య చేసు కున్నట్లవుతుంది!''

బెరిల్లీలో ఆంగ్లపతాకం దిగి, స్వాతంత్ర్య పతాకం ఎగురనారంభించ గానే పదాతి దళాధిపతి సుబేదార్ బక్త్‌ఖాన్ సిపాయీల ప్రధానాధికారి అయినాడు. సమ్రాట్టు తరఫున సుబేదార్‌గా ఖాన్ బహదూర్‌ఖాన్ రోహిల్‌ఖండ్ పాలకుడని ప్రకటింపబడ్డది. నిర్బంధంలోని ఆంగ్లేయు లంతా విచారింపబడి ఉరితీయబడ్డారు రోహిల్‌ఖండ్ విముక్తమైనట్లు ఢిల్లీకి కబురు వెళ్ళింది. రోహిల్‌ఖండ్‌లోని ఇతర నగరాలలో కూడా ఆంగ్లేయు లకు అదేగతి పట్టింది.

ఈ విధంగా రోహిల్‌ఖండ్ ప్రాంతామంతా ఒక్కరోజున ఎదురు తిరిగింది. బెరిల్లీ, షాజహాన్‌పూర్, మొరాదాబాద్, బూదౌన్‌లలోను, ఇతర జిల్లా ప్రధాన నగరాలలోను సైన్యాలు, పోలీసులు, పౌరులు కలిసి స్వేచ్ఛా ప్రకటనలు చేశారు; కొద్ది గంటలలో ఆంగ్లేయులను సాగనంపారు. ఆంగ్ల పతాకాలు ముక్కలు చేయబడ్డాయి. న్యాయస్థానాలు. పోలీసు స్టేషనులు, ప్రభుత్వ కార్యాలయాలపై స్వేచ్ఛాపతాకా లెగిరాయి. ఒక్కరోజున, ప్రతిచోట, హఠాత్తుగా, జిల్లా కేంద్రాలన్నిటిలోను పోలీసులు, సిపాయీలు, పౌరులు ఏకమై మిగిలిన కొద్దిమంది ఆంగ్లేయాధికార్లను తరిమివేశారు. రోహిల్‌ఖండ్ ఆంగ్లేయుల నుండి విముక్తమై, ఖాన్ బహదూర్‌ఖాన్ పాలనను అంగీకరించడానికి గల రెండు కారణాలు : రహస్య సంఘాల పటిష్ఠమైన సంఘటన, నిర్ణీత పథకమును తు.చ. తప్పకుండా చురుకుగా తెలివిగా అమలు చేయడము జరిగింది.

ఖాన్‌బహదూర్‌ఖాన్ స్వయముగా రోహిల్‌ఖండ్‌లో జరిగిన వ్యవహా రాలన్నిటినీ ఢిల్లీ సమ్రాట్టుకు వ్రాశాడు; రోహిల్‌ఖండ్ అంతా ఈ క్రింది ఉద్ఘాటన పంపబడ్డది; "హిందూస్థానవాసులారా! చిరకాలముగా ఎదురు చూడబడుతున్న స్వరాజ్య పర్వము రానేవచ్చింది. దీనిని మీరు స్వీక రిస్తారా? లేక మోకాలొడ్డుతారా? ఈ మహత్తర అవకాశమును వినియోగించు కుంటారా? లేక చేయి జారవిడుచుకుంటారా? హిందూ ముస్లిం సోదర

ప్రాంతాలలోని బలాబలాలను అంచనా వేసేందుకు రహస్య సంఘాలు పనిచేసేవి. మే నెల వచ్చేసరికి ఎందరో ముస్లిం మత ప్రచారకులు సిపాయీ శిబిరాలలో చేరారు. ప్రజలు తిరుగుబాటు చేయాలని ఉద్బోధిస్తూ బహిరంగ ప్రదేశాలలోను, గోడలమీదను ప్రకటన పత్రాలు అంటించ బడ్డాయి. చివరకు హిందూ పూజారులు ఆలయాలలో బహిరంగంగా ప్రార్థన సమావేశాలు జరిపి బ్రిటీషు సామ్రాజ్య విధ్వంసనానికి, స్వరాజ్య ఫల సిద్ధికి ప్రార్థనలు చేసేవరకు పరిస్థితులు వెళ్ళాయి. అదే సమయంలో ఆహారధాన్యాల ధరలు విపరీతంగా పెరుగజొచ్చాయి. ధర లింకా పెరిగితే చివరకు వ్యాపారస్థులే ఎలా దెబ్బతినేది వివరిస్తూ ఆర్థిక సూత్రాలు చెప్పు కుంటూ ఆంగ్లేయాధికార్లు ప్రజలలోకి వచ్చేసరికి ప్రజలు ధైర్యంగా ఎదురు నిలబడి ''మా దేశంలో అన్నిటి ధరలు పెంచినవారు మీరు. ఇప్పుడు ధర్మ పన్నాలు చెప్పడానికి వచ్చారా?'' అని నిగ్గతీసి అడిగేవారు. విప్లవం రాక ముందే ప్రజల రౌద్ర మిలా ప్రస్ఫుటం కావడంవలన ఆంగ్లేయు లెంతగా హడలిపోయినారంటే కెప్టెన్ అల్‌ఫెర్ట్స్, కెప్టెన్ వాట్‌సన్ స్వయముగా ఆంగ్లేయులు ఖాళీచేసి వెళ్ళాలని వత్తిడి తీసుకువచ్చారు. చివరకు గుబ్బిన్స్ దీనంగా ''మీరంతా వారణాసి విడచిపోకండని చేతులుజోడించి వేడుకుం టున్నాను'' అని ప్రాధేయపడ్డాడు. ఆంగ్లేయులు ఖాళీచేసి వెళ్ళడమనేది తాత్కాలికంగా వాయిదా వేయబడ్డది. సిక్కులు ఆంగ్లేయుల రక్షణార్థం దళాలను ఏర్పరచగా ఆంగ్లేయులు వెళ్ళిపోవలసిన అవసరంమాత్ర మేమున్నది కనుక! వారెన్‌హేస్టింగ్స్‌చేత పదవీభ్రష్టుడైన చైత్‌సింగ్ వారసులుకూడా ఆంగ్లేయులతో చేతులుకలిపిన వారైరి! అంతటి విధేయత వారణాసిలో ఆంగ్లేయులకు లభిస్తుండగా వారు దానిని వదలి ఎందుకు పోవాలి !

అయితే ఇప్పుడు అజీమ్‌ఘర్ వైపునుండొక భయంకరవార్త వచ్చింది. జూన్ 3వ తేదీ సాయతంసంధ్యాసమయం. అజీమ్‌ఘర్ ఆంగ్ల

సైన్యాధికారులంతా క్లబ్బులో విందుల హడావిడిలో ఉన్నారు. స్త్రీలు, పిల్లలు ఆ ప్రక్కనే ఆటలలో ఉన్నారు. హఠాత్తుగా వారందరికి బ్రహ్మాండ మైన గందరగోళం వినపచ్చింది. ఇదేమిటో ఆంగ్లేయులకు బాగా తెలుసు. మీరట్‌లోని దృశ్యాలు వారి కళ్ళముందు తారాడాయి. భీతావహులై క్షణం తిరుగకముందే నలుదిక్కులకు పారిపోయినారు. అధికారులు, స్త్రీలు, పిల్లలు, ప్రాణాలకోసం వగర్చిపోయినారు. చావుకన్నా దుర్భరవేదన పడుతున్న వారిని చూచేసరికి అజీమ్‌ఘర్ సిపాయీలకు పగతీర్చుకొనవలె ననిపించలేదు. మరెవరైనా సిపాయీలు చెదురువాటుగా వారిపై కత్తిదూస్తా రేమోనని వారందరిని తమ సంరక్షణలోనికి తీసుకున్నారు. వారందరినీ వెంటనే అజీమ్‌ఘర్ ఖాళీచేసి వెళ్ళిపొమ్మని ఆజ్ఞ ఇచ్చారు. అంతటి అసా ధారణమైన ఉదారతతో భారతీయ సైనికులు వారికోసం బండ్లు తెప్పించి చేతులకు వేయబడిన బేడీలను తీసివేసి బండ్లలోకి ఎక్కించారు. వారి రక్షణకై కొందరు సిపాయీలను కూడా తోడు పంపారు. ఆ బండ్లన్నీ ఆంగ్లేయుల సామానులన్నిటితో- పతాకాది చిహ్నాలతో- వారణాసి వైపు తరలివెళ్ళాయి. ఇటు ఏడులక్షల ఖజానా, ఆయుధాగారం ఆంగ్లపాలన చిహ్నాంకితమైన జైలు, కార్యాలయాలు, రోడ్లు, బ్యాంకులు మున్నగునవి అన్నీ సిపాయీల స్వాధీనమైనాయి. విజయోత్సాహంతో సిపాయీలంతా నగరంలో దళసంచలనం చేశారు. సైనిక ఘోషవాద్యాలతో, రెపరెపలాడే పతాకాలతో వారంతా ఫైజీబాద్ వైపు తరలి వెళ్ళేరు.

అజీమ్‌ఘర్ విముక్తమైన వార్త వారణాసి చేరినప్పటికి అచ్చటి ఆంగ్లేయులు వారణాసినైనా దక్కించుకొనగలమా భావించారు. మీరట్‌లో తిరుగుబాటు జరిగినప్పటినుండి పంజాబ్‌లోని జాన్ లారెన్సు, కలకత్తాలోని లార్డ్ కానింగ్‌లు ప్రధాన విప్లవ కేంద్రాలన్నిటికీ ఆంగ్లేయ సైన్యాలను పంపేందుకుగాను చాలా శ్రమ పడుతున్నారు. ఉత్తరాది సైన్యాలు ఢిల్లీ

తిరుగుబాటులో చిక్కుకుని పోవడంతో ఢిల్లీ దక్షిణ భాగమంతా అసహాయ స్థితిలో పడ్డని. అచ్చటి ఆంగ్లేయాధికార్లు "బాబూ! మాకు ఐరోపా సైన్యాలు పంపి ఆదుకోండి" అంటూ కలకత్తాకు మొరలు పెట్టుకున్నారు. ఐరోపా సైనికుల మొదటి దళం - కఠినుడు, మన్సాహసి, సమర్థుడునైన జనరల్ నీల్ నేతృత్వమువల్ల వారణాసిలోని ఆంగ్లేయులకు కొంచెము ధైర్యమొచ్చింది. అప్పుడే దానపూర్‌లోని ఆంగ్ల సైన్యము కూడా వారణాసి చేరింది. వారణాసిలో అసాధారణమైన అశాంతి కానవస్తున్నందున అచ్చటి సిపాయీలు కూడా విప్లవ కార్యకలాపాలలో చేరినారని స్పష్టమైన సాక్ష్యాధారములు లభించినందున, ఆంగ్లేయులు సుదీర్ఘమైన ఆలోచన తర్వాత సిపాయీలు తిరుగుబాటు చేసే ముందుగానే వారిని నిరాయుధులను చేయాలని నిశ్చయించారు. అందుకుగాను ఆ మధ్యాహ్నమే మైదాన సమ్మేళనం ఏర్పాటు చేశారు. మైదానములో ఆంగ్లేయాధికారులు ఆయుధ విసర్జన చేయమని ఆజ్ఞాపించగానే సిపాయీలకు పరిస్థితి అర్థమయింది. తమచే ముందు ఆయుధముల క్రింద బెట్టించి ఇక తమను అంతము చేస్తారని గ్రహించారు. అందువలన వారు ఆయుధ విసర్జన చేయకపోగా భయంకరమైన నినాదాలు చేసుకుంటూ అధికార్లపైన, ప్రక్కనున్న ఆయుధాగారము మీద విరుచుకు పడ్డారు. వారిని అదుపు చేయడానికి ఉద్దేశింపబడిన సిక్కు సిపాయీల దళమొకటి అప్పుడే రంగములోనికి వచ్చింది. ఆ క్షణమున సిక్కులు ఆంగ్లేయులకు ఎంతటి విధేయత ప్రకటించిరనగా - విప్లవ సేనలను తుదముట్టించేందుకు కొంచెం సేపయినా అవకాశ మిమ్మని కోరుతూ అధికాలకు పాదములపై బడ్డారు! ఒక హిందూ సిపాయి వారి కమాండర్ గైస్ మీదపడి క్షణములో అతడిని నేలగూల్చాడు. అతడి స్థానము నాక్రమించేందుకు బ్రిగేడియర్ డాగ్సన్ ముందుకు వచ్చి రాకమునుపే ఉద్రేక్తుడై పోయిన ఒక సిక్కు సిపాయి అతడిని కాల్చివేశాడు. ఇది సహించలేక పోయిన తోటి సిక్కు సిపాయీలు ఆ యోధుని ముక్క

ముక్కలు చేశారు! ఈ ఘనకార్యానికి తమకు పారితోషికము లభిస్తుందని సిక్కులు ఉవ్విళ్ళూరుతుండగా ఆంగ్ల ఫిరంగి దళం వారందరి మీద అగ్ని వర్షం ప్రారంభించింది. హిందూ - సిక్కు సిపాయీల మధ్య జరుగుతున్న ఘర్షణను చూసి సిక్కులు కూడా తమను త్యజించారని ఆంగ్లేయులు పొరబడ్డారు. ఈ పొరబాటు భావముతో అందరి మీద విచక్షణా రహితముగా తుపాకులెత్తారు. దీనితో సిక్కులకు హిందూ సిపాయీలతో కలిసిపోయి తిరుగబడడంకన్నా గత్యంతరం లేకపోయింది. ఇలా భారతీయులంతా ఏకమై ఆంగ్లాయుధ దళాలపై ముమ్మారు కాల్పులు సాగించారు. 1857 విప్లవ చరిత్రలో హిందువులు, ముస్లిములు, సిక్కులు అంతా కలిసి ఆంగ్లేయులపై విరుచుకుపడిన ప్రముఖ ఘట్టము దాదాపు ఇది ఒక్కటే. పంజాబులోవి జాన్ లారెన్సు పథకము ప్రకారము ఆంగ్లేయులు వారణాసి విప్లవాన్ని ఆదిలోనే అంతం చేసినమాట నిజమేగాని, వారాణాసి విజృంభించిందనే వార్త విద్యుల్లతలా ఉత్తర భారతమంతా క్షణంలో వ్యాపించి, వారణాసిపై దృష్టి నిల్పి ఎదురు చూస్తున్న సమయం లోనే అనేక కేంద్రాలలో విప్లవ పరంపర ప్రారంభం కావడానికి కారణమయింది.

వారణాసి విప్లవము తరువాత చుట్టుపట్ల పల్లెలలో 'ప్రశాంతత' కాపాడేందుకు జనరల్ నీల్ సిక్కు, ఆంగ్లేయ దళాల నేర్పరిచాడు. ఈ దళాలు రక్షణలేని రైతులతో నిండిన గ్రామాలను ఆక్రమించుకొనజొచ్చాయి. తారసిల్లిన ప్రతి వారిని నరికివేయడమో, ఉరి తీయడమో చేసేవారు. ఉరితీత లెంత ఎక్కువగా జరిగినవనగా-రాత్రింబవళ్లు పని చేసినా ఒక ఉరి కంబము చాలలేదు; అందువల్ల అనేకమైన ఉరికంబాలు ఏర్పరచ ఏబడ్డాయి. ఇన్ని ఉరికంబాల మీద త్వరత్వరగా ఉరితీసి సగం చచ్చిన కళేబరాలను సైతం విసరి వేస్తున్నప్పటికీ ఇంకా అనేక మంది ఉరితీతకు ఎదురుచూస్తూ ఉండేవారు. ఇన్ని ఉరికంబాల ఏర్పాటు కూడా చిలిపితనమనిపించి ఏకంగా చెట్లకే మనుష్యులను వ్రేలాడదీసేవారు. కాస్త మార్పు

కోసం ఉరితీత పద్ధతిలో కూడా చమత్కారాలు చూపించేవారు! రైతులను పట్టి సూటిగా చెట్లకు వ్రేలాడదీయడమే కాకుండా, వారందరినీ ఏనుగుల మీద కెక్కించి చెట్ల క్రిందకు పంపేవారు. వారి గొంతులకు త్రాళ్లు తగిలించగానే ఏనుగులను అవతలికి త్రోలేవారు. కొమ్మలకు వేల సంఖ్యలో శవాలు వ్రేలాడేవి! ఒకే రకం దృశ్యాలు చూచి చూచి ఆంగ్లే యులకు విసుగెత్తేది. అందువల్ల కొందరిని 8 అంకెవలెను, కొందరిని 9 అంకెవలెను చిత్ర విచిత్రములుగా కోసి హతమార్చేవారు!

ఇన్ని ఉరితీతలు జరిగినా గ్రామస్తులు సమరాన్ని జరిపేందుకే నిశ్చయించుకున్నారు. దానితో ఆంగ్లేయులు- గ్రామాలకు మూక ఉమ్మ డిగా దహనం చేసే- కొత్త వ్యూహము వేశారు. గ్రామానికి అన్ని వైపులా నిప్పంటించి, లోపలివారిని తగలవేయడం ఆంగ్లేయులకు ఎంత ఆనందమిచ్చేదంటే, వారు ఈ దహనాలను చమత్కారంగా వర్ణిస్తూ ఇంగ్లండుకు ఉత్తరాలు వ్రాసుకునేవారు. ఏ గ్రామమూ ఆహుతిగాక తప్పించుకొనలేనంత చురుకుగా, శీఘ్రంగా నలువైపులా నిప్పంటించే వారు! పేద రైతు, పండితులైన బ్రాహ్మణులు, ప్రమాదము చేయలేని ముస్లింలు, బడిపిల్లలు, పిల్లతల్లులు, లేబ్రాయపు బాలికలు, వృద్ధులు, గ్రుడ్డివారు, కుంటివారు- అందరిని మూకఉమ్మడిగా అగ్నిహోత్రునికి ఆహుతి చేసేవారు.

అల్లాబాద్ ప్రాంతమందలి ప్రధాన కేంద్రము కావడాన ఆంగ్లే యులు అసాధారణమైన జాగ్రతలు తీసుకొని ఉండవలసింది. అయితే మే నెల ప్రారంభము వరకు దేశములోని ఆంతరిక ఆందోళన పరిస్థితి తెలియనందున అలహాబాదులో సరియైన జాగ్రతలేమీ తీసుకొనబడలేదు. అల్లాబాదు నగరంలోనే విప్లవకారులు ఎంత రహస్యముగా పనిచేసే వారంటే- అక్కడ ఒక్క ఆంగ్ల సైనికుని నిలిపే అవసరాన్ని కూడా

ఆంగ్లేయులు గుర్తించలేదు. మీరట్ వార్త వచ్చేసరికి, ఈ ముఖ్యమైన సైనిక కేంద్రములో ఆరవ సిపాయీ దళము, ఫిరోజ్‌పూర్‌నుంచి వచ్చిన 200 మంది సిక్కు సైనికులు ఉన్నారు. ఆ వెంటనే ఔధ్ అశ్వికదళం రప్పించబడ్డది. కోట, అందలి పెద్ద ఆయుధాగారము సిపాయీలకు వప్పగించబడ్డది. వీరిపై ఆంగ్లేయాధికారులు ఈ సిపాయీలందరూ తమకు విధేయులేనని దృఢంగా విశ్వసించారు. ముఖ్యంగా ఆరవ దళం విధేయతలో ప్రప్రథమ మనుకున్నారు. ఒక రోజున, ఢిల్లీ వార్త వినగానే తమ అధికార్లకు వారొక కబురు పంపారు: ''ఖావిండ్, మాకు ఆజ్ఞ ఇవ్వండి. ఢిల్లీవెళ్ళి విప్లవకారులను ముక్క ముక్కలు చేసేస్తాం''- అని. ఈ విపరీతమైన విధేయత ప్రతిచోటా ప్రశంసలందుకున్నది. ఇంతలో ఒక పౌరుడు- ఆరవ దళం విప్లవకారులతో చేతులు కలిపినదని వార్త తెచ్చాడు! ఆరవ దళం హద్దులుమీరిన విధేయతను ప్రదర్శించి ఆంగ్లేయులను అప్రమత్తతకు దూరం చేసింది.

తమ పథకం విఫలం కాకుండా ఉండగలందులకు, వారణాసిలోవలె తాముకూడా నిరాయుధులు చేయబడకుండుటకు విశ్వప్రయత్నములు చేస్తుండగా, ఆంగ్లేయులు తమ కుటుంబాలను కోటలో సిక్కుల, అశ్విక దళముల రక్షణలోనికి పంపారు. జూన్ ఆరవతేది రాత్రి ఆరవ దళపు సిపాయీలంతా కత్తులు పుచ్చుకొని ''మారో ఫిరంగీకో'' అంటూ బయల్దేరారు.

అధికారులు ఔధ్ అశ్వికదళాలను పిలిచి విప్లవకారులను అణచవలసిందిగా అజ్ఞాపించారు. చురుకైన యువకులగు లెఫ్టినెంట్ అలెగ్జాండరు, లెఫ్టినెంటు హార్వర్డ్ అశ్వికదళాన్ని తీసుకొని సిపాయీలపైకి బయల్దేరారు. అప్పటికి తెల్లవారుతున్నది. సిపాయీలు తారసపడగానే వారిని ఢీకొనవలసిందిగా ఆంగ్లేయాధికార్లు ఆజ్ఞాపించారు. తమ వెనుకనున్న వేలాది అశ్వాలు ఎదుటనున్న కొద్దిమంది సిపాయీలను ఢీకొని వారిపని ముగిం

వేస్తారనే ఆశతో సాహసంగా ముందుకు దూకారు! కాని, పాపం! ఆ ఆశ్వికదళం సోదర దేశీయులపై కత్తులు దూయడానికి నిరాకరించింది! ముందుకు సాగనేలేదది! దీనితో సిపాయీలు బ్రహ్మాండమైన హర్ష ధ్వానాలు చేశారు. ఆ మైదానముపై కానవచ్చిన అనంతర దృశ్యము అనుపమానమైనది. ఆంగ్లేయాధికారి ఒక్కొక్క ఆజ్ఞ నిచ్చిన ప్రతిసారీ "జుయ్యీ" మంటూ ఒక తుపాకి గుండు దూసుకు వెళ్ళేది. ప్లంకెట్, ఎడ్డు బెంట్ స్టెపర్ట్, క్వార్టర్‌మాస్టర్ హౌస్, ప్రింగిల్, మన్రో, బర్చ్, లెఫ్టి నెంట్ ఇన్స్—అందరూ నేలకూలారు. మైదానములోని ఉద్రిక్తజనత ఆంగ్లేయుల గృహదహనానికి బయల్దేరింది. పాకశాలలో పలువురు ఆంగ్లే యులున్నారని విని అటు పరుగెత్తారు. అందిన ఆంగ్లేయులందరిని హత మార్చారు. ఇక సిక్కులు, వారి వెంటనున్న సిపాయీలు కూడా ఏకమై ఎదురు తిరిగి ఆంగ్లేయులను తరిమివేశారనేందుకు గుర్తుగా తుపాకి ప్రేలుడు ఒకటి వినిపించవలసి ఉన్నది; అందుకై ఎదురు చూస్తున్నారు అందరు.

కాని కోటలో సిక్కులు తమ దేశద్రోహ బుద్ధిని బయటపెట్టారు. ఆంగ్ల పతాకాన్ని తొలగించడానికి నిరాకరించడమే గాక, ఆంగ్లేయులతో కలసి సిపాయీలను నిరాయుధులను చేసి, లోనికివస్తున్న సిపాయీలను గెంటి వేయడానికి సహకరించారు. కోటలోని సిపాయీలు మాటిమాటికి ఎదురు తిరిగినా సిక్కులు వారితో కలియక ఆంగ్లేయుల ఆజ్ఞలపై వారిని నిరాయుధుల చేసి, బయటికి గెంటివేయ జొచ్చారు. ఆ విధముగా కోట ఆంగ్లేయుల వశములోనే ఉండిపోయింది.

అయితే అలహాబాదులో ఉన్నది యీ నాల్గువందల సిక్కు ద్రోహులు మాత్రమే కాదుకదా! కోటలో సిపాయీల తిరుగుబాటు సమయం రాగానే అల్హాబాద్ నగరమంతా ఎదురుతిరిగింది. మైదానాలలోని భయంకర ధ్వనులు నగరమంతా ప్రతిధ్వనించాయి. మొదట ఆంగ్లే యుల గృహాలు నాశనం చేయబడ్డాయి. ఆ తర్వాత ప్రజలు, సిపాయీలు కలిసి జైలు తలుపులు బ్రద్ధలు కొట్టారు. విప్లవకారులు రైల్వేల మీద,

టెలిగ్రాఫ్ తీగల మీద ప్రత్యేకమైన కన్నుంచారు. రైల్వే ఆఫీసులు, రైల్వే లైనులు, టెలిఫోన్ తీగలు, టెలిగ్రాఫ్ స్తంభాలు, తీగలు, ఇంజన్లు అన్నీ ధ్వంసం చేయబడ్డాయి. 17 వ తేదీ ఉదయం 30 లక్షల రూపాయలు గల ఖజానాను విప్లవకారులు వశంచేసుకున్నారు. మధ్యాహ్నం బ్రహ్మాండమైన ఊరేగింపుతో విప్లవపతాకను తీసుకువెళ్ళి పోలీసు స్టేషనుపై ఆవిష్కరించారు. అటు నగరము, కోట విప్లవజ్వాలతో ఉండగా ప్రజలు, సిపాయీలు ఆ పతాకానికి వందనము చేశారు.

ఇంచుమించు అదే సమయములో ప్రాంతమంతా ఒక్కసారిగా తిరుగుబాటు చేసింది. ఆ ప్రాంతంలో బ్రిటిషువారు పరిపాలించారనేది నమ్మశక్యం కానంత శీఘ్రగతిని ప్రతీచోట పరిస్థితులు మారిపోయినవి.

దుకాణదార్లు, మార్వారీలు, వైశ్యులు సైతం ఈ మహా విప్లవంలో ప్రముఖ పాత్ర వహించారు. జనరల్ నీల్ తన నివేదికలో ఆంగ్లేయుల ఎడ వీరి ద్వేషాన్ని ప్రత్యేకంగా పేర్కొన్నాడు. కాని దీని తర్వాత కూడా ఆంగ్లేయులు "రైతులు మాత్రం మా పక్షమే" అని బడాయిలు పలికేవారు. కాని అలహాబాదు ఈ భ్రమలను పటాపంచలు చేసింది. 1857 విప్లవ సమరంలో రైతులు ప్రధాన పాత్ర వహించారు.

విప్లవకారులు తీవ్రాతి తీవ్ర ప్రయత్నములు చేసినా అలహాబాద్ గూడ వారణాసివలెనే ఆంగ్లేయుల చేజిక్కిపోయింది. కాని విప్లవకారులు స్థైర్యం కోల్పోలేదు. శత్రువు ముఖ్యమైన కోటలలో తలదాల్చుకొనడం చూచి ప్రజలు మరింత ఉద్రిక్తులై ప్రతి గ్రామాన్నీ ఒక్కొక్క దుర్గముగా తయారుచేసి ఎదురు నిలిచారు. అలాంటి ప్రజలను లంచముంచే వశము చేసుకునే రోజులు పోయినాయి. అది ఒక సిద్ధాంత సమరం. చిన్న చిన్న వారి తలలకు సైతం వేలాది రూపాయిల పారితోషికాలను నీల్ ప్రకటించినా కడు దరిద్రులైన రైతులు సైతము అతడికి సహాయపడడానికి సిద్ధపడలేదు. తమ నేతలకు ద్రోహం చేయడం సంగతి సరే- ఆంగ్లేయులకు ఖరీదుకు సరుకులు అమ్మడంకూడా ఆ రోజులలో పాపముగా భావింబడ్డది. అలాంటి పాపం ఎవరైనా చేస్తే సంఘం వారికి కఠిన శిక్ష విధిం

చేది. జాతీయము, సైనికము నైన ఈ బహిష్కరణ ప్రకటింపబడగానే ఆంగ్లేయులు పడ్డ పాట్లకు అంతులేకుండా పోయింది. వారు అలహాబాద్ కోటను వశము చేసుకున్నమాట నిజమే. కాని ఒక అడుగు ఇటుగాని అటు గాని కదిలేందుకు వీలులేని పరిస్థితి. వారికి ఒక బండిగాని, ఎద్దుగాని దొరికేదికాదు. మందుకూడా దొరికేదికాదు. రోగగ్రస్తులైన ఆంగ్లేయులకు డోలీలు మోసేవారు కూడా దొరకలేదు. అనేక చోట్ల ఎందరో వారి రోగులు పడిఉన్నారు. వారి ఆర్తనాదాలు కొందరు ఆంగ్లవనితల ప్రాణాలే హరించాయి. ఎండల రోజులు వచ్చాయి. ఆంగ్లేయులు ఎండలలో మల మల మాడి కూడా మరణించాలని జూన్ నెలలో విప్లవకారులు తమ ఎత్తు గడను మరింత తీవ్రం చేసినట్లు తెలిసింది. తెల్లవారు చల్లనీళ్ళతో తలలు తడుపుకుంటున్నారు! పైగా తిండిగింజలు తగ్గిపోతున్నాయి. ఆంగ్లేయులకు గింజ అమ్మేవారు కానరావడంలేదు ఈ వేడి, ఈ ఆకలి మంటలతో ఆంగ్లేయుల శిబిరంలో కలరా వ్యాపించింది. దీనికితోడు ఆంగ్ల సైనికులు రోజూ త్రాగుడొకటి పెట్టుకున్నారు. వారిలో క్రమశిక్షణ అంతా భగ్నమై పోయింది. ఈ త్రాగుబోతులు నీల్ ఆజ్ఞలను కూడా ధిక్కరించేవారు. వీరిలో కొందరిని ఉరి తీస్తానని నీల్ కానింగుకు వ్రాసేవరకు పరిస్థితి వెళ్ళింది. ఇన్ని కడగండ్ల మధ్య ఉన్న ఆంగ్ల సైన్యం అలహాబాదు నగ రాన బంధింపబడి ఉన్నది. కాన్పూర్‌లోని ఆంగ్లేయులు తమ రక్షణకు రమ్మని ఎన్నిమారులు కోరినా నీల్ వంటి చొరవగల అధికారికి కూడా జూలై ఒకటివరకు అలహాబాదు వదలడం సాధ్యం కాలేదు.

విప్లవకారులపై నీల్ ద్వేషం ఉరితీతలతోను కాల్పులతోను ఆగి పోలేదు; అతడు స్త్రీలను, పురుషులను, పిల్లలను, యువకులను, వృద్ధులను, పాలు త్రాగే పసికందులను కూడా అగ్నికి ఆహుతి చేశాడు. ప్రత్యేకంగా అమలు జరిగిన శిక్షలలో ఆరు వేలమంది భారతీయులు చంపివేయబడ్డారు. కాని ఆంగ్ల చరిత్రకారులు అతడిలోని మృగత్వాన్ని విస్మరించి నీల్‌ను గురించి ఘనంగా వర్ణించుకున్నారు!

# కాన్పూర్ : ఝాన్సీ

మీరట్ విజృంభణ సమయంలో నానాసాహెబ్ భవనంలో అనేక మంది విప్లవకారులు సమావేశమైనారు. లక్నో రాజభవనంలోను, బెరిల్లి సభలోను, చివరకు ఢిల్లోని దివాన్-ఇ-ఖాస్‌లోను ఉన్న విప్లవవీరులందరి మొత్తం కన్నా వీరు ఎక్కువమంది. 1857 మహావిప్లవయోజన ఆ బ్రహ్మ వర్తభవనములో జరిగినది.

అచ్చట, బ్రహ్మవర్తములో ఒక విప్లవసమితి కూర్చున్నది. సభా పతి స్థానంలో నానాసాహేబ్ హుందాగా కూర్చుని ఉన్నాడు. ఆయన సోదరులు బాబాసాహెబ్, బాలాసాహెబ్, ఆయన మేనల్లుడు రావుసాహెబ్ లక్ష్యసాధనకై సుఖసంపదలను, ప్రాణములను అర్పించేందుకు సంసిద్ధ తతో అక్కడే ఉన్నారు. వీరితోపాటు అజీముల్లాఖాన్. అంతేగాక స్వయం స్ఫూర్తితోనూ, మాతృదేశ గౌరవముల ఎడ తన అనంత ప్రేమతోను స్ఫూర్తి సందిస్తూ, విప్లవనేతలకు సహాయంగా ఉన్న ఝాన్సీ లక్ష్మీ బాయితో సహా అక్కడే కూర్చొని ఉన్నారు. శివాజీ సంప్రదాయమునకు చెందిన మహారాష్ట్ర వీరుడగు తాత్యాతోప్ కూడా అక్కడే ఉన్నాడు.

తాత్యాతోప్ 1814 లో జన్మించాడు. ఆయన తండ్రి పేరు పాండు రంగభట్. అతను దేశస్థ బ్రాహ్మణుడు. బ్రహ్మవర్తములో బాజీరావు

పీష్వా క్రింద దానశాఖాధిపతిగా ఉండేవాడు. పాండురంగరావ్ తోప్, నానా సాహెబ్, ఝాన్సీరాణి, తాత్యాతోప్‌లు బాల్యక్రీడలు సలిపింది ఆ వసార లోనే. నానాసాహెబ్, తాత్యాతోప్‌లు రామాయణ మహాభారతములను కలిసి చదివిన దక్కడే. అక్కడే వారు మహారాష్ట్ర వీరుల సమర సాహస చర్యంసుగురించి పఠించినది. హైందవ వీరగాథలు జాగృతపరచే ఉదాత్త భావాలతో ఆ బాలుర హృదయాలు నిండిపోయినవి.

రహస్య సంఘటనా కార్యకలాపాలను ఐక్యతా సూత్రముతో బంధించేందుకు ఏప్రిల్ మాసాంతములో నానాసాహెబ్, అజీముల్లాఖానులు ఉత్తర భారతమందలి ప్రధాన నగరములన్నీ పర్యటించారు. వారంతా నిర్ణీత సమయానికి ఎదురు చూస్తున్నారు. ఇంతలో హఠాత్తుగా మే 10 వ తేదీన మీరట్ విప్లవవార్త, అనంతరం ఢిల్లీ విముక్తి వార్త కాన్పూరుకు చేరాయి. బ్రహ్మవర్త రాజభవనం పరిస్థితిని అర్థము చేసుకున్నది. మీరట్ విజృంభణను ఉపయోగించుకొనాలని నిర్ణయించింది. అయితే అలా ఉప యోగించుకొనడానికి ఉత్తమ మార్గమేది? వెంటనే ఢిల్లీని అనుసరించడమా? లేక మూల పథకం ప్రకారం జూన్ మొదటి వారము వరకు ఆగి ఉండ డమా? ఈ రెండింటిలోను వేచి ఉండడమే మంచిదని భావించి, ఆ ప్రకా రము బ్రహ్మవర్తములోని విప్లవ యంత్రాంగము రహస్యముగానే పని చేయజొచ్చింది.

కాన్పూరు చాలాకాలము ఆంగ్లేయుల ప్రధాన సైనిక కేంద్రము. అక్కడ 1 వ, 53 వ, 56 వ పదాతి దళాలు, సిపాయీ అశ్వికదళము ఉండేవి. మొత్తం మూడువేలమంది భారతీయ సైనికులు ఉండేవారు. అశ్వికదళమంతా ఆంగ్లేయుల అధికారములో ఉండేది. పైగా వందమంది ఆంగ్లసైనికులు కూడా ఉండేవారు. ఈ సైన్యమంతటికి ప్రధానాధికారి సర్ హుగ్‌వీలర్, చాలా అనుభవజ్ఞుడు. కీర్తిగాంచిన సైన్యాధిపతి.

మే 15 వ కాన్పూరు నగరమంతటా ఒక విచిత్రమైన ఆందోళన కానవచ్చింది. మీరట్ సిపాయి చర్యలనుగూర్చి వినగానే, కాన్పూర్‌లోని వారి మిత్రులు కొంచెము కంగారుపడ్డారు. అయితే ఆంగ్లేయాధికారులకు ఈ వార్త 18 వ తేదీవరకు తెలియదు. ఢిల్లీకి తంతితీగలు త్రెంపివేయ బడడంవలన ప్రజలలోని అసంతృప్తి ఎంత తీవ్రంగా ఉన్నదీ సరియైన సమాచారం తీసుకొని రావడానికి సర్ హగ్‌వ్హీలర్ వార్తాహరులను పంపాడు. వీరికి దారిలో ఒక సిపాయి ఎదురైనాడు. కాని అతడు ఫిరం గీలకు సమాచారమందీయ నిరాకరించాడు. తంతీసౌకర్యాలన్నీ చేతనుంచు కున్న ఆంగ్లేయాధికార్లు ఏ సమాచారము తెలియక అంధకారమునందుండగా 1857 లో సిపాయీలలో వార్తలంత త్వరత్వరగా ఎలా అందుతున్నది ఆంగ్లేయాధికార్లకు అంతుచిక్కని ఆశ్చర్యమైంది. మీరట్ విజృంభణకు సంబంధించిన వార్త విన్న తర్వాతనే ఆంగ్లేయులు కాన్పూరు సిపాయీల రహస్య ఆందోళనకు సంబంధించి కొంచెము అలోచించారు.

కాన్పూరు నగరంలోను, సిపాయి శిబిరంలోనూ ప్రతివారు ఆంగ్లే యులకు అంతిమ ఘడియలు వచ్చాయనుకున్నారు. హిందువులు, ముస్లి ములు పెద్ద పెద్ద సమావేశాలు జరిపారు. సిపాయీలు రహస్య సమా వేశాలు జరిపారు; అధ్యాపకులు, విద్యార్థులు విప్లవాన్ని గురించి చర్చిం చారు. బజారులోని ప్రతివారు బహిరంగంగానే పథకాలను గురించి మాట్లాడుకునేవారు.

ఒక ఆంగ్ల వనిత ఏ బజారుకో వెళ్ళి తన మామూలు పద్ధతిలో దురుసుగా మాట్లాడుతూంటే ''ఇక ఈ దురుసుతనం తగ్గించుకోండి. మీకు హిందూస్థాన్‌లో నేటికి ఋణం తీరిందని తెలుసుకోండి'' అని ఏ దారినపోయే వ్యక్తో అనేవాడు. ఆంగ్లేయులకు మొదట ఈ పద్ధతిలో కనువిప్పు కలిగింది. పరిస్థితులు ఈ విధంగా పరిణమిస్తున్నప్పుడు ఊర్ధ్వ

కొనడం ప్రమాదకరమని భావించి సర్ హగ్ రక్షణకు ప్రయత్నాలు ప్రారంభించాడు.

అతడి మొదటి ఆలోచన—ప్రమాదం సంభవిస్తే తల దాచుకొన వలసింది ఎక్కడ? అనేది. గంగానదికి దక్షిణాన సిపాయి పంక్తులకు దాపున ఒక స్థలము ఎన్నిక చేశాడు. కందకములు త్రవ్వి, తుపాకులు ఫిరంగులకు స్థలము ఏర్పరచి దుర్గపు వసతులు ఏర్పాటు చేశాడు. వీలర్ ఈ ఏర్పాట్లతో సంతృప్తి పడలేదు. దృఢమైన రక్షణ దళాలను శీఘ్రముగా పంపవలసిందని లక్నోలోని సర్ హెన్రీ లారెన్సుకు లేఖలు వ్రాశాడు. లారెన్సు వెంటనే 85 గురు ఆంగ్లసైనికులను, లెఫ్టినెంట్ యాష్ క్రింద ఒక ఫిరంగి దళాన్ని, కొంత అశ్వికశక్తిని కాన్పూరుకు పంపాడు. వీలర్ మరొక అడుగు ముందుకువెళ్ళి బ్రహ్మవర్తరాజాగారిని వచ్చి కాన్పూరును రక్షించవలసిందిగా కూడా కోరాడు. బ్రహ్మవర్త రాజా తనకు ఎదురు తిరిగేవ్యక్తి అని అతడు కలలోకూడా ఊహించుకో లేదు. నానాసాహెబ్‌కు ఇంతకన్నా గొప్ప అవకాశమేమి ఉంటుంది? ఆయన 22 వ తేదీన రెండు తుపాకులను తీసుకొని పదాతి అశ్విక దళా లకు చెందిన 200 మంది అంతరంగిక సిపాయీలను వెంటనిడుకొని కాన్పూర్‌లో ప్రవేశించాడు. కాన్పూర్‌లో అప్పుడు సివిల్, మిలిటరీ ఆఫీసర్లు ఆంగ్లేయులు చాలామంది ఉండేవారు. నానా ఈ ఆంగ్లేయుల మధ్యనే తిష్ఠ వేశాడు. విప్లవకారులు ఖజానాపై దాడి చేస్తారుగనుక వెంటనే నానా అను చరులకు ఖజానారక్షణ బాధ్యత అప్పగించబడింది. కలెక్టర్ హిల్లర్డ్‌సన్ నానాసాహెబ్‌కు, తాత్యాతోపేలకు ఎంతగానో కృతజ్ఞత వెల్లడించాడు. అవసరమైతే ఆంగ్లేయ కుటుంబాలు బ్రహ్మవర్తములోని నానాసాహెబ్ భవనంలోనే తలదాచుకుంటారని కూడా సూచించారు. తమ భద్రత అంతా విధేయులు, విశ్వాస పాత్రులకు అప్పగించామని ఆంగ్లేయులు నిబ్బరపడ్డారు.

కాన్పూర్‌లోని రహస్య సంఘాలకు ప్రధాన కేంద్రము సుబేదార్ టిక్కాసింగ్ నివాసం. రహస్య సంఘాల మరొక సమావేశ స్థానం సైనిక నేత షంసుద్దీన్‌ఖాన్ గృహము. ఇచ్చటి సమావేశాలకు నానాసాహెబ్ తరపున బ్రహ్మావర్త భవనానికి చెందిన జ్వాలాప్రసాద్, మహ్మదాలీ అనే విశ్వాసనీయులగు సేవకులిద్దరు హాజరవుతుండేవారు. ధైర్యవంతులు, స్వేచ్ఛా పిపాసులు, నిష్కల్మష దేశభక్తులునగు సుబేదార్ టిక్కాసింగ్, జ్వాలాప్రసాద్‌లు అచిర కాలములో ఆ సమావేశములందు ప్రముఖులైనారు. సైనికులందరు వారి ఆజ్ఞకు విధేయులై యుండుటకు ప్రతిన బూనారు. ముఖ్య విషయాలను నిర్ణయించేందుకు అట్టి నేతలు, నానా సాహెబ్ వ్యక్తిగతముగా కలిసికొనుట అవసరము. పైగా మీరట్ విజృంభణ అనంతర కల్లోలముతో మొందనుకున్న పథకము వ్యర్థమైనది. అందువల్ల మారిన పరిస్థితుల కనుగుణముగా నూతన పథకముల యోచించుట ఆవశ్యకమైనది. జూన్ ఒకటవ తేదీ సాయంత్రము నానాసాహెబ్, తన సోదరుడగు బాలాసాహెబ్, మంత్రి అజీముల్లాఖాన్‌లతో పవిత్ర గంగానదీ తీరానికి వచ్చాడు. అక్కడ సుబేదార్ టిక్కాసింగ్, రహస్య సంఘాల నాయకులు వీరి కోసం వేచి ఉన్నారు. అందరూ కలిసి ఒక నావ నెక్కారు. పవిత్ర గంగా జలంలో ప్రవేశించారు. పవిత్ర జలమును చేత ధరించి దేశ స్వాతంత్ర్యానికై రక్తార్పణ చేయగలమని ప్రతిజ్ఞలు చేశారు. ఆ తర్వాత రెండు గంటలసేపు గంభీరమైన చర్చలు జరిపి ఒక స్పష్టమైన కార్యప్రణాళికను నిర్ణయించుకొని తిరిగి వచ్చారు. వారి రహస్యాలు ఆ గంగా మాతకు మాత్రమే తెలుసు. ఆమె చేతిలో వారికి అంతా భద్రమే! సర్వులకు ఇంతవరకు తెలుసు: ఆ మరునాడు షంసుద్దీన్ తన ప్రియమైన అజీజాన్ వద్దకువెళ్ళి ఆమెతో 'మరి రెండు రోజులలో ఫిరంగీలు సర్వనాశనము చేయబడి భారతము విముక్త మవుతుంద' ని చెప్పాడు! షంసుద్దీన్ ఆమెతో ప్రగల్భములు పలకలేదు. ఆమె హృదయం

షంసుద్దీన్ కోసం ఎంతగా తపించిపోయేదో, భారత స్వాతంత్ర్యము కోసం కూడా అంతగా తపించిపోయేది. ఆమె ఒక నాట్యకత్తె. సిపాయీలు ఆమె నెంతగానో అభిమానించేవారు. ఆమె ప్రేమను బజారులో అమ్ముకొన లేదు. స్వతంత్ర సమర రంగములో దేశభక్తికి కానుకగా అర్పించింది.

అటు విప్లవకారుల పథకాలు పక్వమవుతుండగా ఆంగ్లేయ శిబిరంలో వర్ణనాతీతమైన భయం వ్యాపింప జొప్పింది. లక్నో నుండి దృఢమైన సాయుధ బలాలు చేరిన తర్వాతను, ఖజానా ఆయుధాగారాలను నానా సాహెబ్ రక్షణకు అప్పగించిన తరువాతను సర్ హుగ్‌వ్హీలర్‌కు కాస్త ఊపిరి సలిపింది. కాని ఆంగ్లజనులు మాత్రం పూర్తిగా ధైర్యము కోల్పోయి నారు. మే 24 న ఈద్ పండుగ. ఆనాడు విప్లవం చెలరేగుతుందని ప్రతి నగరంలోను ఆంగ్లేయులంతా భయపడ్డారు. కాని అలా తేలికగా గుర్తించ దగిన దినాన విప్లవం ప్రారంభించడానికి విప్లవనేతలు మతిలేనివారుకాదు. శత్రువు ఊహించలేని దినాన విప్లవాన్ని ప్రారంభించడం విప్లవ విజ యానికి ఒక ప్రధాన సాధనం. అందువల్ల కాన్పూర్‌లో సైతం ఈద్ రోజున అశాంతి చిహ్నాలు ఏమాత్రం కనిపించలేదు. బ్రిటీష్‌వారు మాత్రం పూర్తిగా హడలిపోయి సర్ హుగ్‌వ్హీలర్ ''నేడు తప్పకుండా తిరుగుబాటు జరుగుతుంది'' అని లక్నోకు తంతికబురు పంపాడు. కాని ఆ సాయంత్రం ముస్లింలు మామూలుగానే సంచరించేసరికి మళ్ళీ స్థిమితపడ్డాడు.

ఒకరోజు సాయంత్రం ఒక ఆంగ్లయువకుడు తప్పత్రాగి ఒక సిపాయిపైకి తుపాకి పేల్చాడు. గుండు తగలలేదు, కాని సిపాయి ఫిర్యాదు చేశాడు. మామూలు పద్ధతి ప్రకారం- అతడు త్రాగి ఉన్నందున తుపాకి అదుపు తప్పిందని తీర్పువచ్చింది. ఈ అవమానంతో లస్కర్ అంత కోపంతో ''అయితే త్వరలో మా తుపాకులుకూడా అదుపు తప్పు తాయి'' అని గొణిగింది. సిపాయీలలో ఈ మాటలు ఒక నినాదంగా

మారాయి. వారు ఒకరినొకరు కలిసినప్పుడు సరదాగా "మన తుపాకులు అదుపు తప్పాలి. అంతే కదూ!'' అనుకునేవారు. ఈ మారిరి హాస్యాభి వందనం సిపాయీలలో మామూలైంది. అయితే తమ కోపాన్ని మాత్రం అణుచుకొనే ఉంచుకొనడానికి, మీరట్‌లోవలె నిర్ణీత సమయానికి ముందుగా తొందరపడకుండా ఉండడానికి నిర్ణయించుకున్నారు.

జూన్ 4 వ తేదీ రాత్రి ఈ నిశ్శబ్దం బ్రద్దలైపోయింది. అనుకున్న ప్రకారం అర్ధరాత్రివేళ మూడు తుపాకి మ్రోతలు వినిపించాయి. ముందే నిర్ణయించుకొనబడిన భవనాలు క్షణంలో ధ్వంసమైపోయినాయి. రక్త పాతం, విధ్వంసము, మృత్యు తాండవము ప్రారంభమైన క్షణమది. ముందు టిక్కాసింగ్ గుఱ్ఱం చెంగున దూకింది. వెనుకనే వేలగుఱ్ఱాలు చెంగుచెంగున దూకాయి. అతిచురుకుగా అన్నీ దౌడు తీశాయి. కొందరు ఆంగ్లేయుల నివాసాలు, అశ్వశాలలు దగ్ధం చేయనారంభించారు. కొందరు అన్య సైనికులను పిలిచేందుకు వెళ్ళారు. మరికొందరు సైనిక పతాకాలను గుంజి వేసేందుకు వెళ్ళారు.

''మొదటి పదాతి దళ సుబేదార్‌కు సుబేదార్ టిక్కాసింగ్ ప్రణామ ములు. అవతల ఆశ్విక దళాలు ఫిరంగీలపై విరుచుకుపడగా మీ పదాతి దళ మెందుకు జాప్యం చేస్తున్నదో అతడు తెలుసుకొనగోరుతున్నాడు''- చీకటిని చీల్చుకుంటూ ఇద్దరాశ్వికులు ప్రశ్నించారు: వెంటవే ''దీన్! దేశ్!'' నినాదాలతో ఆ ప్రథమ దళం విజృంభించింది. దాని నాయకుడు కలనల్ ఈవర్ట్ గగ్గోలుపడి ''ఇదేమిటోయ్, ఇదేమిటి? ఆగండి, మీ విధేయత కిది మాయని మచ్చ, ఆగండి బాబూ, ఆగండి'' అంటూ వెంటబడ్డాడు. అతడి మాటలు వింటూ సిపాయీలు సమయం వృధా చేయదలచలేదు. ఒక్క నిముషంలో దళమంతా సైనిక సంచలనంతో ఆశ్వికదళాన్ని చేరేం దుకు బయలుదేరింది. ఈ సైన్యమంతా సైనిక ఫోష్ వాద్యాలతోను, వీర

గీతాలతోను నవాబ్‌గంజ్‌లోని నానాసాహెబ్ నివాసానికి వెళ్ళింది. అక్కడ ఖజానావద్ద నానాసాహెబ్ సిపాయీలు సిద్ధంగా వున్నారు. పరస్పరం అభినందించుకున్నారు. వెంటనే అమూల్యమైన ఆ ధనాగారము, ఆయుధాగారము విప్లవవీరుల వశమైపోయింది. నవాబ్‌గంజ్‌లో యిది జరుగుతుండగా, కాన్పూర్‌లో ఇంకా రెండు సైనిక దళాలు మిగిలి పోయాయి. వాటిని తమచేతిలో ఉంచుకునేందుకు ఆంగ్లేయులు వారిని మైదానములోనికి పిలిచారు. సాయుధ దళాలను చేతిక్రిందకు తెచ్చుకొని వారిని ఇళ్ళకు వెళ్ళి పొమ్మన్నారు. ఆంగ్లాధికారులుకూడా తిరుగు ముఖం పట్టారు. సిపాయీలు ఇది మంచి అదననుకున్నారు. ఒకమూల ఇద్దరు ప్రముఖులు ఏదో గుసగుసలాడుకున్నారు. అందులోనుండి ఒకరు హఠాత్తుగా ముందుకుదూకి "రండి, లేవండి, దేవుడు ధర్మపక్షాన ఉన్నాడు" అని పిలుపు నిచ్చాడు. దీనితో అన్ని వైపులా కత్తులు తళతళలు మెరిశాయి. రానున్న ప్రళయాన్ని గుర్తించి తుపాకిదళం కాల్పులు ప్రారంభించింది. అయితే సిపాయీలు అప్పటికే దాని పరిధి దాటి పోయినారు. అప్పుడు తలచుకొన్నట్లయితే సిపాయీలు తమ అధికార్లను హతం చేయగలిగి ఉండేవారే. కాని వారలా చేయకుండా, ముందు తోడి విప్లవ వీరులను కలిసేందుకు వెళ్ళారు. ఆ విధంగా జూన్ 5 వ తేదీన నానాసాహెబ్ చేతిక్రింద మూడువేలమంది సిపాయీలు శిబిరము చేసియున్నారు.

ఆ సమయంలో నవాబ్ గంజ్‌లో సమర్థులు, ధైర్యవంతులునైన విప్లవనేతలకు కొదువలేదు. నానాసాహెబ్ అక్కడ ఉన్నాడు. అతడి సోదరులు బాలాసాహెబ్, బాబాసాహెబ్‌లు, మేనల్లుడు రావ్‌సాహెబ్ అక్కడే ఉన్నారు. తాత్యాతోప్, అజీముల్లాఖాన్‌లుకూడ అక్కడే ఉన్నారు. అలాంటి చతురులు, మేధావంతులు అక్కడేవుండగా సిపాయీలు నేతల కోసం ఢిల్లీవెళ్లే అవసరమేమున్నది? కేవలం ఢిల్లీలో ఉన్న అవకాశాలన్నిటినీ

పూర్తిగా వాడుకోవడం అంత మంచిది కూడా కాదు. బ్రిటిష్‌వారిని వివిధ స్థానాలలో గిజాటుపెట్టడమే విజయప్రదమగు పద్ధతి. అన్నిటినీ మించి-పంజాబు, ఢిల్లీ, కలకత్తాల మధ్య సమాచార సంబంధాలకు కేంద్రం కాన్పూరు అయినందువల్ల కాన్పూరును దెబ్బతీసి, వశంచేసుకొనడం చాలా ముఖ్యం. సుబేదారు ప్రతినిధులు, నానాసాహెబ్ ప్రతినిధులు సిపాయీలకు ఈ విషయాన్ని నచ్చచెప్పిన తరువాత అందరూ కాన్పూరువైపు మళ్ళేరు. మూడు వేల మంది రాత్రంతా మైదానంలో తుపాకులు పుచ్చుకొని నిలబడి వున్నారు. వీరు తిరుగుబాటు ధోరణిలో లేరని ఆంగ్లేయాధికార్లు భావించారు. వారంతా నానాసాహెబ్‌ను రాజుగా స్వీకరించినట్టివారు. నానాసాహెబ్ దర్శనానికి వారికి అనుమతి యీయబడినది. నానాసాహెబ్ దర్శనం కాగానే బ్రహ్మానందముతో జయఘోషలు చేసి, రాజమర్యాదలు, గౌరవాభినందనములు చేశారు. ఆయన ఎన్నిక పూర్తికాగానే సిపాయిలు ఆయన అనుమతితో అన్యఅధికార్లను ఎన్నుకున్నారు. కాన్పూరు విప్లవ కేంద్రానికి జీవనాడియగు సుబేదారు టిక్కా-సింగ్‌ను ప్రధాన ఆశ్విక దళాధిపతిగా ఎన్నుకున్నారు. ఆయనను ''జనరల్'' బిరుదంతో సన్మానించారు. కొత్త సైనిక నిబంధనలు ప్రకటింపబడ్డాయి. జమాదార్ దల్‌గంజన్‌సింగ్ 63వ దళానికి, సుబేదార్ గంగాదీన్ 56వ దళానికి కలర్నల్స్‌గా నియమింపబడ్డారు. ఆ తర్వాత స్వేచ్ఛాపతకానికి గజోత్సవం, ఊరేగింపు జరిగింది. అప్పుడే నానాసాహెబ్ పరిపాలన ప్రారంభమైనట్లు ప్రకటింపబడ్డది.

ఈ ఎన్నికల తర్వాత నానాసాహెబ్ ఒక్క క్షణంకూడా వృథాచేయలేదు. సిపాయీలు ఢిల్లీ వెళ్ళలేదని, దారిలోనే ఆగారని సమాచారం వినగానే ఆంగ్లేయులు తమ దుర్గంలోనికి వెళ్ళి తుపాకులతో సిద్ధంగా ఉన్నారు. ఆ దుర్గాన్ని ముందు ఆక్రమించడం అతి ముఖ్యం. అందువలన నానా

సాహెబ్ సైన్యమునంతను అటువైపు పురోగమించవలసినదిగా ఆజ్ఞాపించాడు. విప్లవవీరులు తమపై దాడిచేస్తారని ఆంగ్లేయులు గట్టిగా అనుకోలేదు. కాని ఆరవ తేదీ ఉదయం సర్‌హగ్‌కు ఒక చిన్నపత్రం అందింది. అది నానాసాహెబ్ నుండి వచ్చింది. అందులో ఇలా ఉన్నది: ''మేము ఆక్రమణ ప్రారంభిస్తున్నాము. మిమ్ము ముందుగా హెచ్చరించ వలిచాము. అందువల్లనే ఈ పత్రం పంపబడుతున్నది.'' ఈ సమర ఆహ్వానం అందగానే హగ్ తన సైన్యాలను, అధికార్లను సిద్ధం చేసుకున్నాడు.

ఆక్రమణ పథకం అద్భుత సైనిక నైపుణ్యముతో రచింపబడ్డది. అదే సమయంలో కాన్పూరు మహానగరంకూడా తుములమై ఉంది. కత్తులు చేసేవారు, నేతపనివారు, బజారులోనివారు, ముస్లిములు; వెండి, బంగారు నగల వర్తకులు-అందరూ చేతికందిన ఆయుధాన్ని పుచ్చుకొని ఆంగ్లేయులను హతమార్చేందుకు యెదురుచూస్తున్నారు. ఆఫీసులు, కోర్టులు, పాత కొత్త రికార్డులు అన్నీ దగ్ధం చేయబడ్డాయి. దుర్గానికి చేరడం విస్మరించిన ఆంగ్లేయులు హతులై పోయినారు. మధ్యాహ్నమైంది. ఒంటిగంట ప్రాంతానికి దుర్గం చుట్టుముట్టబడ్డది. సాయంత్రం వేళకు తుపాకిప్రేలుళ్ళు మొదలైనాయి, దాడి ప్రారంభమైంది.

ఆంగ్లేయులకు 8 ఫిరంగులున్నాయి. అనంత సంఖ్యలో ఆయుధాలను భూమిలో దాచి ఉంచుకున్నారు. విప్లవ వీరులకు కూడా ఆయుధాల కొరతలేదు. పెద్ద తుపాకులను, ఆయుధగారాన్ని స్వాధీనం చేసుకొని ఉన్నారు. జనరల్ టిక్కాసింగ్ మొదటినుండి ఆయుధగారాన్ని సంసిద్ధంగా ఉంచుకున్నాడు. దుర్గంలోని ఆంగ్లేయ నిర్మాణాలను నానాసాహెబ్ తుపాకులు ధ్వంసం చేసివేశాయి. 7 వ తేదీన విప్లవవీరుల ఆయుధాలు మరింతగా విజృంభించడంతో, అంతవరకు అట్టి పరిస్థితిని అనుభవించని ఆంగ్లేయుల స్త్రీలు, బిడ్డలు భీతావహులై రోదన చేసుకుంటూ అటునిటు పారిపోజొచ్చారు. కొంత సేపయ్యేసరికి ఆ భయం కూడా అడుగంటి

పోయింది. నెత్తిమీదగుండా వెళ్తున్న తుపాకీ గుండ్లను పైన ఎగిరే పక్షులను చూచినట్లు చూస్తున్నారు. దాడి ప్రారంభమైన మూడవ రోజునుండి దుర్గంలో నీటికొరతకూడ ప్రారంభమైంది. దుర్గంలో ఉపయోగించే బావి ఒకే ఒకటి ఉన్నది. దానిమీద ఆంగ్లేయుల కన్నుకన్నా, విప్లవకారుల కన్ను ఎక్కువ తీక్షణంగా పడ్డది. వడదెబ్బకే ఆంగ్లేయులు మరణించేంత ఎక్కువగా వేడి ఉన్నది. తన అనుభవాన్ని వర్ణిస్తూ కాప్టెన్ థామస్ అంటాడు: "ఆర్మ్‌స్ట్రాంగ్ గాయపడి పడివుండగా లెఫ్టినెంట్ ప్రోల్ అతణ్ణి చూడడానికి వచ్చాడు. రెండు సానుభూతి మాటలు పలికీ పలకకమునుపే విప్లవ వీరుల తుపాకీగుండు అతని తొడను ఛేదించుకుంటూ పోయింది. అతడు నేలకూలాడు. అతడి చేయిని నా భుజంపై వేసుకొని, నా చేయిని అతడి నడుముకు చుట్టి నేను అతణ్ణి సార్జంటు వద్దకు తీసుకుని వెళుతున్నాను. నేను నాలుగడుగులు వేశానోలేదో ఒక తుపాకిగుండు బజ్ మనుకుంటూ వచ్చి నా భుజమును ఛేదించుకు పోయింది. ప్రోల్, నేను క్రింద పడ్డాము. గిల్బర్ట్ బక్స్ మావైపు పరుగెత్తుకువచ్చాడు. శత్రువు తుపాకిగుండు అతణ్ణి వెంటాడింది. శరీరంగుండా దూసుకుపోయింది." ఒక గంటసేపులో జరిగిన ఈ తతంగమంతా, ఆ 21 రోజులలోని పరిస్థితి ఎటువంటిదో వ్యక్తం చేస్తుంది. సర్ హగ్ యొక్క కుమారుడు గాయపడి ఉండగా అతని చెల్లెండ్రిద్దరు, తల్లి, ఒక గదిలో అతనికి పరిచర్య చేస్తున్నారు. అతడు మందు మ్రింగబోతుండగా గదిలో బ్రహ్మాండమైన ప్రేలుడు వినిపించింది. తృటిలో ఒక ఫిరంగి గుండు అతని తలను ఛేదించుకుంటూ పోయింది. మేజిస్ట్రేట్ హిల్లర్స్‌డెన్ భార్యతో మాట్లాడుతుండగా 20 పౌనుల ఫిరంగి గుండొకటి అతడి తలను ముక్కలుచేసి పోయింది. కొద్దిరోజుల తర్వాత అతడి వితంతువు ఆనుకొని ఉన్న గోడ కూలి ఆమె దేహం చాలించింది.

కలరా, టైఫాయిడ్, రక్తవిరోచన వ్యాధులుకూడా ఆంగ్లేయులపై కసి తీర్చుకొనడంలో వెనకబడలేదు. సర్ జార్జి పార్కర్, కలనల్

విలియమ్స్, లెఫ్టెనెంట్ రూని మున్నగువారంతా రోగముల వాతబడి మరణించారు. అటు రోగములను, ఇటు తుపాకులను తప్పించుకున్నవారు జరుగుతున్న కాండనుచూచి పిచ్చెత్తిపోయారు. ఆ బీభత్స మట్టిది.

విప్లవకారుల నిఘావల్ల ఆంగ్లేయులు ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపు కొనడం అసాధ్యమైపోయింది. అయినా ఒక భారత వార్తాహరుడు సర్ హగ్ హ్వీలర్ నుండి లక్నో వరకు ఒక లేఖను మోసుకుపోవడంతో కృతకృత్యుడైనాడు: "సహాయం! సహాయం కావాలి! సహాయం పంపండి. మేము చచ్చిపోతున్నాం. మమ్ము రక్షిస్తే, మీకు తోడ్పడగలం" అంటూ కొంచెం లాటిన్, కొంచెం ఫ్రెంచి, కొంచెం ఇంగ్లీషు భాషలలో, దీనంగా, పిట్ట అరుపులతో వెళ్ళిందా ఉత్తరం! అయితే ఆంగ్ల శిబిరంనుండి యిలాంటి వార్తాహరుడు బయల్దేరితే అతడు మళ్ళీ శిబిరాన్ని భద్రంగా చేరే ఆస్కారం లేనంతగా విప్లవకారుల నిఘావున్నది. విప్లవవీరులలో దేశద్రోహు లేమైనా దొరుకుతారేమోననే ఆశతో లక్షల రూపాయల పారితోషికాలతో ఆంగ్లే యులు విప్లవ శిబిరాలకు మనుష్యులను పంపేవారు. తిరిగివెళ్ళి కబురు చెప్పేందుకుకూడా యెవరూ మిగిలేవారుకాదు. ఉదాహరణకు అలాంటి వ్యక్తి ఒకడు చెప్పిన దిలా ఉన్నది: "షెఫర్ తన కూతురు, భార్య మరణించిన తరువాత విప్లవ శిబిరమునుండి రహస్యాలు సేకరించేందుకు, కాన్పూర్‌లో పేచీలు తెచ్చేందుకు ప్రయత్నించాడు. ఒక భారతీయ వంట వానివేషంలో అతడు బయలుదేరాడు. అతడు కొంచెం దూరమైనా వెళ్ళక ముందే నిర్బంధించబడి, నానాసాహెబ్ ముందు హాజరు పెట్టబడ్డాడు. ఆంగ్లేయుల పరిస్థితిని గురించి అడగగానే అతడు అంతా అద్భుతంగా ఉన్నదని వర్ణించనారంభించాడు. కాని తనకు పూర్వమే బంధింపబడిన వనితలిద్దరు వాస్తవాలను విన్నవించినట్లు తెలియగానే అతడు గగ్గోలుపడి పోయినాడు. అతడు వెంటనే ఖైదు చేయబడ్డాడు. జూలై 12 న అతడి విచారణ జరిగింది. అతడికి మూడేండ్ల కఠినశిక్ష విధింపబడ్డది."

ఆరవ తేదీన దాడి జరుగుతుందనే పత్రం పంపిన వెంటనే నానా సాహెబ్ తన మకామును దాడిచేస్తున్న సిపాయీలకు, జనరల్ టిక్కా సింగ్ నివాసానికి దగ్గరగా మార్చాడు. కాన్పూరు విముక్తంకాగానే ప్రాంత మంతటినీ విప్లవకెరటం ముంచెత్తింది. ప్రతిరోజూ క్రొత్త క్రొత్త జమీం దారులు, రాజాలు నానాసాహెబ్ బృందంలో చేర నారంభించారు. నానా కిప్పుడు దాదాపు నాల్గువేలదళం చేతిలో ఉన్నది. నానా క్రింద ఉన్న ఆయుధ బలగంలో అతినిపుణులు, అనుభవజ్ఞులునైన తుపాకి వేటగాం డ్రున్నారు. విప్లవకారులు దర్గాన్ని అగ్ని కాహుతి చేస్తుండగా ఒక సిపాయి ఒక కొత్త ఆయుధాన్ని కనిపెట్టాడు. ఆంగ్లేయులకు అతి ముఖ్య మైన పంక్తి యొకటి ఆ ఆయుధ ప్రయోగానికి మొదటి దెబ్బలోనే బూడిదై పోయింది. కాల్పులు చేయడంలో విప్లవవీరులు పోటీలు పడ్డారు. స్త్రీలు పురుషులకు, వృద్ధులు యువకులకు సహాయపడజొచ్చారు. దేశం కోసం ఏమీ చేయకుండా సోమరిగా కూర్చొనడం అనేది యువకులకేగాక యువతులకు కూడా ఒక పెద్ద కళంకముగా భావింపబడ్డది. దానితో కాన్పూరులోని యువతులందరు జనానాలు వదలి రణరంగంలోనికి దూకారు. అయితే వీరందరి శౌర్య ధైర్యాలు ఒక్క అజీజాన్ ముందు వెలవెలపోయినాయి. ఆమె ఇప్పుడు వీరవేషధారణం చేసింది. కెంపు బుగ్గలతో, చిరునవ్వులు చిందే పెదవులతో; చేత ఆయుధములు ధరించి అశ్వారోహణ చేసింది. ఆమె దర్శనము కాగానే సిపాయీలందరు తమ శ్రమను మరచిపోతుంటారు. నానక్‌చంద్ తన డైరీలో ఇలా వ్రాసు కున్నాడు : "ఆయుధముల ధరించిన అజీజాన్ మెరుపుతీగెలా ప్రతిచోట కానవచ్చేది: తరచు ఆమె వీధిలో నిలబడి అలసిపోయిన, గాయపడిన సిపాయీలకు పాలు, మిఠాయీలూ పంచిపెడుతుండేది."

ఈ విధంగా ఒకప్రక్క సమరము సాగుతుండగానే, నానాసాహెబ్ రెండవప్రక్క పౌరపాలనకు వీలున్న యేర్పాట్లన్నీ చేస్తున్నాడు. మొదట

నగరవాసులకు న్యాయము, రక్షణ కల్పింప సమకట్టాడు. కాన్పూరు పురప్రముఖులు పిలిపింపబడ్డారు. వారిలో అధిక సంఖ్యాకులచే ఎన్ను కొనబడిన హోలాస్‌సింగ్ అనేవారు చీఫ్‌మేజిస్ట్రేటుగా నియమింపబడ్డారు. క్రమవిరుద్ధంగా సంచరించే సిపాయీలనుండి, గ్రామీణ దోపిడీదార్లనుండి పౌరులకు హోలాస్‌సింగ్ రక్షణ కల్పించాలని నానాసాహెబు స్పష్టమైన ఆదేశమిచ్చాడు. సిపాయీలకు ఆహారపదార్థములను సరఫరాచేసే బాధ్యత ముల్లా అనే పౌరునికి వప్పగించబడినది. సివిలు, క్రిమినలు తగాదాలను పరిష్కరించేందుకు ఒక న్యాయస్థానము నెలకొల్పబడినది. జ్వాలా ప్రసాద్, అజీముల్లాఖాన్ తదితరులు న్యాయమూర్తులుగా నియమింప బడ్డారు. బాబాసాహెబు అధ్యక్షుడుగా నియమింపబడ్డాడు.

ఆంగ్లేయుల దుర్గముపై విప్లవవీరుల దాడి జరిగినది 12 వ తారీఖున. ఒక్కసారిగా దాడిచేసి దానిని వశము చేసుకొనడం కాకుండా, ఆంగ్లేయుల నన్నివైపులా గిజాటుపరచి వశము చేసుకొనడం విప్లవవీరులు స్వీకరించిన పద్ధతి. జూన్ 18 వ తేదీన వారు ప్రదర్శించిన ధైర్యసాహసము లత్యద్భుతములు. ఆ రోజున వారు శత్రు ఫిరంగులను నిర్లక్ష్యముచేసి, శరముల వలె శిబిరమువైపు పరుగులెత్తారు. గోడలెక్కి ఆంగ్లేయుల తుపాకి నొకదానిని వశము చేసుకొని ఆంగ్లేయులవైపుకు త్రిప్పారు. స్వాతంత్ర పతాకకు యిక అవనతి అనేది లేదనిపించిన దా క్షణమున. అట్టి ధైర్యవంతులగు సిపాయీలకు సాయము చేయుటకు బదులు కొందరు నిర్హేతుకముగా క్రమరాహిత్యమును, కల్లోలమును వ్యాపింపచేయుటకు ప్రతినబూనినట్లు ప్రవర్తించారు. ధైర్యవంతులైన ఔధ్ సిపాయీలు, కాన్పూర్ ధీరులు అన్యులేమి చేస్తారోనని యెదురుచూడకుండా వీరోచితముగా తమ విధి నిర్వర్తించారు. దాడిచేసిన సిపాయీలు మరలివస్తున్న రోజున ఒక సిపాయి అక్కడ మరణించినట్లుగా పడివున్నాడు. ధైర్యశాలి అని పేరు గాంచిన కెప్టెన్ జెంకిన్స్ మంచి విశ్వాసముతో స్వారీ చేసుకుంటూ

అక్కడికి వచ్చాడు. హఠాత్తుగా ఆ సిపాయి తన ఎదమీదకు దూకి కాల్చి వేశాడు.

జూన్ 23 వ తేదీ వచ్చింది. సరిగా వంద సంవత్సరాల క్రితం ఇదే రోజున ఆంగ్లేయులు ప్లాసీయుద్ధ రంగంలో వపు పాలనకు పునాదులు వేశారు. ఆ జూన్ 23 న ఆంగ్లేయులకు హిందూస్థానముపై దృఢమైన విజయం లభించింది. ఆ దుర్దినమున జరిగిన అవమానం హిందూస్థానపు హృదయమును దహించి వేస్తోంది. నూరేండ్ల తర్వాత కూడా ఆ దుర్దినపు జ్ఞాపకాలు భారతీయుల మనస్సులో స్పష్టంగా మెదలుతున్నాయి. 1857 జూన్ 23 న మాతృభూమి పగ తీర్చుకుంటుందని జోత్యిష్కులు భవిష్యత్తు చెప్పారు.

ఆ సదవకాశమును జారవిడువడానికి యిష్టములేని నానాసాహెబ్ శిబిరంలో జూన్ 23 న బ్రహ్మాండమైన సంరంభం జరిగింది. దళములన్ని మున్నెన్నడు జరగనంత భారీగా దాడిచేయడానికి సిద్ధమైనాయి. వారిలోని ధైర్యవంతులందరూ ఏకమై, ఆ నాడు విజయమో వీరస్వర్గమోపొంది తీర వలెనని ప్రమాణములు చేశారు— హిందువులు గంగాజల సాక్షిగాను, ముస్లీములు ఖురానుసాక్షిగాను. శత్రువుల తుపాకిదళముల లక్ష్యపెట్టకుండా విప్లవ వీరుల అశ్వికదళాలు ముందుకు త్రోసుకపోయి, గోడ లెక్కాయి. పెద్దపెద్ద దూదిబేళ్ళ మాటున పదాతిదళం రెండవ ప్రక్కగాచేరి దుర్గముపై గుండ్ల వర్షము కురిపించింది. ప్రక్క గ్రామముల వారుకూడా విప్లవవీరుల లోనికి వచ్చిచేరారు. దుర్గములో నుండి ఆంగ్లేయులు కూడా అగ్నిని వర్షించారు.

ఒక్కరోజు పోరాటము తర్వాత ఆంగ్లేయులు ఆశలు వదలు కొన్నారు. నిస్పృహ చెందారు. నానాసాహెబ్ ధాటినుండి కోటను రక్షించు కొనడం అసాధ్యమనుకున్నారు. 23 వ తేదీన కాకపోయినా 25 వ తేదీన కోటపై తెల్లజండాను చూపించారు. ఆ జండాను చూచిన తర్వాత నానా

సాహెబ్ పోరునాపు చేయించి తనవద్ద బందీగావున్న ఒక ఆంగ్లేయ వనిత చేత్రవాలుతో జనరల్ హ్వీలర్‌కు ఒక లేఖను పంపాడు. అందులో "విక్టోరియా రాణి ప్రజలకు డల్హౌసీ విధానముతో నిమిత్తము లేదని అంగీకరించువారు, తమ ఆయుధముల త్యజించి లొంగిపోవువారు అల్హాబాదుకు పంపబడుదురు" అని వున్నది. నానాసాహెబ్ ఆజ్ఞపై అజీముల్లాఖాన్ ఆ లేఖను వ్రాయించాడు. ఆ పత్రమందగానే దానిని పరిశీలించి నిర్ణయము చేయుటకు కెప్టెన్ మూర్, కెప్టెన్ వైటింగులకు జనరల్ హ్వీలర్ అధికారమిచ్చాడు. వారుభయులు నానాసాహెబ్‌కు లొంగిపోవడమే శ్రేయస్కరమని నిర్ణయించారు. మరునాడుదయం, 26 వ తేదీన నానాసాహెబ్ తరపున జ్వాలా ప్రసాద్, అజీముల్లాఖాన్, ఆంగ్లేయుల తరపున మోర్, వైటింగ్, రోష్‌లు కోటగోడలవద్ద కలిశారు. మొదట సంభాషణ ఆంగ్లములో ప్రారంభించారు, కాని వెంటనే జ్వాలాప్రసాద్, అజీముల్లఖాన్‌లు జాతి భాషయగు హిందూస్తానీలో మాట్లాడమని వత్తిడిచేశారు. ఆంగ్లేయులు ఆయుధాలను, ధనాగారాన్ని, ఆయుధశాలను నానాసాహెబ్ వశం చేయాలని, నానాసాహెబ్ ఆంగ్లేయులకు ఆహారపదార్థము లివ్వాలని, అల్హాబాద్ వెళ్ళనివ్వాలనే షరతులపై ఒడంబడిక జరిగింది. ఒడంబడిక కాగితముపై వ్రాయబడ్డది. దానిపై నానాసాహెబ్ సంతకము చేయించుటకు అజీముల్లాఖాన్ బృందం వెనుకకు మరలింది. ఆంగ్లేయులు ఆ రాత్రే బయల్దేరాలా లేక మర్నాడు ఉదయం బయల్దేరాలా అనే విషయముపై ఆ మధ్యాహ్నము చర్చవచ్చింది. నానాసాహెబ్‌కు ఆ రాత్రే సర్వమూ స్వాధీనము కావలెనని, ఆంగ్లేయులు మరునాడుదయము బయల్దేర వచ్చునని రాజీ నిర్ణయానికి వచ్చారు.

ఆ సాయంత్రము ఆంగ్లేయులు ఆయుధవిసర్జన చేశారు. తుపాకులు నానాసాహెబ్ స్వాధీనము చేయబడ్డాయి. బ్రిగేడియర్ జ్వాలాప్రసాద్, అతడి అనుచరులిద్దరు కోట బసలో చేశారు. ఆ రాత్రే కాన్పూర్ మేజస్ట్రేట్ హౌలాన్‌సింగ్ తాత్యాతోపె 40 నావలను సిద్ధంగా ఉంచమన్ని

పల్లెవారికి ఆజ్ఞ చేశారు. వాటిని పరిశీలించేందుకు ఏనుగులమీద వచ్చిన ఆంగ్లేయాధికార్లు ఆ నావలు మోటుగాను, అసౌకర్యముగాను ఉన్నాయని ఫిర్యాదు చేశారు. వెంటనే వందమంది పనివారిని పిలిపించి బొంగులతో ఆచ్ఛాదనను కట్టించి, గడ్డి మున్నగువానితో చక్కని మెత్త లేర్పరచారు. నావలనిండా ఆహార పదార్థములు చేర్చారు.

కాన్పూర్‌లో నానాసాహెబ్ స్వాతంత్ర్య పతాకను ఎగురవేశాడని వినగానే నలుమూలలనుండి కాన్పూరుకు వీరుల ప్రవాహాలు ప్రారంభమైనవి. ప్రతి ప్రాంతమునుండి యువక రాష్ట్రీయ స్వయం సేవకులు కాన్పూర్ చేరుతున్నారు. మనుష్యులను పంపలేని నగరాలు ధనమును పంపాయి. ఈ యువక స్వయం సేవకులేకాదు- ఆంగ్లేయుల బానిసత్వంతో విసుగెత్తిపోయి, విముక్తి పొందడానికి విఫలయత్నాలు చేస్తూ వచ్చిన అనేక మంది తండోపతండాలుగా కాన్పూరును నింపజొచ్చారు. వారణాసి, అల్హాబాద్‌లలో ఆంగ్లేయులు భారతీయులపైన, వారి భార్యాబిడ్డలపైన జరిపిన క్రూరచర్యల వార్తలతో అల్హాబాద్, వారణాసిలనుండి కూడా వేలాది సిపాయీలు వచ్చారు. తమ తండ్రులు '8' '9' అంకెల ఆకారంలో ఉరి తీయబడిన తరుణ భారతీయులుకూడా వందల సంఖ్యలో చేరారు. నీల్ హత మార్చిన పసికందుల తండ్రులు, స్త్రీలు,భర్తలుకూడా వచ్చారు.ఆంగ్లేయులు చప్పట్లు చరచుతూ వస్త్రములకు, కురులకు నిప్పంటించిన యువతుల తండ్రులూ వచ్చారు. విజయదినంనాడు నానాసాహెబ్ ఆంగ్లేయు లందరిని సురక్షితంగా పంపడానికి అంగీకరించినట్లువిని వీరంతా రణగొణధ్వని చేశారు. నావల తనిఖీకివచ్చిన ఆంగ్లేయాధికార్లు అ ప్రక్కనే నది వడ్డున చేరిన ప్రజలు ఆంగ్లేయులను ఊచకోత కోయాలనుకోవడం విన్నారు. ఒక జాతిని బానిస చేసిన వారి తలలు నరికివేయడం పాపకార్యం కాదని రాజభవనపు పండితులుకూడా సెలవిచ్చినట్లు తెలిసింది,

జూన్ 27 న సతి చౌదాఘట్ నుండి ఆంగ్లేయులను పంపవలసి వున్నది. అశ్విక దళము, పదాతిదళము ఆ రేవుచుట్టు నిలచి వున్నాయి. ఆయుధదళము కూడా సిద్ధముగా వున్నది! ఆనాటి దృశ్యానికి సంబంధించి యెవరికి తోచిన మనోకల్పనలను వారు చేసుకుంటూ వేలాది కాన్పూరు పౌరులు ఆ దృశ్యాన్ని చూచేందుకు నదీ తీరానికి చేరారు. అజీముల్లాఖాన్, బాలాసాహెబ్, కమాండర్ తాత్యాతోప్‌తో ఆ ప్రక్కనేవున్న ఒక మందిరముమీదనుంచి దానిని చూస్తున్నారు. పల్లకీలు, ఏనుగులపైన ఆంగ్లేయులు రేవు స్థలానికి చేరారు. అటనుండి నావలోనికి ఎక్కించడంలో ఒక్క భారతీయుడైనా సహాయానికి రాలేదు. ఆంగ్లేయులు నీటిలో గెంటుకుంటూ వెళ్ళి నావ లెక్కారు. అంతా నిశ్శబ్దంగా వుంది. నావలు చాలా యెక్కువగా నిండిపోయినాయి. నావికులు తెడ్లతో సిద్ధముగా వున్నారు. సాగిపొమ్మని సైగచేస్తూ తాత్యాతోప్ చేయి ఊపాడు. హఠాత్తుగా ఒక మూల యెవరో ఆ భయంకర నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఈల వూదారు. ఆ ఈల మ్రోత వెంటనే భూమ్యాకాశాలను బ్రద్దలుచేసేటువంటి భయంకర ధ్వనులు వినిపించాయి. తుపాకులు, రైఫిళ్ళు, బాయ్‌నెట్లు, కత్తులు మున్నగునవి లేచాయి. నావికులు నదిలోకి దూకి ఒడ్డుకుచేరారు, సిపాయీలు నీళ్ళలోకి దూకారు. "మారో ఫిరంగీకో" అనే నినాదంతో నది నిండిపోయింది. నావలన్నింటికి నిప్పంటుకున్నది. హడలిపోయిన స్త్రీ పురుషాదులందరూ గంగలోకి దూకారు. కొందరీదారు, కొందరు మునిగారు, కొందరు కాలిపోయినారు. చాలామంది వెంటనే గాని, ఆ తర్వాతగాని తుపాకి గుండ్లకు బలియైపోయినారు. గంగ సింధూరవర్ణమైంది. మాంసపుముద్దలు, పగిలిన తలల, విడిపోయిన జుత్తు, తెగిపోయిన కాళ్ళు, చేతులు, రక్తపు కరుళ్ళు తేలిపోయినాయి.

అది ఉదయం పది గంటలవేళ. ఆ సమయంలో నానాసాహెబ్ తన భవనంలో పచార్లు చేస్తున్నాడు. నూరేండ్ల కిరాతకాలకు జవాబు ముద్దు

తుంచే ఆయనకి అశాంతి ఏమిటి? ఆయన యెక్కువసేపు ఆలోచించక పూర్వమే ఒక ఆశ్వికుడు త్వరితగతినివచ్చి సతి చౌదాఘట్‌లో సిపాయీలు ఆంగ్లేయులను విచక్షణారహితంగా హతమారుస్తున్నారని తెలియ చేశాడు. దీనిని వినగానే నానాసాహెబ్ స్త్రీలను, పిల్లలను వధించే అవసరం లేదని, అదే అశ్వికునితో "బ్రిటిష్‌వారిని హతమార్చండి! కాని పిల్లలకు, స్త్రీలకు హాని కలిగించరాదు" అని కబురు పంపాడు. ఈ ఆజ్ఞ రాగానే మారణహోమం ఆగిపోయింది. 120 మంది స్త్రీలు, పిల్లలు నది నుండి ప్రాణాలతో వెలికి తీయబడ్డారు. వారందరిని సాన్‌డా కోఠీకి బందీలుగా తీసుకువెళ్ళారు. మిగిలిన ఆంగ్లేయులందరిని ఒక పంక్తిలో నిలిపి వారికి ఉరిశిక్ష విధింపబడినట్లు వినిపింపబడ్డది.

జూన్ 7 నాటికి కాన్పూరులోవున్న వేయిమంది ఆంగ్లేయులకుగాను జూన్ 30 నాటికి నల్గురు పురుషులు, 125 మంది స్త్రీలు, పిల్లలుమాత్రం మిగిలారు. స్త్రీలు, పిల్లలు నానాసాహెబుకు బందీలై వుండగా, సగం చచ్చిన ఆ నలుగురు పురుషులు దుర్విజయసింగ్ ఇంట్లో మందు వేయించుకుంటున్నారు.

బ్రిటిష్ పరిపాలనా చిహ్నాలన్నీ తొలగించబడిన తరువాత 28 వ తేదీ సాయంత్రం 5-30 గంటలకు నానాసాహెబ్ ఒక పెద్ద దర్బారు ఏర్పాటు చేశాడు. ఆ దర్బారు గౌరవార్థం సైనికు లందరితోను సైనిక వందనముకూడా ఏర్పాటైంది. ఆ మహోత్సవంలో ఆరు పదాతి దళాలు, రెండు ఆశ్వికదళాలు, ఇంకా - తమతమ పతాకలతో స్వాతంత్ర్య సమర రంగంలోనికి దూకిన ఎందరో విప్లవవీరులు పాల్గొన్నారు. కాన్పూర్ విజయానికి కారణమైన ఆయుధ దళాలకు సముచిత గౌరవం తెలుపబడింది. బాలాసాహెబ్‌కు మొదటినుండి సైన్యములో ఆదరమున్నది. ఆయన రాగానే హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. మొదట ఢిల్లీ పాదుషా గౌరవార్థం 101 తుపాకీ కాల్పులు జరిగినాయి. తర్వాత నానాసాహెబ్

రాగానే హర్షధ్వానాలతోను, 21 తుపాకీ కాల్పులు మ్రోతతోను స్వాగతం చెప్పబడ్డది. తనకు జరిగిన సన్మానానికి నానాసాహెబ్ సైన్యాలకు కృతజ్ఞత తెలుపుతూ ఇలా అన్నాడు: "ఈ విజయం మన అందరిది. ఇందలి ఘనత అందరికీ సమానముగా చెందుతుంది." అనంతరము సైనికులకు లక్ష రూపాయల పారితోషికము ప్రకటించబడ్డది. ఆ తర్వాత నానాసాహెబ్ సైనిక పర్యవేక్షణ జరిపినప్పుడు మరల 21 సారి తుపాకులు ప్రేల్చ బడ్డాయి. ఆ తర్వాత రావ్‌సాహెబ్, బాబాసాహెబ్, బాలాసాహెబ్‌ల ఎడ గౌరవసూచకంగా 17 వంతున తుపాకులు ప్రేల్చబడ్డాయి. బ్రిగేడియర్ జ్వాలాప్రసాద్, కమాండర్ తాత్యాతోప్‌లయెడ గౌరవ పురస్సరంగా 11 వంతున ప్రేల్చబడ్డాయి. ఈ విధంగా నాటి సంధ్యాదేవి తుపాకి మ్రోతలలో స్వేచ్ఛాగీతాన్ని విన్నది. ఆ తర్వాత సైన్యమంతా శిబిరానికి తిరిగి వెళ్ళింది. సైనికపర్యవేక్షణ తర్వాత నానాసాహెబ్ సోదరుడైన బాలాసాహెబ్ వెంటరాగా చారిత్రకమైన బ్రహ్మావర్త భవనానికి వెళ్లాడు. జూలై ఒకటవ తేదీన పట్టాభిషేకము నిశ్చయించారు. ఆ రోజునే భవనములో యేమి సందడి! యేమి ఆనందము! పీష్వాలాక్రమించిన చారిత్రక సింహాసనము మహోత్సవముతో దర్బారులోనికి తీసుకొనిరాబడ్డది. నుదుట రాజతిలకము ధరించి తుపాకి ప్రేల్పుల ఘోషలు, వేలాది ప్రజల హర్షధ్వానాలు, జయ ఘోషలమధ్య నానాసాహెబ్ దానినధిష్ఠించాడు. ఆనాడు కాన్పూరునుండి వందలకొలది కానుకలు ఆయనకు పంపబడ్డాయి. ఆంగ్లేయులవల్ల రాయఘర్‌లో కృంగిపోయిన మహారాష్ట్ర సింహాసనము ఆంగ్లేయుల రక్తముతో అరుణవర్ణముతో ప్రవహించిన గంగానదిలో తేలియాడి పునర్దర్శనమిచ్చింది. యావద్భారతమందలి హిందువులందరు "రాజా రామచంద్రునికి జై" అని నినదించారు.

జూన్ 4 వ తేదీన ఝాన్సీ విజృంభించింది. ఈ విజృంభణకు పూర్వం ఝాన్సీలో బ్రిటిషు కమీషనర్ చేతికి కొన్ని ఉత్తరాలు దొరికాయి.

రాణి సేవకులలో ఒకరైన లక్ష్మణరావ్ అనే బ్రాహ్మణుడు విప్లవ ప్రయత్నాలు చేస్తున్నాడని, దానికి ప్రాతిపదికగా ఆంగ్లేయ సైన్యాధికారుల నందరిని వధించ నిశ్చయించాడని ఆ ఉత్తరాలు వ్యక్తం చేశాయి. ఆ విషయమై ఏమి జాగ్రత్తలు తీసుకొనాలో ఆంగ్లేయాధికార్లు చర్చిస్తుండగానే, అదేరోజున విప్లవవీరులు కోటను వశం చేసుకున్నారు. ఇదిచూచి ఆంగ్లేయులంతా నగరంలోని దుర్గములో తలదాచుకొనడానికి వెళ్ళారు. విప్లవకారులు దానిపై కూడా దాడిచేసి దానిని వశము చేసుకున్నారు. 7 వ తేదీన ఝాన్సీకి చెందిన రసల్దార్ కలాఖాన్, తాశీల్దార్ మహ్మద్ హుస్సేన్ తదితర వీర సైనికులు దాడికి నేతృత్వం వహించి ఝాన్సీ దుర్గముపై స్వేచ్ఛా పతాక నెగురవేశారు. రెండవప్రక్క ఆంగ్లేయులు తెల్లజెండాను చూపి సంధి కోరికను వెల్లడించారు. ఆంగ్లేయులు నిర్నిబంధంగా లొంగిపోతే వారిని ప్రాణాలతో వదలగలమని ఝాన్సీ పౌరప్రముఖుడు హకింసలే మహ్మద్ వాగ్దానం చేశాడు. ఆంగ్లేయులు ఆయుధములు క్రిందపెట్టారు. వారు వెళ్ళేందుకు కోటతలుపులు తెరవబడ్డాయి. వారు కోటదాటగానే సిపాయీలు "మారో ఫిరంగీకో!" అని వెంటబడ్డారు. ఆంగ్లేయులు తమ భార్యాబిడ్డల నెలా ఊచకోత కోసిందీ, నీల్ ఏవిధంగా గ్రామాలను సర్వనాశనం చేసిందీ సిపాయీలకు తెలుసు. అది తలచుకొన్నప్పుడు వారి హృదయాలు దహించుకుపోయినాయి. 8 వ తేదీన నగరంలో ఒక ఊరేగింపు జరిగింది. ఆంగ్లేయులను బందీలుగా చేసి అందులో ప్రదర్శించారు. క్షణం క్రితం వరకు అధికారం చెలాయించిన వారే యిప్పుడు బందీలుగా నడిచారు. జోహాన్‌బాగ్ చేరగానే సిపాయీలు "రసల్దార్ సాహెబ్, మాకిప్పు డేమి ఆజ్ఞ?" అని అడిగారు. రాణిని పదభ్రష్టం చేసి, దేశాన్ని ఆక్రమించ దలచడం ద్వారా దేశద్రోహులైన ఫిరంగీలను వదలడం అనేది లేదన్నాడాతడు. పురుషులు, స్త్రీలు, పిల్లలను మూడు పంక్తులుగా చేసి జైల్

డరోగా కమీషనర్‌ను శిరచ్ఛేదం చేసిన తర్వాత మిగిలిన వారందరినీ వరుసగా శిరచ్ఛేదం చేయాలని ఆజ్ఞాపించాడు.

సుమారు 75 మంది పురుషులు, 12 మంది స్త్రీలు, 23గురు పిల్లలు విప్లవకారులచే శిరచ్ఛేదం చేయబడ్డారు. వారసులెవరూ లేనందున రాజ్యాన్ని విప్లవవీరులు లక్ష్మీబాయి కొడుకు దామోదరరావు తరపున పాలించేందుకై ఆమెకు దత్తం చేశారు. 'ఈ విశ్వము పరమేశ్వరునిది, దేశము స్వామ్రాట్టుది, అధికారము రాణీ లక్ష్మీబాయిది' అని వారుద్ఘాటించారు.

# ఔధ్

డల్హౌసీ ఔధ్ సంస్థానమును వశము చేసుకున్నది మొదలు అచ్చటి ప్రజలు రోజురోజుకు కష్టములతో కృంగిపోతున్నారు. నూతన ఔధ్ ప్రాంతానికి సర్ హెన్రీ లారెన్సు ప్రధానాధికారిగా నియమింపబడ్డాడు. పంజాబ్ విప్లవాన్ని మొగ్గలోనే త్రుంచివేసిన సమర్థుడగు సర్ జాన్ లారెన్స్‌కు ఇతడు అన్న. అంతకు పూర్వమున్న అధికారులకన్నా ఇతడు కొంత మంచివాడే అయినా ప్రజలు ఆంగ్ల పరిపాలన అంటేనే విసుగెత్తి పోయినారు. అధికారి మంచివాడైనా, చెడ్డవాడైనా, స్వరాజ్యము రావడం వజీద్ ఆలీషా మళ్ళీ సింహాసనము నధిష్టించడము తప్ప ఇంకేదీ వారిని సంతృప్తి పరచజాలదు. హిందూముస్లిం మతములకు, స్వాతంత్ర్య సముపార్జనకు సంబంధించిన ఈ సమరంలో తమ సర్వస్వము త్యాగము చేద్దామని మాన్‌సింగ్ వంటి హైందవ ప్రముఖులు, మౌల్వీ అహ్మద్‌షా వంటి ముస్లిం ప్రముఖులు నిశ్చయించుకున్నారు. వేలాది పండితులు, మౌల్వీలు రహస్యముగాను, బాహాటముగాను పవిత్ర యుద్ధ ప్రచారము చేసుకుంటూ ఔధ్ అంతటా పర్యటించ నారంభించారు. సైనికులు ప్రమాణాలు చేశారు. పోలీసులు ప్రమాణాలు చేశారు. జమీందారులు ప్రమాణం చేశారు. ప్రతి ఒక్కరూ ఆంగ్లేయ పాలనను అంతమొందించే ఈ వ్యూహములో చేరారు. ప్రజాందోళనాగ్ని నలుదిశల వ్యాపించింది.

సర్ హెన్రీ లక్నో నగరమువద్ద ఆంగ్లేయులు తలదాచు కొనేందుకై మాచీభవన్, రెసిడెన్సీలను ఎన్నిక చేశాడు. వాటిని దృఢమైన దుర్గాలుగా తయారు చేస్తున్నాడు. ఆంగ్ల వనితలు, బాలబాలికలు అక్కడకు చేర్చబడ్డారు. ఆంగ్లేయులైన గుమాస్తాలు, సివిల్ అధికార్లు, వ్యాపారులు మున్నగు వారందరికీ సైనిక కవాతులు, క్రమశిక్షణ, రైఫిల్ ప్రయోగము మున్నగునవి అన్నీ నేర్పబడుతున్నాయి.

ఔధ్ నేపాలుకు దగ్గరగా ఉన్నందున నేపాల్ జంగ్ బహద్దూర్‌ను ససైన్యముగా ఔధ్‌కు రమ్మని ఆహ్వానిస్తూ సర్ హెన్రీ ఒక ప్రతినిధి వర్గాన్ని పంపాడు. అటు ఆ జాగ్రతలు తీసుకుంటూండగానే సర్ హెన్రీకి ప్రతిరోజూ "నేడే విప్లవదినం" అంటూ విశ్వసనీయ వర్గాల ద్వారా సమాచారము అందుతుండేది! ఈ వార్త రాగానే రోజూ అతడు ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకునేవాడు. కాని ఆరోజు ఏమి జరిగేదికాదు. ఈ విధంగా తరచు అతడిని భ్రమపెట్టడం జరిగేది. మే 30 వ తేదీనకూడా ఒక అధికారి అదే విధముగా రాత్రి 9 గంటలకు తిరుగుబాటు జరుగు తుందని సర్ హెన్రీకి తెలియజేశాడు, ఆ రోజు ప్రొద్దు గ్రుంకింది. సర్ హెన్రీ మిత్రులతో భోజనం చేస్తుండగానే తొమ్మిది కొట్టింది. ఈ సమా చారమిచ్చిన అధికారి అక్కడే ఉన్నాడు. సర్ హెన్రీ అతడిని చూచి ఎగతాళిగా "మీ మిత్రులు ఇంకా ప్రారంభించలేదే?" అన్నాడు. ఈ మాటలు ఇంకా పూర్తిగాక మునుపే 71టవ బృందంలో రైఫిళ్ళ గందర గోళం వినిపించింది. ముందే అనుకున్న ప్రకారం ఈ దళంవారు తొమ్మిది గంటలకు ఫిరంగిమోత వినపించగానే ఆంగ్లేయుల బంగాళాలపై విరుచుకు పడ్డారు. వారి పాతశాలకు నిప్పంటుకున్నది. వారిపై కాల్పులు జరిగాయి. కంటోన్‌మెంట్‌కుకూడా నిప్పంటింపబడ్డది. ఆంగ్ల పతాక నంటిపెట్టుకొని ఉన్న ఆంగ్ల సైనికులు, భారతీయ సిపాయీలను రాత్రంతా కంట్లో వత్తు లతో కాపలా కాచారు. విప్లవం విస్తరించకుండా ప్రయత్నించారు. మే 31

ఉదయం హెన్రీ లారెన్సు తన కింకా విధేయులుగాఉన్న కొద్దిమంది సిపాయీలను తనవద్దనున్న ఆంగ్లసైనికులను తీసుకొని విప్లవకారులమీదకి దాడి వెడలాడు. కాని అతడి పక్షానఉంటూ వచ్చిన 7వ ఆశ్వికదళం కూడా దారిలో లతడికి ఎదురు తిరిగింది. దానిని అక్కడ విప్లవకారులతో వదిలి అతడు తిరుగుముఖం పట్టాడు. ఫిరంగి దళాలు కాక 32వ దళమంతా లక్నోలో బ్రిటిష్‌వారికి అండగా ఉన్నప్పటికి, 71వ, 48వ పదాతి దళాలు, 7వ ఆశ్వికదళము మిగిలిన సన్నకారు సైనికులను కలుపుకొని ఆనాటి సూర్యాస్తమయంలోపునే స్వేచ్ఛాపతాక నెగురవేశారు.

లక్నోకు పశ్చిమంగా 51 మైళ్ళ దూరాన సీతాపురం ఉన్నది. 41వ పదాతిదళం, 9, 10వ సాధారణ పదాతిదళాలు ఇక్కడ ఉన్నాయి. ప్రాంత కమీషనర్, ఇతర ఆంగ్లేయాధికారులుకూడా ఇక్కడే ఉన్నారు. జూన్ 2 వ తేదీన ఒక అసాధారణ సంఘటన జరిగింది. తమ కివ్వబడిన పిండి బస్తాంలో ఎముకల పొడి కలిసిందని చెప్పి సిపాయీలు వాటిని స్వీకరించ నిరాకరించారు. పైగా వెంటనే వాటిని గంగానదిలో పారవేయాలని కూడా పట్టుబట్టారు. ఆంగ్లేయులు నిశ్శబ్దంగా వాటిని గంగానదిలో పడవేశారు! ఆ మధ్యాహ్నం సిపాయీలు హఠాత్తుగా ఆంగ్లేయుల తోటంలోనికివెళ్ళి అందిన అన్ని పండ్లు, కోరినన్ని కోసుకుతిన్నారు. జూన్ 3న కొందరు సిపాయీలు వెళ్ళి ఖజానాను వశం చేసుకున్నారు. మరికొందరు చీఫ్ కమీషనర్ నివాసముపై దాడిచేశారు. 9 వ దళంవారు వారి అధికార్లను హతం చేశారు. కమీషనర్, అతడి భార్య నదివైపుగా పరుగులెత్తారు. వారు నది దాటుతుండగా హతులైనారు. క్రోధోద్దీపితులైన సిపాయీలు అప్పుడు 24 మందిని హతమార్చారు. మిగిలిన ఆంగ్లేయులు చాలామంది రామ్‌కోటే, మితావళి మున్నగు జమీందార్ల ఆశ్రయము, ఆతిథ్యము పొంది 9, 10 నెలల తర్వాత క్రమంగా భద్రంగా లక్నోకు చేర్చబడ్డారు.

9)

ఆ తర్వాత సీతాపురం సిపాయిలందరూ ఫరూకాబాద్ వెళ్ళారు. ఆంగ్లేయులు తలదాచుకున్న కోట తీవ్ర సమరం తర్వాత స్వాధీనమైంది. ఆంగ్లేయులందరూ వధింపబడ్డారు. ఆంగ్లేయులచే సింహాసనానికి దూరము చేయబడ్డ నవాబు టఫూజర్ హుస్సేన్‌ఖాన్‌ను మళ్ళీ సింహాసన మెక్కించారు. నవాబుకూడా తన ప్రాంతములో అందిన ప్రతి ఆంగ్లేయునీ హత మార్చాడు. దానితో జూలై 1 నాటికి ఫరూకాబాద్ ప్రాంతంలో ఒక్క ఆంగ్లేయుడుకూడా మిగలలేదు. మోహమ్మది, బోరెహైబ్, మలాపూర్ జిల్లాలుకూడా ఇదే విధముగా విముక్తమైనాయి.

ఔధ్‌కు తూర్పు ప్రాంతములో ఉన్న ప్రధాన నగరం ఫైజాబాద్ ప్రాంత కమీషనర్ గోల్డ్‌నే నివాసముకూడా అక్కడే. ఫైజాబాద్ ప్రాంతంలో మూడు జిల్లాలున్నాయి. సుల్తాన్‌పూర్, సలోని, ఫైజాబాదు. ఆ సమయంలో ఫైజాబాద్ నగరంలో 22వ పదాతిదళం, 6వ సాధారణ పదాతి దళం, కొంత ఆశ్వికదళం, తుపాకి దళం నిలుపబడి ఉన్నాయి. వీటన్నిటికి నాయకుడు కల్నల్ లెన్నాక్స్. ఫైజాబాద్ జిల్లాలో ఆంగ్ల ప్రభుత్వపు పీడనము చాలా ఎక్కువగా ఉన్నది. మీరట్ వార్త వినగానే ఇచ్చటి ఆంగ్లేయాధికారులు తమ ఘోరాలకు కూడా ప్రతిగా త్వరలో పగ తీర్చుకొనబడుతుందని భావించారు. దారి విప్లవకారుల నిఘాలోఉన్నందున వారు తమ భార్యాబిడ్డలను లక్నో పంపడం సాధ్యంకాలేదు. పోనీ ఫైజాబాదులోనే పోరాటానికి సిద్ధపడాలంటే సిపాయిలందరూ భారతీయులు. ఇలా సందిగ్ధంలోపడి ఈ ఆంగ్లేయాధికారులందరూ చివరకు రాజా మాన్‌సింగ్‌ను శరణుజొచ్చారు. రాజా మాన్‌సింగ్ ఔధ్‌లోని హిందువు లందరికి నాయకుడు. నవాబుల క్రింద హిందూ ధర్మాన్ని రక్షించేందుకు అతడి ఖడ్గము సదా సిద్ధముగా ఉంటుంది. ఆత్మాభిమానవంతుడైన ఈ రాజాను 1857 మే మాసములో, ఏదో చిన్న ఆదాయము విషయంలో ఆంగ్లేయులు ఖైదు చేశారు. కాని మీరట్

విజృంభణతో బలహీనపడిన ఆంగ్లేయులు అతడిని విడుదల చేసి మంచి చేసుకొనే యత్నించారు. ఆంగ్లేయులు ఆశ్రయం కోరినప్పుడు రాజా మాన్ సింగ్ అతి కష్టముమీద ఆంగ్ల వనితలు, బాలబాలికలకు తన భవనంలో రక్షణ ఇచ్చేందుకు అంగీకరించాడు. ఈ పని ప్రజలకు ఇష్టం ఉండదని, తన భవనంపై దాడిచేసేందుకు సైతం వారు వెనుకాడరని కూడా అతను తెలియజేశాడు. చివరకు జూన్ 1 వ తేదీన ఆంగ్లేయుల కుటుంబాలు మానసింగ్ వద్దకు రక్షణకై వెళ్ళి అతడి షహగంజ్ భవనంలో భద్రంగా కాలం గడుపుతున్నాయి. ఆంగ్లేయులీ జాగ్రతలు పడుతుండగా ఫైజాబాద్‌లో విప్లవ జ్వాలలు తీక్షణం కాజొచ్చాయి. నేడు చరిత్రలో శాశ్వత స్థానం పొందిన మౌల్వీ అహ్మద్ షా, ఆనాడు తన ఆస్తులను బ్రిటిష్ వారికి కోల్పోయిన అనేక మంది తాలూకాదార్లలో ఒకడు. తన రాజ్యంరానే గాక, యావద్దేశాన్ని విముక్తి చేస్తానని అతడు ప్రతిజ్ఞ పట్టాడు. ఆగ్రాలో ఒక రహస్యసంఘ శాఖను స్థాపించాడు. ఆంగ్ల శాసనాన్ని నాశనం చేయండని లక్నోలో బహిరంగంగానే ప్రబోధించాడు. ఔధ్ ప్రజ అతని ఎంతగానో ప్రేమించేవారు. అతడు విప్లవ కరపత్రాలను వ్రాసి, ఔధ్ అంతటా పంచేవాడు. ఆంగ్లేయులతడిని బందీ చేయాలని ఆదేశించారు. అయితే ఔధ్ పోలీసులు ఆ ప్రజానాయకుని బంధించడంలో సహకరించ లేదు. అందువల్ల అతనిని పట్టుకునేందుకు ఒక సైనిక బృందం పంపబడ్డది. అతడిని రాజద్రోహనేరం క్రింద విచారించారు. ఉరిశిక్ష విధించారు. కొంత కాలం ఫైజాబాద్ జైలులోనే ఉంచబడ్డాడు.

మౌల్వీనిర్బంధము ఫైజాబాద్‌లో విప్లవజ్వాల రగిలేందుకు ఒక అగ్నికణమైంది. సైనికులతో సహా నగరమంతా ఒక్కసారిగా లేచింది. ఆ ప్రజానాయకుని పాదస్పర్శచే పవిత్రమైన జైలు మీదకు వెళ్ళారు ప్రజలు, సిపాయిలు. జైలు నుండి మౌల్వీ బయట పడగానే ఫైజాబాద్ విప్లవానికి అతడు నాయకత్వం వహించాడు. తనకు ఉరిశిక్ష విధించి

నందుకు పగను ప్రదర్శిస్తూ అతడు చేసిన మొదటి పని: తనను జైలులో వుండగా హుక్కా పీల్చుకోనిచ్చినందుకు ధన్యవాదా లర్పిస్తూ నిర్బంధంలో వున్న కలనల్ లెనాక్స్‌కు ఒక సందేశం పంపడం: తనకు ఉరిశిక్ష విధించిన వానికి అలా ధన్యవాదాలు తెల్పి, ఆ ఉదారుడు చేసిన రెండవ పని ఆంగ్లేయాధికారు లందరూ వెంటనే ఫైజాబాద్‌ను వదలి పొమ్మని ఆజ్ఞాపించడం. అన్యస్థానాలలో జరిగినట్లుగా లూటీలు, అక్రమాలు ఫైజాబాద్‌లో కూడా జరుగకుండా సిపాయీలను రక్షకులుగా పంపాడు.

ఫైజాబాద్ నుండి ఆంగ్లేయులు వెళ్ళిపోగానే ప్రాంతములోని ఇతర జిల్లాలలో కూడా స్వాతంత్ర కేతనము ఎగురవేయ బడ్డది. జూన్ 9 వ తేదీన సుల్తాన్‌పూర్ విజృంభించింది. 10 వ తేదీన మూడవ ముఖ్యనగరము సలోని విజృంభించింది. ఇచ్చట అధికారులు ప్రాణము లరచేత పెట్టుకు పరుగెత్తారు. సర్దార్ రుస్తుంసింగ్ వారిలో కొందరిని రక్షించాడు. రాజా హనుమంతసింగ్ మరి కొందరిని రక్షించాడు. శౌర్యధైర్య సంపన్నులయిన ఔధ్ పాలకులు తమకు లొంగిపోయిన ఆంగ్లేయులకు ప్రాణదానం చేయడమేకాకుండా, దయతో చక్కని ఆతిథ్యము కూడా ఇచ్చారు.

మే 31, జూన్ మొదటి వారపు మధ్య భాగంలో ప్రాంతమంతటా ఒక మహాయంత్రము పనిచేయిడం ప్రారంభించినట్లుగా, విప్లవం ప్రారంభమైంది. ప్రాంతమంతటా - జమీందార్లు, జాగీరుదార్లు, రాజాలు, అశ్వ, ఆయుధ, పదాతి దళాలకు చెందిన సైనికులు, ప్రభుత్వోద్యోగులు, రైతులు, వ్యాపారులు, విద్యార్థులు, క్లుప్తంలో హిందువులు, ముస్లిములు అందరూ ఒక్కటై విరాట్ పురుషునివలె లేచారు. పది రోజులలో ఈ మహాజనం వజీదాలీషాచే సింహసనమును పునరధిష్ఠింప చేశారు. ప్రజల శ్రేయస్సు కోసం ఇతడిని పదవీభ్రష్టుని చేశానన్న డల్హౌసీకి ఎంత హుందాయైన జవాబు! జూన్ మొదటి వారాంతానికి ఔధ్ ప్రాంతమంతటిలోను ఆంగ్ల పతాకాలన్నీ పీలికలు చేసివేయడం ద్వారా చక్కని జవాబీయని గ్రామ మొక్కటి కూడా లేదు.

జూన్ 10 వ తేదీ నాటికి ఔధ్ ప్రాంతమంతా స్వతంత్రమైంది. సిపాయీలు, స్వయం సేవకులు లక్నోవైపు తరలారు. ఆ నగరం, బ్రిటిష్ మహానేత సర్ హెన్రీలారెన్సు మృత్యుముఖానపడ్డ ఆంగ్లాధిపత్యానికి జీవం పోయడానికి యావచ్ఛక్తిని వినియోగించి ప్రయత్నిస్తున్నాడు. ప్రాంత మంతా చేయిజారిపోయినా అతడు రాజధానిని చేతనుంచుకొని పెనుగు లాడుతునే ఉన్నాడు.

ఔధ్ ప్రాంతపు సిపాయీలు, యువకవీరులు లక్నో చుట్టూ మూగ నారంభించారు. మరొక సమరానికి ఉభయ వర్గాలు ఎదురుచూస్తున్నాయి. కాన్పూర్ రణరంగంలోని పరిస్థితి చాలా తీవ్రముగా వుంది. అచ్చటి నుండి వార్త వచ్చేవరకు ఇచ్చట ఉభయులు పోరు ప్రారంభించలేదు. 28 న వార్త వచ్చింది - కాన్పూర్‌లో ఒక్క ఆంగ్లేయుడు కూడా ప్రాణాలతో మిగల లేదని! విప్లవవీరులు విజయోత్సాహంతో విక్రమించారు. చిన్‌హాట్ వరకు సాగి వెళ్ళారు.

కాన్పూర్‌లో ఆంగ్లేయుల ఘోర పరాజయం, యావద్దేశంలోను ఆంగ్లేయుల గౌరవ ప్రతిపత్తికను తొలగించివేసింది. ఈ పరాజయానికి ప్రతీకారం చేస్తేగాని లక్నోలోని రెసిడెన్సీనిగాని, చివరకు కలకత్తాలోని ఫోర్టు విలియంనుగాని రక్షించుకోవడం సాధ్యంకాదని భావించాడు సర్ హెన్రీ లారెన్సు. జూన్ 29 న ఆంగ్ల సైన్యాలు ఇనువవంతెనవద్ద చేరాయి. సర్ హెన్రీ లారెన్సు నాల్గువందల ఆంగ్ల సైనికులను, నాల్గువందల సిపాయి విద్రోహులను, పది పెద్ద తుపాకులను తీసుకొని లక్నోను విడ చాడు. చాలాదూరం వెళ్ళాడు. ఎక్కడా శత్రువుల జాడ రానరాలేదు. చివరకు విప్లవకారుల మొదటివరుస దర్శనమైంది. వెంటనే హెన్రీ, దాపున కుడి ప్రక్కగా ఉన్న ఒక ముఖ్య గ్రామాన్ని ఆక్రమించవలసిందిగా తన అను చరుల నాజ్ఞాపించాడు. వారు వెంటనే ఆ గ్రామము నాక్రమించారు. ఆంగ్ల సిపాయీలు యెడమ ప్రక్కన ఉన్న ఇస్మాయిల్ గంజ్‌ను

కూడా అక్రమించారు. హెన్రీ సిపాయీలు, విప్లవ వీరులపై జరిపిన కాల్పులకు, విప్లవవీరులు జవాబీయడం అసాధ్యమైంది. వారు ఊరుకున్నారు. వెంటనే విప్లవవీరులు ఇస్మాయిల్ గంజ్‌లో నిశ్శబ్దంగా ప్రవేశించినట్టు కేకలు వినిపించాయి. ఆంగ్లసైనికులపై వారు హఠాత్తుగాపడి గ్రామం నుండి గెంటివేశారు. గ్రామం విప్లవకారుల వశమైంది. ఇకవారు, ఆంగ్లేయులంపు మధ్యనుండి, వెనుకనుండి ఢీకొన్నారు. ఆంగ్లసైనికులు తప్పుకుంటుండగా, విప్లవవీరులు ముందుకు సాగారు. ఆంగ్లేయులలో గందరగోళం ప్రారంభమైంది. సర్ హెన్రీ పరిస్థితి గమనించాడు. ఇలాగే మరికొంత సేపు జరిగితే తన సైన్యమంతా నాశనమవుతుందని గ్రహించి, అతడు తిరోగమనం చేశాడు. ఈ విధంగా దెబ్బతిని అతడు మరల లక్నోలోని రెసిడెన్సీలోనికి చేరాడు. విప్లవకారులు అతని వెంట పడ్డారు. ఆంగ్ల సైన్యాలు, వారికి విధేయంగావున్న సిక్కు-సిపాయీలూ రెసిడెన్సీ ప్రాంగణం చేరగానే చిన్‌హాట్ పోరు ఆగిపోయింది. ఇప్పుడు విప్లవకారులు రెసిడెన్సీ మాచి భవన్‌లను రెండిటినీ చుట్టుముట్టారు. తన రక్షణ కొంచెం నిర్దుష్టంగా చేసుకునేందుకు సర్ హెన్రీ మాచి భవన్‌ను ఖాళీచేయడానికి నిశ్చయించాడు. అక్కడవున్న ఆయుధాగారాన్ని ప్రేల్చివేయించాడు. ఆంగ్లేయులంతా రెసిడెన్సీలోనికి చేరారు. ఇక్కడ వారికి చాలినంత ఆహారము, ఆయుధాలు నిలువ ఉంచబడి ఉన్నాయి. ఇప్పుడచట వేయిమంది ఇంగ్లేయులు, 800 మంది భారతీయ సిపాయి విద్రోహులు ఉన్నారు. బయట చేరిఉన్న విప్లవ వీరులనుండి రక్షించుకోవడానికి వారు ప్రయత్నాలు చేస్తున్నారు. చిన్‌హాట్ యుద్ధం తర్వాత, రెసిడెన్సీ రక్షణకు సర్ హెన్రీ చేస్తున్న ప్రయత్నాలు చూచి, విప్లవకారులు నిరంతరదాడి ప్రారంభించారు. వేలాది విప్లవకారులు ఈ బానిసత్వాన్ని, విదేశీ ఆధిపత్యాన్ని అంతముచేయడానికి శక్తినంతా కేంద్రీకృతం చేస్తున్నారు. ఉద్రిక్తులైన ఔధ్ ప్రజలు లక్నో రెసిడెన్సీలోని ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని ఈ విధంగా వెంటాడి, దెబ్బతీసి, బంధించివేశారు.

# సమీక్ష

స్వాతంత్ర్యమును సంపూర్ణముగా కోల్పోయిన ప్రాంతాలలోని ప్రజలవలెనే గ్వాలియర్, ఇండోర్, రాజపుటానా, భరత్‌పూర్‌లలోని ప్రజల హృదయాలు కూడా విప్లవ సమరభావనతో నిండిపోయినాయి. తమ సంస్థానం భద్రముగా ఉన్నది కనుక తాము ప్రమాదానికి దూరంగా ఉన్నామనే అల్పభావన ఎవరికీ లేదు; తన చిన్న సంస్థానమే యావద్రాష్ట్రమనే భావన లేదు. ఆంగ్లేయులచే ఆక్రమింపబడిన సంస్థానాలు తమకు చెందని విదేశీరాజ్యాలనే భావన కూడా లేదు.

గ్వాలియర్‌లో విప్లవకారులు విజృంభించి సింధియాను తమతో చేరమని ఆహ్వానించగా, అతడు కొంత సంశయించి, చివరకు ఆంగ్లేయులతో స్నేహం చేశాడు. కాని సింధియాను ఒక గడ్డి బొమ్మగా త్రోసిరాజని గ్వాలియర్ సిపాయీ దళాలు తిరుగుబాటు చేశాయి; అధికార్ల రక్తం చిందించారు. బ్రిటీషు పనితనం, బ్రిటీషు పతాకను, బ్రిటీషు అధికారాన్ని గ్వాలియర్ దరిదాపుల లేకుండా చేసి గ్వాలియర్‌ను స్వతంత్రం చేశారు. ఆ తర్వాత సింధియాను ఇలా ఆజ్ఞాపించారు: ''రండి! మాకు నేతగా ఉండండి. హిందూస్థాన విముక్తికై మీ సైన్యమంతటితో ఆగ్రా, కాన్పూర్, ఢిల్లీలకు రండి.'' ఏవేవో వాగ్దానాలతో సింధియా చాలాకాలం వారిని అలా ఉంచాడు. సింధియా పద్ధతి ఆంగ్లేయు

లకు ఆగ్రాలో క్రొత్త ఆశలు కల్పించింది. అయితే అది ఎంతోకాలం లేదు. ఆగ్రా అచిరకాలంలోనే విప్లవవీరులకు వశమైపోయింది.

సంస్థానాల ధోరణి సందిగ్ధంగా కనిపించినా నిజానికది అవకాశ వాద ధోరణిలో ఉన్నది. ప్రజలు, సైన్యాలు ఆంగ్లేయులను తరిమివేస్తుంటే దానిని జరగనిచ్చేవారు; ఎందువల్లనంటే అది సంస్థానాలకు విముక్తి హేతువు గనుక. ఇది జరిగినా ఆంగ్లేయులతో మైత్రిమాత్రం సాగించే వారు- ఒకవేళ ఆంగ్లేయులదే అంతిమ విజయమైతే తమకున్నది కోల్పో కుండా ఉండేందుకు. కచ్, గ్వాలియర్, ఇండోర్, బుందేల్, రాజపుటానా, తదితర సంస్థానాధిపతులంతా ఇలాగే ప్రవర్తించినట్లు కనిపిస్తుంది.

చివరకు విప్లవాన్ని క్లిష్టపరిస్థితిలో పడవేసింది సంస్థానాధీశుల ఈ స్వార్థపూరిత ప్రవర్తనే. "విజయమో, వీరస్వర్గమో" నని వారు ధైర్యంగా ముందుకు వచ్చినట్లయితే నిశ్చయంగా వారికి పూర్ణ స్వాతంత్ర్యం లభించి వుండేది. కాని వారు హేయమైన స్వార్థముతో ద్వంద్వప్రవృత్తి చూపారు. బలహీనులైనవారి సదుద్దేశాలవల్ల వారికి లభించినదేమీలేదు; వారి హీనబుద్ధి మాత్రం స్పష్టంగా ప్రకటితమైనది. పాటియాల మున్నగు సంస్థానాధీశులవలె నగ్నమైన, బహిరంగమైన దేశ ద్రోహులు మాత్రంకాదు; కాని పరోక్షంగా వారి చర్యలు ద్రోహకరము లైనాయి.

## తృతీయ భాగం

# మహాగ్నిజ్వాల

## ఢిల్లీ సమరం

మే 11 న ఢిల్లీ స్వాతంత్ర్యము ప్రకటించిన తర్వాత, అట్టి సాహసచర్యానంతరము సంభవించే మహావిప్లవ నిర్వహణమునకు ఢిల్లీ సంఘటితము కాజొచ్చింది. ఢిల్లీ పాదుషాను ప్రాచీన మొగలు సింహాసనముపై కూర్చొనబెట్టడం ద్వారా, ఢిల్లీ ప్రజలు విముక్తి పోరాటానికి బలమైన కేంద్రము నొకదానిని - దాని కీర్తే ఒక శక్తి - ఏర్పరచుకున్నారు. అయితే ఈ పునరుద్ధరణము ఆ ప్రాచీనాధికారమును లేదా ప్రాచీన సంప్రదాయమును పునరుద్ధరించడం మాత్రము కాదు. బహాదూర్‌షాను హిందూస్థానపు సింహాసన మెక్కించడం సంకుచితార్థంతో ఆయనను ఆయన సింహాసమెక్కించడమే అయినా వాస్తవమదికాదు. ఎందువల్లనంటే దేశ ప్రజలు ఆ మొగలు వారసత్వాన్ని కోరుకొనలేదు. ఆక్రమణ అనే ఘనమైన పేరుతో, దుస్సాహసులైన ఆక్రమణదారులు, దేశంలోని స్వార్థపరులు కొందరు కలిసి ఈ దేశమునకు ఆ పాలనమును అంటగట్టారు. బహదూర్‌షా కొరకై పునరుద్ధరింపబడినది ఈ సింహాసనము కాదు. మే 11 న గౌరవనీయుడగు బహదూర్‌షా అధిరోహించినది అక్బర్, ఔరంగజేబ్ లధిష్టించిన సింహాసనము కాదు. అది మహారాష్ట్రులచే ఏనాడో తుత్తునియలైపోయింది. విదేశీ పరిపాలకులనుండి స్వేచ్ఛకై

సమరము జరుపుతున్న ప్రజలచే స్వేచ్ఛగా ఎన్నుకొనబడినట్టి సమ్రాట్టు బహదూర్‌షా. మూలమూలలనుండి రాజులనుండి, అనేక సైన్యాలనుండి హిందుస్థానమంచలి ప్రధాన నగరము లన్నింటనుండి ఈయనకు జోహారు లర్పింపబడ్డాయి. పంజాబ్, అయోధ్య, నీమద్, రోహిల్‌ఖండ్, తదితర ప్రాంతాలలో తిరుగుబాటుచేసిన సైన్యాలన్నీ తమ తమ పతాకాలతో ఢిల్లీకి తరలివచ్చి, బహదూర్‌షా నేతృత్వములో మహావిప్లవమున సేవకులుగా ఉండేందుకు తమ సంసిద్ధత తెలియజేశారు.

వెంటనే-విదేశీ ఆధిపత్యము, ఫిరంగీ పరిపాలనము అంతమయి పోయిందని, రాష్ట్రము స్వతంత్రమై పోయిందని, హిందూస్థానమంతటికీ ఒక ప్రకటన చేయబడ్డది. అత్యంత ఆశాజనకంగా ప్రారంభమైన ఈ మహా విప్లవ పరిపూర్తికై ప్రజలెల్లరు ఉత్తిష్ఠులు కావాలని, ఈ మహాసమరంలో వారిని నడిపించవలసింది నిస్వార్థమైన తాత్వికావేశం,దైవకార్యనిర్వహణా భావనం అని ఉద్బోధించబడ్డది.

ఆంగ్ల శాసనముపై యుద్ధప్రకటన జరగగానే ఢిల్లీలోని విప్లవకారులు విప్లవ నిర్వహణకు అవసరమైన ఆయుధ నిర్మాణంలో నిమగ్నులైనారు. తుపాకులు, ఫిరంగులు, ఇతర చిన్న ఆయుధాల తయారీకి ఒక పెద్దకర్మా గారం నెలకొల్పబడ్డది. నిర్మాణాన్ని పర్యవేక్షించేందుకు కొందరు ఫ్రెంచి వారు నియమింపబడ్డారు. రెండు మూడు ఆయుధపు గిడ్డంగులు కూడా నిర్మించారు. ప్రజలు రాత్రింబవళ్ళు పనిచేసి ఎన్నెన్నో మణుగుల తుపాకీ మందును నిలువ చేశారు.

బుందేల్‌కిసిరాయ్ యుద్ధము తరువాత ఆంగ్లేయు లాక్రమించిన స్థానము, వారి సైనిక ప్రయత్నాలకు చాలా అనువుగా ఉపయోగించింది. ఇటు ఢిల్లీ దుర్గ పరిసరముల మొదలు అటు నాలుగుమైళ్ళ అవతల జమున వరకు శిబిరములతో సుదీర్ఘముగా వ్యాపించి ఉన్న కొండలతో

ఆవృతమైన ఆ ప్రదేశం సైనికదృష్టిలో చాలా ప్రయోజనకరమైనది. 50, 60 అడుగుల ఎత్తువున్న ఆ కొండవాలు మిగిలిన ప్రదేశముకన్నా ఎత్తైనందున తుపాకులు, ఫిరంగులను నిరంతరము సమర్థవంతముగా నిలుపుకొనడానికి చాలా వీలు. అయితే కొండవాలుల మీదనుండి ఆంగ్లేయులు నగరముపై చేసిన రెండు దాడులు విఫలమైనాయి. అంత వరకు ఆత్మరక్షణ విధానమును మాత్రమే అవలంబిస్తూ వచ్చిన విప్లవ కారులు ఇక వేర్వేరు దిక్కులనుండి వివిధములైన దాడులు ప్రారంభిం చారు. ఈ దాడులతో బయట వున్న ఆంగ్లేయుల మనోధైర్యము దెబ్బ తినసాగింది.

నశీరాబాద్‌లో తిరుగుబాటు చేసిన సిపాయీలు జూన్ 18 న ఢిల్లీ వచ్చారు. వారు వెంట తెచ్చిన ఖజానా సొమ్మునంతను అధికారుల కిచ్చారు. వీరి ప్రతినిధులు జూన్ 20 న ఆంగ్లేయులపై దాడిచేయగలమని వీరి సిపాయీల దర్బారులో ప్రతిజ్ఞ చేశారు. ఆ ప్రకారమే జూన్ 20న ఎందరో విప్లవవీరులు ఢిల్లీ గుమ్మముదాటి శత్రువులవైపు తరలివెళ్ళడం జరిగింది. ఆంగ్లేయులను వెనుకనుండి దెబ్బతీసేందుకై చల్లగా సబ్జిమండి గుండా వెళ్ళారు. అకస్మాత్తుగా వారిపై భయంకరమైన కాల్పులు జరిపి వారిమీదకు పరుగెత్తారు. స్కాట్, మని, టూంబ్స్ మున్నగు ఆంగ్లేయాధి కార్లు తమ ఫిరంగి ప్రయోగాలతో ఈ దాడిని ఆపుచేయాలని ప్రయత్నిం చారుగాని, భారత సైనికుల దార్ఢ్యం అణచరానిదై పోయింది.

చీకటి పడిన తర్వాతకూడా రంగము వేడిగానే వుంది. ఆంగ్లేయులు తమకు చేతనైనదంతా చేశారుగాని, తమ ఫిరంగిని నిలుపుకొనడం తప్ప మరేమీ చేయలేకపోయినారు. అర్ధరాత్రివరకు పోరుసాగింది. సిపాయీల పురోగమనం మాత్రం ఆగలేదు. ఇక ఆంగ్లేయులు తమ శిబిరానికి వెనుక నున్న ఒక ముఖ్యకేంద్రాన్ని సిపాయీలకు వదలి రంగమునుండి విర మించారు.

ఏమి జరుగుతుందో ఉభయులకు తెలియని దశలో జూన్ 23 వ తేదీ సూర్యోదయమైంది. 1857 జూన్ 23 ప్లాసీయుద్ధపు శతవత్సర దినం. వంద ఏండ్లక్రితం ఈ రోజుననే ప్లాసీయుద్ధపు చదరంగంలో భారతీయులకు అదృష్టం వ్యతిరేకమయినది. అసలే పడిపోయివున్న వారికి కొత్త పరాభవాలు, కొత్త అవమానాలు జరుపుతూ నూరేండ్లు సాగి పోయాయి. 'నూరేండ్ల ఈ పరాభవానికి ప్రతీకారం జరగాలి. ఆ అవ మానాన్ని తుడిచివేయాలి, ఈ రాష్ట్రీయ పరాభవ కళంకాలను రక్తంతో కడిగివేయాలి'. ఢిల్లీకోని సిపాయీలందరి కండ్లలో కాంతులీనిన తృష్ణ యిది. ప్రతిప్రభంజనంలోను, ప్రచండ మార్తాండుని ప్రతి కిరణంలోను భయంకరమైన ప్రతి ఫిరంగి మ్రోతలోను, కరకు ఖడ్గముల ప్రతి ఒరపిడిలోను వినవచ్చిన దొకే ఒక నినాదం—ప్లాసీ; ప్లాసీ పరాభవానికి ప్రతీకారం!

ఉదయభానుడు ప్లాసీ శతవత్సర దినాన్ని ప్రకటించగానే విప్లవ శక్తులన్నీ లాహోరు ద్వారంపద్ద చేరనారంభించాయి. ఈ రోజున తమ సర్వశక్తులను కేంద్రీకరించవలసి వుంటుందని ముందే తెలిసిన ఆంగ్లే యులు, తెల్లవారక ముందే తమవారిని రణరంగంలో సిద్ధంగా వుంచు కున్నారు. ఈ ఆందోళనలో తమ రక్షణకు సహాయం పంపవలసిందని పంజాబ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి పంపారు. వారి అదృష్టవశాత్తు ఆనాటి సాయంత్రానికి సహాయం చేరింది.

ఆంగ్లేయుల సహాయానికి కొత్తసైన్యాలు వచ్చాయనే వార్తగాని, ఆంగ్లేయులు తమ వెనుకనున్న రోడ్లు, వంతెనలను నాశనం చేసివేశారనే వార్తగాని ఏవీ విప్లవకారుల ఉత్సాహాన్ని నిరోధించలేకపోయినాయి. వారు సబ్జీమండిగుండా త్రోసుకుపోయి ఆంగ్లేయులపై కాల్పులు సాగించారు. ఆంగ్లేయపదాతివళం వెంటవెంటనే కాల్పులు జరిపిందిగాని విప్లవవీరులు చెంగుచెంగున యెంతగా ముందుకు దూకారో అంతగాను ఈ కాల్పులకు

తిరుగుజవాబు లిచ్చారు. నగరకుడ్యాలలో వున్న ఫిరంగిశక్తులు కూడా అంతే శక్తి సామర్థ్యాలతో పనిజేయ నారంభించాయి.

ఆ రోజంతా ఆంగ్ల శిబిరములోని ప్రతివారు నిర్విరామంగా పోరాడారు. ఇక నిలవడం కష్టమనిపించింది వారికి. కాని వారి సైన్యాధ్యక్షునికి మాత్రం ఇంకా ఆశ అడుగంటలేదు. ఎందువల్లనంటే ఆ ఉదయమే పంజాబునుండి వచ్చిన ఆంగ్లేయ విధేయ సైన్యాలు ఒకసారి ప్రయత్నించడానికి తహతహలాడుతున్నాయి. పురోగమించవలసిందిగా వారికి ఆజ్ఞ యివ్వబడ్డది. క్రిందటి రోజంతా పోరాడి ఆలిసిపోయిన విప్లవకారులు ఈ దాడితో సమువృజ్జీలుగా పోరాడడానికి అస్కారంలేదు, అయినా అలాగే రాత్రయ్యేవరకు విప్లవకారులు పోరాడారు. చివరికి ఉభయ పర్గాలు తమదే విజయం అనుకుంటూ రాత్రికి విశ్రమించాయి. ప్లాసీ శతవత్సరదినం యీ విధంగా యెవరికి విజయ పరాజయాలు లేకుండా ముగిసి పోయింది. ఉభయులూ ఒకరి ధైర్యసాహసాలను మరొకరు ప్రకటించుకుంటూ తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు.

దినదినము ఉభయవర్గాంపు కొత్తసైన్యములందవచ్చాయి. పంజాబునుండి పదేపదే సైన్యములందడంతో ఆంగ్లేయుల శక్తి ఏడువేల వరకు పెరిగింది. రెండవ ప్రక్క రోహిల్‌ఖండ్‌లో తిరుగుబాటు చేసిన సైన్యాలు బఖ్‌త్‌ఖాన్ నాయకత్వాన ఢిల్లీ చేరాయి. బఖ్‌ల్‌ఖాన్ బృందపు ఆగమనాన్ని ఆనాటివారొకరు తమ దినచర్య పుస్తకంలో ఇలా వర్ణించారు: ‘‘జూన్ రెండవ తేదీ ఉదయం రోహిల్‌ఖండ్ సైన్యమును స్వాగతించేందుకై నవాబ్ అహ్మద్ కులీఖాన్ ఇతర గౌరవనీయులతోను, తుపాకులతోను వెళ్ళాడు. రోహిల్‌ఖండ్ సైన్యాధినేత మహ్మద్ బఖ్‌త్‌ఖాన్ సమ్రాట్టును తమ సేవ కంగీకరించవలసినదిగా కోరాడు. సమ్రాట్టు అభీష్టమేమో తెలుపవలసిందని నొక్కి కోరగా సమ్రాట్ ఇలా అన్నాడు: ప్రజంకు పూర్తిరక్షణ కలగాలని, ప్రాణములకు, ఆస్తిపాస్తులకు భద్రత ఉండాలని, ఆంగ్లేయులను

గెంటివేయడమనేది విజయవంతంగా జరగాలని నా కోరిక. అప్పుడా సైన్యాధిపతి- సమ్రాట్టు వాంఛిస్తే విప్లవ శక్తులకు సర్వసైన్యాధిపత్యము వహించటానికి నేను సంసిద్ధుణ్ణి అన్నాడు. అంతట సమ్రాట్టు అనురాగముతో ఖాన్ భుజము చరిచాడు. ఆ తర్వాత వివిధ దళముల నాయకులు సమావేశం చేయబడ్డారు. బఖ్‌త్‌ఖాన్ సర్వసైన్యాధిపత్యము వారందరికి అంగీకార యోగ్యమేనా అని అడిగాడు. అంతా ముక్తకంఠంతో తమ అంగీకారం తెలిపారు. ప్రమాణాలు చేశారు. ఈ రాజసభ అయిపోయిన తరువాత సర్వసైన్యాధ్యక్షుడు తనను విడిగా కలిసేందుకు సమ్రాట్ అనుమతి నిచ్చాడు. బఖ్‌త్‌ఖాన్ సర్వసైన్యాధిపతి అనే వార్త నగరమంతా ప్రకటింపబడ్డది. ఆయనకు ఖడ్గము, కవచము, సర్వసైన్యాధిపతి బిరుదము ప్రసాదింపబడినవి.

బఖ్‌త్‌ఖాన్ ఆగమనం ఢిల్లీ విప్లవాన్ని సుసజ్జితం చేస్తుండగా,అటు ఆంగ్లేయ శిబిరంలోనికి కూడా పంజాబు మున్నగు ప్రాంతాలనుండి శక్తి సంపన్నులగువారు వచ్చి చేరుతున్నారు. అప్పుడే పంజాబునుండి వచ్చిన బ్రిగేడియర్ జనరల్ చాంబర్లైనుకు ధైర్యము, శక్తిసామర్థ్యాలలో సరితూగే వారు ఆంగ్లేయులకు ఏమంత ఎక్కువమంది లేరు. ప్రఖ్యాత సైనిక ఇంజనీర్ బైర్డ్‌స్మిత్ కూడా వచ్చాడు. సిక్కు యుద్ధములో ఖ్యాతిపొందినవారందరిని ఢిల్లీలోని ఆంగ్లేయుల సహాయార్థము జాన్ లారెన్సు పంజాబునుండి పంపాడు. అంతవరకు అనేకమారులు ఆలోచించి వదలివేసిన సూటి పోరాటానికి మరొకసారి సాహసించాలని బ్రిటిష్ కమాండర్ జనరల్ బర్నార్డ్ నిశ్చయించాడు. అంతకు పూర్వము వలెనే ఈ దాడియొక్క వ్యూహరచన నిర్దుష్టంగా జరిగింది. అంతవరకు నిలచిఉన్న ఆంగ్ల సైన్యాలు జులై 3 నాడు మెల్లగా కదిలాయి. ఇంతలో ఎవరో ఒక ఘోరమైన వార్తను తెచ్చారు - వారు ఢిల్లీకి వెళ్ళేశ్రమ లేకుండా బఖ్‌త్‌ఖాన్ వారివైపు తరలి వస్తున్నాడని జులై నాల్గున బఖ్‌త్‌ఖాన్ సాగివచ్చి ఆంగ్లేయులపై వెనుకనుండి వత్తిడి తెచ్చి ఆలీపూర్ వరకు గెంటుకు వెళ్ళాడు.

ఢిల్లీ నగరాన్ని చూడడమంటే దానిని జయించడమేనని బహిరంగ ప్రగల్భములాడుతూ వచ్చిన ఆంగ్లేయులకు అడుగు ముందుకు వేయడం అసాధ్యం కావడమనేది సున్నితమనస్కుడైన బెర్నార్డ్‌కు ఆందోళన కరము, లజ్జాహేతువు అయింది. సిపాయీల దాడులతో అతడికి నిము షముసేపు శాంతి అనేది లేకుండా పోయింది. పైగా రోజు రోజుకు విప్లవ కారులను సాహసోపేతంగా ఎదుర్కొనడానికి సంబంధించిన ఆశలు దెబ్బ తినడంకూడా అతడు గుర్తించకపోలేదు. శారీరకంగా శుష్కించిపోయి, మానసికంగా ఆశలడుగంటి, నిస్పృహచెందిపోయిన కమాండర్ బెర్నార్డ్ చివరకు జూలై 5న కలరా వాతబడ్డాడు. ఇది ఆంగ్లేయ శిబిరానికి ఒక అఘాతమైంది. ఢిల్లీ నగరాన్ని ప్రవేశించడానికి ప్రయత్నించి శ్మశాన వాటికను చేరిన ఆంగ్ల సైన్యాధిపతులలో ఇతడు రెండవ వ్యక్తి. ఇప్పుడు జనరల్ రీడ్ ఆధిపత్యం వహించి మూడవవాడైనాడు. జూలై 15 న జరిగిన దాడిలో బ్రిగేడియర్ జనరల్ చాంబర్లిన్ ఒక సిపాయిచేత కాల్చి వేయబడ్డాడు.

దీనితో జనరల్ రీడ్‌కు గుండెలు పూర్తిగా జారిపోయినాయి. మరణం తప్పించుకునే ఆశతో రాజీనామా చేసి హిమాలయాలకు విరమిం చాడు. ఆంగ్లసైన్యాం కితడు మూడవ అధిపతి, ఇద్దరు మట్టిలో కలసి పోయినారు. ఇతడు రాజీనామా చేయడంతో బ్రతికిపోయినాడు. అయినా ఢిల్లీ మాత్రం వశంకాలేదు. మరణించింది కొద్దిమందే అయినా అది ఆంగ్లేయులను స్పష్టంగా బలహీనపరచింది. అందువల్ల వారు కేవలం ఆత్మరక్షణ విధానం మాత్రమే అవలంబిద్దామని నిర్ణయించుకున్నారు. తమ దాడులవల్ల విప్లవశక్తులు బలహీనపడనూ లేదు. వారి దాడులు ఆగనూ లేదు. ఈ పరిస్థితుల మధ్య మూడవ అధికారి కూడా విరమించ డంతో ఆంగ్లేయులు ఢిల్లీపై దాడి చేసే ఆశలే వదులుకుంటున్నారు. దాడి చేయడమా లేదా అనేది ప్రధాన కేంద్రములోనే చర్చనీయాంశమై పోయింది. మూడవ అధికారి విరమించి నాల్గవవాడుగా బ్రిగేడియర్ జనరల్ విల్సన్ సైన్యాధిపత్యం స్వీకరించే సమయానికి పరిస్థితి ఇది.

# హేవ్‌లక్

అల్హాబాద్ కోటను సిక్కు సిపాయీలు విప్లవకారులకు కాకుండా అంగ్లేయులకు వశం చేయడంతో ఆంగ్లేయులు తమ సైనికచర్యలకు దానిని కేంద్రం చేసుకున్నారు. విప్లవం అణగిపోయేవరకు రాజధానినే అల్హాబాద్‌కు మార్చుదామనుకున్నాడు లార్డ్‌కానింగ్. ఆ ప్రకారమే కొద్ది రోజులలో అల్హాబాద్‌లో నివసించేందుకై వచ్చాడు. కాని ఇంతలోనే కాన్పూర్‌లోని ఆంగ్లేయుల విచారకర పరిస్థితి, వారి ఆర్తనాదాలకు సంబంధించిన సమాచారం వచ్చింది. అందువల్ల జనరల్ నీల్ అల్హాబాద్‌లో రక్షణకై కొద్ది సైన్యము నుంచి, మిగిలినవారిని మేజర్ రేనౌడ్ నాయకత్వాన కాన్పూర్‌ను వశం చేసుకునేందుకై పంపాడు. దారిన కనపడ్డ ప్రతి గ్రామాన్ని విచక్షణారహితంగా ధ్వంసం చేసుకుంటూ ఆ సైన్యం సాగివెళ్ళింది.

అప్పుడే కాన్పూర్ సైన్యాధిపతిగా నీల్‌స్థానే హేవ్‌లక్ నియమింపబడ్డాడు. జూన్ మాసాంతానికి అతడు అల్హాబాద్ చేరాడు. అల్హాబాద్‌లోని ప్రధానాధికారిగా హేవ్‌లక్ నియమింపబడటంతో నీల్‌కు కడుపు మండిపోయినా, ఆంగ్లరాజ్యాధిపత్యానికి శ్రేయస్కరం కాదు కనుక అతడు దాని నెంతమాత్రం బయటపడనీయలేదు. హేవ్‌లక్ క్రింద ఉన్న సైన్యాలకు అవసరమైన సహాయమంతా ఇచ్చాడు. సైనిక కార్యాలయంలో ఏర్పాటులన్నీ చేశాడు. హేవ్‌లక్ రాగానే సైన్యములను ఆయనకు వప్పగించాడు.

ఈ సైన్యం కాన్పూరులోని ఆంగ్లేయులకు సహాయంగా వెళ్ళేం దుకు పూర్తిగా సంసిద్ధమై ఉన్నది. సర్ హగ్ వీలర్ ఓడిపోయి లొంగిపోయినాడని, గంగానది తీరాన అతడితో సహా ఆంగ్లేయులందరూ హతులైపోయినారని వార్త రాగానే హేవ్‌లక్ బయల్దేరి పోవాలని తహ తహలాడిపోయినాడు.

మేజర్ రేనౌడ్ నాయకత్వాన ఫతేపుర్ వైపుకు ఆంగ్ల సైన్యాలు తరలి వెళ్తున్నాయని కాన్పూర్‌కు వార్త రాగానే నానాసాహెబ్ కొంత సైన్యాన్ని అటువైపు పంపాడు. జ్వాలాప్రసాద్, టీకాసింగ్‌ల నాయ కత్వాన నడచిన ఈ సేన శత్రువులను కొద్దిసేపటిలోనే ఓడించి వేయవచ్చు ననే విశ్వాసంతో ఫతేపుర్ చేరింది. కాని అప్పటికే హేవ్‌లక్ సైన్యాలు రేనౌడ్ సైన్యాలను చేరాయి. విప్లవవీరులు చేరారని వినగానే ఉభయులూ కలిసి కాల్పులు ప్రారంభించారు. పోరు ప్రారంభమైంది. విప్లవకారులు తమ తుపాకులను వదలి తిరోగమించవలసి వచ్చింది. వారిని వెంటాడటం అసాధ్యం. అందువల్ల ఆంగ్లేయులు ఆ ప్రయత్నము విరమించి ఫతేపుర్ నగరంలో ప్రవేశించారు. క్షణంలో వారు నగర మంతటిని బూడిద చేసి వేశారు. లూటీ చేశారు. నగర ప్రజలను సజీవ దహనం చేశారు.

ఈ వార్త నానాసాహెబ్ శిబిరానికి చేరింది. దీనికి ప్రతీకారం చేసేం దుకు నానాసాహెబ్ తనకు బందీలుగా ఉన్న ఆంగ్లేయులందరిని వధించ వలసిందిగా ఆజ్ఞ చేశాడు. ఇలా హతులైన వారిలో ఆంగ్లస్త్రీలు చాలా మంది ఉన్నారు. వారిలో అనేకులు విప్లవవీరులకు వ్యతిరేకంగా గూఢ చారులుగా పనిచేశారని ఋజువైంది. ఈ వధతో విప్లవకారులు ఆంగ్లేయు లకు లెక్కకులెక్క చెప్పజెప్పారు.

దాదాపు ఇదే సమయంలో పాండునది వద్ద నానాసాహెబ్ సైన్యా లను ఓడించి హేవ్‌లక్ ముందుకు సాగివెళ్తున్నాడు. చిన్నపోరులో నానా

సాహెబ్ సోదరుడు బాలా సాహెబ్ పీష్వాకు భుజములో గుండు తగిలింది. ఆతడు కాన్పూరు చేరాడు. భవిష్యత్ పథకాన్ని నిర్ణయించేందుకు నానాసాహెబ్ సమర మండలిని సమావేశపరచాడు.

జూలై 10 వ తేదీకి ఆంగ్ల సైన్యము కాన్పూర్ దాపునకు చేరింది. కాన్పూర్‌లో జరిగిన పథం ఉదంతం వారి కింకా తెలియలేదు. కాన్పూర్ మేడలు మిద్దెలు కంటపడగానే హేవ్‌లక్, విప్లవ సైన్యాల వైపు గూఢ చారులను పంపాడు. పాండ్యుల నేతృత్వములోని సైన్యము రంగమంతా చక్కగా విస్తరించి ఉంచబడ్డది. జీవితమంతా రణరంగములోనే గడపిన ఒక ఆంగ్ల వీరుడు దానిని చూచి విప్లవకారులలో అసాధారణమైన సైనిక నిపుణు లున్నారని గుర్తించాడు. సంకుల సమరము తర్వాత విప్లవకారులు ఓడింపబడ్డారు. వారు బ్రహ్మపుత్రము వైపు తిరోగమించవలసి వచ్చింది. వీరోచితమయ్యు దురదృష్టకరమైన ఈ సమరములో నానాసాహెబ్ స్వయముగా నిర్వహించిన పాత్ర అల్పము కాదు.

జూలై 17 న విజయము గాంచిన హేవ్‌లక్ సైన్యాలు కాన్పూరు నగరములో ప్రవేశించాయి. పోయిన ఆంగ్లేయుల ప్రతిష్ఠను కాపాడే విధంగా హేవ్‌లక్ విజయ తరంగాన్ని కాన్పూర్‌వరకు కొనితెచ్చినందుకు భారత్, బ్రిటన్‌లలోని ఆంగ్లేయు లందరూ ఆయనను ఆశీర్వదించారు.

కాన్పూర్‌ను లూటీ చేసేందుకు ఆజ్ఞ లభించగానే వందల కొలది ఆంగ్ల సైనికులు, అధికారులు సిక్కులతో కూడ కలిసి గాయపడ్డ సింహముపై గ్రద్దలవలె విరుచుకుపడ్డారు. నానాసాహెబ్ బందీలైన తమ సోదరులకై నిర్వహింపబడిన వధలకు ఆంగ్లేయులు ప్రతీకారం చేశారు. హేవ్‌లక్‌కు సంబంధించినంతవరకు అది సర్ హగ్ వ్హీలర్ మరణానికి సరియైన జవాబుకూడా.

దీని వెంటనే జనరల్ నీల్ కూడా తగినంత సైన్యమును అల్హాబాద్‌లో ఉంచి కాన్పూర్‌కు వచ్చాడు. ఇలా సమాన హోదా కలిగిన

ఇరువురు అధికారులు కలవగానే సైన్యమునంతను ఎవరికి వారు తమ చేతి క్రిందకు తెచ్చుకోవాలని ప్రయత్నించడము, అసలే అస్తవ్యస్తమై ఉన్న ఆంగ్ల సైన్యము మరింత అల్లకల్లోలం కావడము సంభవము. ఈ వ్యక్తిగత మాత్సర్యమువల్ల ఆంగ్లేయుల ప్రయోజనములు దెబ్బతినకుండా నీల్ కాన్పూరు రక్షణకు ఉండిపోయినాడు. హేవ్‌లక్ లక్నో రక్షణకై వెళ్తున్న సైన్యాలకు నాయకుడుగా ఔధ్‌వైపు వెళ్ళాడు.

కాన్పూర్ రక్షణకు నీల్ కొత్తపథకం వేశాడు. మహాసరుంతో ఆయన ఒక దళాన్ని ఏర్పరచి, నగర రక్షణ బాధ్యత దానికి వప్పగించాడు. అగ్రవర్ణస్తులపై వీరిని రెచ్చగొట్టే ఈ ఎత్తుగడ అద్భుతంగా పనిచేసింది. హిందూ ముస్లిముల మధ్య విభేదాలు సమసిపోవడంతో ఈ వర్ణవిభేదం ప్రయోగించబడ్డది.

కాన్పూర్ పరాజయంతో నానాసాహెబ్ బ్రహ్మావర్తమును వదలి తన ఖజానా, సైన్యముతో గంగానదిని దాటివెళ్ళాడు. ఆయన శిబిరం ఫతేఘర్‌వద్ద ఉన్నది. నానా ఉన్న స్థావరం సరిగా తెలియక హేవ్‌లక్ నేతృత్వంలోని ఆంగ్లసైన్యము లక్నోవైపు తరలి వెళ్ళింది.

# బీహారు

బీహారు ప్రాంతము, దాని రాజధాని పాట్నా సమరానికి దూరంగా ఉండలేదు. ఆంగ్లేయులను తీవ్రముగా ద్వేషించిన పాట్నానగరం వారిని గెంటివేసేందుకై 1852లోనే రహస్య సంఘం స్థాపించింది. ఆ సంఘ సభ్యులలో పలుకుబడిగల వ్యాపారులు, బ్యాంకర్లు, జమీందారులు చాలా మంది ఉన్నారు. దీనివల్ల ఆ సంఘానికి మంచి నిధులుకూడా ఉన్నాయి.

ఈ రహస్య సంఘానికి కేంద్రస్థానం పాట్నా. నగరములోని వివిధ వర్గాలకు చెందిన ప్రజలందరూ దీనికి ఆధారం. పోలీసులు కూడా దీనిలో చేరినందున దీని కార్యకలాపాలు నిరాఘాటంగా సాగిపోయినాయి. సంఘ సభ్యులు ఎందరినో విప్లవకారులను ఏదో ఒక మిషతో తమ క్రింద ఉద్యోగములలో ఉంచుకొని సంఘ నిధులనుండి జీతము లిస్తుండేవారు.

అచిరకాలములోనే ఆ ప్రాంతరక్షణకై అచ్చటవున్న సిపాయీల తోను, జమీందార్లతోను, రాజులతోను, వివిధ జిల్లాలలోని నగర ప్రముఖులతోను, సంబంధ బాంధవ్యాలు నెలకొల్పబడ్డాయి. అందరూ పాట్నా రహస్య సంఘంతో చేతులు కలిపారు. దానపూర్‌లోని సిపాయీలు రహస్య సమావేశాలు, తిరుగుబాటు పథకాలు ప్రారంభించారు. చివరకు విప్లవాన్ని ఏక్షణాన ప్రారంభించాలనే విషయముపై చర్చలు జరుగుతుండగా బ్రిటిషు కమీషనర్ టేలర్‌కు మీరట్‌వార్త అందింది. తర్వాత దానపూర్ సిపాయీలలో కూడా అశాంతి చెలరేగిందనే వార్త కూడా అందింది. కమీషనర్

పాట్నా రక్షణార్థం రాత్రే ఆధిపత్యాన 200 మంది సిక్కులను పంపాడు. సిక్కులు బయల్దేరారు. ఈ లోపున టేలర్, విప్లవంతో సంబంధం ఉన్నదనే ఆరోపణతో ఆ ప్రాంతంలోని పలువురిని నిర్బంధంలోకి తీసుకున్నాడు. అ తర్వాత పాట్నాలో ఎవరూ ఆయుధాలు ధరించరాదని, రాత్రి 9 గంటల తర్వాత ఎవరూ తమ ఇండ్లు వదలి వెళ్ళరాదని ఆజ్ఞలు జారీచేశాడు. ఈ ఆజ్ఞతో రహస్య సంఘపు రాత్రి సమావేశాలు అసాధ్యమైపోయినాయి. ఆయుధాలను ప్రోగుచేయడం కూడా కష్టమైపోయింది. అందువల్ల పాట్నాలోని విప్లవసంఘం,ధైర్యంగా హఠాత్తుగా విజృంభించాలని నిర్ణయించారు. జూలై 3 వ తేదీన ముస్లింలు పీర్ ఆలీ అనే ముస్లిం ఇంటిపద్ద మూగి, ఆయన నేతృత్వంలో విప్లవకారులు నిరర్థకమైన ఒక చిన్న పోరాటం చేశారు. అందరి ఆరెస్టులతో అది ముగిసిపోయింది.

పీర్ ఆలీ మొదట లక్నో నివాసి. పాట్నాలో పుస్తక విక్రేతగా స్థిరపడ్డాడు. తాను విక్రయించే పుస్తకాలను చదివి స్వాతంత్ర్య భావాలలవరచుకున్నాడు. అతడు చిన్న పుస్తక విక్రేతే అయినా పాట్నా విప్లవ మండలిలో ఆయనకు మంచి పలుకుబడి ఉన్నది. పాట్నాలోని ఆంగ్లేయాధికారి టేలర్ అమానుషచర్యలు ప్రారంభించేసరికి పీర్ ఆలీకి కోపము ఆగలేదు. తన దేశీయులు పడుతున్న యమయాతనలను సహించలేక తాను అనుకున్నదానికన్నా ముందు తిరుగుబాటు చేశానని తర్వాత తెలియజేశాడు. ఆయన తన సహచరులతో నిర్బంధింపబడిన తరువాత పీర్ ఆలీకి ఉరిశిక్ష విధించారు. చేతులపై బిగుతైన బేడీలు వేశారు. చేతులు నెత్తురు కారుతున్నవి. తనకై పొంచిచూస్తున్న మృత్యుదేవతను ధిక్కరించచూస్తూ వీరోచితహాసముతో ఉరికంబముపై నిలబడ్డాడు. తన ప్రియమైన పుత్రుని మాట వచ్చినప్పుడు మాత్రం కాస్త కన్ను చెమ్మగిల్లింది. వెంటనే అక్కడ ఉన్న ఆంగ్లేయాధికారి ''పీర్ ఆలీ! నీవు ఇతర విప్లవకారుల పేర్లు చెప్పితే ఇప్పటికైనా బ్రతికి బయటపడగలవు'' అన్నాడు. పీర్ ఆలీ ఆ ఫిరంగీ

వంక ప్రశాంతంగా చూచి గంభీరంగా ఇలా అన్నాడు: "జీవితంలో ప్రాణ రక్షణకు వాంఛనీయమైన సమయాలు కొన్ని ఉంటాయి. కాని అంతకన్నా ఎక్కువగా ప్రాణత్యాగం వాంఛనీయమైన సమయాలు కూడా కొన్ని ఉంటాయి. ప్రస్తుత క్షణ మలాంటిది. ఇప్పుడు మృత్యుదేవతను కౌగిలించు కొనడం అమరత్వాన్ని పొందడమే!" ఈ మాటలతో పీర్ ఆలీ మృత్యు దేవత నాహ్వానించి అమరవీరుడైనాడు. ఈయన మరణం దానపూర్‌లోని విధేయులగు సైనికుల తిరుగుబాటుకు సైగచేసినట్లయింది. కంపెనీ దుస్తులను గిరవాటువేసి ఆ విప్లవ సైనికులు జగదీశ్‌పూర్ వైపు వెళ్ళారు. అక్కడ వారికొరకై ఒక నేత వేచియున్నాడు. ప్రఖ్యాత రాజపుత్ర వంశమున జన్మించిన కుమరసింగ్ అతడు. అజేయ శక్తి సంపన్నుడు, వార్ధక్యంలో కూడా తొణికిసలాడే యవ్వన తేజముగల వీర పురుషుడు! తరతరాలుగా సంక్రమించిన షహాబాద్ ప్రాంత ఆధిపత్యమాతనిది.అచ్చటి ప్రజలకు ఆ ప్రాచీన వంశము యెడ సహజమైన ప్రేమాభిమానాలున్నాయి.

డల్హౌసీ ఔధ్ సంస్థానమును కబళించిన తరువాత ఆంగ్లేయులు హిందూస్థానమందలి స్థానిక రాజవంశాలను విచ్ఛిన్నం చేయ నారంభించారు. ఈ ఉద్యమంలో కుమర్‌సింగ్ ప్రాంతం కూడా బలి అయింది. తన ప్రజలను నాశనం చేసిన ఆంగ్ల పరిపాలనను ఛిన్నాభిన్నం చేస్తానని కుమర్‌సింగ్ ప్రతిన బూనాడు. వెంటనే నానాసాహెబ్‌తో సంబంధాలు పెట్టుకున్నాడు.

దానపూర్ సిపాయీలు ఈ వృద్ధ పరిపాలకుని మీదకు రాగానే, తా నెదురుచూస్తున్న అవకాశం రానేవచ్చినదని, 80 ఏండ్ల ఆ వృద్ధవీరుడు, పాట్నావరకు ఏనుగుపై వెళ్ళేశక్తి లేకపోయినా, హఠాత్తుగా ఉత్తేజితుడై, శయ్యనుండి లేచి రణరంగములోనికి దూకాడు.

సిపాయీలు తర్వాత జగదీశ్‌పూర్ నుండి అర్రాకు వెళ్ళారు. అది షహాబాద్ జిల్లా ముఖ్య పట్టణం. ఖజానాను దోచుకున్నారు. ఆంగ్లేయుల

జైళ్ళను, కార్యాలయాలను, పతాకాలను నాశనం చేశారు. చివరకు ఆ చిన్న దుర్గమువైపు తిరిగారు. జిత్తులమారి ఆంగ్లేయులు ఆయుధములను, ఆహార పదార్థములను అవసర సమయంలో తమ ఉపయోగానికి అక్కడ దాచుకున్నారు. పైగా పాట్నా నుండి 50 మంది సిక్కులు వారి రక్షణకై పంపబడ్డారు. వీరంతా కలిసి సుమారొక 75 మంది లోపల సంసిద్ధులై ఉండగా సిపాయీలకు అవకాశం వచ్చింది. ఆ ప్రదేశం వశం చేసుకొన బడ్డది.

ఈ దుర్గపు స్వాధీన చర్యలు మూడు రోజులపాటు జరిగాయి. మూడవ రోజు రాత్రి, 29 వ తేదీన, దూరాన తుపాకి మ్రోతలు విని ఆంగ్లేయులు హఠాత్తుగా నిద్రలేచారు. ఈ లోపున దాదాపు 270 మంది ఆంగ్ల సిపాయీలు, కెప్టెన్ డన్‌బర్ నాయకత్వాన 100 మంది సిక్కులు షాన్ రివర్ వద్దకు చేరారు. పడవలు మెల్లగా బయల్దేరాయి. సాయంత్రం ఏడు గంటలకు ఆ సైన్యమంతా అర్రా పొలిమేరలకు చేరాయి.

పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. ఆంగ్లేయులకు శత్రువు జాడ మాత్రం ఎక్కడా కనపడలేదు. ఇంతలో హఠాత్తుగా అన్ని వైపుల నుండి తుపాకీ గుండ్ల వర్షం ప్రారంభమైంది. చిక్కని మామిడితోపుల చీకట్లలో మిట్ట పల్లాల మధ్య కుమర్‌సింగ్ సేనలు దాగి ఉన్నాయి. పైకి ఎవరూ కనిపించడము లేదు. ఆంగ్లేయుల తెల్లని దుస్తులు తేలికగా గుర్తుపట్టేందుకు వీలుగా ఉన్నాయి. కాని కుమర్‌సింగ్ సైనికుల దుస్తులు చీకటిలో కలిసి పోయేవిగా ఉన్నాయి. ఈ గుండ్ల వర్షములో ఆంగ్లేయులు, సిక్కులు రంగము వదలి పారిపోయినారు. మొదటే హతులై పోయినవారిలో చేరాడు-కమాండర్ డన్‌బర్. కుమర్‌సింగ్ బారినుండి తప్పించుకు పారిపోవడం కూడా తేలిక కాదు. అడుగడుగునా రక్తం చిందిపోయింది.

పారిపోతున్న ఆంగ్ల సైన్యాలు షాన్‌నదిని చేరేసరికి వారి పడవలు అక్కడ కనపడలేదు. పడవల్లో చాలా భాగం అక్కడ ఇసుకలో కూరుకు

పోయినాయని చాలా సేపటికి గుర్తించగలిగారు. తమవారు విజేతలై సమర గీతాలు పాడుకుంటూ, అర్రా సిపాయీలను బందీలుగా తెస్తారని, వారిని అభినందించాలని ఆశతో నదీ తీరానికి చేరిన దానపూర్ ఆంగ్లేయులకు, పడవల నుండి ఒక్క విజయ నినాదమూ వినరాలేదు; 415 మంది ఆంగ్లేయులకు గాను కేవలం 57 మంది మాత్రమే కుమర్‌సింగ్ బారినుండి తప్పించుకు ప్రాణాలతో బయటపడ్డారనే భయంకరమైన వార్త అన్ని వైపులా వ్యాపించింది. ఈ వార్త వ్యాపిస్తుండగానే, ఈ పరాజయాన్ని తీర్చుకునేందుకు మేజర్ ఐర్ అర్రావైపు సైన్యాలు తీసుకుని బయల్దేరాడు. డన్‌బర్ పరాజయాన్ని గూర్చి అతడు వినకపోయినా, ఆంగ్లేయులు ఓడిపోయినారని విని అర్రాకు వెళ్ళాడు.

డన్‌బర్ సైన్యాన్ని అణచివేసి జూలై 29, 30 లలో కుమర్‌సింగ్ సైన్యాలు తిరిగి వస్తుండగా, ఐర్ అర్రావైపుగా వెళ్తున్నాడనే వార్త విన్నారు. క్షణం వృధా చేయకుండా ఆ వృద్ధసేనాని తన సైన్యాలన్నిటిని ప్రోవుచేశాడు. కాని ఐర్ కుమర్‌సింగ్ సైన్యాలను ఓడించి అర్రా దుర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆ వెంటనే ఆంగ్ల సైన్యాలు అతడిని స్వస్థానము వెడలనడిసి జగదీశ్‌పూర్‌కు తరిమికొట్టాయి. కాని ఆంగ్లేయులు రాజమందిరాన్ని, హిందూ దేవాలయాలను, అన్యభవనాలను సర్వనాశనం చేసినను, ఆ మందిరాల అధిపతి, ఆ ఆలయాల దేవుడు, ఆ భవనాల యజమాని అయిన కుమర్‌సింగ్ సమరం తర్వాత కూడా అజేయుడుగానే వున్నాడు. తమ రాజధానులు కూలిపోతే వేరే రాజు లెవరికైనా ధైర్యం చిరికి పోవచ్చునేమో గాని జగదీశ్‌పూరు రాజా ఆ కోవకు చెందినవాడు కాదు. ఆయన మాట ఒకే ఒకటి: ''నేనెక్కడ ఉంటే అక్కడే జగదీశ్‌పూర్ ఉంటుంది." అందువల్ల ఆయనను బందీ చేయకుండా జగదీశ్‌పూర్‌ను వశములో వుంచుకొనడమనేది అసాధ్యమైన విషయం. ఆయనకు స్వగృహం పోవడంతో, రణరంగాన్నే ఆయన స్వగృహం చేసుకున్నాడు.

# ఢిల్లీ పతనం

ఢిల్లీ వెలుపల ఉన్న మూడవ ఆంగ్ల సైన్యాధిపతి రాజీనామా చేయడంతో బ్రిగేడియర్ జనరల్ విల్సన్ ఆయన స్థానంలో నియమింపబడ్డాడు. విప్లవవీరుల దాడులతో మతి చలించి పోయిన ఆంగ్ల శిబిరములో అధైర్యము ప్రబలిపోయి,'అసలు తిరుగు దాడి చేయడమా ? మానడమా'? అనే ప్రశ్న కూడా వచ్చింది. ఢిల్లీని చుట్టుముట్టడంలో ఆంగ్లేయులకు ఒక సౌకర్యమున్నది. ఎందువల్లనంటే విప్లవ సైన్యాలు ఒకేచోట ఇరుక్కొని ఉన్నాయి. ఆ మహాసైన్యము అలా కాక నలుదిశలా వ్యాపించి, చిన్న చిన్న ముఠాలుగా చీలి, ఆంగ్లేయులను చీకాకుపరచినట్లయితే, ఆ గెరిల్లా యుద్ధము ఆంగ్లేయులను శక్తిహీనులను చేసివుండేది. ఒకవేళ ఢిల్లీ అధీనం తప్పినా సిపాయీలు నలువైపుల సర్దుకొని ఉండవలసింది.

ఆ క్షణాన భారతదేశంలోని ఆంగ్ల శక్తి బొటాబొటిగా ఉన్నది. ఆ సమయంలో ధైర్యవంతుడు, దుస్సాహసి అయిన బైర్డ్‌స్మిత్ వంటి అధికారి ఢిల్లీ వెలుపల ఉండడం ఆంగ్లేయుల అదృష్టం. మిగిలిన అఫ్‌సర్లు అందరూ తిరోగమిద్దామంటుండగా అతడు దృఢనిశ్చయంతో "ఢిల్లీపై మన అధికారాన్ని ఒక్క అంగుళం మేరకూడా వదలుకొనం. ఢిల్లీ ముట్టడిని వదలితే పంజాబ్ అంతా చేయి దాటిపోతుంది. భారతదేశమే చేయి దాటిపోతుంది. ఆంగ్ల సామ్రాజ్యమే శాశ్వతంగా నాశనమయి పోతుంది" అని గర్జించాడు.

ఈ మాటలతో ఉత్తేజితుడై పోయి, బ్రిగేడియర్ విల్సన్ ఢిల్లీ వశము చేసుకొనకుండా తిరిగిపోరాదని నిశ్చయించుకున్నాడు. రెండవ ప్రక్క విప్లవకారులు అసాధారణమైన ధైర్యసామర్థ్యాలతో ముట్టడి నెదుర్కొన్నారు. ఉత్తర భారతమందలి తంతి, తపాలు, రైల్వేలు మున్నగునవి అన్నీ భగ్నం చేయబడ్డాయి. ఆంగ్లేయులు ఢిల్లీని ఎంతగా ముట్టడి చేశారో, విప్లవకారులు ఆంగ్లేయులను కూడా అంతగా ముట్టడి చేసినట్లయింది. ఢిల్లీకి దక్షిణాన ఏమి జరుగుతున్నదో, కలకత్తానుండి బయల్దేరిన సైన్యము చేరినదో లేదో; లక్నో, కాన్‌పూర్, వారణాసి మున్నగు స్థానాలలోని పరిస్థితి ఏమిటో - ఏదీ ఆంగ్లేయులకు అర్థంకావడంలేదు. కలకత్తానుంచి ఇంకా సైన్యాలు తెచ్చుకొనే ఆశ ఏమీ లేదు. భారమంతా పంజాబుమీద పడ్డది. ఈ భారమును సర్ జాన్ లారెన్సు బాగా భరించాడు. తరచు ఆంగ్ల సైన్యాలను, సిక్కు సైనికులను కూడా పంపాడు. ఈసారికూడా నికల్సన్ నేతృత్వంలో 2 వేలమందిని పంపాడు. ఈ సైన్యపు ఆగమన వార్త అందగానే ఆంగ్ల శిబిరములో ప్రతివారిముఖము ఆశ, ఆనందము ఉత్సాహములతో నిండిపోయింది. రెండువేలమంది సైనికులు వస్తున్నారనే వార్తకన్నా, నికల్సన్ కమాండరనే వాస్తవం వారిని ఎక్కువ ఉత్సాహ పరిచింది.

మంచి నాయకులు లభించడం ఆంగ్లేయ శిబిరంలో విజయానికి సంబంధించిన భయసందేహాలను తొలగించడంతోపాటు, విప్లవ వీరులకు మంచి నాయకులు లేకపోవడంతో వారి పరాజయం నిశ్చయమనే అభిప్రాయం కల్గించింది. వారు గద్దెపై నెక్కించిన వృద్ధ సమ్రాట్ కూడా వారితోపాటు మంచి నాయకులకోసం ప్రయత్నిస్తున్నాడు. ఆయన చాలా ప్రయత్నాలు చేశాడు. ఏవీ ఫలించలేదు. జయపూర్, జోధ్‌పూర్, బికనీర్, అల్వార్ మున్నగు సంస్థానాధీశు లందరికీ స్వయముగా లేఖలు వ్రాసి, ఫిరంగీలను తరిమివేయడంలో తనతో కలియవలసిందిగా ఆహ్వానించాడు. అవసరమైతే

తాను రాజీనామాచేసి రాజ్యాధికారాన్ని ఎన్నికైన సంస్థానాధీశుల మండలికి వప్పగించగలనని కూడా సూచించాడు.

సమర్థుడైన నాయకుడు లేకపోవడంతో విప్లవకారుల వీరోచితమైన శక్తి వ్యర్థమవుతుండగా, శత్రుశిబిరానికి నికల్సన్‌వంటి సమర్థుని సైన్యాధిపత్యపు ప్రయోజనం లభించింది. దీనితో మొదటిసారిగా ఢిల్లీలో నిరాశా ఛాయలు కానవచ్చాయి. నీముచ్, బెరిల్లీ సేనలు ప్రస్తుత పరిస్థితికి బాధ్యత మీదంటే మీదని పరస్పరం విమర్శించుకున్నాయి. ఎదురుతిరిగే స్వభావము గల సిపాయీలు, తమకు జీతాలు సరిగా ముడుతున్నప్పటికీ జీతాలను పెంచవలసినదనీ, లేకపోతే నగరములోని ధనవంతులను దోచుకుంటామని బెదిరించారు.

అప్పుడు సమ్రాట్టు సూచనపై బఖ్‌త్‌ఖాన్ సిపాయిలను, సిపాయీ నాయకులను, ప్రముఖపౌరులను సమావేశపరిచి, ''యుద్ధమా? లొంగిపోవడమా?'' అని ప్రశ్నించాడు. వెంటనే ఆకాశం బ్రద్దలయ్యేటట్లుగా''యుద్ధము యుద్ధమే''నని జవాబు వచ్చింది.

ఈ ఉత్సాహ ప్రకటనతో సర్వత్రా విశ్వాసం వ్యాపించింది. విప్లవ సైన్యమంతా-బెరిల్లీ, నీముచ్ సిపాయీలతోసహా-ఆంగ్లేయులపై దాడికై నజాఫ్‌ఘర్‌వైపు పురోగమించింది. నజాఫ్‌ఘర్ చేరినతర్వాత నీముచ్ సిపాయీలు బెరిల్లీదళం వున్నచోట శిబిరం చేయడానికి వ్యతిరేకించారు. శత్రువుకు వ్యతిరేకంగా అంతా కలిసివుండడానికి మారుగా వారు బఖ్‌త్‌ఖాన్ ఆజ్ఞలను తిరస్కరించి ప్రక్కనున్న గ్రామంలో మకాము చేశారు.

ఆంగ్లేయులు ఈ వార్త వినగానే, కొత్త సైన్యాధిపతి నికల్సన్, ఎన్నికైన సైన్యాన్ని తగినంతగా తీసుకొని త్వరితగతిని నజాఫ్‌ఘర్‌వైపు తరలివెళ్ళాడు. బఖ్‌త్‌ఖాన్ ఆజ్ఞలను తిరస్కరించి విడిగా మకాము చేసిన నీముచ్ సైనికులపై హఠాత్తుగా దాడి చేశాడు. ఇటు అసంసిద్ధంగా, అసజ్జి

తంగా, చెల్లాచెదురుగాఉన్న విప్లవకారులు; అటు నికల్సన్ ఆజ్ఞకు బద్ధులై, సుసజ్జితంగా, హెచ్చరికతో, జాగ్రతగా జరుగుతున్న దాడి! నీముచ్ సిపాయీలు సర్వనాశనమైపోయినారు. బుందేల్‌కీసరాయ్ తర్వాత విప్లవకారులు అంత ఘోర పరాజయాన్ని ఎన్నడూ పొందలేదు. నీముచ్ దళమంతా ఆరోజునే నేలకొరిగింది.

ఆగష్టు 25 నాటి ఆ విజయం ఆంగ్ల శిబిరముపైనున్న నిరాశా మేఘాలను పటాపంచలు చేసివేసింది. జూన్‌మాసం తర్వాత వారి నిజమైన విజయమిది ఒక్కటే. ఇక ఇప్పుడు ఢిల్లీపై దాడి చేయడానికి ప్రతి ఒక్కరు ఆతృత చూపుతున్నారు. చివరి దాడికి పథకం తయారు చేయవలసిందిగా కమాండర్ విల్సన్ బైర్ట్‌స్మిత్‌కు ఆజ్ఞయిచ్చాడు. పంజాబు నుండి కొత్తదాడి పటాలం కూడా ఆంగ్లశిబిరానికి భద్రంగా చేరింది.

సెప్టెంబరు 14 వచ్చింది. ఆంగ్లసైన్యం నాల్గు విభాగాలుగా చీలింది. కాబూల్‌గేట్ ఛేదించి ఢిల్లీలో ప్రవేశించేందుకై నికల్సన్ నేతృత్వంలో మూడుదళాలు ఎడమవైపున, మేజర్ రీడ్ నాయకత్వాన నాల్గవదళం కుడివైపున సిద్ధంగా ఉన్నాయి.

అంతవరకు గోడలను బ్రద్దలుచేస్తున్న ఆంగ్లేయుల తుపాకుల ధ్వనులు, సూర్యోదయమయ్యేసరికి హఠాత్తుగా ఆగిపోయినాయి. ఆంగ్ల శిబిరాన్ని క్షణంపాటు నిశ్చల నిశ్శబ్దం ఆవరించింది. ఆవెంటనే ఒక్కపెట్టున నికల్సన్ క్రిందఉన్న దళం గోడను ఢీకొన్నది. కాశ్మీర్ బాస్టియన్‌లో ఏర్పడ్డ బీటవరకు మొదటిదళం చేరింది. లోపలనుండి విప్లవకారుల తుపాకులు నిప్పులు కక్కుతున్నాయి. ఆంగ్లేయులు కుప్పలు కుప్పలుగా కందకాలలో కూలారు. కాని కొందరు బురుజులవద్దకు చేరగలిగారు. ఒక నిచ్చెన వేశారు. క్రమంగా ఎక్కనారంభించారు. విప్లవకారులు తెగించి పోరాడారు. మళ్ళీ వందలకొలది సైనికులను కూల్చారు. ఘోరంగా దెబ్బ

తింటూ కూడా ఆంగ్ల సైన్యాలు ముందుకు సాగాయి. చివరకు వారు పెద్ద బీట వేశారు. ఢిల్లీ గోడలు లొంగిపోయాయి. విజయనాదం మ్రోగింది.

అదేవిధంగా వాటర్ బాస్టన్‌వద్ద ఏర్పడ్డ బీట కూడా పెద్దదైంది. హోరాహోరిగా పోరు సాగింది. రెండవ దళంలో ఆంగ్లేయులు అడుగడుగునా అనంత సంఖ్యలో మరణించారు-చంపారు. గోడను బ్రద్దలు చేసి నగరంలోకి దూకారు.

మూడవ దళం కాశ్మీర్ గేట్‌వైపు పురోగమించింది. లెఫ్టినెంటు హోమ్, లెఫ్టినెంటు సాకెర్ డైనమైట్‌తో కాశ్మీర్ గేటును బ్రద్దలు చేయుచుండగా అటు గోడలనుండి, కిటికీలనుండి, ప్రతి చోటునుండి వారిపై గుండ్ల వర్షం కురిసింది. ఇంత అయినా ఆంగ్ల సైనికులు చొచ్చుకు పోయినారు. కాశ్మీర్ గేటు భయంకరమైన శబ్దంతో బ్రద్దలైపోయింది. భీషణ రణధ్వనుల మధ్య ఇంత శబ్దంకూడా వినిపించనేలేదు. ఆంగ్లేయుల కమాండర్ కాశ్మీర్ గేటు తెరువబడుతుందని ఎదురుచూస్తున్నాడు. తన సైనికులపై అచంచల విశ్వాసముతో కాంప్‌బెల్ దాడి చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. సైన్యాలు కందకాలవద్దకు చేరాయి. విజయాన్ని, వీర మరణాన్ని పొందుతున్న తమ సహచరులను చూచారు. బ్రద్దలైన కాశ్మీర్ గేటువైపు త్రోసుకుపోయినారు. ఢిల్లీలోకి దూకారు.

మేజర్ రీడ్ క్రిందఉన్న నాల్గవదళం కాబూల్ గేటుపైకి లంఘించింది. వారు సబ్జీమండి చేరేసరికి లోనుండి సిపాయీలు ఢీకొన్నారు. మేజర్ రీడ్ మొదటి దెబ్బకే పడిపోయినాడు. ఆంగ్లేయుల పురోగమనానికి అడ్డుకట్ట పడ్డది. ఆంగ్ల శిబిరంలో కల్లోలం వ్యాపించింది. విజయం అరచేతిలో లభించినట్లే విప్లవకారులు భావించారు. ఇంతలో హోప్ గ్రాంటు ఆశ్వికదళాన్ని తీసుకువచ్చాడు. మళ్ళీ ఉభయులు సమఉజ్జీలుగా తయారైనారు.

రెచ్చిపోయిన విప్లవవీరులు ఈద్ ఘర్ వద్ద ప్రతి అంగుళంకోసం పోరాడారు. ఈద్ ఘర్‌ను ఆక్రమించడానికి ఆలోచిస్తున్న ఆంగ్లేయులపై విప్లవకారులు మరొక్కసారి చూకారు. ఆంగ్లేయులు తిరోగమించారు. విప్లవకారులు వెంటాడారు. తుపాకులతోను, అశ్వికదళాలతోను తరిమి తరిమి కొట్టారు.

నాల్గవదళం ఈవిధంగా ఛిన్నాభిన్నం కాగా, మొదటి మూడుదళాలు కాశ్మీర్ గేటువద్ద కాసేపు వేచివుండి నగరంపై దాడి చేసేందుకు ముందుకు ఉరికాయి. ముగ్గురు కమాండర్లూ-కాంప్‌బెల్, జోన్స్, నికల్సన్ - తమ అనుచరులతో కాబూల్ గేటువరకు పోరాడుతూ సాగివెళ్ళారు. దారిలో దొరికిన తుపాకులను స్వాధీనం చేసుకున్నారు. ప్రతి స్థంభంమీదను, బురుజులమీదను ఆంగ్ల పతాక లెగురవేశారు. బర్నాబాస్టన్ వరకు పోరాడుకుంటూ వెళ్ళారు.

కాని ఇక్కడినుండి వారికి ఎదురైంది-ఖాళీ తుపాకులు, నిర్జీవమైన కొండ తిప్పలు, నిర్మానుష్యమైన పొలాలు కాదు. బ్రహ్మాండమైన యుద్ధ నినాదం. విప్లవకారులు నిప్పులు కక్కారు. అంగుళం ఖాళీలేకుండా రక్తం పారింది. మృత్యుదేవత ప్రళయతాండవం చేసింది; విజయోత్సాహంతో ముందుకు సాగిన ఆంగ్ల సైన్యాలు వెనుకకు గెంటివేయబడ్డాయి. ఆంగ్ల సైన్యాలిలా దెబ్బతినడంతో నికల్సన్ బెబ్బులిలా విరుచుకుపడ్డాడు, ధైర్య సాహసములు గల వీరుడాతడు! ఈ ప్రపంచంలో అసాధ్యమైన దేమీ లేదనేది అతడి ఒకే ఒక విశ్వాసం.

వాటర్ బాస్టన్‌ను వదలిన నికల్సన్ మళ్ళీ గల్లీలో ప్రవేశించడంతో, రక్తసమరం మళ్ళీ ప్రారంభమైంది. కిటికీలగుండా, ఇండ్ల కప్పులమీదనుండి, వరండాలనుండి-స్వాతంత్ర్య పిపాసయైన ఈ మొండిసందు అగ్నిని వర్షించింది. నికల్సన్ కూడా తిరోగమించవలసి వచ్చింది. అయితేనేం? మళ్ళీ

ముందుకు దూకాడు.ఇంతలో ఆంగ్లశిబిరంలో పిడుగుపడ్డట్లుగా భయంకర మైన కేకలు వినవచ్చాయి-నికల్సన్, నికల్సన్ అంటూ. ఏడీ నికల్సన్? సాహసియైన సిపాయి ఒకడు అతణ్ణి వంటరి చేసివేశాడు. మోదివేశాడు. నికల్సన్ నేలపై దొర్లుతున్నాడు! 'హతో హతో' అంటూ ఆంగ్లశిబిరం ఘోషిస్తే 'ఛటో ఛటో' అంటూ సిపాయి శిబిరం గర్జించింది.

ఆంగ్ల సైన్యం ఈ గల్లీనుండి ఇలా బయట కాశ్మీర్ గేటు చేరీ చేరకముందే, జుమ్మా మసీదువద్దనున్న ఆంగ్లేయులను తిరిగి రమ్మంటూ బిగిల్ మ్రోగింది : ఆ మసీదుకు చేరేవరకు ఆంగ్లేయులకు ఎదురు లేక పోయినా, అక్కడికి చేరగానే భయంకర యుద్ధ నినాదం ఎదురైంది. కాంబెల్ గాయపడ్డాడు.

ఢిల్లీపై మొదటినాటి దాడి అలా ముగిసింది. ఆంగ్లేయుల నాల్గువళ నేతలలో ముగ్గురు గాయపడ్డారు. 66 మంది అఫీసర్లు, 1104 మంది సైని కులు హతులైనారు. ఇంత నష్టానికి లభించిన లాభాన్ని బ్రిటిష్ కమాండర్ విల్సన్ సాయంత్రం లెక్కవేసుకుంటే- ఢిల్లీలో నాల్గవ వంతు మాత్రమే స్వాధీనమైనదని తేలింది. భయము, నిరాశ, ఆందోళనలతో విల్సన్‌కు మతిపోయింది. వెంటనే తిరిగిపోవాలని గావుకేక పెట్టాడు.

మరణోన్ముఖుడైన నికల్సన్ ఆసుపత్రిలో ఈ మాట విని "తిరో గమనమా? తిరోగమించమంటున్న విల్సన్‌ను కాల్చివేసేందుకు భగవంతుని దయవల్ల నా కింకా శక్తి ఉన్నది" అన్నాడు! మరణోన్ముఖుడైన యీ వీరుని మాటలే నచ్చాయి ఆంగ్లేయాధికారు లందరకు! సెప్టెంబరు 14 రాత్రి తమకు వశమైన భాగాలలో ఆంగ్లేయులు అలాగే నిలిచి ఉన్నారు.

ఆంగ్లేయుల యుద్ధ సమితి విల్సన్ కోర్కెను తిరస్కరించింది. విప్లవకారుల శిబిరంలో శక్తి ఉడిగిపోయినట్లు, ఆ రాత్రి స్థితిగతులవల్ల వ్యక్తమయింది. ఢిల్లీని వదలివేసి, ప్రాంతంలో పోరు ప్రారంభించడం

మంచిదన్నది- ఒక పర్గం : మనలో ప్రతి ఒకరు మరణించినాసరే ఢిల్లీని మాత్రం వదలరాదన్నది రెండప పర్గం.

ఢిల్లీలో మున్ప్రాతికవంతు ఆంగ్లేయుల వశం కాగానే బఖ్త్‌ఖాన్ పాదుషాను సమీపించి "ఢిల్లీ చేయిజారిపోయింది. అంటే దీని అర్థం విజయావకాశాలన్నీ పోయినాయని కాదు. ఇప్పుడైనాసరే ఒకచోట కూర్చొని శత్రువు నెదుర్కొనేకన్నా దేశంలో శత్రువును ఇరకాటాన పెట్టి వేయడంవల్ల విజయం సాధ్యమే. నేను ఢిల్లీ బయట పోరాడేందుకు వెళ్తున్నాను. మీరు కూడా మాతో రండి. మీ నేతృత్వం క్రింద అంతిమ స్వరాజ్యంకోసం పోరాడుదాం" అన్నాడు.

ఈ మొగలాయీ వృద్ధునికి బాబర్, హుమయున్, అక్బర్‌లకున్న శౌర్యంలో నూరవ వంతు ఉన్నా అతడు ఈ ఆహ్వానాన్ని మన్నించి, బఖ్త్‌ఖాన్‌తో ఢిల్లీ వెడలివచ్చి ఉండేవాడే; మరణించడమే గత్యంతర మైతే మహారాజుగానే మరణించి ఉండేవాడే. కాని వార్ధక్యంవల్ల నిరాశ చెంది, సుదీర్ఘ భోగానుభవంవల్ల మందకొడి అయిపోయి, పరాజయంవల్ల హడలిపోయి పాదుషా బహదూర్‌షా చివరవరకు ఊగిసలాడుతునే ఉన్నాడు. ఆఖరి రోజున హుమయూన్ గోరీలో తలదాచుకున్నాడు. బఖ్త్‌ఖాన్ ఆహ్వానాన్ని తిరస్కరించి, అల్లాబక్ష్ మీర్జా సలహాపై ఆంగ్లేయులకు లొంగిపోయే విషయం యోచించాడు. ఈ అల్లాబక్ష్ అసాధ్యుడైన దేశద్రోహి. ఈ వార్త నతడు ఆంగ్లేయులకు అందజేశాడు. వెంటనే లొంగిపోయే విషయం సంప్రదించి రమ్మని వారు కెప్టెన్ హడ్సన్‌ను పంపారు. ప్రాణదానానికి హామీ ఇచ్చినమీదట పాదుషా లొంగిపోవడానికి అంగీకరించాడు. ఆంగ్లేయులు అతణ్ణి భవనానికి తీసుకునివచ్చి నిర్బంధించారు. అప్పుడే నీచ దేశద్రోహులగు అల్లాబక్ష్, మున్షి రజాబ్ అలీలు పసిగెత్తుకువచ్చి "రాకుమారులు ఇంకా హుమయూన్ గోరీలోనే దాగి ఉన్నారు"

రని వార్త ఇచ్చారు. వెంటనే హడ్సన్ అక్కడికి పరుగెత్తాడు. వాళ్ళు లొంగిపోయినారు. ఒక బండిలో వేసి నగరంలోనికి తోలుకుపోయినాడు.

నగరంలోనికి ప్రవేశించగానే హడ్సన్ బండిపద్దకు పరుగెత్తుకువెళ్ళి ఆంగ్లయువతులను, బాలబాలికలను చంపినవారికి మరణమొకటే శిక్ష అని అరచాడు. అలా అరుస్తూ, లొంగిపోయినవారిని బండిలోనుండి దిగలాగాడు. శరీరంమీదనున్న అమూల్యవస్తువులన్నీ టిని లాగివేశాడు. వారు దిక్కుతోచనివారై అలా నిలిచిపోయినారు. మూడుగుండ్లతో ముగ్గురు రాకుమారులు నేల కొరిగారు. తైమూర్ వంశానికి చెందిన ఈ ఆఖరి అంకురాలను అలా అంతం చేశాడు.

వీరిని కాల్చివేయడంతో కసి తీరలేదు. ఆ శవాలను పోలీస్ స్టేషను ముందు పారవేశారు. శవాలపై గ్రద్దలు వాలే సమయానికి వాటిని నదిలో పారవేశారు.

అప్పుడు నగరంలో భారీ ఎత్తున హత్యలు, దోపిడీలు, దోపకోతలు ప్రారంభించారు. ఆ వివరాలన్నీ అందుకొని సర్ జాన్ లారెన్సుకు లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ ఇలా వ్రాశాడు.

"సమరం ముగిసిన తర్వాత మన సైనికులు జరిపిన దురాగతాలు హృదయవిదారకంగా ఉన్నాయి. శత్రువు మిత్రుడు అనే భేదమే లేకుండా మూకుమ్మడిగా కసి తీర్చుకున్నారు. ఇక దోపిడీల విషయానికి వస్తే నిజంగా మనవాళ్ళు నాదిర్షాను మించిపోయినారు."

ఢిల్లీ వశంచేసుకోవడంలో పాల్గొన్న ఆంగ్లేయసేన యూరోపియన్లు, భారతీయులు కలిపి — 10 వేల వరకు ఉంటుంది. ఇందులో 4 వేలమందికి రణరంగంలో హతులు కావడమో, క్షతగాత్రు లవడమో జరిగింది.

స్వధర్మ, స్వరాజ్యకాంక్షలతో ఉత్తేజితమైన ఢిల్లీ నగరం ఈ విధంగా 134 రాత్రులు, పగళ్ళు ఆంగ్లేయులంటే అపరిమిత శక్తిసంపన్నుడైన శత్రువుతో పోరాడింది.

# లక్నో

చిన్‌హట్ సమరంలో విప్లవకారులు విజయం పొందిననాడే, ఔధ్‌లో ఆంగ్లపాలన అంతమయి, విప్లవం అఖిలభారతమైంది. లక్నో నవాబ్ వజీర్ అలీషా కలకత్తాలో ఆంగ్లేయుల బందీగా ఉన్నందున, ఆయన కుమారుడు బిరీజ్‌ఖాదర్ గద్దె నెక్కింపబడ్డాడు. ఆతడు మైనరై నందున అతడి తల్లి రాణీ హజ్రత్ మహల్ సంరక్షకురాలుగా నియమింప బడ్డది. ఈ మాదిరి తాత్కాలిక ఏర్పాట్లతో విప్లవకారులు ఏ మాత్రము సంతృప్తి చెందలేదు. తమ కింకా నాయకుడు లభించపోయినా లక్నో రెసిడెన్సీని వారు వశం చేసుకున్నారు.

అంతవరకు ఎంతో చురుకుగా ఉంటున్న విప్లవకారుల తుపాకిదళం జూలై 20 ఉదయం హఠాత్తుగా కాల్పుల నాపివేసింది. సుమారు ఎనిమిది గంటలవేళ రెసిడెన్సీ గోడల క్రింద విప్లవ పక్షాలవారు మందు పెట్టారు. అది ప్రేలగానే సిపాయీలు ముందుకు పరుగులెత్తారు. దానితోపాటు ఊపిరిసలపకుండా కాల్పులు సాగించారు. విప్లవ సైన్యాలు అన్నివైపుల నుండి ఆంగ్లేయులపై-కాన్పూర్ బ్యాటరీమీద, ఇన్స్‌నివాసం మీద, రేడాన్ మీద - పడ్డాయి. కాన్పూర్ బ్యాటరీ మీద పడ్డ సిపాయీలు ఆంగ్లేయుల తుపాకుల మీదికే ప్రాణాలకు తెగించి ఎగిరెగిరి దూకారు.

అయితే ఈ దాడి వెంటనే అణచివేయబడ్డది. దాని తర్వాత మాత్రం విప్లవకారులు రోజూ ఆంగ్లేయులపై ఎక్కడో ఒకచోట చిన్న, పెద్ద

దెబ్బలు లీస్తూనే పచ్చారు. రెసిడెన్సీ నివాసాల క్రింద మందులు ప్రేల్చేం దుకు పీలున్నంతపనీ చేశారు. ఏ క్షణాన తమ కాళ్ళ క్రింద భూమి బ్రద్ద లవుతుందోననే భయంతో ఆంగ్లేయులు గడగడలాడవలసి వచ్చింది. బ్రిగేడియర్ ఇన్స్ అంచనా ప్రకారం విప్లవకారులు మొత్తం 37 సార్లు అలా డైనమైట్ మందుగుండు పెట్టారు.

సర్ హెన్రీ లారెన్స్ మరణానంతరం ఔధ్ చీఫ్ కమీషనర్‌గా నియమింపబడిన మేజర్ బ్యాంక్స్ కూడా దాదాపు ఇదే సమయంలో ఒక విప్లవకారుని తుపాకీ గుండుకు హతుడై పోయినాడు. ఈ ముట్టడిలో హతు డైన రెండవ చీఫ్ కమీషనర్ ఇతడు.

అప్పుడే కాన్పూర్ నుండి అన్‌గడ్ తిరిగి వచ్చాడు. ఇతడు లోగడ ఆంగ్లేయ సైన్యంలో పనిచేసి, ప్రస్తుతం పదవీ విరమణలోనున్న భార తీయుడు. లక్నో ముట్టడి తర్వాత బయటికి వెళ్ళి, సమాచారం లీసుకుని, ప్రాణాలతో తిరిగి రావడం అనేది శ్వేతవార్తాహరులకు అసాధ్యమైన విషయమై పోయింది. అతడి తెల్లచర్మం, రాగిజుట్టు, నీలపుకళ్ళు విప్లవ కారుల చూపులను,తుపాకులను తప్పించుకొనడం అనేవి ఉండేదికాదు.అందు వల్ల నల్లవారిని ప్రయోగించడం అవసరమై,విధేయులైన నల్లవారనేకమంది లక్నోనుండి పంపబడ్డాడు. అయితే వీరందరిలో కూడా తిరిగి వచ్చినది ఒక అన్‌గడ్ మాత్రమే; విప్లవకారుల భయంతో అతడు వెంట ఒక ఉత్తరాన్ని గాని, మరి దేనినిగాని తీసుకురాలేదు. కాని లక్నోను రక్షించేందుకు, ఆంగ్ల సైన్యాలు కాన్పూర్ నుండి బయల్దేరడం తన కండ్లతో తాను చూచానని ఇంగ్లీష్ కమాండర్‌కు తెలియజేశాడు.ఈ సమాచారం ఉత్సాహం పొందిన ఆంగ్లేయులు అన్‌గడ్‌ను మళ్ళీవెళ్ళి లిఖిత పూర్వకమైన జవాబు తెమ్మన్నారు. అతడు 22న లక్నో వదలి 25 రాత్రి 11 గంటలకు తిరిగి వచ్చాడు. వెంట హేవ్‌లక్ ఉత్తరం తెచ్చాడు. "అన్ని క్లిష్టపరిస్థితులకు తగినంత సైన్యంతో హేవ్‌లక్ వస్తున్నాడు. 5, 6 రోజులలో లక్నో

విముక్త మవుతుంది'' అని అందులో వ్రాసి ఉన్నది. తమను రక్షించ డానికి వస్తున్న హేవ్‌లక్‌కు సమస్తమైన సమాచారాన్ని అందించేందుకై ఆంగ్లేయులు మిలిటరీ పథకాలను, మ్యాపులను అన్‌గడ్‌కిచ్చి, హేవ్‌లక్ వద్దకు మళ్ళీ వెళ్ళిరమన్నారు. ఆ నేర్పరియైన భటుడు మళ్ళీ హేవ్‌లక్ వద్దకు వెళ్ళి లక్నో మిలిటరీ మ్యాపుల నన్నిటిని అతడికి అందచేశాడు.

లక్నోలో తన దేశీయులపై విప్లవకారులు నిత్యమూ దాడి చేస్తున్నా రని విని హేవ్‌లక్ క్షణాల మీద కాన్పూర్‌ను వదలి జూలై 29 నాటికే గంగానదిని దాటాడు. అతడి వద్ద 1500 మంది సైనికులు, 13 తుపా కులు ఉన్నాయి. 5, 6 రోజులలో లక్నోను విముక్తం చేస్తానని లేఖ వ్రాశాడు. కాని గంగానదిని దాటి ఔధ్‌లో ప్రవేశించగానే అడుగడుగునా హోరాహోరిగా పోరాటం ఎదుర్కొనవలసి ఉన్నదని గుర్తించాడు. అయినా హేవ్‌లక్ పురోగమించాడు. విప్లవకారులు ఓనావ్‌వద్ద ఆతడిని చుట్టుముట్టారుగాని, ఆ వెంటనే వెళ్ళిపోయినారు. ఈ అలజడి తర్వాత హేవ్‌లక్ తన సైనికులను ఆహారం తీసుకొనడానికి తప్ప వేరే ఆగడ మనేది లేకుండా నడిపించాడు. బషిరత్‌గంజ్ వద్ద ఇలాగే చిన్న పోరు జరిగింది. 29 న హేవ్‌లక్ సైన్యాలు మరి రెండుపోరుల నెదుర్కొనవలసి వచ్చింది. రెండింటిలోను తమదే పైచేయి అనిపించుకున్నారు. కాని ఒక్క రోజులో అతడి వద్దనున్న కొద్ది సైన్యంలో ఆరవ వంతు నశించిపోయింది. విప్లవకారు లేమాత్రమూ చెక్కుచెదరలేదు. పైగా దానపూర్ సిపాయిలు కూడా విప్లవకారులతో చేరారని అప్పుడే వార్త వచ్చింది. ఈ పరిస్థితుల మధ్య హేవ్‌లక్ 30 వ తేదీన తన పురోగమనాన్ని నిలుపుజేసి, మంగళ్ వార్‌కు తిరిగిపోవడం తప్పనిసరి అయింది.

హేవ్‌లక్ సైన్యాలు కాన్పూరును వదలాయని వినగానే నానా సాహెబ్ పీష్వా కాన్పూర్ చుట్టుపట్ల మరల తన కార్యకలాపాలు ప్రారంభించాడు. హేవ్‌లక్ కాన్పూర్‌ను వదలి ఔధ్‌లో ప్రవేశించేందుకు గంగానదిని దాటుతుండగానే నానాసాహెబ్ ఔధ్‌ను వదలి కాన్పూరులో

ప్రవేశించేందుకు గంగానదిని దాటుతున్నాడు! నానాసాహెబ్ వ్యూహంలో చిక్కుకొనకుండా రక్షించుకునేందుకై హేవ్‌లక్ ఆగష్టు నాలుగువరకు మంగళ్‌వార్‌లోనే వుండిపోయినాడు. ఒక్క వారంలో విప్లవకారులను గౌతమీనదీతీరాంకు తరిమివేయడం జరగకపోగా, హేవ్‌లక్ గంగానదీ తీరానే అంటుకుపోవలసి వచ్చింది.

హేవ్‌లక్ మంగళ్‌వార్‌కు తిరిగి వెళ్ళాడని వినగానే విప్లవకారులు మళ్ళీ బషీరత్‌గంజ్‌ను వశము చేసుకొని, అక్కడ శిబిరము వేశారు. అందువల్ల ఆగష్టు 11 వ తేదీన హేవ్‌లక్ మళ్ళీముందుకు సాగి మూడవ సారిగా బషీరత్‌గంజ్ చేరేడు. మూడవసారి పోరు సాగింది. విప్లవకారులు పారిపోయినారు. అయితే హేవ్‌లక్‌ను మూడవసారి సందేహం కలిగింది: "ఇంతకూ ఇది విజయమా? పరాజయమా" అని.

ఈ లోపున నానాసాహెబ్ పథకాలు ఫలించ నారంభించాయి. సాగర్‌నుండి, గాల్వియర్‌నుంచి విప్లవకారులు, స్వయంసేవక దళాలు వచ్చి చేరాయి. చిత్తూరువరకు పురోగమించి, నానా కాన్పూరును కూడా ప్రమాదం కల్పించాడు. జనరల్ నీల్ వద్ద తగినంత సైన్యం లేదు. అందువల్ల తన క్లిష్టపరిస్థితి తెలియజేస్తూ హేవ్‌లక్‌కు కబురు పంపాడు. ఇక లక్నో వెళ్ళడమనేది ఊహించరాని విషయమైపోయింది. అందువల్ల హేవ్‌లక్ మళ్ళీ గంగను దాటి కాన్పూరుకే వెళ్ళవలసివచ్చింది.

కాన్పూరు చేరగానే హేవ్‌లక్‌కు అందిన మొదటి వార్త - నానా సాహెబ్ బ్రహ్మావర్తాన్ని పునరాక్రమించుకున్నాడని! విప్లవకారులు ఆ విధంగా కాన్పూరు సైన్యాలకు దగ్గరగా పురోగమించడం గమనించి, హేవ్‌లక్ వెంటనే వారిమీదకు దాడి వెడలాడు.

ఆ రోజున బ్రహ్మావర్త సమరంలో, ఆంగ్లేయులు విప్లవకారుల మీదికి 20 గజాల దూరానికి వెళ్ళగానే విప్లవకారుల 42 వ దళం బాయ్‌నెట్లు ప్రయోగించింది. అన్ని ఆయుధాలు విఫలమైపోయినప్పుడు బాయ్‌నెట్లతో

విప్లవకారులను. హదంకొట్టవచ్చుననుకునేవారు ఆంగ్లేయు లంతవరకు. కాని నేడు-స్వాతంత్ర సమరవీరులే వారిపై బాయ్‌నెట్లు ప్రయోగిస్తున్నారు! అదే సమయంలో విప్లవకారుల ఆశ్వికదళం, ఆంగ్లేయుల వెనుక దళాలపై బడి, వారివద్ద నున్న ఆహార పదార్థాలు ఎత్తుకుపోయింది. ఈ విధంగా ఆంగ్లసైన్యాలపై ముందు, వెనుకలలో దాడి జరిగింది! అయితే ఈ శౌర్య ధైర్యాలకు తగిన క్రమశిక్షణ తోడుకాలేదు. ఆంగ్లేయులలో మాత్రం అలా కాదు. అందువల్ల విప్లవకారు లెంత శౌర్యం ప్రదర్శించినా చివరకు పరాజయం పొంది తిరిగి వెళ్ళవలసి వచ్చింది.

అగష్టు 17 వ తేదీన హేవ్‌లక్ కాన్పూరుకు చేరగానే ఒక విషయం గమనించాడు. నానాసాహెబ్ సైన్యమంతా బ్రహ్మావర్తములోలేదు. జమునా నదీతీరాన కల్పిలో సాయుధమైన అనంతసైన్యం ఉన్నది: కల్పివద్ద, బ్రహ్మావర్తంవద్ద, ఔధ్‌వద్ద, గంగానదీ తీరాలు రెండింటివద్ద గుక్కతిరగకుండా పీడింపబడిన హేవ్‌లక్ 'విజేత' కలకత్తాకు ఇలా వ్రాసుకున్నాడు: "మేము భయంకర పరిస్థితిలో చిక్కుకున్నాం. సహాయక సైన్యాలు రాకపోతే ఆంగ్లసైన్యాలు లక్నో వదలి అల్లాబాద్ పారిపోక తప్పదు."

కలకత్తానుండి ఐర్, ఔట్రమ్, కూపర్‌వంటి ఆఫీసర్లలో కూడిన సహాయక సైన్యాలు చేరగానే, కాన్పూర్ సైన్యం సెప్టెంబరు 20 న ద్విగుణీకృతోత్సాహంతో లక్నోను విముక్తం చేసేందుకు గంగానదిని దాట యత్నించ నారంభించింది. ప్రస్తుతం హేవ్‌లక్ చేతిక్రింద 2500 ఆంగ్ల సైనికులు, 3250 సిక్కు సిపాయీలు ఉన్న సైన్యమంతా ఉన్నది. ఎన్నికైన ఆశ్వికదళం, శ్రేష్ఠమైన సాయుధబలము, నీల్, ఐర్, ఔట్రంవంటి అధికారులు కూడా ఉన్నారు. ఇక అతడు ఔధ్ విప్లవకారుల నెంతమాత్రము లక్ష్యపెట్టలేదు. శక్తివంతమైన ఆ ఆంగ్ల సైన్యం ఔధ్ వైపు త్రోసుకు వెళ్ళింది.

క్రమంగా పోరాడుకుంటూ, శిక్షణచాలని విప్లవకారులను తుడిచి వేసుకుంటూ సెప్టెంబర్ 22 నాటికి హేవ్‌లక్ ఆలంబాగ్ చేరాడు. అక్కడ ఒక విప్లవ శిబిరం ఉంది. ఉభయ శక్తులు ఢీకొన్నాయి. ఆలంబాగ్ వద్ద ఆ రోజంతా ఘోరమైన సమరం జరిగింది. శత్రువు విప్లవకారుల 5 తుపాకులు వశం చేసుకున్నాడు. అందాకదానిని విప్లవకారులు తిరిగి వశం చేసుకున్నారు. ఉభయులు ఆ రాత్రి రణరంగంలోనే గడప నిశ్చయించు కున్నారు. శత్రుసైన్యాలు చల్లచల్లగా ఆ భూమిమీద విశ్రమించ జొచ్చాయి. విప్లవ వీరులు విశ్రాంతి అనేది లేకుండా మళ్ళీ పోరు ప్రారంభించారు.

చివరకు క్లిష్టదినం వచ్చింది. 25 వ లేదీ ఉదయమైంది. హేవ్‌లక్ సైన్యాలు లక్నో వెళ్ళే మామూలు బాటలన్నీ వదలి, పక్కదారులగుండా రెసిడెన్సీ చేరడానికి యత్నించటాన్ని గమనించి, విప్లవవీరులు భయంక రంగా అగ్నిని దిమ్మరించారు. దీసంతటని ధైర్యంగా సహించి ఆంగ్లేయ సైన్యాలు ఆలంబాగ్‌నుండి చార్‌బాగ్ బ్రిడ్జివరకు వచ్చారు. ఈ బ్రిడ్జిని దాటడమంటే లక్నోలో ప్రవేశించడమే. అందువల్ల ఆ కీలక స్థానంలో మొండియుద్ధం ఆరంభమైంది. అరగంటసేపు కెప్టెన్ మాడే బ్రిడ్జిమీదకు తీవ్రంగా తుపాకులు కాల్చాడు. కాని అటు బ్రిడ్జి ఖాళీకాలేదు. కనీసం అక్కడి తుపాకుల మ్రోతలైనా ఆగలేదు. అంతేకాదు ఆంగ్లేయుల పక్షాన ఎల్లో హౌస్‌వద్ద 21 మంది హతులైనారు. బ్రిడ్జివద్ద మరింతమంది హతులైనారు. ఈ క్లిష్ట స్థితిని గట్టెక్కేందుకై బ్రిడ్జిమీద దాడిచేసేందుకు తన కనుజ్ఞ ఇవ్వవలసిందని హేవ్‌లక్ కుమారుడు నీల్‌ను అడిగాడు. కమాండర్ ఇన్ ఛీఫ్ హేవ్‌లక్‌నుండి అనుమతి పొందవలసిందని నీల్ ఆతడికి చెప్పాడు. అతడు తనతండ్రిని కలిసి తిరిగి వచ్చినట్లుగా నటిస్తూ నీల్‌తో "బ్రిడ్జిని ధ్వంసం చేయవలసిందిగా కమాండర్ ఇన్ చీఫ్ హేవ్‌లక్ ఆజ్ఞ చేశారు"అని చెప్పాడు. ఇది విని నీల్ అందుకు అనుజ్ఞ నిచ్చాడు.

హేవ్‌లక్ కుమారుడు 25 మంది ఆంగ్లేయులను తీసుకొని బ్రిడ్జి మీదను దాడి చేశాడు. భయంకరంగా కాల్పులు సాగాయి. ఆంగ్లేయు లందరూ చూస్తుండగానే సాహసియైన సిపాయి ఒకడు హేవ్‌లక్ కుమారునికి 10 గజాల ముందుకు వచ్చి అతడిపై గురిపెట్టాడు: బులెట్ దూసుకుపోయింది–అయితే తలగుండా కాదు, శిరస్త్రాణముగుండా. క్షణాలలో ఆంగ్లేయులు అందరూ బ్రిడ్జిమీదకు తోసుకువెళ్ళారు. బ్రిడ్జి ఊగిపోయింది. విప్లవకారులు వెనుకకు తగ్గవలసి వచ్చింది. ఆంగ్లేయులు ముందుకు సాగివెళ్ళారు. బ్రిడ్జి పతనమైంది. లక్నోకు వెళ్ళే మొదటి దాడి భగ్నమైంది. ఆ తర్వాత రెండవది ... మూడవది ...ఆంగ్లేయులు ముందు ముందుకు సాగివెళ్ళారు. ఆంగ్లేయు లనుకున్న దారి తప్పారు. అంతకంతకు విప్లవ గుండాల్ని సమీపించజొచ్చారు. అయినా నీల్ పురోగమిస్తూనే ఉన్నాడు. ఖాన్‌బజార్ చేరేసరికి– ఆంగ్ల సాయుధ దళం వెనుక చిక్కినట్లు గుర్తించాడు. తన గుర్రమెక్కి వెనుదిరిగి పరిశీలించాడు. ఇదే అదను! దేశం పగతీర్చుకొనడానికి సమయ మిదే! ఓ విప్లవ మహావీరుడా! నీవు ఆత్మార్పణ చేయవలసివచ్చినాసరే, ఈ అవకాశాన్ని మాత్రం వినియోగించుకోవలసిందే! అక్కడే నక్కిఉన్న ఒక సిపాయి త్రుటిలో జనరల్ నీల్ గొంతులో తుపాకి గుండు నాటాడు! అతడు నేల కూలాడు! కాని ఆంగ్ల సైన్యాల ప్రత్యేకత ఏమంటే దాని కార్యనిర్వహణ ఏ ఒక్క వ్యక్తిమీద ఆధారపడి ఉండదు–అతడు జనరల్ నీల్ అంత గొప్పవాడయినా సరే; నీల్ మరణం ఏమాత్రం కల్లోలానికి దారి తీయలేదు. ఆంగ్ల సైన్యం రెసిడెన్సీవైపు ఆగకుండా పురోగమించింది. బజార్ల గుండా వెళ్తుంటే, రెసిడెన్సీనుండి విజయధ్వానాలు వినవచ్చాయి. హేవ్‌లక్ తన సోదర దేశీయులను మృత్యుముఖం నుండి రక్షించాడు! ...

87 రోజులపాటు తెరపిలేకుండా సాగిన లక్నో రెసిడెన్సీ యుద్ధంలో 700 మంది మరణించారు. క్షతగాత్రులైనవారు, అస్వస్థులు కలిసి 500

యూరోపియనులు, 400 భారతీయులు మిగిలారు. హేవలక్ సైన్యములో 720 మంది రెసిడెన్సీ చేరకపూర్వమే మరణించారు! ఇందరు వీరుల మరణం తర్వాత లక్నో విజయం సిద్ధించింది. కాని హేవలక్ విజయం కేవలం ఒక మిథ్య మాత్రమే. అతడు రెసిడెన్సీలో ప్రవేశించగానే అతడి సహచరులతో సహా లోపల చిక్కుకొనిపోవలసి వచ్చింది.

13 వ ఆగష్టున కొత్త బ్రిటిష్ కమాండర్ ఇన్ చీఫ్ సర్ కాలిన్ కాంప్‌బెల్ కలకత్తా చేరాడు. నాటినుండి అక్టోబరు 27 వ తేదీవరకు అతడు — హిందూస్థానమును విప్లవకారుల చేతినుండి వశం చేసుకునే పథకాన్ని రచించేందుకుగాను నర నరాను క్షణ క్షణమూ కష్టపడ్డాడు.

దాదాపు అదే సమయములో కల్నల్ పావెల్, కెప్టెన్ విలియం పీల్‌ల నేతృత్వంలో ఒక నావికాదళం ఏర్పాటు చేయబడ్డది. అది నదీ మార్గాన అల్హాబాద్‌కు పంపబడ్డది. కలకత్తానుండి అలహాబాద్‌వరకు గల అన్ని ప్రధాన మార్గాలవద్దను, కాన్పూరువద్దను, విప్లవకారుల చిన్న చిన్న దళాలు ఆంగ్ల సైన్యాలకు చిక్కులను, చికాకులను కల్పించజొచ్చాయి. ఈ దళాలన్నీ ఒకేచోట ఎదురైతే ఆంగ్లేయులు బహుశా అందరిని కలిపి ఎదిరించగలిగేవారు. కాని కువర్‌సింగ్ సంప్రదాయంలో తయారైన పాండే విప్లవశక్తులు ఎక్కడా పోరుకు అవకాశమిచ్చేవారుకారు. ఆయా స్థానాలలో తామున్నట్లు కూడా ఆంగ్లేయులకు తెలియనిచ్చేవారుకాదు.

కాన్పూరు దారిలో సర్ కాలిన్ కాంప్‌బెల్ సైతం చావుతప్పి బయటపడ్డాడు. అక్కడ బ్రిగేడియర్ గ్రాంట్ నేతృత్వంలో భారీ సైన్యం అప్పటికే చేరి ఉన్నది. ఢిల్లీకి చెందిన ఆంగ్లేయ సైనికుడగు గ్రేథెడ్ కూడా అచటికి చేరాడు. పీల్ నేతృత్వములోని నావికా దళము గూడా వారిని కలిసింది.

గ్రాంట్ నేతృత్వంలోని ఈ సైన్యమంతా పోరాడుకుంటూ ఆలం భాగ్‌వరకు చేరినదని వినగానే, సర్ కాలిన్ కాంప్‌బెల్ కాన్పూరు వదలి,

గంగానదిని దాటాడు. వెనుక భాగపు రక్షణకై ఎన్నికైన ఆంగ్ల, సిక్కు సిపాయీ దళాలను కాన్పూర్‌లో ఉంచాడు. అనేక ఐరోపా యుద్ధములందు కీర్తిగాంచిన విండ్‌హామ్ ఈ దళాలకు నాయకుడు. సర్ కాలిన్ నవంబరు 9 నాటికి ఆలంబాగ్‌లోని ప్రధాన సైన్యమును చేరాడు.

ఈ యావత్తు సైన్యము నవంబరు 14 న లక్నో వైపుకు బయలు దేరింది. రోజంతా ఆంగ్లేయులకు విప్లవకారులకు మధ్య పోరాటాలతో గడిచిపోయింది. సాయంత్రానికి ఆంగ్ల సైన్యాలు దిల్‌ఖుష్‌బాగ్ వరకు చేరాయి. ఆ రాత్రి అక్కడ గడుపుదామనుకున్నాడు సర్ కాలిన్. అక్కడ తోటలో శిబిరం వేశారు. మరునాడుదయం కాలిన్ తన సైన్యాలను పిలచి, 16 వ తేదీన లక్నోపై మరం దాటి జరపవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఈవర్ట్ నేతృత్వంలోని ఆరోహక సైన్యము, పావెల్ క్రింద నున్న సిక్కు దళము సికిందర్‌బాగ్‌పై విరుచుకుపడినప్పుడు-ఆంగ్లేయుల ధాటికి ఇక సర్వమూ తుడిచిపెట్టుకుపోతుందా అనిపించింది. ఆరోహక సైన్యం తనను దాటి పోరాదన్నట్లుగా సిక్ సుభాదార్ గుకుల్‌సింగ్ కత్తిని ఝళిపించాడు. సైన్యమంతా అలా త్వరితగతిని ప్రవేశించడం చూచి లోనున్న సిపాయీలు క్షణకాలం వ్యాకులపడ్డారు. కానీ నాడు సికిందర్‌బాగ్‌లో విప్లవకారులకు నేతృత్వము వహించినది సామాన్యుడు కాదు. ఆయన ఆధ్వర్యమున సిపాయిలు గట్టిగా ఎదురు నిలిచారు.

సికిందర్‌బాగ్‌కన్న అన్యస్థానాలలో రక్తం ఎక్కువ ప్రవహించింది. దిల్‌ఖుష్, ఆలంబాగ్, షానజఫ్‌లలో శత్రువులు ఆరాత్రి పగలు భయంకర మైన సమరము నెదుర్కొనవలసి వచ్చింది. దెబ్బతిన్న లక్నో అంతటా ఉదయానే మళ్ళీ ఘంటారావాలు, ఢంకానాదాలు, రణభేరీలు మ్రోగాయి. శత్రువు ఘోర యుద్ధాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. 17,18,19 తేదీల లోను, ఆ తర్వాత 23 వ తేదీ వరకును సమరం సాగింది. చివరకు

ఆక్రమణదారులతో సహాయక సైన్యాలు కూడా వచ్చిచేరాయి. మృత్యు ఛాయలలో విలవిల్లాడిన రెసిడెన్సీలో చిరునవ్వు మెరిసింది.

అయితే, ఇప్పటికీ విప్లవకారులు విజయలక్ష్మిని ఆంగ్లేయులకు స్వాధీనము చేయలేదు. శత్రువుల ఉభయ సైన్యాలు కలిసినా, లక్నో అంతా రక్త సముద్రంలో ఈదులాడుతున్నా విప్లవకారుల నుండి తిరోగమనమనిగాని, లొంగుబాటు అనిగాని వినిపించలేదు. ఇంత పట్టుదల, సాహసం చూపబడ్డప్పుడు యుద్ధం ఎప్పుడు ముగుస్తుందనేది ఊహించడం సాధ్యంకాదు. అందువల్ల కాలిన్ మరం తమ సైన్యాల మరమ్మతు ప్రారంభించాడు. రెసిడెన్సీని ఖాళీచేసి, సైన్యాలన్నిటిని దిల్ ఖుష్‌బాగ్‌లో చేర్చాడు. ఆలంబాగ్‌లో ఔట్రమ్ నాయకత్వాన 4 వేల మందిని 25 తుపాకులతో ఉంచాడు. రానున్న పోరాటానికి అవసరమైన ఏర్పాటులన్నీ చేశాడు. లభించిన విజయం దృష్ట్యా తన సైనికుల ధైర్యాన్ని, క్రమశిక్షణను, విధేయతను కొనియాడాడు. ఇందత్యధిక ఖ్యాతి హేవ్‌లక్‌కు లభించింది.

అయితే ఇటు ఆంగ్ల సైన్యాలు తమ విజయాలకు మురిసిపోతుండగా అందుకు ప్రధాన బాధ్యుడైన హేవ్‌లక్ హఠాత్తుగా మరణించాడు. భయంకరమైన లక్నో సమరపు శ్రమవల్లను, నిరాశ నిస్పృహలవల్లను, ధైర్యవంతుడైన హేవ్‌లక్ క్రమక్రమంగా కృంగి, కృశించి, తీరా విజయం లభించే సమయానికి మరణించాడు.

అదే సమయంలో తాత్యాతోప్ కాన్పూర్‌ను చుట్టుముట్టాడనే వార్త వారికి విషాదచ్ఛాయ అయింది. లక్నో రక్షణకు ఔట్రమ్‌ను ఉంచి కాలిన్ ప్రమాదాసబద్ధ ఆ నగరానికి వెంటనే బయల్దేరి వెళ్ళాడు.

# తాత్యాతోప్

జూలై 16న విప్లవ సైన్యాలు కాన్పూర్‌లో ఓడిపోగానే శ్రీమంత్ నానా కాన్పూర్‌ను వదలి బ్రహ్మావర్తం చేరాడు. ఆ రాత్రి అంతా భవిష్యత్తుకు సంబంధించిన ఆలోచనలతో గడిపాడు నానా. మరునాడుదయం అఖరి తమ్ముడు బాలాసాహెబ్, మేనల్లుడు రావుసాహెబ్, అంతరంగిక కార్యదర్శి తాత్యాతోపే, రాణివాసపు స్త్రీజనము, ధనకనకాదులు, కొంత ఆహార సామగ్రితో నానా గంగానదిని దాటేందుకై పడవనెక్కాడు.

నానా వెళ్తున్నది లక్నో ప్రాంతమందలి ఫతేపూర్‌కు. నానా సాహెబ్ ఆప్తమిత్రుడైన చౌదరి భోపాల్‌సింగ్ ఆయనకు హార్దిక స్వాగతమిచ్చి, తన ఇంట నివాసపు ఏర్పాటు చేశాడు. హేవ్‌లక్ తన సైన్యాలన్నిటితోను కాన్పూర్‌ను ముట్టడించి, లక్నోపై కూడా వత్తిడి తెచ్చేందుకు యోచిస్తుండగా నానాసాహెబ్ హేవ్‌లక్‌ను నిరోధించే ఉత్తమ విధానాలకు సంబంధించి దర్బారులో చర్చిస్తుండేవాడు. ఈ దర్బారులో తాత్యాతోప్ ఒక ఆలోచన ప్రతిపాదించాడు. కాన్పూర్ పరాజయంతో చెల్లాచెదరైన సిపాయీ దళాలన్నిటిని సమీకరించాలని సూచించాడు. ఈ అద్భుతవాదన మానవ నైజములో అత్యంత సహజమైన రహస్య వాస్తవముల గుర్తించి చేసినట్టిది. ఈ అసాధారణ ప్రజ్ఞావంతుని సాహస శీలములు-మూర్ఖమైన సిపాయి దళాలను సైతం ఒక్క మాటతో, ఒక్క రోజున విజృంభింపజేయగలిగినట్టివి.

16 వ ఆగష్టున ఆంగ్లేయుల చేత పరాజయం సంభవించగానే, తాత్యా తన సైన్యాలన్నిటితోను గంగను దాటి ఫతేపూర్‌లో నానా సాహెబ్‌ను కలిశాడు. పునరుజ్జీవన దినాలు మళ్ళీ ఆసన్నమైనాయి. సింధియాకు విధేయులై ఉండవలసిన రాజధాని గ్వాలియర్ కంటోన్మెంటులో అకర్మణ్యులుగ ఉన్న సిపాయీలు ఫిరంగీలతో యుద్ధానికై తహ తహ లాడుతున్నారు. అందువల్ల గ్వాలియర్‌కు ఎవరినో పంపవలసి ఉన్నది. ఆ పనికి తాత్యాకన్నా అర్హులెవరున్నారు? తాత్యా మారువేషంలో గ్వాలియర్ వెళ్ళాడు. అచిరకాలంలోనే మోరార్‌వద్ద సిపాయిలందరి హృదయాలను—అశ్వదళాన్ని, పదాతి దళాలన్నిటిని—స్వాధీనం చేసుకున్నాడు. కల్పివరకు వారందరిని తీసుకొని వచ్చాడు కూడా.

సైనిక వ్యూహాల దృష్ట్యా కల్పి సిపాయిలకు ఎంతగానో ఉపకరించేది. కల్పి, కాన్పూర్‌ల మధ్య ప్రవహించే నది వారికి వరదానా ఉపకరించేది. కాన్పూర్ తర్వాత కల్పిని మించిన కోట లేదని గుర్తించాడు తాత్యా. అందువల్ల కోటను స్వాధీనం చేసుకున్నాడు. కల్పిలోని చక్కని కోట తన వశమైందని వినగానే నానా దానిని తన కేంద్రం చేసుకొన దానికి సమ్మతించాడు. ఆ ఏర్పాటులు చూచేందుకై బాలాసాహెబ్‌ను అక్కడికి తన ప్రతినిధిగా పంపాడు. కోట బాలాసాహెబ్ ఆధీనం చేయబడగానే తాత్యా ఆంగ్ల సైన్యాలపై దాడికి సంబంధించిన యోజనలు ప్రారంభించాడు.

కల్పి కాన్పూర్‌కు 46 మైళ్ళ దూరాన ఉన్నది. ఆంగ్లేయుల లోతుపాతులన్నీ తెలుసుకొని తాత్యా కల్పినుండి బయల్దేరి జమునా నదిని దాటి, దోఆబ్‌లో ప్రవేశించాడు. తన సహచరులను జల్వాలో వదలి కాన్పూర్ సమీపమున గల కొన్ని గ్రామాల నాక్రమించాడు. జమున దాటగానే కాన్పూర్‌మీదకు త్రోసుకొని వెళ్ళకపోవడంలో పెద్ద వ్యూహ మున్నది.

వెనుకనున్న కాలిన్ కాంబెల్ సైన్యాలను కదలించడమా లేక కాన్పూర్‌వద్ద మాత్రమే పోరు సాగించమా అనేది విండ్‌హామ్ ఒక మాత్రానికి ఊహించుకోలేని పరిస్థితిలో పెట్టాడు తాత్యా. అయితే జనరల్ విండ్‌హామ్ తాత్యాను స్వేచ్ఛగా పురోగమించనీయడు. వెంటనే కాన్పూర్‌ను వదలి కాల్పివద్ద ఒక కాలువపై గల వంతెనవైపుకు వెళ్ళాడు.

ఈలోపున, నవంబరు 25 న తాత్యా శ్రీఖండీ నుండి పాండునది వైపు వెళ్ళాడు. సాహసముతో వారంతా చేరువకు వచ్చేసరికి ఆంగ్లేయులు యుద్ధానికి తయారైనారు. విప్లవకారులు ఘోరాటవిలో ఉన్నారు. ఆంగ్లేయులపై గుండ్లవర్షం కురిపించారు. చాలాసేపు కాల్పులు జరిగిన తరువాత ఆంగ్లేయులు విప్లవకారుల తుపాకులు మూడు వశం చేసుకున్నారు. తన ధైర్యసాహసాలవల్ల, తన సైన్యానికి మరొక విజయం ప్రాప్తించిందని భావించాడు విండ్‌హామ్.

కాని అది వట్టి భ్రమ మాత్రమే. ఎందువల్లనంటే ఆ వెంటనే ఆంగ్లేయులు తిరోగమించవలసి వచ్చింది; క్షణంలో విజయం పరాజయంగా మారింది. విండ్‌హామ్ కాన్పూర్ చేరేవరకు తాత్యా తరిమి తరిమి కొట్టాడు.

అంతవరకు నిర్విరామంగా 24 గంటలసేపు పోరాడిన సిపాయీలను, మర్నాడుదయానికి మళ్ళీ సమరానికి సిద్ధంగా ఉండమని తాత్యా ఆజ్ఞాపించాడు. అయితే షియో, షియోరాజ్‌పూర్‌ల నుండి వచ్చే విప్లవ సైన్యాలు, కుడివైపు నుండి ఆంగ్లేయులపై కాల్పులు ప్రారంభించేవరకు వీరు కాల్పులు ప్రారంభించారు.

ఆంగ్లేయులు ఉదయపు ఉపాహారం పుచ్చుకొనీ పుచ్చుకొనక ముందే కుడివైపు నుండి తుపాకి గుండ్లు దూసుకురా నారంభించాయి. ముందున్న దళాలను కూడా తాత్యా ఎదుర్కొన్నాడు. ఆంగ్లేయ సాయుధ

సైనికులు వెనుదిరగ నారంభించారు. తాత్యా తన సైన్యాంను అర్ధచంద్రా కారంలో ఏర్పాటుచేసి మూడు వైపుల నుండి దెబ్బతీస్తూ పురోగమిస్తు న్నాడు. విండ్‌హామ్ ఆవ్యూహాన్ని భేదించడానికి సర్వవిధాలా యత్నించాడు. కాని తాత్యా అతడిని ఒక్క అడుగు కూడా ముందుకు సాగనీయలేదు. ఇక నిలవ దొక్కుకొనడం కూడా సాధ్యంకాదని భావించారు ఆంగ్లేయులు. వెంటనే తిరోగమన చిహ్నాలు కానవచ్చాయి.

వామ విభాగం తుపాకులు వదిలి తిరోగమించడం చూచి దక్షిణ విభాగం కొంతసేపు నిలప ద్రొక్కుకొనడానికి ప్రయత్నించింది. అయితే అది ఎంతోసేపు సాధ్యం కాలేదు. వారు కూడా తిరోగమించడంతో అర్ధ చంద్రాకారపు విప్లవ వ్యూహం వారిని ఇంకా దరికిజేరి నొప్పించింది. సాయంత్రం ఆరయ్యేసరికి ఆంగ్ల సైన్యాలు సంపూర్ణంగా మనో ధైర్యం కోల్పోయినాయి. మరికొంత వ్యవధిలో వారి పరాజయం పూర్తయింది. వేలాది గుడారాలు, వస్త్రాలు, ఆహార పదార్థాలు పశువులు విప్లవకారుల హస్తగతమైనాయి. కాన్పూర్‌లో సగభాగం ప్రస్తుతం తాత్యా అధీనములో ఉన్నది.

ఈ దశలో తాత్యా ఫిరంగి ధ్వనులు సర్ కాలిన్ కాంప్‌బెల్ చెవుల బడ్డాయి. కాంప్‌బెల్ ఒక మాసం రోజులవరకు లక్నోను వదలే వీలుండదు లెమ్మని తాత్యా కాన్పూరులో ప్రవేశించినప్పుడనుకున్నాడు. కాని వెంటనే అనుకోకుండా కాంప్‌బెల్ విప్లవకారులను పారద్రోలినట్లు తాత్యా విన్నాడు. ఇక కాలిన్ తనవైపువచ్చి గంగ రెండు వైపుల నుండి తనపై దగ్గర ఉండి పోరు సల్పడం అత్యంత సంభవ మనిపించింది. కాలిన్ తన రక్షణకు వస్తున్నాడని విని ధైర్యం పొందిన విండ్ హామ్ పరాజయం మర్చాడు ఉదయమే మళ్ళీ దాడి ప్రారంభించాడు. విప్లవకారులు రెండు వైపుల నుండి ఆయుధ ప్రయోగం ప్రారంభించారు. క్రిందటి రోజున

వలెనే మధ్యాహ్నం వరకు పోరు సాగింది. కాని నేను మాత్రం ఆంగ్లేయులు తిరోగమించలేదు. విజృంభించారు సమైక్యంగా, దృఢ నిశ్చయంతో, అణచేందుకు వీలులేకుండా కాల్పులు సాగించారు. అయితే ఆంగ్లేయులు మళ్ళీ దెబ్బ తిన్నారు. క్రిందటి రోజుకన్న గట్టిదెబ్బ తిన్నారు ఆ ఆఖరి రోజున ఆంగ్లేయుల సైన్యవిభాగాలు రెండూ రంగంనుండి కేవలం తరిమి వేయబడ్డాయి. దీనిలో కాన్పూర్ మొత్తం తాత్యా వశమైంది.

ఆంగ్లేయులు ఆఖరి దెబ్బ తింటూవుండగా కమాండరిన్ చీఫ్ కాలిన్ అప్పుడే శిబిరంలోనికి ప్రవేశించాడు. తాత్యావల్ల ఆంగ్లేయుల ప్రతిష్ఠకు కలిగిన అఘాతమును గుర్తించాడు. ఆంగ్లేయులు ప్రాణా లరచేత బెట్టు కొని చెల్లాచెదరై పారిపోవడం, విజేతలైన విప్లవకారులు వెంటబడి తరు మడం తన కండ్లతో తాను చూచాడు. కాన్పూర్‌లో తాత్యా సాగిస్తున్న సమరపు ప్రాముఖ్యాన్ని గుర్తించాడు.

లక్నోలోని విప్లవకారుల పరాజయం వల్లనే ఈ క్షణాన కాలిన్ ఆంగ్లేయులను అంతగా కాన్పూర్ రావడం సాధ్యమైనదన్న వాస్తవాన్ని తాత్యా గుర్తించాడు. అయితే అతడు తంత్రించుటలేమి కాలేదు. ఆంగ్లే యులు గంగను దాటిరాకుండా అయోధ్య వద్దనున్న వంతెనను ధ్వంసం చేసి వేశాడు. అప్పటి అనేక తుపాకులను కూడా ఏర్పాటు చేశాడు.

శత్రువు ఈ వ్యూహాన్ని అర్థం చేసుకుని, ఒక ప్రక్క అగ్నివర్షం కురుస్తున్నా లెక్కచేయక నవంబరు 30 కి ముందుగా అయోధ్య నుండి కాన్పూర్‌కు చేరారు. తాత్యా శిబిరములోనికి నానాసాహెబ్, కుమర్ సింగ్‌లు కూడా చేరారు. కాన్పూర్‌ను వదలివేయడం కాకుండా, కమాండ రిన్ చీఫ్‌ను రణరంగంలో ఎదుర్కొనడమే ప్రతిష్ఠాకరమని ఈ నాయ కులు నిర్ణయించుకున్నారు.

తాత్యా తన వామసైనిక విభాగాన్ని గంగా, కాన్పూరుల మధ్య గల ఒక సురక్షిత ప్రాంతంలో ఉంచాడు. తన కేంద్రం కాన్పూరు నడి బొడ్డున. తన దక్షిణ సైనిక విభాగం గంగా కాలువమీదుగా ముందుకు సాగివెళ్ళి అక్కడ ఉన్న ఒక వంతెనను తమ ఆధీనంలో ఉంచుకున్నారు. తాత్యా సైన్యములో పదివేలమంది సుశిక్షితులైన సిపాయిలున్నారు. వీరిని ప్రయోగించి డిశంబరు 1, 2 తేదీలలో కాలిన్‌కు ఊపిరాడకుండా చేశాడు. రెండవ తేదీన కాలిన్ గుడారము మీదనే కాల్పులు సాగించాడు. ఆరవ తేదీన కాలిన్ విప్లవవీరుల సవాలును ప్రత్యక్షంగా ఎదుర్కొనవలసి వచ్చింది. తన చేతిక్రింద నున్న ఏడువేల మందిని అత్యద్భుతంగా సమీక రించి, సర్వ సైన్యాధిపతి గుడారముమీదనే కాల్పులు సాగించ సాహసిం చిన ఈ 'తిరుగుబాటు'దార్లపై దాడి ప్రారంభించాడు.

మొదట ఎక్కువ రక్షణలేని దక్షిణ విభాగాన్ని ఎదుర్కొన్నాడు. అందులో ఎక్కువగా ఉన్నది గ్వాలియర్ సైన్యాలు. దీనికి సంబంధించి నంతవరకు కాలిన్‌కు చక్కని విజయం లభించింది. అయితే అతడికి సంతృప్తి కలుగలేదు. కల్పి వెళ్ళేదారిని అడ్డంచేసినట్లే, ఎడమప్రక్క బ్రహ్మావర్తము వెళ్ళేదారిని అడ్డంచేసి, తాత్యాను ససైన్యముగా పట్టుకొనా లని ఒక ఆలోచన కల్గిం దతడికి. బ్రహ్మావర్తము వెళ్ళేమార్గమును నిరోధించేందుకై మాన్స్ ఫీల్డును పంపాడు. చుట్టుదారిన రహస్యంగా మాన్స్‌ఫీల్డు రావడాన్ని గుర్తించిన విప్లవకారులు - అతడిపద్ద భారీ సైన్యం ఉన్నప్పటికి - మాన్స్‌ఫీల్డును అడ్డగించారు. స్వయంగా నానాయే దానిని నడిపాడు. మాన్స్‌ఫీల్డు మెల్లమెల్లగా సాగిరావడాన్ని పూర్తిగా తన కను కూలంగా వినియోగించుకున్నాడు నానా. తాత్యా వశమైనాడా అని కాలిన్ ఆతృతగా అడుగుతుంటే మాన్స్‌ఫీల్డ్ దెబ్బ తింటున్నాడని జవాబు వచ్చింది! ఆయన వాంఛ భగ్నమైంది. తాత్యా చిక్కలేదు.

నానా మాన్స్‌ఫీల్డును నొక్కివేశాడు. బ్రహ్మవర్తంవరకు త్రోసుకు పోయినాడు. ఆంగ్లేయ దళాలను తునాతునకలు చేసి, తన సైన్యాలతోను, తుపాకులతోను, వారి మధ్యగుండా దూసుకుపోయినాడు. తాత్యా ససైన్యముగా తప్పించుకొనగల్గినా, హోస్‌గ్రాంటు అతడిని వెంటాడాడు. డిశంబరు 9 వ తేదీన ఫియో రాజ్‌పూర్‌వద్ద వారిద్దరికి మధ్య సమరం జరిగింది. ఈసారి గూడా తాత్యా తప్పించుకొనగల్గినా, అతడి తుపాకులనేకం శత్రువుల వశమైనాయి.

# లక్నో పతనం

తాత్యా విజృంభణ నలా అరికట్టి కాలిన్ భారతదేశపు మిగిలిన భాగాలను తిరిగి వశము చేసుకొనడానికి ఉపక్రమించాడు. చర్యల నిర్వహణకు ఇద్దరు కమాండర్లు - సీటన్, వాల్‌పోల్ - నియోగింపబడ్డారు. జమునానది నానుకొనిఉన్న దో ఆబ్ డొంకలో ఒక్క విప్లవకారుడైనా లేకుండా ఖాళీ చేయించడం వారిపని.

1858 జనవరి 4న సర్ కాలిన్ విజయగర్వంతో ఫతేఘర్ ప్రవేశించే సమయానికి, దో ఆబ్ మండలము, వారణాసినుండి మీరట్ వరకు గల యావత్ప్రదేశము మళ్ళీ ఆంగ్లేయుల వశమైపోయింది. ఇకముందు ఆంగ్ల సైన్యాలు ఎలాంటి పథకము వేసుకొనాలనేది ప్రశ్న. దో ఆబ్‌లో విప్లవ జ్వాలలను చల్లార్చివేస్తే యావద్దేశపు విప్లవ జ్వాలలు చల్లారిపోగలవని ఆంగ్లేయులు పడిన ఆశలు నీరుకారి పోయినాయి. ఢిల్లీ పడిపోగానే 8 రోజులలో విప్లవం అణగారిపోతుందని రాజకీయ జ్యోతిష్కులన్నారప్పుడు. వాస్తవానికి అలా జరగలేదు. ఢిల్లీ పతనంవల్ల పిప్లవం ఆగలేదు. ఈ అంచనాలన్నీ తల్లక్రిందు లయినాయి. ఎందువల్లనంటే, అంతవరకు ఢిల్లీలోనే కేంద్రీకరింపబడి ఉన్న విప్లవ సైన్యాలు ఢిల్లీ పతనంతో నలుదిక్కులా వరదలవలె వ్యాపించి విజృంభించాయి.

అయితే ప్రస్తుతం విప్లవకారుల చేతిలో మిగిలిపోయినవి అయోధ్య, రోహిల్‌ఖండ్‌లు మాత్రమే. సర్ కాలిన్ ముందు రోహిల్‌ఖండ్‌ను జయించి ఆ తర్వాత లక్నో వెళ్ళామనుకున్నాడు. కాని లార్డ్ కానింగ్ ఇంకొక విధంగా ఆలోచించాడు. విప్లవ కార్యకలాపాలకు కేంద్రంగా ఉన్న లక్నోను ముందు నాశనం చేసివేయాలనుకున్నాడు. దానిని మన్నించి సర్ కాలిన్ 1858 ఫిబ్రవరి 23 న బ్రహ్మాండమైన సాయుధ బలాలతో కాన్పూర్ వదలి గంగను దాటి లక్నోకు బయల్దేరాడు.

ఆంగ్లేయులకు కొరకరాని కొయ్యగా ఉంటూవచ్చిన అయోధ్యకు ఈలోపున నేపాల్ వైపునుండి జంగ్‌బహద్దూర్ నాయకత్వాన ప్రమాదం వచ్చింది. సర్ కాలిన్ ససైన్యంగా గంగానదిని దాటుతున్న సమయము లోనే జంగ్ బహద్దూర్ ఆంగ్లేయులకు తోడ్పడేందుకు లక్నోవైపు పయనిస్తున్నాడు. విధి వైపరీత్యము! ఆంగ్లేయు లాతడికి మిత్రులు! హిందూస్థానీయు లాతడికి శత్రువులు! ఆవు క్రొవ్వుతో తూటాలందిచ్చిన వారతడికి ఆప్తులు! వాటిని కొరికి నిరాకరించినవారు విరోధులు! చరిత్రకే మాయని కళంక మీ జంగ్ బహద్దూర్. స్వరాజ్య సమరం ఆరంభమైనదని వినగానే ఆంగ్లేయులతో కలిసిపోవడం ద్వారా తనకు, తన వంశానికే అప్రతిష్ఠ తెచ్చాడీ జంగ్ బహద్దూర్. 1857 కు కొద్దిగా పూర్వం అతడు బ్రిటన్ వెళ్ళి వచ్చాడు. ఆంగ్లేయుల ఘనతను, శక్తిని కళ్ళారా చూచి వచ్చాడు కనుక అతడు వారిపై పోరాడే సాహసం చేయలేకపోయినాడంటారు ఆంగ్ల చరిత్రకారులు!

ఆంగ్ల సైన్యాలు అయోధ్యపై దృష్టి సారించకపూర్వమే నేపాలీలు విప్లవకారులను అయోధ్య వద్దనే నొక్కి ఉంచారు. మరికొన్ని రోజులలో ఆంగ్లేయులు, జంగ్ బహద్దూర్‌తో ఒక స్పష్టమైన ఒడంబడిక చేసుకొని, ఈ ప్రాంతంపై దాడి వెడలడానికి మూడు సైనిక దళాలను సిద్ధము చేసుకొన్నారు.

1857 డిశంబరు 23న జంగ్ బహద్దూర్ 9 వేలమంది గూర్ఖాలతో బయలుదేరాడు. జనరల్ ఫ్రాంక్, జనరల్ రౌక్రాఫ్ట్ పెద్ద పెద్ద ఆంగ్ల సైన్యాలు తీసుకొని బయల్దేరారు. దారిలో వారణాసికి ఉత్తరాన, అయోధ్యకు తూర్పున విప్లవకారులను అణచివేసి ఈ మూడు సైన్యాలు అయోధ్య ప్రవేశము చేయజొచ్చాయి.

సంకుల సమరం తర్వాత, మొదట అంబర్‌పూర్ కోట వశమైంది. విజేతలైన ఫ్రాంక్, జంగ్ బహద్దూరుల సైన్యాలు తూర్పునుండి బయల్దేరి, పశ్చిమంగా లక్నోపై దాడి చేస్తున్న కాంప్‌బెల్‌ను చేరాయి.

లక్నోను రక్షించుకునేందుకై రాజాలు, జమీందార్‌లు కూడా విజృంభించారు. వారిలో అతి ముఖ్యమైన నాయకుడు ఫైజాబాద్‌కు చెందిన అహ్మద్‌షా మౌల్వీ. ఈయన ప్రాంతమంతటిలోనూ అగ్ని రగిల్చాడు. ఆంగ్లేయులను వెంటాడి వేటాడాడు.

మార్చి 6 వ తేదీన ఆంగ్లేయులు లక్నోకు ఉత్తర దిశగా తమ కార్యకలాపము లారంభించారు. ఆ తర్వాత వెంటనే కాలిన్ సైన్యాలు 30 వేల వరకు పెరిగాయి. ఇక ఆంగ్లేయులు తూర్పు, ఉత్తరములనుండి దాడి ప్రారంభించారు. లక్నోనుండి ఒక్క విప్లవకారుడైనా ప్రాణాలతో బయటపడేందుకు వీలులేని పద్ధతిలో కాలిన్ తన సైన్యాలను విభజించి నియమించాడు.

ఆంగ్ల సైన్యాలు కోటలపై పెను తుఫానుగా విరుచుకు పడ్డాయి. దిల్ ఖుష్‌బాగ్, కదంరసూల్, షానజీఫ్, బేగమ్‌కోఠి మున్నగు కోటలన్నీ వశం చేసుకొని పురోగమించాయి ఆంగ్ల సైన్యాలు. 10 వ తేదీన విప్లవ కారులు హడ్సన్‌ను హతమార్చారు. ఢిల్లీలో నిరాయుధులై లొంగిపోయిన మొగలు రాకుమారులను కాల్చి చంపిన వ్యక్తి ఇతడే. 14 న ఆంగ్ల సైన్యాలు సూటిగా రాజభవనంలో ప్రవేశించాయి.

ఇప్పటికి లక్నో పూర్తిగా ఆంగ్లేయుల హస్తగతమైనది. రాజ భవనం ఎలా లూటీ చేయబడినది, పౌరులు మూక ఉమ్మడిగా ఎలా ఊచ కోత కోయబడినది, శవాలు సైతం ఎలా అవమానింపబడినది - అంతా ఒక హృదయ విదారకమైన గాథ. వారు జరిపిన మానభంగాలకు, నీచ వర్తనలకు ఆంగ్లేయ చరిత్రకారుల సాక్ష్యమే లేకపోతే వాటిని నమ్మడమే కష్టం. విప్లవ సమయంలో, కేవలం కసి తీర్చుకొనడానికి ఆంగ్లేయులు జరుపుతూ వచ్చిన ఘాతుక చర్యల పద్ధతిలోనే ఇదికూడా జరిగింది.

# కుమర్‌సింగ్ అమర్‌సింగ్

వృద్ధు డయ్యీ శక్తివంతుడైన షహాబాద్ కేసరి కుమర్‌సింగ్ జనరల్ ఐర్‌చే జగదీశ్‌పూర్ లోయనుండి తరిమివేయబడిన తర్వాత విశ్రాంతి అనేది లేకుండా తిరుగుతున్నాడు. తన స్వేచ్ఛను హరించివేసిన వారి గొంతు పట్టుకునేందుకు అనుక్షణమూ ప్రతి అవకాశము వినియోగించు కొన జూస్తున్నాడు. ఆయన సోదరుడు అమర్‌సింగ్, మరి ఇద్దరు ముఖ్యులు నిస్వర్‌సింగ్, జవాన్‌సింగ్‌లు ఆయన ధ్వజం క్రింద ఏకమైనారు. వారు అడవులలో పొంచి ఉన్నారు.

తన రాజధానిని కోల్పోయిన కుమర్‌సింగ్ ఆంగ్లేయుల పైకి తన సైన్యాలను పంపలేదు. అలా చేస్తే తన సైన్యాలు శత్రువు ముందు క్షణంలో శలభాలవలె నశించిపోయేవి. అతడు జాగ్రత్తగా, శత్రువుకు బలహీనమైన స్థావరాలను గుర్తించుకుంటూ, షోన్ నదీతీరము వెంట బీహార్‌లోని పశ్చిమారణ్య ప్రాంతాలకు వెళ్ళాడు. ఇంతలో—లక్నోను నాశనం చేసేందుకు అజీమ్‌ఘర్ నుండి అయోధ్యకు ఆంగ్లేయ, నేపాలీ సైన్యాలు పంపబడుతున్నాయని - అతడికి తెలిసింది.

ఆంగ్లేయులు లక్నో మీదికి వెళ్తున్నప్పటికి, వారి ఒక కన్ను ఇంకా జగదీశ్‌పూర్ మీద ఉన్నది. ఎందువల్లనంటే, ఆ ప్రాంతంలో కుమర్‌సింగ్ కార్యకలాపాల కేంద్రీకరణకు అవకాశాలున్నాయి. అందువల్ల కుమర్‌సింగ్ అక్కడ తన కార్యకలాపాలను నిరవధికంగా వాయిదా వేసి అయోధ్య తూర్పు మండలానికి బయల్దేరాడు! ఆంగ్ల సైన్యాలు అత్యంత బలహీనంగా ఉన్న అక్కడ ఒక స్థానాన్ని దెబ్బ తీయాలనుకున్నాడు. తూర్పు అయోధ్యలో చెల్లాచెదురుగా ఉన్న విప్లవకారులందరిని సమీకరించి అజీమ్‌ఘర్‌పై ఆకస్మిక దాడి జరిపి, విజయం లభిస్తే ఏకదాటిన వారణాసి, అల్హాబాద్ వరకు సాగివెళ్ళి, ఆ విధంగా జగదీశ్‌పూర్ అనమానాన్ని బాపుకొనాలని అతడి ఆశ. 1858 మార్చి 18 న బీనా విప్లవకారులు కూడా ఆయనతో చేరారు. ఆ సంయుక్త సైన్యము అట్రోలియా కోటకు చేరువన శిబిరము వేసింది.

అజీమ్‌ఘర్ అట్రోలియాకు 25 మైళ్ళ దూరాన ఉన్నది. కుమర్‌సింగ్ ఎంతో చేరువలో ఉన్నాడని విని, మిల్మన్ నేతృత్వంలో పదాతి, అశ్విక దళమునకు చెందిన 300 మంది ఆంగ్లేయులు 2 పెద్ద తుపాకులతో అట్రోలియా మీదకు దాడి వెడలారు. మార్చి 22 సూర్యోదయమయేసరికి అటు ఆంగ్లేయులు, ఇటు విప్లవకారులు పరస్పరం కంటబడ్డారు. హఠాత్తుగా ఆంగ్లేయులు కనబడగానే చకితులైనట్లు కనపడ్డ విప్లవకారులకు తెప్పరిల్లుకునేందుకు క్షణకాలం వ్యవధి కూడా లేకుండా మిల్‌మన్ తన సైన్యాలను హెచ్చరించాడు.

మొదట బ్రిటిషువారే గెలిచినట్లు కనిపించింది. కాని వెంటనే కుమర్‌సింగ్ అట్రోలియా కోటనుండి వెలికివచ్చాడు. కుమర్‌సింగ్ సైన్యాలు, మిల్‌మన్ సైన్యాలకు ఐదారురెట్లు ఉన్నాయి. అవి తనను చుట్టుముడుతున్నట్లు గుర్తించగానే, మిల్‌మన్ అంత సాహసోపేతమైన దాడి మధ్యలో ఒక్కసారిగా బలహీనంగా ఆగిపోవలసి వచ్చింది. ఈ బలహీనత కుమర్‌సింగ్ విశ్వాసాన్ని పెంచివేసింది.

హడలిపోయి, ఉక్కిరిబిక్కిరై ఉన్న ఆంగ్లసైన్యాలు వెనుకబడ నారంభించాయి. కుమర్‌సింగు సైన్యాలు వేటాడ నారంభించాయి. చెదురు వాటు ఆంగ్లయులను కాల్చివేస్తున్నారు. దళాలను తుత్తునియలు చేస్తున్నారు.

మిల్‌మన్ సైన్యాలను కుమర్‌సింగ్ అజీమ్‌ఘర్ వరకు తరిమి కొట్టాడు. అక్కడ మిల్‌మన్‌కు మరల ధైర్యం చిక్కింది. తన శీఘ్ర గమన సందేశానుసారం వారణాసి, ఘాజీపూర్‌లనుండి 350 మంది అతడికి సహాయపడేందుకై వచ్చారు. సమగ్ర సైన్యానికి కలనల్ డేమ్స్ నేతృత్వం వహించాడు.

కాని డేమ్స్‌కుకూడా మిల్‌మన్‌కు పట్టిన గతియే పట్టింది. ప్రారంభ విజయం (అలా కనిపించింది) తర్వాత అతడు అజీమ్‌ఘర్ కోటకు పరుగెత్తి తలదాచుకున్నాడు. కుమర్‌సింగ్ అజీమ్‌ఘర్‌ను ప్రవేశించాడు. అక్కడ కొద్దిమంది ఆంగ్లేయులను తన చేతి క్రిందివారికి, క్షామ దేవతకు వదలివేసి విజయవంతంగా వారణాసి వైపు వెళ్ళాడు.

ఈ ఆంగ్లేయ పరాజయంతో గవర్నర్ జనరల్ కానింగ్‌కు ముచ్చె మటలు పోశాయి. దానితో క్రిమియన్ సమరవీరుడైన లార్డ్ మార్క్ కేర్‌ను పిలిచి, కుమర్‌సింగ్‌ను అజీమ్‌ఘర్ వద్ద ఎదుర్కొనవలసిందిగా ఆజ్ఞ చేసి పంపాడు.

లార్డ్ మార్క్ కేర్ 500 మంది సైనికులతోను, 8 తుపాకులతోను బయల్దేరి వెళ్ళాడు. అజీమ్‌ఘర్‌కు 8 మైళ్ళ దూరానికి చేరాడు. ఆంగ్లేయులు దాడి ఆరంభించీ అరంభించక పూర్వమే కుమర్‌సింగ్ సైన్యాలు వారిపై గుండ్ల వర్షం ప్రారంభించాయి. ఆనాడు ఆ వృద్ధ కుమర్‌సింహుడు, తన ప్రియమైన శ్వేతాశ్వముపై కూర్చొని, మెరుపుతీగవలె రణరంగమంతా తానేయై భాసించాడు. శత్రు సైన్యాలు ఏమంత ఎక్కువ కాదని,అందున్నది నానా గోత్రీకులని గుర్తించి, తన ఆక్రమణను విస్తరించి, మార్క్ కేర్ పార్శ్వములందు విరుచుకుపడ్డాడు. శత్రు సైన్యాలు అగ్నిని వర్షిస్తున్నాయి.

తనవద్ద అన్ని తుపాకులు లేవు. అయినా మెల్లగా లార్డు కేర్ వెనుకకు చేరగలిగాడు. అక్కడ దృఢంగా స్థిరపడ్డాడు. అతడి ధాటికి తట్టుకొనలేక ఆంగ్లేయుల ఏనుగులు చెల్లాచెదురై పరుగెత్త జొచ్చాయి. ఆశలుడిగి పోయిన మావటీంద్రులు ఏనుగుల గొంతులు కావలించుకొని పడుకున్నారు.

వెనుక భాగాన కానవచ్చిన అగ్నిజ్వాల చూచి కేర్ ఇక రణరంగం వదలడం మంచిదని భావించి ఆజీంఘర్ వైపు త్రోసుకుపోయినాడు. అతడి తుపాకులు అతడి కెంతగానో సహాయపడ్డాయి—ముఖ్యంగా కుమర్‌సింగ్ వద్ద తుపాకులు లేనందువలన. అర్ధరాత్రి వేళకు లార్డ్ కేర్ తన సైన్యాలను అజీంఘర్‌కు చేర్చాడు.

అజీంఘర్ విముక్తం చేయడానికి లార్డ్ కేర్ అవకాశానికి ఎదురు చూస్తుండగా కుమర్‌సింగ్ మరొక సాహసోపేతమైన పథకం వేస్తున్నాడు. మృత్యువు నెదిరించడానికి స్వచ్ఛందంగా సిద్ధపడ్డ విప్లవకారులను ఏరి, అధారపడదగిన అనుభవజ్ఞులు, ధైర్యవంతులతో దళము నొకదానిని ఏర్పరచాడు. తాను నది వంతెనపై కాపలా ఉన్న ఆంగ్లేయులను ఈ దళముతో చెదరకొట్టాలని ఆయన పథకం. అజీంఘర్‌వద్ద ఆంగ్లేయుల నాదుకొనేందుకు బ్రిటిష్ జనరల్ లూగర్ట్ సాగివస్తున్నది ఈ వంతెన దారినే. విప్లవకారులు వంతెనపై దృష్టిని సారించడానికి కారణం అజీంఘర్‌ను రక్షించుకొనడమేనని సహజంగా అనుకున్నాడు మొదట లూగర్ట్. కాని వాస్తవానికి కుమర్‌సింగ్ వారికి ఒక వంచిక ఇవ్వదలిచాడు. ఏమైనా సరే అజీంఘర్‌ను రక్షించుకొంటున్నట్లుగా పైకి కనిపించి, ఆంగ్లేయుల దృష్టిని, సైన్యాన్ని అక్కడ కేంద్రీకరింపజేసి జగదీశ్‌పూర్‌కు చక చక సాగివెళ్ళడం ఆయన ఉద్దేశం. అతడి సైన్యాలు ఆంగ్లేయుల కన్నుగప్పి అజీంఘర్‌ను వదలి, ఘజీపూర్ వెళ్ళేదారి తొక్కేవరకు ఆ వంతెననే అంటిపెట్టుకొని ఉండవలసిందిగా ఆ దళానికి ఆజ్ఞ చేశాడు. ఘజీపూర్ నుండి గంగను దాటితే తను జగదీశ్‌పూర్ అరణ్యాలకు చేరగలడు. ఇక అక్కడినుండి ఆంగ్లేయులతో చెర్లాటమాడవచ్చు.

అక్కడ లూగర్ట్ ఆ సేతురక్షకులపై దాడి తర్వాత దాడి చేస్తున్నాడు. క్షణకాలమైనా వంతెన అతడికి వశంకాలేదు. ఆంగ్లేయుల ప్రతి కాల్పుకు జవాబు వస్తున్నది. కుమర్‌సింగ్ అజీంఘర్ వదలి భద్రముగా ఘజీపూర్ దారికి చేరారని సంకేతము అందేవరకు ఆ వీరులు వంతెనలో ప్రతి అంగుళము రక్షిస్తూ నిలచారు. ఆ వెంటనే విజయవంతంగా తిరోగమించి, ఆనందోత్సాహాల మధ్య కుమర్‌సింగ్ వద్దకు చేరారు.

కుమర్‌సింగ్ ఇలా అత్యద్భుతంగా తప్పించుకొనడంతో ఆంగ్లేయులు నిశ్చేష్టులై పోయినారు. వెంటాడ వ్యర్థంగా యత్నించారు. కుమర్‌సింగ్ దొరకలేదు; తీరా అతడు దొరికేసరికి-వెంటాడేవారెవరో, వెంటాడబడేవారెవరో పోల్చుకునేందుకు వీలులేకుండా – పరిస్థితి తల్లక్రిందులై ఉంది! శత్రువుచుట్టూ కత్తులు ఝళిపిస్తూ, తుపాకులు చూపుతూ మూగారు కుమర్‌సింగ్ సైనికులు. ఆ సమరంలో కుమర్‌సింగ్ సైన్యాలు ఏమాత్రమూ చలించలేదు. ఆంగ్లేయులు మాత్రము పూర్తిగా ఆత్మరక్షణలో పడ్డారు. కుమర్‌సింగ్ గంగానదివరకు సాగివెళ్ళాడు.

ఇతడిని వెంటాడేవారితో అజీంఘర్ నుండి జనరల్ డగ్లస్ వచ్చి చేరాడు. చతురుడైన కుమర్ వీరిని ఇట్టే తప్పించుకున్నాడు. గంగానదిలో పడవలు చాలనందున అతడి సైన్యాలు లోతులేని బలిలావద్ద ఏనుగులపై నెక్కి గంగను దాటబోతున్నాయనే వదంతి వ్యాపింపచేశాడు! ఆంగ్లేయులకు నిజమైన వార్త తెలిసేసరికి వారు అదరాబదరా వచ్చి నదిమధ్యంలో కుమర్‌సింగ్‌ను ఢీకొన్నారు.

ఈ జాతీయ మహావీరుడు నదీమధ్యములో ఉండగా శత్రువులగుండు ఒకటివచ్చి మణికట్టుగుండా దూసుకుపోయింది. అయితే 80 ఏండ్ల ఆ వృద్ధ వీరుడు దానిని కూడా లక్ష్యపెట్టలేదు. మణికట్టు వ్రేలాడుతూ అడ్డంగా ఉండేసరికి రెండవచేత కత్తిధరించి మోచేతివరకు తెగనరికి "అమ్మా,

గంగా భవానీ! నీ ప్రియసుతుని ఈ ఆఖరి కానుకను స్వీకరించు'' అంటూ నదిలో వదిలాడు!

గంగామాయికి ఈ అర్పణ చేసిన తరువాత ఈ వీరసుతుడు ఆంగ్లేయుల వద్దనుండి ఎలాంటి ఇబ్బందీ లేకుండానే ఆవలి గట్టుకు చేరాడు. రెండవప్రక్క శత్రువులు తామనుకున్న పని పూర్తిగాక, అహం దెబ్బ తిని అక్కడే నిలచిపోయినారు. కుమర్‌సింగ్ షహబాద్ అరణ్యాలగుండా జగదీశ్‌పూర్ చేరి ఏప్రిల్ 22న తన పూర్వ రాజధానిలో ప్రవేశించాడు.

ఎనిమిది నెలల క్రితం అతడు తరిమివేయబడినదీ రాజధాని నుండియే. మళ్ళీ నేడు జగదీశ్‌పూర్ పాలకుడు రాజమందిరంలో చేరాడు. ఇతడు గంగను దాటకపూర్వమే ఆతడి సోదరుడు అమరసింగ్ దేశభక్తులైన గ్రామీణులను, రైతాంగాన్ని సమీకరించి ఇతడిని కలిశాడు.

కుమర్‌సింగ్ జగదీశ్‌పూర్ ప్రవేశం ఎంత చురుకుగా, ఆకస్మికముగా జరిగినదనగా - జగదీశ్‌పూర్‌పై కాపలాగా అర్రాలో ఉంచబడిన ఆంగ్లేయులకు కుమర్‌సింగ్ అర్రాపై అవతరించిన విషయమే తెలియలేదు. పప్పులో కాలువేసిన అర్రా బ్రిటిష్‌జనరల్ లీగ్రాండ్, 400 మంది ఆంగ్లేయులను 2 తుపాకులను తీసుకుని తిన్నగా జగదీశ్‌పూర్ నగరము మీదకు ఏప్రిల్ 23 న దాడి వెడలాడు. అప్పటికే అలసిపోయి ఉన్నప్పటికీ కుమర్‌సింగ్ ఆంగ్ల సైన్యాలను అజీంఘర్ ద్వారాలవద్దనే అణచివేశాడు. ఆలా శత్రువును చావుదెబ్బతీసి మరీ అతడు రాజమందిర ప్రవేశం చేశాడు. నూతన వైభవంతో సింహాసనాన్ని అధిరోహించాడు. అయితే నగరంలో ఇది అతడి ఆఖరి ప్రవేశం. తెగిపోయిన చేయి పరిస్థితి ప్రాణాంతకమైనది. ఏప్రిల్ 26 న ఆ మహావీరుడు స్వీయభవనంలో కన్నుమూశాడు. స్వతంత్ర సింహాసనంమీద, స్వేచ్ఛా పతాకం క్రింద అతడు వీరమరణం పొందాడు.

రంగంమీదనుండి ఈ మహానటుడు నిష్క్రమించగానే ఆయన స్థానమును అంతటి శౌర్య ధైర్య సంపన్నులు మరియొకరాక్రమించారు,

ఈయన ఎవరోకాదు - కుమర్‌సింగ్ తమ్ముడు రాజా అమర్‌సింగ్. క్షణం వృథా చేయకుండా ఇతడు అర్రామీదకు తిన్నగా దాడి వెడలాడు.

లీగ్రాండ్ పరాజయవార్త విని గంగానదికి ఆవల ఆగిపోయిన ఆంగ్ల సైన్యాలు ఈలోపున గంగానదిని దాటాయి. వాటి అధిపతులైన బ్రిగేడియర్ డగ్లస్, జనరల్ లూగర్ట్ మే 3 వ తేదీన అమర్‌సింగ్ మీదకు దాడిచేశారు.

బిహియా, హతంపూర్, దలిపూర్, తదితర అనేక స్థానాల్లో రోజు విడిచి రోజు ఆంగ్లేయులు విప్లవకారులపై దాడి చేశారు. అందువల్ల అమర్‌సింగ్ క్రొత్తవ్యూహం ఒకటి వేశాడు. శత్రువుది పైచేయి అయిన సందర్భాలలో తన సైన్యాలను చీలదీసి రహస్యంగా అనుకున్న ప్రకారం నలుదిక్కుల సాగిపోయి, ఆ విధంగా శత్రుసైన్యాల దృష్టిని చీల్చివేసి, వారు వేసుకున్న పథకాల ప్రకారం అనుకున్న సమయాలలో ఏకమై, పోరు సలిపేందుకు అసాధ్యమైన పరిస్థితులు కల్పింపజొచ్చాడు.

ఈ కానరాని శత్రువును మరి ఓడించడం ఎలా ? ఇదీ ఆంగ్లేయుల కెదురైన ప్రశ్న. ప్రతిక్షణము విజయము తమ చేతికందుతున్నట్లే కనిపిస్తుండేది. మరుక్షణంలో అమరసింహుని సైన్యం మరొకచోట ఎక్కడో చావుదెబ్బ తీస్తుండేది. ఆ అరణ్యంలో ఒకచోట గట్టి దెబ్బతీస్తే అతడు మాయమై మరొక చోట జవాబు చెప్పేవాడు. అతడికి వెళ్ళేసరికి మళ్ళీ మొదటిచోట ప్రత్యక్షమై దెబ్బ తీస్తుండేవాడు. చివరకు విసుగెత్తి, అవమానం పాలై, నిరుత్సాహపడి బ్రిటిష్ జనరల్ లూగర్ట్ జూన్ 15 న రాజీనామా చేసి, విశ్రాంతికై ఇంగ్లండు చేరాడు. పోరును తీవ్రం చేసేందుకు బ్రిగేడియర్ డగ్లస్ మిగిలిపోయినాడు.

బ్రహ్మాండమైన ప్రయత్నంతో ఆంగ్లేయులు ఈ మహాసమరాన్ని ముగింపు చేయాలని నిశ్చయించుకున్నారు. ఏడు వైపుల నుండి ఏడు పెద్ద

సైన్యాలను ఒకేసారి జగదీశ్‌పూర్ మీదకు నడిపించారు. ఈ విధంగా జగదీశ్‌పూర్‌కు చేరే మార్గాలన్నీ మూసివేయబడ్డాయి. అమర్‌సింగ్ బోనులో చిక్కుకున్నట్లయింది. సైన్యాలు క్రమంగా ముందుకు సాగివచ్చాయి. చివరకు అక్టోబరు 17 న రాజధానిని గట్టిగా చుట్టుముట్టాయి. అన్నివైపుల నుండి ఒక్కసారిగా నగరము మీదకు పరుగెత్తారు. వారి వల్ల నగరము ధ్వంసమయిపోయేసరికే అమర్‌సింగ్ తప్పించుకున్నాడు.

అక్టోబరు 19 నాటికి ఆంగ్లేయులు విప్లవ సైన్యాలను నోనది గ్రామంలో నొక్కివేశారు. 400 మంది విప్లవకారులలోను 300 మందిని హతమార్చారు. మిగిలిన 100 మంది దెబ్బతిన్న బెబ్బులులై ఆ మహారణ్యంలో ఆ కొత్త ఆంగ్ల సైన్యాలపై తిరగబడ్డారు. చివరకు ఈ 100 మందిలోను ముగ్గురు మాత్రమే బ్రతికి బయటపడ్డారు. ఆ ముగ్గురిలోను ప్రచ్ఛన్నవేషమందున్న అమర్‌సింగ్ ఒకడు !

అమర్‌సింగ్ కైమూరు పర్వతాలలోకి తప్పించుకుపోయినాడు. ఆంగ్లేయులు వెంటపడ్డారు. అప్పటికీ లొంగిపోయే ప్రసక్తి రాలేదు.

కుమర్‌సింగ్ రాజవంశానికి చెందిన 150 మంది స్త్రీలు,విజయంపై విశ్వాసం సన్నగిల్లి, మందుగుండుకు ఎదురునిలిచి, నిప్పంటించుకొని ఆ బ్రహ్మాండమైన ప్రేలుడులో అమరజీవులైనారు.

విదేశ శత్రువుల కెదురుగా తన జన్మహక్కుకై బీహార్ ఆవిధంగా పోరాడింది. అయితే అమర్‌సింగ్ మాత్రం శత్రువుల చేతికి చిక్కలేదు. సౌభాగ్యం ఆయనను విడనాడింది. అయినా అజేయమైన ఆయన ఆత్మ మాత్రం ఆయన నేనాడూ విడువలేదు. అయితే ఆయన ఏమైనాడు? ఆఖరి ఘడియ లెక్కడ, ఎలా గడిపాడు? అది అర్థంకాని చరిత్ర "ఏమైనాడు?" అని తిరిగి ప్రశ్నిస్తోంది.

# మౌల్వీ అహ్మద్ షా

1858 ఏప్రిల్ ఒకటి భారతదేశములోని ఆంగ్ల సైనికుల సంఖ్య 95 వేలకు పెంచబడినది. లక్నో పతనతర్వాత-రోహిల్‌ఖండ్, అయోధ్య లలో తీవ్ర విప్లవ నిర్వహణకు అనువైన కేంద్రము లేకపోయింది.

విజయమనేది అసాధ్యంగా కనిపించినా విప్లవ శిబిరములో పారిపోవడమనిగాని, లొంగిపోవడమనిగాని వినిపించనే లేదు. అందువల్ల అయోధ్య, రోహిల్‌ఖండ్ విప్లవ నేతలు గెరిల్లా పద్ధతులలో విప్లవాన్ని కొనసాగించాలనే నిశ్చయించారు.

ఆంగ్ల సైనిక దళాలు అయోధ్య ప్రాంతపు ఉత్తరభాగంలో విప్లవ కారులను తుడిచిపెట్టిన తరువాత కమాండర్ ఇన్ ఛీఫ్ కాలిన్ తన సైన్యాల నన్నిటిని ఏకంచేసి స్వయంగా రోహిల్‌ఖండ్ మీదకు దాడి వెడలాడు. విప్లవకారుల నాయకులందరు షాజహాన్‌పూర్‌లో సమావేశమయినారు. నానాసాహెబ్, మౌల్వీ అహ్మద్‌షాలు కూడా అక్కడకు వచ్చారు. వీ రిరువురు ఆంగ్ల సేనాపతుల అనేక ప్రయత్నాలు భగ్నం చేశారు. నేటికి అంతా శక్తి సామర్థ్యాలతో, అజేయులై ఉన్నారు.

వీ రిరువురు ఇక్కడ ఉన్నారని వినగానే కాలిన్ ఆ నగరమార్గాల నన్నిటిని బంధించివేశాడు. మెల్లగా సాగివెళ్ళి నగరసమీపానికిచేరాడు—కాని పిట్టలెగిరిపోయినాయి! నలుదిక్కులా కాపలా ఉంచినప్పటికి,తానున్న వైపునుండే పారు తప్పించుకుపోవడంతో అతడు గతుక్కుమన్నాడు.

షాజహాన్‌పూర్ పథకం ఇలా భగ్నంకావడంతో కాలిన్ బెరిల్లీ మహానగరాన్నయినా ధ్వంసం చేయాలనుకున్నాడు. అందువల్ల షాజహాన్‌పూర్‌లో ఒక దళాన్ని ఉంచి బెరిల్లీవైపు బయల్దేరాడు. మే 14 నాటికి బెరిల్లీ దాపులకు చేరాడు. మరి ఒకరోజులో బెరిల్లీ చేరుకున్నాడు. అక్కడ ఖాన్ బహద్దూర్‌ఖాన్ వీరిని ఎదిరించాడు. అయితే ఆ రోహిల్లా నాయకుడు ఎంతో కాలం వారిని నిలిపిఉంచలేకపోయినాడు. తమసు పట్టుకోవాలనే ఆంగ్లేయుల పథకాన్ని భగ్నంచేసి, విప్లవకారులు ఖాన్ బహద్దూర్‌ఖాన్ నేతృత్వంలో 1858 మే 7 వ తేదీన బెరిల్లీనుండి బయటపడ్డారు. ఆంగ్ల సైన్యాలు ఆ రోహిల్‌ఖండ్ రాజధానిని వశం చేసుకున్నాయి.

ఈ లోపున మౌల్వీ అహ్మద్‌షా, కాలిన్‌ను పెడత్రోవలు పట్టించేందుకు పథకం వేస్తున్నాడు. ఆంగ్లేయులు బెరిల్లీ విజయానికి మురిసిపోతూ ఉండగా, అహ్మద్‌షా షాజహాన్‌పూర్‌వైపు చరచరా సాగివెళ్ళాడు. కాని అర్ధరాత్రి దాటేసరికి—ఎవరి బుద్ధిహీనత కారణమోగాని—ఆ సైన్యాలు నగరానికి నాలుగు మైళ్ళ ఇవతల ఆగిపోయినాయి. ఆంగ్లేయుల గూఢచారిగా పనిచేసే సిపాయి ఒకడు షాజహాన్‌పూర్‌లోని కలనల్ హేల్‌కు ఈ కబురు అందజేశాడు! వెంటనే అతడు తన సైన్యాలను మేలుకొల్పాడు. అహ్మద్‌షా ఇంకా ముందుకు సాగాడు. కాని శత్రువు అప్పటికే నిద్రలేచి దృఢంగా నిలిచిఉన్నాడు. అహ్మద్‌షా శత్రువును ఢీకొన్నాడు. నగరాన్ని ఆక్రమించాడు. కోటను వశం చేసుకున్నాడు. ధనికులనుండి తన సైనికులకు ఆహారపదార్థాలు రాబట్టాడు. నగరాన్ని స్వాధీనం చేసుకున్న తర్వాత మౌల్వీ 8 తుపాకులు సంపాదించాడు. ఆంగ్లేయులు తల దాచుకుంటున్న కోటపై కాల్పులు సాగించాడు.

మే 7 వ తేదీన ఈ వార్త బెరిల్లీలోని కాలిన్‌కు చేరగానే అతడు కొంత ఆశ్చర్యపడినా, అంతులేని ఆనందం కల్గిందాతడికి. కొంతకాలం క్రితం మౌల్వీ తప్పించుకుపోయినప్పుడు చేయిజారిపోయిన అవకాశం నేడు మళ్ళీ మౌల్వీ చర్యవల్లనే లభించింది. ఇక ఎవరిపై విరుచుకుపడాలి?

ఇప్పుడు ఇక మౌల్వీ మళ్ళీ తప్పించుకుపోయే సందు లేదని స్పష్ట పడ్డది. మే 11 నుండి మూడు రోజులపాటు నిరంతర పోరాటం జరిగింది. మౌల్వీకి తప్పించుకుపోవడం ఇక అసాధ్యం. ఈ మహా శక్తివంతుని, ఈ ప్రగాఢ దేశభక్తుని రక్షించుకొనడానికై నలువైపులనుండి విప్లవ నేతలు తమ తమ దళాలతో వచ్చి చేరారు. అయోధ్యబేగం, మయ్యాన్ సాహెబ్ మహ్మదీరాజా, ఢిల్లీ రాకుమారుడు ఫిరోజ్‌షా, నానాసాహెబ్-మున్నగు నాయకు లందరు తమ తమ దళాలతో, షాజహాన్‌పూర్‌లో చిక్కుకొని ఉన్న నాయకునికి అండగా మే 15 నాటికి వచ్చారు. ఈ విధంగా సహాయం పొందిన మౌల్వీ, ఆంగ్లేయుల కమాండర్ ఇన్ ఛీఫ్ వేసిన వలయాలను ఛేదించుకొని మళ్ళీ తప్పించుకొన్నాడు. మౌల్వీని బంధించడం, విప్లవకారులను అణచివేయడం ఇక సాధ్యమని గాఢంగా సమ్మిన కమాండర్ ఇన్ ఛీఫ్ అప్పటికే తన సైన్యాలను విభజించి, నలుదిక్కుల పురోగమించేందుకు ఏర్పాట్లు చేసి ఉన్నాడు. ఆంగ్లేయులు ఏడాదిపాటు పోరాడి, అతికష్టంమీద ఘోర సమరానంతరం విప్లవకారుల నణచివేసిన అయోధ్య ప్రదేశ్‌లోనికి ప్రవేశించాడు మౌల్వీ! కాలిన్ అయోధ్యను జయిస్తే మౌల్వీ రోహిల్ ఖండ్‌ను ఆక్రమించాడు! ఇప్పుడు కాలిన్ రోహిల్ ఖండ్‌ను జయిస్తే, మౌల్వీ మళ్ళీ అయోధ్యను జయించాడు!

అయోధ్య పునఃప్రవేశము తర్వాత మౌల్వీ, శత్రువుకు గట్టి పోరాటం ఇస్తూనే ఈ సరికొత్త తుఫానును విజృంభింప జేసేందుకుగాను పావెన్ రాజా తనకు సహాయంగా నిలిస్తే బాగుంటుందని భావించాడు. ఇందుకుగాను పావెన్‌బేగం ముద్రతో రాజాకు ఒక పత్రం పంపాడు.

ఈ చిన్న రాజు యుద్ధమనగానే హడలిపోయినాడు. పిరికితనంతో పాటు దేశద్రోహి కూడా అయి, మౌల్వీ తనను వ్యక్తిగతంగా కలిస్తే

మంచిదని జవాబిచ్చాడు. దానిమీద మౌల్వీ అతడిని కలిసేందుకు బయల్దే రాడు. తీరా అతడు నగరం చేరేసరికి ద్వారాలు మూసివున్నాయి పైన సైన్యాలు కాపలా కాస్తున్నాయి. మౌల్వీ ఆశ్చర్యపడిపోయినాడు.ఆ సైన్యాల మధ్య రాజా స్వయంగా నిలబడి ఉన్నాడు. అతడి ప్రక్కనే అతడి సోద రుడు కూడా ఉన్నాడు.

దీని అంతరార్థమేమిటో గుర్తించికూడా మౌల్వీ, రాజాతో సంభా షణ ప్రారంభించాడు. అతడి ధైర్యాన్ని, వాదనాపటిమను అర్థం చేసుకునే యోగ్యత ఆ గోడలమీది దుర్మార్గునికి లేదు. తలుపులు తీయబడవని స్పష్ట పడగానే, మౌల్వీ తన ఏనుగుచే తలుపులు బ్రద్దలుకొట్టించవలసిందిగా మావటికి ఆజ్ఞచేశాడు. మరొక్క దెబ్బతో తలుపులు విడిపడి ఉండేవే. కాని రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీపై గురిచూచాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడై పోయినాడు.

ఆ పిరికిపందలు వెంటనే గోడ దిగి వచ్చి మౌల్వీ శిరస్సును ఖండించి, దానిపై గుడ్డ కప్పుకొని, చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటిష్ ఠానా—షాజహాన్‌పూర్‌కు తీసుకువెళ్లారు. ఇంకా రక్తం ఓడు తున్న ఆ పవిత్ర శిరాన్ని అ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి, వారి పాదాల చెంత మోకరిల్లారు.

మరునాడు 'నాగరికులైన' ఆంగ్లేయులు తమతో అంత ధైర్యంతో, అంత ఆత్మగౌరవంతో పోరాడిన శత్రువు శిరాన్ని కోటగుమ్మానికి వ్రేలాడ గట్టారు. నీచమైన దేశ ద్రోహానికి తలపడిన ఆ పావెన్ పశువుకు 50వేల రూపాయలు పారితోషికం లభించింది!

# రాణీ లక్ష్మీబాయ్

''నేను ఝాన్సీని వదిలివేయాలా ? ఎవడు సాహసిస్తాడో రానీ, చూస్తాను'' అంటూ వీర ఝాన్సీరాణి ఆంగ్లేయులపై విజృంభించింది. విప్లవ శక్తులు ఆంగ్లసైన్యాల రక్తాన్ని త్రాగివేశాయి. సాగర్, నేగావ్, బందా, బాణాపూర్, షహఘర్, కర్కి మున్నగుచోట్ల ఆంగ్లపాలనావశేషం కూడా లేకుండా చేశాయి. ప్రతిచోట ప్రజలు రాణికి జయజయ ధ్వానాలు చేశారు.

రాణి దినచర్య ఈ విధంగా వర్ణించబడ్డది : "రాణి ఉదయమే 5 గంటలకు నిద్ర లేచేది. సుగంధ ద్రవ్యాలతో స్నానం చేసేది. వస్త్రధారణ చేసి పూజాదికాలకు కూర్చునేది. తరచు ఆమె స్నిగ్ధధవళవస్త్రం ధరించేది. భర్త మరణానంతరం శిరోజముల నుంచుకున్నందుకు ప్రాయశ్చిత్తంగా ముందు పవిత్రజలాలను జల్లుకునేది. అనంతరము తులసికోటలోని తుల సికి పూజలు చేసేది, ఆ తర్వాత పార్థివపూజ చేసేది. అందు ఆస్థాన గాయకులు గానం చేసేవారు. పౌరాణికులప్పుడు పురాణములు చెప్పేవారు. ఆ తర్వాత సర్దారులు, ఆశ్రితులు ఆమెను దర్శనం చేసేవారు. తనవద్ద నున్న 750 మందిలో ఏ ఒకరు రాకపోయినా మర్నాడు వారు కనబడగానే నిన్న రాలేదేమని అడిగేది. ఆమ జ్ఞాపకశక్తి అలాంటిది! భోజనానంతరం- ఏదైనా ముఖ్యమైన పని ఉంటేతప్ప ఒక గంట కునుకుతీసేది. ఆ తర్వాత ఉదయము సమర్పింపబడిన కానుకలను తెప్పించేది. తనకు నచ్చినవి

కొన్ని తన అధీనంలో ఉంచుకొని మిగిలినవి సేవకులకు పంచిపెట్టేది. మూడు గంటలకు దర్బారుకు వెళ్ళేది. ఆ సమయంలో మామూలుగా పురుష వస్త్రధారణం చేసేది. పైజామా, నల్లని కోటు, టోపీ, దానిపై అందమైన తలపాగా ధరించేది. నడుముకు అందమైన వస్త్రపు పటకా ధరించేది. దానికి రత్నములు పొదిగిన కత్తి ఉండేది. భర్త మరణానంతరం స్త్రీలు చేసుకునే ఆనాటి అనేక అలంకరణలను మానివేసింది. చేతికి వజ్రాల గాజులు, మెడలో ఒక సన్నని ముత్యాలపేరు, చిటికెన వ్రేలుకు ఒక వజ్రాల ఉంగరం మాత్రం ఉంచుకునేది. ఆమె ధరించే నగలు అవి మాత్రమే. శిరోజములను మెడమీద కొప్పు కట్టుకొన్నది. తెల్లని చీరెను, తెల్లని రవికను ధరించేది. ఒక్కొక్కసారి స్త్రీ వేషములోను, ఒక్కొక సారి పురుష వేషములోను దర్బారు అలంకరిస్తుండేది. అక్కడ సమావేశమైన వారికి ఆమె సంపూర్ణ విగ్రహం కానవచ్చేది కాదు. దర్బారులోనికి చొచ్చుకువచ్చిన మంటపమువంటి చిన్న గదిలో ఆమె ఆసీనురాలై యుండేది. ఆ గదికి నగిషీలు చెక్కిన తలుపులుండేవి. అందమైన జరీ తెరలుండేవి. ఆ గదిలో మృదువైన ఆసనముపై దిండ్లు నానుకుని ఆమె కూర్చొని ఉండేది.ఆ తలుపుకు వెలుపల సువర్ణరజత దండములతో ఇరువురు సేవకులుండేవారు. ఆ గదికి ఎదురుగా దివాన్ లక్ష్మణరావ్ ఉండేవారు. ఆయనకు ముందు ఎన్నెన్నో ముఖ్య పత్రములు ఉంటే, వెనుక వివిధ అధికారులు ఉండేవారు. నిశితమైన మేధాసంపద గల లక్ష్మీబాయి ప్రతి విషయాన్ని ఎంతో చురుకుగా గ్రహించేది. ఆమె చేసే ఆజ్ఞలు, ఇచ్చే తీర్పులు ఎంతో స్పష్టంగాను, సమర్థతతోను ఉండేవి. ప్రతి శుక్ర, మంగళవారము లందు ఆమె మహాలక్ష్మి ఆలయానికి వెళ్ళేది. మహాలక్ష్మి ఆమె ఇష్టదైవం. ఆలయానికి ఒక్కొక్కసారి పల్లకిలోను, ఒక్కొక్కసారి అశ్వము మీదను వెళ్ళేది. ముందు జాతీయ స్వేచ్ఛా పతాకము, సైనిక ఘోష్ వాద్య సంగీతము ఉండేవి. ఆ ధ్వజము వెంట

200 మంది ఆంగ్లేయులు, ఆమె ముందు వెనుకలందు 200 మంది అశ్వికులు ఉండేవారు. ఒక్కొకసారి ఈ ఊరేగింపు వెంట సైన్యాలుకూడా నడిచేవి. రాణి బయల్దేరే సమయంలో కోటపై నున్న చౌఘడానుండి మధుర సంగీతం వినవచ్చేది. అదేసమయంలో మహాలక్ష్మి నగర్ఖానా చౌఘడాలో కూడా గీతాలాపన జరిగేది.''

హిమాలయముల మొదలు వింధ్యవరకు విప్లవకారుల ఆధీనములో నున్న యావద్దేశమును వశము చేసుకొనడానికి 1858 ఆరంభంలో ఆంగ్లేయులు సైనికమైన బృహత్పథకము నొకదానిని తయారు చేశారు. ఈ భూమండలమంతా రెండు భాగాలుగా విభజింపబడ్డది. రెండింటిని జయించేందుకు రెండు బృహత్ సైన్యాలు నియమింపబడ్డాయి. జమునకు ఉత్తర భాగము హిమాలయముల వరకు ఆక్రమించేందుకు కాలిన్ బయల్దేరాడు. దక్షిణాన వింధ్యవరకు ఆక్రమించేందుకు సర్ హగ్రోజ్ బయల్దేరాడు. ఉత్తరాన సిక్కులు, గూర్ఖాలు, జమీందార్లు, తదితరులు కాలిన్‌తో కలిశారు. దక్షిణాన హైద్రాబాద్, భోపాల్ నవాబులు హగ్రోజ్‌కు అండగా నిలిచారు. ఇంతేగాక మద్రాసు, బొంబాయి, హైద్రాబాద్‌లలోని ఆంగ్ల సైన్యాల అండకూడా ఇతడికి ఉన్నది. దక్షిణభాగపు ఆక్రమణకు గాను ఏర్పాటైన సైన్యాలు రెండుగా విభజింపబడ్డాయి. ఒకదానికి బ్రిగేడియర్ హ్విట్లక్ అధిపతి. అతడు జబ్బల్‌పూర్‌నుండి బయల్దేరి దారిలో ఉన్న ప్రదేశాలను వశం చేసుకుంటూ సర్ హగ్ రోజ్‌ను కలవవలసి ఉన్నది. రెండవదానికి అధిపతి స్వయంగా హగ్రోజే. హ్విట్లాక్ జబ్బల్‌పూర్‌లో బయల్దేరగానే, హగ్రోజ్ మ్హౌలో బయల్దేరాలి. ఇతడు కల్పిలోని ఝాన్సీగుండా వెళ్ళాలి!

పథకం ప్రకారం 1858 జనవరి 6 న మ్హౌలో బయల్దేరాడు. తీవ్ర పోరాటానంతరం రాయ్‌ఘర్‌లో కోటను వశము చేసుకున్నాడు. సాగర్ వెళ్ళాడు. విప్లవకారులు బంధించినవారిని విడుదల చేశాడు.

దారిలో ఉన్న అనేక స్థానాలను జయిస్తూ ఇంకా దక్షిణంగా వెళ్ళాడు. మార్చి 10 న బానాపూర్‌ను స్వాధీనం చేసుకున్నాడు. ప్రఖ్యాతమైన చందేరి కోటను మళ్ళీ వశం చేసుకున్నాడు. మార్చి 20 నాటికి విజయము పొందిన ఆంగ్ల సైన్యాలు ఝాన్సీకి 15 మైళ్ళ దూరానికి చేరాయి.

ఈ యుద్ధాంనుండి తప్పించుకొని, ఝాన్సీలో రక్షణకై చేరిన విప్లవకారులందరిని లుంగచుట్టాలనుకున్నాడు హగ్. అయితే ముందు విప్లవకారుల చేజిక్కిన చర్ఖారీ రాజాను విడుదల చేయవలసిందిగా లార్డు కానింగ్, సర్ కాలిన్-ఇతడికి ఆజ్ఞ చేసి ఉన్నారు. ఈ ఆజ్ఞను శిరసా వహిస్తే ఝాన్సీని ధ్వంసం చేయాలనే హగ్ పథకం భగ్నమయిపోతుంది. మరి అతడేమి చేయాలి? ఆజ్ఞల నతడు ధిక్కరించనూలేడు, శిరసా వహించనూ లేడు. ఆంగ్లేయుల సంపూర్ణ ప్రయోజనం ఝాన్సీని మట్టు పెట్టడంలోనే ఉన్నది. అందువల్ల ఆ పని చేయదలిచారు. హిందూస్థాన మందలి అత్యున్నతాధికారుల ఆజ్ఞను ధిక్కరించే ఈ బాధ్యతను సర్ రాబర్టు హామిల్టన్ తనమీద వేసుకున్నాడు. ఉన్నత జాతీయ భావనలో ఉత్తేజితులైపోయిన ఆంగ్లేయ సైనికులు, విజయంమీద పరిపూర్ణ విశ్వాసముతో ఝాన్సీ వైపు పురోగమించారు.

ఝాన్సీ పొలిమేరలలో అడుగిడగానే ఆంగ్ల సైన్యాలు ఘోరమైన కష్టనష్టాల పాలైనాయి. శత్రువు తిండిలేక మరణించేందుకుగాను రాణి చుట్టుపట్ల పొలాలను పాడుపెట్టించి ఉండడం వారికి ఆశ్చర్యం కల్గించింది. పొలంలో ఒక్క మొక్కలేదు. గట్టున గడ్డికూడాలేదు. నీడ కావాలంటే చెట్టు కూడా లేదు. ఇంత పాగు పెట్టబడ్డా ఆంగ్లేయులు సింధియా, టెహ్రీరాజాల పుణ్యమా అని-ఝాన్సీని సమీపించగలిగారు. ఆ రాజాలు ఆంగ్లేయులకు నిరంతరం కోరినంత గడ్డి, వంటచెఱకు, కూరలు సరఫరా చేశారు.

ఈ లోపున లక్ష్మీబాయ్ రాత్రింబవళ్ళు సమరప్రయత్నాలు చేసింది. రాణీ సైన్యంలో సాహసవంతులెందరో ఉన్నారు. అయితే సుశిక్షితులు

మాత్రం కొంచెం తక్కువ. రాణియే స్వయంగా యావత్తు సైన్యాన్ని నడిపింది. ప్రతి ద్వారం వద్ద, ప్రతి బురుజువద్ద ఆమె చకచక సంచరించింది.

దేశ విజయానికై ఝాన్సీ బ్రాహ్మణులు ప్రార్థనలు చేస్తున్నారు. రణరంగానికి వెళ్ళిన సైనికుల శ్రేయస్సుకై ఆలయములు అర్చనాకేంద్రాలయినాయి. క్షతగాత్రులై తిరిగివచ్చినవారికి ఆశ్రయమిచ్చి సేదదీర్చేవి. కార్మికులు ఆయుధనిర్మాణంలో ఊపిరాడకుండా ఉన్నారు. పురుష పుంగవులు తుపాకులు చేబూని తూటాలు దట్టిస్తున్నారు. వీరవనితలు ఆయుధము లందించేవారు. తోప్‌ఖానాలు నడిపేవారు. ఆహారపదార్థాలందించేవారు.

ప్రత్యక్షంగా దీనంతటిని వీక్షించిన ఒకరిలా వ్రాశారు: ''25 తేదీ నుండి పోరు ఆరంభమైంది. శత్రువు రాత్రింబవళ్ళు అగ్నిని వర్షించాడు. 50, 60 పౌనుల ఎర్రని అగ్నిగోళాలగు ఫిరంగిగుండ్లు టెన్నిస్ బంతుల వలె ఎగిరాయి. పగలు ఇవి స్పష్టంగా కానవచ్చేవి. రాత్రులందు మరింత స్పష్టంగా, భయంకరంగా కానవచ్చేవి.

''26 వ తేదీ మధ్యాహ్నానికి ఆంగ్లేయులు దక్షిణద్వారమువద్ద తుపాకుల మ్రోతల నణచివేశారు. అక్కడ నిలవడం ఎవరికీ సాధ్యం కాలేదు. అప్పుడు పశ్చిమద్వారము కడనున్న తుపాకి శత్రువులపై గర్జించింది. మూడవ గుండుతో ఆంగ్లేయులలోని ఉత్తముడైన తుపాకి గురికాడు నేల కొరిగాడు. అతడి తుపాకి నోటికి తాళము పడింది. దీనికి లక్ష్మీబాయ్ ఎంతో ఆనందించింది. ఆ సిపాయీ వీరునికి రజతకం బహూకరించింది. ఆ వీరుడెవరోకాదు - గులాం గౌస్‌ఖాన్.

''ఐదవ, ఆరవనాళ్ళు కూడా అలాగే జరిగింది. నాలుగైదుగంటలు లక్ష్మీబాయ్ తుపాకులు అద్భుతంగా పనిచేశాయి. ఆంగ్లేయులు విపరీతంగా

నష్టపడ్డారు. ఏడవరోజున ఎడమవైపున పనిచేస్తున్న తుపాకికి ఆటంకం వచ్చింది. అక్కడ బురుజుగోడ ఒకటి శత్రువులవల్ల ధ్వంసమయింది. అయితే ఆ రాత్రికి రాత్రే 11 మంది తాపీవారు ముసుగులతో వచ్చి తెల్లవారేలోపున దానిని మళ్ళీ కట్టి వెళ్ళిపోయినారు. ఆ విధంగా బురుజు గోడ మళ్ళీ తయారవడంతో ఆంగ్లేయు లాశ్చర్యపడిపోయినారు. అక్కడి తుపాకి మళ్ళీ పనిచేయ నారంభించింది.

"8 వ నాటి ఉదయం ఆంగ్లేయులు శంకర్ ఖిల్లాకు వెళ్ళారు. ఆంగ్లేయులవద్ద ఖరీదైన ఆధునిక దుర్భిణీయంత్రాలున్నాయి. వాటి సహాయంతో వారు, కోటలోని మంచినీటి కోనేరులో మందు కురిపించ నారంభించారు. అయితే దక్షిణ, పశ్చిమ ద్వారములవద్ద నున్న తుపాకి గురికాండ్రు శంకర్ ఖిల్లాలోని ఆంగ్లేయులపై తుపాకీలు ప్రయోగించి, వారి మందుగుండు వర్షాన్ని ఆపుజేశారు. ఈ విధముగా దృఢముగా నిరోధింపబడడం వల్ల ఆంగ్లేయులవద్ద ఎన్ని తుపాకులు, ఎంత మందు గుండు సామగ్రి ఉన్నప్పటికి మార్చి 31 వరకు కోటలో ప్రవేశించలేక పోయినారు."

కాని నిరంతర వైఫల్యాలు సంభవించినప్పుడు కూడా రాణి మనోధైర్యమెన్నడూ సడలలేదు. ఆమెకు సహాయపడేందుకు తాత్యాతోప్ ఝూన్సీవైపు పురోగమిస్తున్నాడని ఆమెకు తెలుసు. కాన్పూర్‌లో విండ్ హాం పరాజయం, కాలిన్స్ విజయం తర్వాత తాత్యా గంగను దాటి నానాసాహెబ్ వద్దకు చేరాడు ఆ తర్వాత నానావద్ద నుండి బయల్దేరి కాల్పివద్ద యమునానదిని దాటాడు. నానాసాహెబ్ ప్రారంభించిన స్వరాజ్య సంగ్రామంలో తోడ్పడడానికి చర్ఖారీరాజా నిరాకరించినందువల్ల, తాత్యా, నానా ప్రతినిధిగా, అతడి రాజధానిపై దాడిచేసి, అతడి 24 తుపాకులను స్వాధీనం చేసుకొని, అతడి వద్దనుండి 3 లక్షల రూపాయల ధనం తీసుకున్నాడు.

ఇక తాత్యా కాల్పీవైపు పురోగమించాడు. అక్కడ ఆయనకు రాణీ లక్ష్మీబాయ్‌నుండి వచ్చిన లేఖ అందింది. ఝాన్సీ రావలసిందిగాను, ముట్టడినుండి విముక్తి కలిగించవలసిందిగాను అందులో ఆమె కోరింది. ఆయన ప్రధానాధికారి అయిన రావ్‌సాహెబ్ పీష్వాకు ఈ విషయమై కబురు పంపాడు. అక్కడినుండి ఆజ్ఞలు రాగానే ఆంగ్లేయులను వెనుక నుండి ఢీకొన్నాడు.

తాత్యాకిప్పుడు చేతిలో మున్నెప్పుడు లేనంత బలగం ఉంది. అందువల్ల ఆంగ్లేయులు తీవ్రమైన ధాటిని తట్టుకొనవలసి వచ్చింది. వారు పిడికెడుమంది లేరు. వారికి ముందుభాగాన ఝాన్సీలక్ష్మి, వెనుకభాగాన 20 వేల పంజాలతో ఈ మహారాష్ట్ర సింహము! ఇట్టి అవకాశం లభించగా ఇక తాత్యా హ్యూగ్‌ను ఏల చీల్చి చెండాడరాదు? అతడందుకై పురోగమించాడు. కాని ఆకస్మాత్తుగా ఆయన 20 వేల పంజాలు స్థంభించిపోయినట్లయింది-విప్లవకారులు చేత్వానదివద్ద సిగ్గుచేటైన పిరికితనం చూపించారు. ఝాన్సీలక్ష్మి ముందునుంచి, తాత్యా వెనుకనించి దెబ్బతీసే పథకం అద్భుతంగా ఉన్నది - కాని ఆంగ్లేయులు తెగించి ఝాన్సీపై కాల్పులు సాగిస్తూ తాత్యావైపు పురోగమించారు. ఈ పిరికివారు కనీసం పోరాటమైనా జరపలేదు. ఇదంతా భయమో, దేశద్రోహమో-ఝాన్సీవైపునుండి ఒక్క తుపాకి మోతకూడా రాలేదు. దీనితో ఈ మహాసైన్యము, మహాసేనాధిపతి పూర్తిగా పరాజితులైనారు. ఎంతో సామగ్రి ఆంగ్లేయుల వశమైంది. తాత్యా తుపాకులు వారికి చేజిక్కాయి. 1500 మంది విప్లవ కారులు హతులైనారు.

ఈ తాత్కాలిక అఘాతంవల్ల రాణీ పోరాటం ఏమాత్రము ఆగలేదు. పైగా, ఆమె తన సైనికులకీ క్రింది ఆజ్ఞ జారీ చేసింది: ''నానాపై ఆధారపడి ఝాన్సీ ఇంతకాలమూ పోరాడలేదు. ఇకముందు పోరాటం జరిపేందుకు కూడా ఆ సహాయంపై ఆధారపడవలసిన పనిలేదు. ఇంత

వరకు మీ ఆత్మగౌరవం, మీ ధైర్య సాహసాలు, మీ దృఢ నిశ్చయాలు అద్భుతంగా ప్రకటింపబడ్డాయి. ఇప్పుడు కూడా మీరలాగే ప్రవర్తించి, సాహసంతో తెగువతో పోరాడవలసిందిగా కోరుతున్నాను."

ఏప్రిల్ 3 వచ్చింది. ఆంగ్లేయులపై ఆఖరి దాడి ప్రారంభమైంది. వారన్నివైపుల నుండి వత్తిడితో ఢీకొంటున్నారు. రాణీ సర్వత్రా మెరుపు తీవలా సంచరిస్తోంది. కొందరిని సువర్ణ పతకాలతో ప్రోత్సహిస్తోంది. కొందరికి అమూల్య వస్త్రాదులను బహూకరిస్తోంది. మరికొందరిని వీరవచనాలతో ఉత్సాహపరుస్తోంది.

గులాం గౌస్‌ఖాన్, కౌర్ ఖుదాబక్ష్ తమ తమ తుపాకులు దట్టిస్తున్నారు. శత్రువు ప్రధాన ద్వారాలను ఢీకొంటున్నాడు. బురుజులపై ధాటి చూపిస్తున్నాడు. 8 చోట్ల నిచ్చెనలు వేశాడు. ''హరహర మహదేవ్'' నినాదాలతో కోటనుండి, బురుజులనుండి, ఇండ్లనుండి నిరంతరంగా గుండ్ల వర్షం కురిసింది. మృత్యుగహ్వరాలవంటి ఫిరంగి ముఖాల నుండి అగ్ని గోళాలు వెలికివస్తున్నాయి. ''మారో ఫిరంగీకో!'' నిచ్చెన లెక్కబోతున్న నల్గురు లెఫ్టినెంటులు బూడిదై పోయినారు. నిచ్చెనలు కూలాయి. ఆంగ్లేయుల పాదాలక్రింద నిచ్చెనలన్నీ తుక్కుతుక్కయి పోయినాయి. ఆంగ్లేయులు తిరోగమన ఘోష చేశారు! తిరోగమించారు. అందిన ప్రతి బండ చాటున నక్కినక్కి తిరోగమించారు!

ప్రధాన ద్వారం వద్ద అలా దృఢమైన అటకాయింపు జరిగింది. అయితే...దక్షిణాన ఉన్న మోర్చా ద్వారంవద్ద దేశద్రోహుల సహకారం పొందినట్లు తెలుస్తోంది. ద్వారం వశమైంది. బురుజు లెక్కారు. ఒక్కసారి నగరప్రవేశమంటూ జరిగిన తర్వాత ఇకవారు క్షణం తెరపి ఇవ్వలేదు. రక్తం వరదలై పారింది. ఊచకోత, అగ్నివర్షం, విధ్వంసకాండ - ఇలా పురోగమించారు వార్లు, రాణీ మందిరం వరకు. మందిరం ముట్టడింపగానే

రక్షకులను నరికివేశారు. భవనాలు కూల్చివేశారు. ఖజానా దోచివేశారు. ఝాన్సీ శత్రువుల చేజిక్కింది.

బురుజులపై నిలబడి లక్ష్మీబాయి ఒక్కసారి నగరంవంక చూచింది. దక్షిణ ద్వారంవద్ద జరిగిన ఘోర విధ్వంసం కన్నులబడ్డది. ఆమె కన్నులు అగ్నిని వర్షించాయి. కత్తిని దూసింది. వేయిమంది సిపాయిలతో ఆ ద్వార ప్రాంగణంలోకి దూకింది. "కత్తులు కరకరలాడాయి. రెప్పపాటులో ఉభయ సైన్యాలు కలియబడ్డాయి. కత్తుల తళతళలతో మెరిసిపోయింది రణరంగం. ఎందరో ఆంగ్లేయులు రక్తం చిమ్ముతూ నేల దొర్లుతున్నారు. మిగిలినవారు నగరంలోనికి పరుగెత్తారు. దాగిదాగి కాల్పులు చేశారు.'' ఆ ఆంగ్లేయుల రక్తదర్శనంతో ఈ కాళీమాత ఆవేశం కొంత చల్లారింది. మెల్లగా ఆలోచించింది. కోటలో నుండి ఇక పోరాడడం అవివేకమని భావించింది. అయితే శౌర్యపు ప్రతిధ్వను లిప్పుడు వీధి వీధినా వినిపించజొచ్చాయి. మందిరంలోని 50 మంది అశ్వపాలకులు, అవతల నగరమంతా హాహాకారాలతో నిండిఉన్నా- తమ తమ స్థానములు వదలడానికి నిరాకరించారు. చేతనైనంతవరకు శత్రువును తెగనరికారు. వారిలో ప్రతి ఒక్కరూ హతులైన తర్వాతనే ఆంగ్లేయులకు ఆ గుఱ్ఱపుశాలలు హస్తగతమైనాయి.

ఇప్పటికి ఆంగ్లేయులు నగరము నంతటిని ధ్వంసం చేసివేశారు. అందరూ వారికి చేజిక్కారు. అయిదేళ్ళ శిశువు మొదలు శతవృద్ధులవరకు అందరిని తెగవేశారు. క్షతగాత్రులు, మరణాసన్నుల హాహాకారాలతో, దిక్కులు పిక్కటిల్లాయి. నగరమంతటి నుండి హృదయ భేదకమగు ఆర్తనాదం వినిపించింది.

కోట బురుజులపైనుండి రాణి నగరమును చూచింది - దృఢమైన ఆ బురుజుల నా రాత్రి ఛేదించడము సాధ్యముకాదని శత్రువు ఆ పని మరునాటికి వాయిదా వేశాడు. నరకముగా తయారైన నగరమును చూడగానే ఆమె హృదయం క్షోభించిపోయింది. కన్నులవెంట జలజల అశ్రువులు

రాలాయి. తలఎత్తి గోడలపై ఎగురుతున్న ఫిరంగి జండాలను చూచింది. అశ్రుపూర్ణములైన ఆ నయనములనుండి వింతయైన అగ్ని కురిసింది.

ఇంతలో ఒక వార్త వచ్చింది - సర్దార్ ఖుదాబక్ష్, గులాం గౌస్‌ఖాన్‌లను ఆంగ్లేయులు కాల్చివేశారని. వార్త తెచ్చిన ఆ వృద్ధ సర్దారుతో ఆమె "నా చేతులతోనే ఆయుధాగారానికి నిప్పంటించి కోటను ధ్వంసం చేయ నిశ్చయించాను" అన్నది. ఇది విని ఆయన ప్రశాంతంగా "అమ్మా, ప్రక్క ప్రదేశంలో భద్రంగా ఉంటుంది. ఈ రాత్రే తాము కోట విడిచి, శత్రు శిబిరాన్ని ఛేదించుకుని బయటపడి పీష్వా సైన్యాలతో కలియడం మంచిది" అని సలహా ఇచ్చాడు. దీనిని రాణి పాటించ నిశ్చయించింది.

బాగా చీకటి పడగానే రాణీ ప్రయాణసన్నాహం చేసింది. ఆమె ఝాన్సీని విడుపనున్నదని వినగానే-బహుశా శాశ్వతంగా-ఆమె అనుచరులు కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. ఆమె తనవెంట కొద్దిమంది ఆశ్వికులను తీసికున్నది. పురుష వేషం ధరించింది. ఉక్కు కవచాన్ని ధరించింది. నడుమున చక్కని చురకత్తి, ఖడ్గముల ధరించింది. దత్తపుత్రుడగు దామోదర్‌ను వీపున పట్టుధోవతికి కట్టుకున్నది. ఈ వేషధారణతో శ్వేతాశ్వము నధిరోహించిన లక్ష్మిబాయి సమరదేవిగా భాసించింది.

ఆమె ఉత్తర ద్వారమును చేరగానే టెహ్రీ రాజ్యపు విద్రోహ సైనికుడగు కాపలాదారొకడు "ఎవరా వెళ్ళేది ?" అన్నాడు. "టెహ్రీ సైన్యము హగ్‌రోజ్ సహాయార్థము వెళ్తోంద"ని జవాబివ్వబడ్డది. వాడు తృప్తిపడ్డాడు. అలాగే ఆంగ్లేయుల కాపలానుకూడా దాటి ముందుకు సాగి వెళ్ళింది. శత్రు శిబిరముగుండా ఆమె వెళ్తున్నప్పుడు ఆమె ఆంతరంగిక రక్షకులు - ఒక స్త్రీ, ఒక నౌకరు, 10, 15 మంది ఆశ్వికులు. ఇంతే, ఆమె ఇతర ఆశ్వికులను ఆంగ్లేయులు అనుమానముతో నిలిపి

వేశారు. పోరుసలపవలసి వచ్చింది. మోరోపంత్ తంబే గాయపడిగూడా దాటియావరకు పురోగమించాడు. కాని విద్రోహియగు ఆ రాజ్యపు దివాను ఆయనను బంధించి ఆంగ్లేయులకు వప్పగించాడు. ఆంగ్లేయు లాతనిని అనంతరము ఉరితీశారు.

రాణిని బంధించేందుకు కొందరాశ్వికులతో లెఫ్టినెంట్ బేకర్ ఆమెను వెంటాడ నారంభించాడు. వీపున బిడ్డనుంచుకొని రాణి ఆ రాత్రంతా అశ్వముపై ప్రయాణము చేసింది. ప్రభాత సమయానికి ఆమె భాండియర్ గ్రామంవద్ద విశ్రమించింది. ఫలహారనంతరము మళ్ళీ కాల్పి రోడ్డుమీద ప్రయాణము సాగించింది. కాని బేకర్ ఆమెను వెన్నంటే ఉన్నాడు. చిన్న పోరు జరిగింది. ఆమె కత్తిని ఒక్కసారి ఝాడించి, దూసుకుపోయింది. అతడు అశ్వముపై నుండి నేలకూలాడు. ఆమె సైనికులను ఆంగ్లేయు లటకాయించారు.

హోరాహోరి పోరు జరిగింది. ఆ సమరంలో మరణించగా మిగిలిన వారు అమె రక్షణకై పురోగమించారు. బేకర్ తన ప్రయత్నం విరమించు కున్నాడు. మధ్యాహ్నమయింది. రాణి మాత్రమాగలేదు. ప్రొద్దువాలింది. సూర్యాస్తమయమయింది...రాణిమాత్రము ఆగలేదు.నక్షత్రాలు వచ్చాయి. రాణి త్వరితగతిని పురోగమిస్తూనే ఉన్నది. చివరకు అర్ధరాత్రి వేళకు రాణి కాల్పిలో ప్రవేశించింది. అప్పటికామె నిర్విరామంగా 102 మైళ్ళు ప్రయాణము చేసింది. అందులోను మధ్యమధ్య సమరం: మూపున బాలునితో. ఆ అశ్వం అమెను కాల్పి చేర్చేందుకే జీవించి ఉన్నట్లున్నది. కాల్పి చేరగానే అది కుప్పగా కూలిపోయింది. రాణి అమితంగా ప్రేమించిన ఆ అశ్వ సేవకై ఆరుగురు సేవకులు నియోగింపబడ్డారు.

తెల్లవారేవరకు ఆమె నిద్రించింది. ఉదయం ఆమె, రావ్ సాహెబ్ పీష్వాలు కలిశారు. అసాధ్య కార్యముల నిర్వర్తించేందుకై ఉద్భవించిన తమ పూర్వీకులను గుర్తుచేసుకొని స్ఫూర్తిపొందారు. సిండియా హోల్కార్,

గాయక్‌వార్, బుందేల్, పటవర్ధన్ మున్నగు మహనీయులు స్వరాజ్యం కోసం తన ప్రాణాలనుసైతం అర్పించేందుకు సిద్ధంగా ఉండినందువలననే మహారాష్ట్రపతాకం అట్టక్ వరకు ఎగిరిందని గుర్తించారు. మాతృదేశాన్ని దాస్యశృంఖలాలలో ఉంచేందుకు ప్రయత్నం చేసినవారికి ఎదురుగా తమ ఆఖరి నిశ్వాసంవరకు అదే జండాకోసం, అదే స్వరాజ్యం కోసం తమ పూర్వీకుల అడుగుజాడలలో పోరాడాలని నిశ్చయించుకున్నారు. మళ్ళీ లక్ష్మీబాయి, తాత్యాతోప్‌లు ఘోరయుద్ధానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

ఝాన్సీని వశం చేసుకొని, సాగర్ వెళ్ళిన హ్యూరోజ్ సైనికులు ఆ ప్రాంత విప్లవవీరులకు నేతృత్వం వహిస్తున్న బందా నవాబ్‌పైకి దాడి వెడలారు. ఝాన్సీ, సాగర్ తదితర ప్రాంతాలలో విప్లవం ప్రారంభమైన సమయాలలో విప్లవవీరులు ఊచకోతకోశారు. ఆంగ్లేయులు ప్రాణ రక్షణకై అందిన ప్రతిచోట దాక్కున్నారు. హ్యూరోజ్‌తో జరిగిన పోరులో వెనుకబడిన నవాబ్ ససైన్యముగా కాల్పివైపు ప్రయాణమైనాడు. హ్యూరోజ్ ఏప్రిల్ 19 న విజయవంతంగా బందాలో ప్రవేశించాడు. బందా తర్వాత కిర్వీ రాజ్యం వశం చేసుకొనబడ్డది. కిర్వీ ప్రజలు విప్లవ కారుల విజయోత్సవమును జరుపుకున్నందుకు ప్రతిక్రియగా కసితో జరిగిన పని ఇది.

స్వాధీనమైన ప్రాంతాలను కాస్త అనునయించేందుకు హ్యూరోజ్ మహోబాలో విడిదిచేశాడు. నిజానికత డప్పటికి తన ఉద్యమాన్ని పూర్తి చేశాడు. బుందేల్‌ఖండ్ తూర్పుప్రాంతాన్నంతా వశం చేసుకున్నాడు. ఒకటి రెండు ప్రాంతాల ప్రజలను అనునయించి మంచి చేసుకునేందుకు కొందరిని పంపాడు.

విశ్వాసంతో పునర్విజృంభించిన రాణి పీష్వా సైన్యాలతో కాల్పికి 42 మైళ్ళదూరాన ఉన్న కుంచ్‌గావ్ మీదకు దాడి వెడలింది. హ్యూరోజ్ ఝాన్సీనుండి రాగానే విప్లవకారు లతడిని కుంచ్‌గావ్ వద్ద ఢీకొన్నారు.

మధ్యాహ్నపుటెండ ఆంగ్లేయులకు భరింపరానిదని గుర్తెరిగి విప్లవకారులు ఆ సమయంలోనే దాడి ప్రారంభించారు. అయినా పరాజయం తప్పలేదు. కాల్పివైపు తిరోగమించారు. అక్కడచేరి పరస్పరం నిందించుకొన నారంభించారు. పరాజయానికి అశ్వికదళం కారణమంది, పదాతిదళం. అశ్విక దళం ఝూన్సీ దళాలను నిందించింది. అందరూ కలిసి తాత్యాతోప్‌ను నిందించారు.

ఈ లోపున తాత్యా గ్వాలియర్‌కు వెళ్ళే దారిలో చర్ఖి గ్రామంలో వున్న తన తండ్రిని చూచేందుకు వెళ్ళాడు. తాత్యా ఇటు ప్రయాణమైనపుడు లక్ష్మీబాయ్ పీష్వా నగరానికి వెళ్ళింది. ఆమె పీష్వా నిస్పృహను తొలగించి ఉత్సాహపరచింది. విప్లవ సైన్యాలు సుసంఘటితంగా ఉంటే శత్రువుకు విజయం అసాధ్యం అని ఉద్బోధించింది. ఆమె ప్రసంగంతో బందా నవాబు ఉత్తేజితుడైనాడు. స్ఫూర్తివంతమైన పదజాలంతో విప్లవ శిబిరంలో మళ్ళీ ఆజ్ఞలు జారీ అయినాయి.

ఉభయ సైన్యాలు జమునానదీ తీరాన, కాల్పివద్ద తారసిల్లాయి. ఆంగ్లేయుల ధాటికి విప్లవవీరులు కొంచెం వెనుకజిక్కగానే ఆమె కత్తిని తీసుకుని, అరుణవేషధారులైన అశ్వికులతో తటిల్లతలా రణరంగంలో ప్రవేశించింది. ఆంగ్లేయుల దక్షిణ పార్శ్వముపై విరుచుకుపడింది. ఆ హఠాత్సంఘటనకు వారు హతబుద్ధులైపోయినారు. నిస్సహాయులై తిరోగమించారు.

ఆమె శక్తి ప్రదర్శనంతో విప్లవకారులంతా చైతన్యవంతులైనారు. యుద్ధం తీవ్రమైంది. ఫిరంగీ తుపాకిదారులు ఒకరి తర్వాత ఒకరు కూలిపో నారంభించారు. రాణి అశ్వికులను తీసుకుని నిప్పులు కక్కుతున్న తుపాకిధారులమీదికి దూకింది. ఆంగ్ల పదాతి సైనికులు తుపాకులు వదలి పారిపోయినారు. అశ్వికులు అణచివేయబడ్డారు.

కథ ఇలా అడ్డంతిరగడం చూచి హగ్‌రోజ్ నిల్వ ఉన్న ఒంటెల దండుతో పురోగమించాడు. ఆంగ్లేయుల సప్పట్లో రక్షించిందీ ఒంటెల దండే. వీటివల్లనే మే 22 న ఫిరంగీలు పీష్వా సైన్యాలను కాల్పి వరకు తరిమివేయగలిగారు. పీష్వా సైన్యాలిలా ఇంకొకసారి పరాజయం పొందిన తర్వాత, చిన్న చిన్న పోరుల జరుపుకుంటూ హగ్‌రోజ్ మే 24 న కాల్పిలో ప్రవేశించాడు. ఏడాదిపాటు తాత్యా, పీష్వాలు అతికష్టంమీద సేకరించి ఉంచిన ఆహార నిల్వలను ఆంగ్లేయులు కాల్పి కోటలో ప్రవేశించ గానే వశం చేసుకున్నారు. భూగర్భంలో దాచి ఉంచబడిన 60 వేల పౌనుల తుపాకిమందు, అందమైన మస్కెట్ తుపాకులు, తుపాకులకు పనికివచ్చే అధునాతనమైన ఇత్తడి గుండ్లు, ఫిరంగి గుండ్లను తయారుచేసే, ఫిరంగు లను మరమ్మతుచేసే కర్మాగారములు, కుప్పలు కుప్పలు సైనిక దుస్తులు, జండాలు, రణవాద్యములు, ఫ్రెంచి డప్పులు, ఐరోపాలో తయారైన హావిట్జర్ తుపాకులు, రకరకాల ఆయుధాలు - ఇత్యాదులన్నీ ఆంగ్లేయుల చేతి కందాయి.

వారికి చిక్కనిది ధైర్యవంతులైన విప్లవ నేతలు మాత్రమే. కాల్పి పతనం చెందగానే రావ్ సాహెబ్ బందా నవాబు, లక్ష్మీబాయి మున్నగు నేత లందరు కాల్పి వదలి భవిష్యత్ప్రథకాలను గురించి యోచించేందుకు గోపాల్‌పూర్ వెళ్ళిపోయినారు.

విప్లవకారుల కిప్పుడు సైన్యములేదు. కోటలేదు. సహాయక సైన్యాలు వచ్చే ఆశ లేదు. వారికి మిగిలింది పరాజయంపై పరాజయం. అయితే తాత్యాతోప్ సజీవుడై ఉన్నాడు. వారికదే చాలు. తాత్యాకూడా గోపాల్ పూర్ చేరాడు.

కాల్పి పతనం అయిపోగానే ఏదో ఒక బలమైన కోటను, సైన్య మును సంపాదించడం వారి తక్షణావసరం. తాత్యా మెల్లగా తప్పించుకుని గ్వాలియర్ చేరాడు. ఆయన తండ్రిని చూచేందుకు వెళ్ళాడని అంతా

అనుకున్నారు. అచటి ప్రధాన సైన్యాధికారుల వాగ్దానాలను పొందాడు. దర్బార్ సర్దార్‌లను, ఇతర అధికార్లను వప్పించి కొత్త విప్లవ సైన్యాన్ని ఆయత్తం చేశాడు. వారంతా తమ చేతనున్న సాయం అంతా చేస్తా మన్నారు. ఒక్క నెలలో గ్వాలియర్ అంతా ఆయన చేతికి అందింది. గ్వాలియర్‌లోని సైనిక కేంద్రాలన్నిటిని గుర్తించి, సిండియా సింహాసనాన్ని వదిలించి, గోపాల్‌పూర్‌లో ఉన్న రావ్‌సాహెబ్ వద్దకు చేరాడు. గ్వాలియర్ ప్రజలను వప్పించి తాత్యా తిరిగి వచ్చాడని వినగానే గ్వాలియర్ మీదకు పయనమై వెళ్దామని లక్ష్మీబాయ్ పీష్వాకు సూచించింది.

ఎక్కువ కష్టంలేకుండానే పీష్వాసైన్యాలు గ్వాలియర్ చేరాయి. సిండియాను తనవైపు చేరవలసిందిగా రావ్‌సాహెబ్ స్నేహపూర్వకంగా సందేశం పంపాడు. ముఖ్యంగా 'గ్వాలియర్ ప్రజలు విప్లవంవైపు చేరారు కనుక ఇది మంచిపని' అని ఉద్బోధించాడు. కాని సిండియా దానిని విస్మరించి జూన్ 1 ససైన్యముగా పీష్వా నెదుర్కొన్నాడు. రాణి లక్ష్మీబాయ్ తన 300 ఆశ్వికులతో సూటిగా సిండియా సైనికులమీదికి దూకింది. జయంతిరావు సిండియా, ఆయనకు అంగరక్షణకై ఉన్న ఫలేఘటే సైనిక దళం ఆమె కంటబడ్డాయి. ఒక బాణంలా ఆమె వారిపైకి దూసుకుపోయింది. క్షణంలో సిండియా తన అంగరక్షకులతో సహా ఓడింపబడ్డాడు. ఆతడి సైన్యము అంతకు పూర్వమే తాత్యాకు వాగ్దానం చేసి ఉన్నందువల్ల పీష్వాకు వ్యతిరేకంగా పోరాడడానికి నిరాకరించింది. ముందే అనుకున్న ప్రకారం వారంతా పీష్వా సైన్యాలలో చేరిపోయినారు. తుపాకిమోత లాగి పోయినాయి. గ్వాలియర్‌లోని ప్రతివారు పీష్వా ధ్వజానికి నమోవాకము లర్పించారు. అసలే పిరికిపంద అయిన జయరాజీవ్ సిండియా, తనమంత్రి దినకరరావుతో సహా యుద్ధభూమి నుండేగాక, గ్వాలియర్ నుండే వెళ్ళి పోయినాడు. ఆగ్రా చేరాడు.

గ్వాలియరిప్పుడు ఆనందంతో వెర్రెత్తి పోయింది. పీష్వా గౌరవార్థం సైన్యాలు తుపాకి మ్రోతలతో వందనం చేశాయి. ఆర్థికమంత్రి అమర్‌చంద్ భాటియా ధనాగారాన్ని పీష్వాకు వశం చేశాడు. విప్లవకారుల ఎడ సానుభూతి చూపిన నేరానికి జైళ్ళలో ఉంచబడిన దేశభక్తులను ప్రజల హర్షధ్వానాల మధ్య విడుదల చేశారు. సిండియాను ఆంగ్లేయుల వైపు ఉండవలసిందిగా ప్రబోధించిన దేశద్రోహులు పారిపోయినారు. వారి నివాసాలు నిశ్శేషంగా ధ్వంసం చేసివేయబడ్డాయి.

జూన్ 3 న పూల్‌బాగ్‌లో పెద్ద దర్బారు జరిగింది. తాత్యాతోప్ ఆయన క్రింద ఉన్న అరబ్బులు, రోహిల్లాలు, పఠానులు, రాజపుత్రులు, రంగ్డేలు, పరదేశీలు, తదితరులంతా దర్బారుకు వచ్చారు. శ్రీమంత్ పీష్వా రాగానే అంతాలేచి నిలబడ్డారు. వందనము లర్పింపబడ్డాయి. ఆయన సింహాసనము నధిష్ఠించారు. ఆనందాశ్రువులతో ఆయన ఎల్లరిని అభినందించారు. రామారావ్‌గోవింద్ ముఖ్యమంత్రిగా నియమింపబడ్డాడు. తాత్యాతోప్ ప్రధాన సైన్యాధికారిగా నియమింపబడ్డాడు. నవరత్నములు పొదిగిన ఖడ్గ మొకటి ఆయనకు బహూకరింపబడ్డది. 8 మంది మంత్రులు నియమింపబడ్డారు. సైన్యాలకు 20 లక్షల రూపాయలు పంచిపెట్టబడ్డాయి.

ఈ ఉత్సవాల హడావిడిలో దురదృష్టవశాత్తు తక్షణ కర్తవ్యానికి సంబంధించిన ఆలోచనలు వెనుక బడ్డాయి. సర్ హగ్‌రోజ్ తన ఉత్తమ సైన్యాలతో త్వరితగతిని గ్వాలియర్ మీదకు దాడి వెడలాడు. తమ వెంట సిండియాను కూడా తెచ్చారు. అతడి కోసమే తాము పోరాడుతున్నామని ప్రకటించారు. విప్లవకారులను జాగ్రతపరచడంలో సదా సఫలం చెందుతున్న తాత్యా ఆంగ్లేయులను ఢీకొన్నాడు.

విప్లవనేతలు అలజడి చెంది హడావిడిగా యుద్ధ సన్నద్ధులైనారు. ఈ గంద్రగోళంలో ప్రశాంత స్థిరచిత్తముతో ఉన్నది ఒక్క లక్ష్మీబాయ్ మాత్రమే. ఖడ్గమును చేబూని ఎర్ర వేషధారణలో; తన సైనికులతో

ముందున కురికింది. తనకు వప్పగించబడిన కోటకి సెరాయ్ స్థావరాలన్నిటిని జాగృతపరచింది. ఆంగ్లేయులు కంటపడగానే ఆమె ఆశ్వికులు కాల్పులు సాగించారు. ఆమె అంతరంగిక సఖులైన మందర, కాశీలు గూడా ధైర్యంగా ఆమె ప్రక్కనుండి పోరాడారు. ఆంగ్లేయు లనేకసార్లు ఆమె స్థావరాన్ని ఢీకొన్నారు. ఆమె దృఢంగా నిలచింది. ఆమె సైన్యాలు అత్యుత్సాహముతో ఆంగ్లేయులను దునుమాడాయి. చివరకు ఆంగ్లేయులు నిష్క్రమించవలసి వచ్చింది.

జూన్ 18 న ఆంగ్లేయు లన్నివైపుల నుండి గ్వాలియర్ కోటపై విరుచుకుపడ్డారు. క్రిందటి రోజు పరాజితుడై తిరిగిపోయిన జనరల్ స్మిత్ నేడు సరికొత్త సైన్యాలతో, మరింత దృఢ నిశ్చయంతో అదేవైపున ఢీకొన్నాడు. హగ్‌రోజ్ తాను కూడా అక్కడే ఉండడం మంచిదనుకుని స్వయంగా ఝాన్సీ స్థావరం మీదకు వెళ్ళాడు. రాణి గూడా అతడికోసం ఎదురుచూస్తున్నది. కర్తవ్య నిర్వహణకై ఆమె యావచ్ఛక్తితో నిలిచి ఉంది.

నా డామె చందేరీ తలపాగా, తమామీ వస్త్రములు, పైజమాలను ధరించి ఉన్నది. కంఠమున రత్నహారము ధరించింది. ఆమె ప్రియతమ అశ్వము అలసిపోయి ఉన్నందున నూతనాశ్వమును ఆరోహించింది. ఆమె సఖులు షర్బత్ తీసుకుంటుండగా ఆంగ్లేయులు పురోగమిస్తున్నారని వార్త వచ్చింది. వెంటనే రాణీ బయల్దేరి హగ్‌రోజుకు ముఖాముఖిగా నిలచింది.

తన సైన్యాలను పదేపదే పురికొల్పింది. అవి పల్చపడుతున్నట్లు కనిపిస్తున్నా, తానందరికీముందునిలచి వీరవిహారం చేయనారంభించింది. కాని అదేమీ కొరగాలేదు. హగ్‌రోజ్ వదలిన ఒంటెలదళం ఆమె ఆఖరి దళాన్ని ఛిన్నాభిన్నం చేసింది. అయినా ఝాన్సీ స్థైర్యమును కోల్పోనక

నిలచి పోరాడుతూనే ఉన్నది. ఆమె సైన్యములా విధంగా అసాధారణ ప్రజ్ఞతో పోరాడుతుండగా, వెనుకనున్న విప్లవసైన్యాలను ఛేదించుకొని ఆంగ్లసైన్యములు పురోగమించడం ఆమె గమనించింది. తుపాకులు మూగ వోయినాయి. సైన్యము పరాజితమైంది. ఆంగ్లేయులు విజయవంతముగా అన్నివైపులనుండి ఆమెమీదకు వస్తున్నారు. అప్పటికామెవద్ద 15, 20 మంది ఆశ్వికులు మాత్రమున్నారు. రాణీ తన సఖులతో ఒక్కసారిగా శత్రువులను ఛేదించుకొని దౌడు తీసింది. ఆవలనున్న తన మిత్రుల చేరేందుకు వెళ్ళింది. ఆమె ఏమిచేస్తున్నదీ తెలియని ఆంగ్లేయ ఆశ్వికులు వేటకుక్కలవలె వెంటబడి ఆమెపై కాల్పులు సాగించారు. ఆ వీరనారి తన ఖడ్గంతో దారిచేసుకుంటూ సాగి వెళ్ళిపోయింది.

హఠాత్తుగా వెనుక ఒక కేక వినిపించింది : "అమ్మా!" అని. వెనుదిరిగి చూచింది. అది తన ప్రియసఖి మందర కేక! శ్వేతసైనికు డొకడు ఆమెను కాల్చివేశాడు. క్రోధోన్మత్తయై ఆమె ఆ ఫిరంగి పైకి దూకింది. క్షణంలో అతడిని హతమార్చింది. మళ్ళీ ముందుకు సాగింది. ఒక చిన్న వాగు వచ్చింది. ఒక్క దుముకుతో ఆమె ఫిరంగీ పంజా నుండి బయటపడేదే! కాని గుఱ్ఱము దూకలేకపోయింది. తన ప్రియతమ అశ్వమే ఉంటే! ఏదో మంత్రముగ్ధ అయినట్లు గుర్రము గిరగిరాలు తిరుగుతున్నదేగాని ముందుకు దూకలేదు.

క్షణంలో ఆంగ్లేయాశ్వికులు ఆమెవద్దకు వచ్చారు. కత్తులు కరకర లాడాయి. వెనుకనుండి ఎవడో ఆమె తలపై దెబ్బతీశాడు. దానితో కుడి పార్శ్వము తెగింది. కుడికన్నుకూడా తెగిపోయింది. మరొక ఆఘాతం గుండెకు తగిలింది. మృత్యుముఖంలో ఉండికూడా ఆ దుర్మార్గుని ఆమె వధించింది. ఇప్పుడామె అంతిమక్షణాలలో ఉన్నది. రామచంద్రరావు దేశముఖ్ అను విశ్వాసపాత్రుడగు సేవకుడు ఆమె ప్రక్కనే ఉన్నాడు. ప్రక్కనే ఉన్న ఒక కుటీరానికి ఆమెను చేర్చాడు. గంగాదాస్‌బావా

ఆమెకు శయ్య నేర్పాటు చేశాడు. త్రాగేందుకు నీరిచ్చాడు. రక్తముతో మునిగి ఉన్న ఆ దేవి శయ్యను అలంకరించింది. పరమేశ్వరునిలో లీన మైంది. మరణమునకు పూర్వము ఆమె చేసిన ఆనతి ప్రకారం రామ చంద్రరావ్ శత్రువుకంట పడకుండా పచ్చిక పరచాడు. ఆంగ్లేయుల స్పర్శచే అపవిత్రం కాకపూర్వమే ఆ స్వేచ్ఛాదేవికి అంత్యక్రియ జరిగింది.

లక్ష్మి అలా పోరాడింది. ఆకాంక్షను తీర్చుకున్నది. నిశ్చయాన్ని అమలుపరచుకున్నది. యావద్రాష్ట్ర అస్థిత్వాన్ని ప్రకటించేందుకు అట్టి జీవితమొక్కటి చాలు. దైవీగుణముల మూర్తి యామె. ఒక పడతి, 23 ఏండ్లకు మించని వయసు; గులాబివంటి సుకుమారి; ముచ్చటైన ప్రవర్తన, పవిత్రమైన శీలములతో-పురుషులలో ఎంతో తక్కువమందికి గాని సాధ్యముకాని విధంగా ప్రజల అభిమానాన్ని చూరగొన్నది. అట్టి దైవీ వ్యక్తిత్వాన్ని ఒక రాష్ట్రం తన కన్నబిడ్డగాను, రాణిగాను పొందే సౌభాగ్యం ఎంతో అరుదు.

చతుర్థభాగం

# తాత్కాలిక ప్రశాంతి

## స్థూల చిత్రం

1857 సమరము ప్రధాన దృశ్యాలన్నీ ఉత్తర భారతానికి చెందినవైనందున ఇంతవరకు ఆ భాగపు సమరదృశ్యాలను వర్ణించడమే జరిగింది. కాని ఆ యుద్ధపు తీవ్రతను అవగాహన చేసుకొనడానికి అన్య ప్రాంతములలో అది వ్యక్తమైన తీరునుకూడా గమనించవలసి ఉన్నది.

రాజపుత్ర స్థానంలో జరిగిన అనేక సంఘటనలు రాజపుత్ర ప్రజానీకం విప్లవకారులవైపు మ్రొగ్గివున్నారని ఋజువుచేస్తాయి. జయపూర్, జోధ్‌పూర్, ఉదయపూర్ మున్నగు అనేక మహానగరాలలో—ఆంగ్లేయుల పక్షమున పోరాడిన భారతీయ సిపాయిలపై ప్రజలు వర్షించిన శాపనార్థాలు; విప్లవకారు లొక చిన్న విజయము సాధించినప్పుడు బజార్లలో ప్రదర్శింపబడిన ఆనందోత్సాహాలు; వారు పరాజయం చెందినప్పుడు వ్యక్తమైన విచారం-ఇత్యాదులన్నీ రాజపుత్రులు ఈ జాతీయ స్వాతంత్ర్య సమరంలో విప్లవవిజయానికై నిత్యమూ ప్రార్థిస్తూ ఉన్నారని స్పష్టం చేస్తాయి.

ఉత్తరాదిన విప్లవపథకం రూపొందుతున్న సమయంలో, విప్లవ ప్రతినిధులు దక్షిణాదిన ప్రాంత ప్రాంతాన, నగర నగరాన సంచారం చేశారు. కాన్పూర్‌లోని నానాసాహెబ్‌తో సతారాకు చెందిన రంగోబాపూజీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. పూనా, సతారా, ధార్వార్, బెల్గాం, హైద్రాబాద్‌లలోని సైనిక కేంద్రాలలో బ్రాహ్మణులు, మౌల్వీలు, విప్లవ సైనిక ప్రతినిధులు రహస్య సంచారం చేస్తూ, ఉత్తరాదిన విజృంభిస్తున్న విప్లవానికి సంబంధించిన సమాచారాన్ని వ్యాప్తిచేశారు. అయితే దక్షిణ భారతం వెంటనే విజృంభించలేదు.

దక్షిణాదిన మూడు ముఖ్య సైనిక దళాలు - కొల్హాపూర్‌లో 27వ దళం, బెల్గాంలో 29వ దళం: ధార్వార్‌లో 28వ దళం - ఉన్నాయి. విప్లవ పథకం తయారైనప్పుడు ఈ మూడు దళాలు ఆగష్టు 10 వ తేదీన విజృంభించాలని యోజింపబడ్డది. అయితే ఈ లోపున కొల్హాపూర్‌లోని ప్రజలను, సిపాయిలను అదుపులో ఉంచేందుకు ఒక ఆంగ్లేయ దళం పంప నిశ్చయమైంది. ఈ విషయం తంతి శాఖకు చెందిన ఒక అధికారి ద్వారా సిపాయీలకు తెలిసింది. దానితో అసలే ఉద్రిక్తులై ఉన్న సిపాయీలు అనుకున్ననాటికన్న ముందుగా జూలై 31 వ తేదీనే విజృంభించారు. కొందరాంగ్లేయాధికార్లను చంపారు. ధనాగారాన్ని వశం చేసుకున్నారు. అప్పుడే వచ్చిన ఆంగ్ల సైన్యాలతో పోరు సలిపారు. కనుమలవైపు వెళ్ళి పోయినారు.

సావంత్‌వాడీకి చెందిన రాంజీ శిరసాల్ నేతృత్వంలో ఏకమైన విప్లవ సైన్యాలు కాడీ అరణ్యప్రాంతంలో ఆంగ్లేయులను పీడింపజొచ్చాయి. ఆంగ్లేయులు పోర్చుగీసు, గోవా సహకారంతో కొన్ని నెలలలో వారిని ఓడించి, తరిమివేశారు. కొల్హాపూర్ వచ్చిన క్రొత్త ఆంగ్ల సైన్యాధికారి జాకబ్ మిగిలిన సిపాయీలను నిరాయుధులను చేసి, వారి నాయకులను కాల్చి చంపించాడు. కొల్హాపూర్ సిపాయీలు తిరుగుబాటు చేసిన రోజున,

నగరం విజృంభించలేదు. ఈ లోపున నానాసాహెబ్ దూతలు యువకు డైన కొల్హాపూర్ రాజాతో సంప్రదింపులు జరిపారు. ఆయన సాంగ్లీ, జాంఖిండీ తదితర దక్షిణాది సంస్థానాధీశులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. ఆ మహారాజాకన్న, ఆయన తమ్ముడగు చిమ్నాసాహెబ్ నరనరాలలో శివాజీ రక్తం ప్రవహించింది. ఆయన ఇటీవల భగ్నం చేయబడ్డ విప్లవ పథకాలను రహస్యంగా పునరుజ్జీవింపజేయ కృషి నారంభించాడు. కొల్హాపూర్‌లో విడివిడిగా ఉన్న సైనికులను సమీకరించి, స్వయంసేవక బృందాల నేర్పరచి, వారిద్వారా డిశంబరు 15న విప్లవం ప్రారంభించాడు. ఈ వార్త వినగానే జాకబ్ తన క్రిందివారిని ఏకంచేసి కచ్చాద్వారం మీద దాడిచేశాడు. ఆ క్షణం మొదలు ఆంగ్లేయులు రాజభవనాలన్నీ స్వాధీనం చేసుకునేవరకు సంకులసమరం జరిగింది. ఈ పరాజయం జరగగానే రాజా మామూలుగా ఈ విప్లవం తన అభీష్టానికి విరుద్ధంగా సైనికులు, ప్రజలు లేవదీసినట్టిదని ప్రకటించాడు. నాయకులను బంధించేందుకు జాకబ్ చేతనైన ప్రయత్నాలన్నీ చేశాడు. కేవలం అనుమానంతో కొందరిని ఉండుండి నిర్బంధిస్తుండేవాడు. ఎన్నిచేసినా ఈ ప్రమాదకర విప్లవ రహస్యాన్ని ఏ మాత్రం పసిగట్టలేకపోయినాడు. అనంతరం బెల్గాం, ధార్వార్ విప్లవాలు కూడా ఆంగ్లేయులచే ఆదిలోనే అంతమొందింపబడ్డాయి.

సతారాలో రంగో బాపూజీ అంటే మొదటి నుండి ఆంగ్లేయులకు అనుమానమే. కొల్హాపూర్‌లో తిరుగుబాటును ఉద్బోధించినందుకు ఆయన కుమారుని ఆంగ్లేయులు ఉరితీశారు. అదే సమయంలో సతారా రాజకుటుంబానికి చెందిన రాకుమారు లిద్దరు రాజ్య బహిష్కారం చేయబడ్డారు. రంగో బాపూజీ సతారావదలి పారిపోయినాడు. ఆ తర్వాత ఆయన విషయ మేమైందీ నేటికీ వెలికిరాలేదు.

ఈ సమయంలో బొంబాయి గవర్నరుగా లార్డు ఎల్‌ఫింన్‌స్టన్ నియమింపబడ్డాడు. తన ప్రాంతంలో జరిగిన చిన్న చిన్న పోరాటాలను

ఎదుర్కొనడమేగాక. ఆయన రాజపుత్రస్థానానికి కూడా సైన్యాలను అందించాడు బొంబాయినగరంలో విప్లవం తలయెత్తకుండా చేసిన ఘనత ఎవరికైనా దక్కితే అది ప్రధాన పోలీసు అధికారి ఫారెస్టుకు దక్కుతుంది. బొంబాయిలో ఉన్న సిపాయీలపై మొదటి నుండి ఒక కన్నుంచాడీతడు. దీపావళి సెలవలు విప్లవానికి అనుకూలమని సిపాయీలు నిశ్చయించుకుని రహస్య సమావేశాలు జరుపుతున్నారు. ఫారెస్టు ఈ సమావేశాలకు తన గూఢచారులను పంపేందుకు విపరీతమైన ప్రయత్నాలు చేశాడుగాని విప్లవకారుల నిశితమైన జాగ్రతవల్ల అది ఫలించలేదు.

సిపాయీల పథకం - మొదట బొంబాయిలో విజృంభించడం, ఆ తర్వాత పూనా వెళ్ళడం. నగరాన్ని స్వాధీనం చేసుకొనడం, అక్కడ మహారాష్ట్ర ధ్వజాన్నెగురవేయడం, నానాసాహెబ్ పీష్వాను పరిపాలకుడుగా ప్రకటించడం. ఈ పథకం అమలుజరగడానికి పూర్వమే ఫారెస్టు రహస్యాన్ని వాసనపట్టాడు. ప్రధాన నాయకులిద్దరిని ఉరితీశాడు. ఆరుగురు ముఖ్యులను ప్రాంత బహిష్కారం చేశాడు. ఆ విధంగా బొంబాయి విప్లవం మొగ్గలోనే త్రుంచివేయబడ్డది.

నాగపూర్, జబ్బల్‌పూర్‌లో కూడా చిన్న చిన్న విప్లవాలు తల ఎత్తాయి గాని అవి కూడా అలాగే అణచివేయబడ్డాయి. ధార్ సంస్థానం, మహేద్‌పూర్, గోరియా మున్నగు ప్రాంతాలలో గూడా ఢిల్లీ యువరాజు ఫిరోజ్‌షా విప్లవ ప్రయత్నాలు చేసిన సూచనలు కానవచ్చాయి.

అయితే భారతదేశంలో ఆంగ్లరాజ్యాధిపత్యపు అస్థిత్వం చాలావరకు హైద్రాబాద్‌కు చెందిన నైజాం నవాబుచేతిలో ఉన్నది. 1857 మే నెలలో అప్పుడే కొత్త నవాబు అఫ్జల్-ఉద్-దౌలా అధికారంలోకి వచ్చాడు. సర్ సాలార్‌జంగ్ ప్రధాన మంత్రిగా ఉన్నాడు. నైజామ్ విప్లవకారులలతో చేరి ఉంటే దక్కన్ భూమండలమంతా ఒక విరాట్పురుషునివలె విజృంభించి ఉండేది. హైద్రాబాద్ ప్రజలు, నైజాం సైన్యానికి చెందిన కొన్ని వర్గాలు సైతం సాలార్‌జంగ్ చేతులు కట్టివేయడానికి ప్రయత్నించారు.

కాని సాలార్‌జంగ్ వారి ప్రతి ప్రయత్నాన్ని విఫలం చేశాడు. అతడు తాటస్థ్యంకూడా వహించలేదు. ఆంగ్లేయుల పక్షాన చేరి స్వీయ సైనికులను సైతం హతమార్చడంలో సహాయపడ్డాడు. ఆ పోరాటంతో విప్లవనాయకుడు తోరవజ్‌ఖాన్ చంపివేయబడ్డాడు. మౌల్వీ అల్లా-ఉద్-దీన్ శత్రువులచేతికి చిక్కాడు.

ఈ విధంగా నైజాం దక్షిణ భారత విప్లవాన్ని భగ్నం చేసినా, హైద్రాబాద్ దాపుల ఉన్న జోరాపూర్‌ను పాలిస్తున్న యువకుడగు హిందూరాజు తన సర్వస్వాన్ని ఈ స్వరాజ్య సంగ్రామంలో ఒడ్డడానికి సిద్ధపడ్డాడు. తదనుగుణ్యంగా అతడు అరబ్బులను, రోహిల్లాలను, పఠానులను సమీకరించ నారంభించాడు. నానాసాహెబ్ ప్రతినిధు లాయనను కలిసి, పీష్వా ధ్వజంక్రింద పోరాటానికి ఆయనను సిద్ధం చేశారు.

నైజాం నవాబు, ఆంగ్లేయులు కలిసి ఆయనపై దాడిచేశారు. ఈ వార్త విన్నదగ్గరనుంచి తన భవిష్యత్తు క్లిష్టస్థితిలో పడ్డట్లు ఆయనకు తెలుసు. ఈ సంయుక్త సైన్యాలను నిరోధించడం సాధ్యంగాక ఆ మహారాజు ఒక నెలతర్వాత 1858 ఫిబ్రవరిలో హైద్రాబాద్ వెళ్ళాడు. అక్కడ బజారున వెళ్తుండగా సాలార్‌జంగ్ ఆజ్ఞలపై అతడిని బంధించి ఆంగ్లేయులకు వప్పగించారు.

శైశవమునుండి ఈ రాజాకు, మీడోస్ టేలర్‌కు సన్నిహితపరిచయమున్నది. టేలర్‌ను ఇతడు "అప్పా" అని పిలుస్తుండేవాడు. అందువల్ల అంగ్లేయులు విప్లవరహస్యములను, నాయకుల పేర్లను తెలుసుకునేందుకు టేలర్‌ను, బంధింపబడి ఉన్న ఈ రాజావద్దకు పంపారు. ప్రాణభయం కల్గించినా రాజా చలించలేదు. ఇక మరణము తప్పదని టేలర్ సూచించాడు. దానిపై రాజా ఇలా అన్నాడు: "అప్పా! అయితే ఒక చిన్న కోరిక. నేను దొంగనుకాదు. అందువల్ల నన్ను ఉరితీయకండి. ఫిరంగికి కట్టి ప్రేల్చండి. ఆ ఫిరంగి నోటివద్ద నేనెంత ప్రశాంతంగా నిలచి ఉంటానో దర్శించండి!"

అయితే, టేలర్ ప్రమేయంవలన దేశభక్తుడైన ఈ యువకునికి మరణ దండనగాక కొంతకాలం ద్వీపాంతరవాస శిక్ష విధింపబడ్డది. ఆ తర్వాత, అతడు అండమానుదీవులకు పంపబడనుండగా, తన కాపలాదారుడైన ఒక ఆంగ్లేయుని పిస్తోలును కాజేసి ఎవరూ లేని సమయంలో తనను తాను కాల్చివేసుకున్నాడు.

జోరాపూర్ రాజాతో సన్నిహిత సంబంధాలతో ఉన్నది నర్గుంద పాలకుడు భాస్కరరావ్ బాబాసాహెబ్. కాని జోరాపూర్ విజృంభించి నప్పుడు అంత ధైర్యవంతురాలు తన దత్తస్వీకారాధికారాన్ని నిరాకరించిన ఫిరంగీలను సర్వనాశనం చేయడానికి తన ప్రాణాలను సైతం అర్పించ డానికి ఆమె సిద్ధంగా ఉన్నది. ఆమె ప్రోద్బలం వలన, చివరకు 1858 మే 25న నర్గుంది విజృంభించి ఆంగ్లేయులతో యుద్ధం ప్రకటించింది.

ఈ లోపున బాబాసాహెబ్ సవతితల్లి కుమారుడు విప్లవంలో చేర నిరాకరించడమేగాక ఆంగ్లేయులతోకూడా చేరాడు. బాబాసాహెబ్ ఓడింప బడ్డాడు. ఆ తర్వాత మారువేషమందుండగా పట్టుబడి జూన్ 12న ఉరి తీయబడ్డాడు. సుందర యువతియు, ధైర్యవంతురాలును అగు ఆయన సతి, శత్రువుకు లొంగిపోక, తన అత్తగారితో కలిసి మానప్రభలో జల ప్రవేశము చేసి ప్రాణత్యాగ మొనర్చింది.

వీరంతా గాక కోమల దుర్గానికి చెందిన భీమారావు ఖాండేశ్ భిల్లులు, తదితర సాహసికులైన వనవాసీజనులు తమ తమ విల్లు, అంబు లతో మహారాష్ట్రమంతటా చిన్న, పెద్ద తిరుగుబాట్లు చేశారు.

ఈ విధముగా దక్షిణ భారతం కొంత వెనుకబడియుండగా అటు అయోధ్యలో విప్లవజ్వాలలు పునర్విజృంభించ నారంభించాయి. మౌల్వీ అహ్మద్ షాను ఉరితీసినందుకు పగతీర్చుకునేందుకై నిజాం అలీఖాన్ పిల్ భిత్‌వరకు సాగివెళ్ళాడు నాల్గువేల మందితో ఖాన్ బహద్దూర్‌ఖాన్ రంగం లోనికి వెళ్ళాడు. 5000 మందితో ఫరూకాబాద్‌లో విజృంభించాడు. 3 వేల

మందితో విలాయత్ షా రంగంలోకి ప్రవేశించాడు. ఇక నానాసాహెబ్, బాలాసాహెబ్, అలీఖాన్ మేవాతి, తదితర నాయకులందరూ రోహిల్ ఖండ్ అయోధ్య ప్రాంతములలో 5 వేల మందితో మహోద్యమం లేవదీశారు.

వీరేకాక - ఆంగ్లేయుల పశమైన అయోధ్యను మళ్ళీ స్వాధీనం చేసుకొనడానికి రాజా రామ్‌బక్ష్, బహునాథ్‌సింగ్, చందాసింగ్, గులాబ్ సింగ్, భోపాల్‌సింగ్, హనుమంతసింగ్ మున్నగు పాలకులు, జమీందార్లు, చిన్న, పెద్ద సైన్యాలతో పోరాడుతున్నారు. ధార్ వద్ద పోరాడుతూ ఉండిన మొఘల్ రాజా ఫిరోజ్‌షా ఇప్పు డయోధ్యకు వచ్చాడు. రూయా కోటను రక్షించేందుకై ధైర్యసాహసాలతో పోరాడిన రాజా నరపత్‌సింగ్ కూడా ఉన్నాడు. వీరందరికన్న ఉత్సాహంలోను, శక్తిలోను, ధైర్యము లోను, దేశభక్తిలోను, నిశ్చయములోను అధికుడైన రాజా వేణీమాధవ్ కూడా కోట విడిచివచ్చి అసామాన్యమైన సాహసంతో కాన్పూర్ రోడ్డు మీద పురోగమించి లక్నోపై విరుచుకుపడడానికి సిద్ధంగా ఉన్నాడు.

దానితో హోప్ గ్రాంట్ జూన్ 13 న ఆకస్మికంగా లక్నో దాపులలో నవాబ్‌గంజ్ వద్ద విప్లవ వీరులపై దాడి చేశాడు. తెగించి పోరాడిన ఆంగ్లేయుల తుపాకులు తిరుగులేని విధంగా గర్జించిన పిదప ఆనాటికి విజయం సాధించాడు.

అయోధ్య జరిపిన భయంకర సమర మట్టిది. చివరకు 1858 అక్టో బరులో బ్రిటిష్ కమాండరు, ఆంగ్ల భారత సైనికులను సుసజ్జితం చేసి వారందరిని అన్నివైపులనుండి ఒకేసారి నడిపించి, విప్లవవీరులపై అన్ని వైపుల నుండి ఒత్తిడితెచ్చి నేపాల్ వరకు గెంటుకుపోవలసిందిగా ఆజ్ఞ లిచ్చాడు.

రాజా వేణీమాధవుని నగరమగు శంకర్‌పూర్‌ను మూడు వైపులా ముట్టడించారు. అప్పటికాయన సాధనసంపత్తి చాలా క్షీణించింది. ఆంగ్లే

యులు మంచి బలంగా ఉన్నారు. అయినా వేణీమాధవుడు అస్త్ర విసర్జన చేయలేదు.

1858 నవంబరులో బ్రిటిష్ రాణి చేసిన చారిత్రక ప్రకటన దేశ మంతా వినిపింపబడ్డది. జ్యోతిష్కులన్నట్లు నూరేండ్లలో కంపెనీ పరిపాలన అంతమయింది! కాని దాని స్థానంలో రాణి పరిపాలన వచ్చింది! ఆ ప్రకటన ప్రకారం ఆంగ్లేయుల నెదిరించి పోరాడినవారు అస్త్ర విసర్జన చేయగానే పూర్తిగా క్షమింపబడతారు; వారి ఆస్తులు స్వాధీనం చేసుకొన బడవని వాగ్దానం చేయబడ్డది; విచారణకూడా జరుపబడదు; సంస్థానా ధీశ్వరుల దత్త స్వీకారాధికారం కూడా మన్నింపబడుతుంది; ప్రజల మత విషయములలో ప్రమేయం పెట్టుకొనమని కూడా అందలి ఒక అంశం; వాగ్దాన భంగం జరుగదనికూడా ఒక హామీ ఇవ్వబడ్డది.

అయోధ్య రాజ్యం 1858 జూన్ మొదలు 1859 ఏప్రిల్ వరకు పోరాడింది. అప్పటికి అది అన్ని దిశలనుండి నేపాల్‌వైపు గెంటివేయబడ్డది. విప్లవకారులు నేపాల్‌లో ప్రవేశించినప్పుడు కూడా ఆంగ్లేయులు వెంటాడు తునే ఉన్నారు. నేపాల్ హిందూరాజా వారికి రక్షణ కల్పిస్తాడా ?

ఈ సమయానికి దాదాపు 60 వేల మంది విప్లవకారులు నేపాల్ ప్రవేశించారు. వారికి నానాసాహెబ్, బాలాసాహెబ్, అయోధ్య బేగం, ఆమె చిన్నకుమారుడు తదితరులు నాయకత్వం వహించారు.

విప్లవ నాయకులను కలిసేందుకు నేపాల్ మహారాజు జంగ్ బహద్దూర్ తన ఆంతరంగిక ప్రముఖుడగు కలనల్ బలభద్రసింగ్‌ను పంపాడు. నేత లంతా ఏకగ్రీవంగా ఇలా చెప్పారు: ''మేము హిందువుల ధర్మంకోసం పోరా డాము. మహారాజా జంగ్ బహద్దూర్‌కూడా హిందువేకనుక మాకు సహాయ పడాలి. ఆయన ఈ సహాయం చేస్తే, ఆయన అధికార్ల నేతృత్వంలో ఉండి కలకత్తా వరకు దాడి చేయడానికి సైతం మేము సిద్ధం. మా ఆహార పదార్థాల బాధ్యత మేమే వహిస్తాం. ఆయన ఆజ్ఞలపాటించి పనిచేస్తాం. మేము జయిం

చిన ప్రతిదానిని గూర్ఖా ప్రభుత్వ వశం చేస్తాం. ఇది సాధ్యం కాకపోతే కనీసం ఈ రాజ్యంలో ఆశ్రయ మిప్పించండి. ఆయన అజ్ఞలకు లోబడి ప్రవర్తిస్తాం''.

గూర్ఖా ప్రతినిధి బలభద్రసింగ్ ఇలా అన్నాడు: ''ఆంగ్లేయులు కరుణా కటాక్షములతో వీక్షిస్తున్నారు. అందువల్ల వారిముందు ఆయుధ విసర్జనం చేసి వారి ఆశ్రయం పొందండి.''

దానిపై విప్లవ వీరులిలా అన్నారు: ''రాణీ ప్రకటనను మేము విన్నాం. కొందరి ప్రాణాలు పోతుండగా మరికొందరి ప్రాణాలు దక్కించుకోవడం మేము ఇష్టపడని విషయం.''

ఈ మాదిరి అనేక సంప్రదింపులు జరిగాయి. చివరకు జంగ్ బహద్దూర్ సూటిగా చెప్పివేశాడు : ''మీకు సహాయపడాలనే ఉంటే విప్లవకారుల నణచేందుకు నేను మావాళ్ళను లక్నోవర కెందుకు పంపుతాను?'' ఈ మాదిరి తుచ్ఛమైన కబురు పంపడంతో అత డాగలేదు. తన సరిహద్దులలో ఉన్న విప్లవ వీరులను వేటాడేందుకు ఆంగ్లేయులకు పూర్తి స్వేచ్ఛ నిచ్చాడు !

అప్పుడు విప్లవకారులు అన్ని ఆశలు వదలుకొని, ఆయుధములను రహస్యముగా దాచుకొని స్వస్థానములవైపు తిరుగుముఖం పట్టారు. అలా తిరిగిపోవడాన్ని ప్రోత్సహించేందుకై ఆంగ్లేయులు దారిలో వారి కేమాత్రము చిక్కులు కల్పించలేదు. అయినా మరికొందరు వీరశేఖరులు ఆంగ్లేయ పాలనలోకి వెళ్ళడం ఇష్టంలేక పస్తులతో మరణించడానికి సిద్ధపడి అడవులలోకి వెళ్ళిపోయినారు. వీరిలో ప్రముఖుడు నానాసాహెబ్. తాను తెచ్చుకున్న కష్టాలమధ్య బాలాసాహెబ్ అడవిలో మరణించాడు. ఆ తర్వాత బీగంకు, ఆమె చిన్న కుమారునికి జంగ్‌బహద్దూర్ ఆశ్రయ మిచ్చాడు.

# మహాయజ్ఞంలో అంతిమ సమిధ

గ్వాలియర్ మైదానంలో జరిగిన మహాసమరంలో 1858 జూన్ 20 న ఝాన్సీ లక్ష్మీబాయి వరిగిపోయింది. ఆంగ్లేయుల బద్ధ శత్రు వొక రిలా వరిగిపోగా ఆమెకు తీసిపోని మరొక బద్ధశత్రువు - పైగా వ్యూహ రచనలో మిన్న - చాతుర్యంతో తిరోగమించాడు. 20 వ తేదీన గ్వాలి యర్ నుండి మాయమైనా డాయన. 22 న ఔరా, ఆలిపూర్‌లలో దర్శన మిచ్చి, ఆ రణరంగం నుండి మళ్ళీ అదృశ్యమైనాడు ! ఆంగ్లేయులకు అంతు చిక్కకుండా వెళ్ళాడు. ఎక్కడికి ?

కొద్ది రోజులలో మధ్య భారతమంతా అడవులలో, నగరాలలో, గ్రామాలలో, కొండలలో, గుహలలో, నదులలో, వాగులలో ఎక్కడ చూచినా ఒకే సమర నినాదం, — ''తాత్యాతోప్, తాత్యాతోప్'' అని !

ఆ మహారాష్ట్ర సింహం, తెల్ల వేటగాళ్ళు వెన్నాడుతుండగా మధ్య భారతపు అడవులలోనికి తప్పించుకుపోయింది. అయితే నేడిప్పుడాయనకు చెప్పుకొనదగిన సైన్యము లేదు, తుపాకులు లేవు, ఆయుధములు లేవు. ఇవి లభించే ఆశలుకూడా లేవు.

గ్వాలియర్, జౌరా, ఆలీపూర్ పరాజయాల తర్వాత తాత్యాతోప్, రావ్‌సాహెబ్ పీష్వాలు మిగిలిన సైన్యాలను తీసుకొని సర్మథురా అనే స్థానంవైపు వెళ్ళారు. భవిష్యత్ కార్యకలాపా లన్నిటిని మూడు ముఖ్య సూత్రాలమీద ఆధారితం చేశారు. ఒకటి : ఆంగ్లేయులతో పోరాటంలో చిక్కుకొనకుండా ఉండడం. రెండు : అరక్షిత ప్రదేశాలపై గెరిల్లా దాడులు జరపడం. అయితే ఆయుధ ఆహార సరఫరాకు ఏదో ఏర్పాటు ఉంటే తప్ప ఈ రెండిటిని అమలుచేయడం సాధ్యంకాదు. అందువల్ల మూడవది : స్వదేశీ సంస్థానం ఉన్న ప్రతిచోట తాత్యా ఆహారము, ధనము, అయుధములను సేకరించడం.

ఉత్తర, మధ్యభారతములలో అడుగడుగునా స్వదేశీ సంస్థానము లున్నాయి. కొన్ని సంవత్సరాలమీద వారు చాలా ఆహార పదార్థాలను, ఆయుధాలను నిల్వచేశారు. వీటన్నిటిని దేశోపయోగం కోసం వినియోగించడం ఆ పరిపాలకుల కర్తవ్యం. కాని 1857లో ఈ పరిపాలకులు దేశాభీష్టాన్ని, తమ ప్రజల కోరికలను మన్నించలేదు. ఆంగ్లేయులతో తమ సంబంధ బాంధవ్య ప్రయోజనాలకోసం వారు విప్లవకారులతో చేరలేదు. ఈ పరిస్థితుల దృష్ట్యా దేశరక్షణ కత్యవసరమైన ఈ పదార్థాదులను ఈ విశ్వాస ఘాతుకులనుండి స్వాధీనం చేసుకొనడానికి తాత్యాతోప్, రావ్ సాహెబ్‌లు ఒక పథకం వేశారు. వారంతా హృదయపూర్వకంగా స్వదేశీ సైన్యాలకు ఆహార పదార్థాలు ఇచ్చారా సరే—లేకపోతే బలవంతంగా వారిచ్చేలా చేయించాలి. అంతే. చాలామంది స్వచ్ఛందంగానే ఇచ్చారు.

కనుక తాత్యా భవిష్యత్పథకం పై మూడు అంశాలమీద ఆధారపడి ఉంది. సకాలంలో నర్మదానదిని దాటి మహారాష్ట్ర సింహం మహారాష్ట్రారణ్యాలలో ప్రవేశించడం తాత్యా లక్ష్యం. ఆయనను నర్మద దాటనీయక పోవడమే కాకుండా అసలు నర్మద దాపులకు రాకుండా చేయాలనేది ఆంగ్లేయుల లక్ష్యం. ఇక పోటీ ప్రారంభమైంది.

మొదట తాత్యా, భరతపూర్‌పై కన్నువేశాడు. కాని అక్కడకు ఒక దృఢమైన ఆంగ్లసైనికదళం చేరిందని వినగానే వెంటనే జైపూర్ చేరాడు. ఇది వినగానే ఆంగ్లేయులు నసీరాబాద్‌నుండి జైపూర్ బయల్దేరారు. తాత్యా దక్షిణాభిముఖుడై వెళ్ళవలసి వచ్చింది.

తాత్యా తిన్నగా ఇంద్రఘర్ వరకు వచ్చి ఆగాడు. హోమ్స్ అతడి వెనుక ఉన్నాడు. రాజపుత్రస్థానమునుండి వస్తున్న రాబర్ట్స్ ప్రక్కనే ఉన్నాడు. ఆ సమయంలో విపరీతంగా వర్షం ఉన్నది. చంపాల్ మున్కలై పోయింది. అందువల్ల తాత్యా ఈశాన్యదిశగానున్న బుందీ వైపు మరలాడు. అతి చాకచక్యంతో విప్లవానికి అనుకూలంగా ఉన్న నీముద్-నశీరాబాద్ ప్రాంతానికి చేరాడు.

తాత్యా బిల్వారా గ్రామంవద్ద విశ్రాంతికై విడిది చేశాడు. ఇది విని సార్వార్‌గామ్‌నుండి రాబర్ట్స్ హడావిడిగా వచ్చి 1858 ఆగస్టు 7 న తాత్యాపై దాడి చేశాడు. పగలంతా తాత్యా అతడితో పోరాడి చీకటి పడగానే తన సిపాయీలను, తుపాకులను తీసుకుని క్షేమంగా ఉదయపూర్‌లోని కోట్రాలో ప్రవేశించాడు.

అక్కడ సిపాయీలు విశ్రాంతి తీసుకుంటుండగా తాత్యా ఆ రాత్రి ప్రఖ్యాత యాత్రాస్థలమగు నాథద్వారాలోని కృష్ణాలయానికి దర్శనార్థము వెళ్ళాడు. అర్ధరాత్రి తిరిగిరాగానే, ఆంగ్లేయులు తమకు అతి సమీపానే ఉన్నట్లు విన్నాడు. వెంటనే విడిది వదలి బయల్దేరండని అనుచరుల నాజ్ఞాపించాడు. అప్పుడు వారు పూర్తిగా అలసిపోయి ఉన్నారు. "ఇక మేము రేపు ఉదయందాకా ఒక్క అడుగు ముందుకు వేయలేం. అశ్విక దళాన్ని బయల్దేరమనండి" అన్నారు పదాతిసైనికులు.

ఈ పరిస్థితులలో తాత్యా పోరాటానికి సిద్ధపడవలసివచ్చింది. తెల్లవారేలోపు సైనికులను వీలున్నంత చక్కగా సర్దుబాటు చేశాడు.

ఆగష్టు 14న జరిగిన ఆ యుద్ధంలో తాత్యా సైనికులు గట్టి దెబ్బ తిన్నారు. తుపాకులు వదలి 15 మైళ్ళు తిరోగమించారు.

మళ్ళీ - తాత్యాకు - ఆయుధాలు లేవు. ఆహార సామగ్రి లేదు. శత్రువుమాత్రం వెన్నంటి ఉన్నాడు. శత్రువును మెల్లగా తప్పించి తాత్యా అకస్మాత్తుగా చంబల్ నదివైపు దౌడుతీశాడు. ఆంగ్లేయులు అతడి పక్కగాను, వెనుకగాను వెంటాడడమేగాక ఒక కమాండరు చంబల్ నదీతీరానే వేచి ఉన్నాడు. కాని తాత్యా కొందరికి వంచికలిచ్చి, కొందరిని త్రోసివేసి చాకచక్యంగా చంబల్ నదీతీరానికి చేరాడు. ఆంగ్లేయులు గుడ్లు వప్పగించి చూస్తుండగా నదిని దాటాడు.

ఇప్పుడు చంబల్‌నది తాత్యాకు, ఆంగ్లేయులకు మధ్య ఉన్నది. కాని అతడివద్ద ఆయుధం లేదు. ఆహారం లేదు. ధనం లేదు. ఇక నర్మదా? అది ఊహకైనా అందుబాటులోలేదు. అలాంటి విపరీతస్థితిలో చిక్కుకుని ఇక ఝల్రపట్టంవైపు వెళ్ళాడు. ఇది విని ఆ ప్రాంత పాలకుడు సాయుధులైన విశ్వాసనీయులను కొందరిని తీసుకుని తాత్యామీదకు వెళ్ళాడు; తాత్యా తారసిల్లగానే ఆ సైనికులు తాత్యాకు సలాముచేసి తమ విధేయతను ప్రకటించారు. తాత్యా వెంటనే వారిని తన బృందంలో చేర్చుకున్నాడు. ఝల్రపట్టంలో అతడికి అశ్వాలు, అయుధాలు, శకటాలు లభించాయి. వెంటనే తాత్యా, రావ్‌సాహెబ్, బందానవాబ్‌లు దక్షిణాదిన భవిష్యత్ప్రథకాలను గురించి యోజించ నారంభించారు. పీష్వా సైన్యాల ప్రధాన లక్ష్యం నర్మదా నదిని దాటి దక్కన్ పీఠభూమిలో ప్రవేశించడం. దీనిని నివారించేందుకు అడుగడుగునా కాపలా ఏర్పాట్లు చేసుకున్నారు. అయితే ఇప్పుడు తాత్యాకు 32 తుపాకులు, ఒక కొత్తసైన్యం, ఆహార పదార్థాలు, ధనము లభించాయి. పోరును జరిపేందుకు వీలైన స్థితిలో ఉన్నాడు. అందువల్ల రహస్యంగా ''ఇక ఇందోరు స-స్థానంపై విరుచుకుపడదాం'' అని సహచరుల చెవిలో ఊదాడు.

ఈ ఆలోచన తాత్యా ధైర్యసాహసాలకు అనువైనదే. చేతిలో నిలకడ అయిన సైన్యం లేకుండా అతడన్నన్ని క్రొత్తసైన్యాలు సృష్టించాడు; సింహాసనాలు వశం చేసుకున్నాడు; రాజ్యాలు సంపాదించాడు. ఇందోరు సైన్యం తాత్యాకు అండగా నిలిచేందుకై రహస్యంగా అంగీకరించింది. ఇందోరు దర్బారు కూడా ఈయనకు రహస్యంగా ఆహ్వానాలు పంపు తోంది. అందువల్ల తాత్యా ఇందోర్‌మీదికి వెళ్ళాలనుకున్నాడు. పాటన్ నుండి చకచక దక్షిణంగా సాగివెళ్ళాడు... మాల్వా చేరాడు... రామ్ ఘర్‌లో హఠాత్తుగా దర్శనమిచ్చాడు.

తాత్యాను బంధించేందుకు బ్రిటిష్ కమాండర్లు రాబర్ట్సు, హోమ్సు, పార్కు, మిట్‌చల్, హోప్, లుక్‌హార్టు మున్నగువారంతా అన్నివైపుల నుండి పురోగమిస్తున్నారు. తాత్యా ఇందోర్‌వైపు పురోగమిస్తున్నాడని వినగానే వారంతా గగ్గోలుపడిపోయినారు. మౌవావదలి వచ్చాడొకడు; నల్‌ఖేరావైపు పరుగెత్తాడింకొకడు; రామ్‌ఘర్ పోవడమా మానడమా అని సందేహించా డింకొకడు. ఈ విధంగా అయోమయ స్థితిలో పడ్డారు.

మిట్‌చల్ సైన్యాలు వెన్నంటిరాగా తాత్యా సైన్యాలు బేట్వానదిపద్ద అడవులలోకి జారిపోయి, అవతలప్రక్క సిరంజ్ అనేచోట తేలాయి! ఆ సమయంలో వచ్చిన తీవ్రమైన వర్షాలవల్ల ఆంగ్లేయులు కొంతకాలం ముందుకు అడుగు వేయలేకపోయినారు. అందుచేత తాత్యా సైన్యాలకు కాస్త విశ్రాంతి తీసుకునే వ్యవధి లభించింది. ఒక్కవారం విశ్రాంతి తీసుకున్నారు. మళ్ళీ వెంటనే ఉత్తరాభిముఖులై ప్రయాణం సాగించారు.

ఇక ఇప్పుడు తాత్యా, రావ్‌సాహెబ్ లిద్దరూ శత్రువు గుప్పిట్లో చిక్కుకొని ఉన్నారు. దక్షిణమునుండి మిట్‌చల్, తూర్పుదిశనుండి కల్నల్ లిడ్డెల్, ఉత్తరమునుండి కల్నల్ మీడ్, పశ్చిమమునుండి కల్నల్ పార్కు చంబల్ నుండి రాబర్ట్సు చుట్టుముట్టారు. మీదిమీదికి వస్తున్నారు. వీ రంద రికి వంచన లిస్తూ, వ్యూహాలను ఛేదిస్తూ, ఈ మహారాష్ట్ర వీరుడు మెరుపు

తీవలా వారిని దూసుకుపోతూ, కనుమలు దాటాడు; నదులు దాటాడు: అడవులు దాటాడు. దక్షిణానికి చేరాడు. ప్రక్కనుండి పార్క్, వెనుక నుండి మిట్‌చెల్, ముందు నుండి బీదర్ దరికి చేరారు. కాని తాత్యామాత్రం వారిని త్రోసిరాజని పూసుకుపోతున్నాడు.

నర్మదానదిని ఒక్క ఏడాది క్రితం దాటి ఉంటే అద్భుతంగా ప్రయోజనకరమయ్యేది. కాని 1858 అక్టోబరులో ఈ సాహసోపేతమైన వ్యూహం ప్రశంసల నందుకొనగలదుగాని ప్రయోజనం సాధించిపెట్టజాలదు ! ఈ సరికి విప్లవం అన్ని చోట్ల అణచివేయబడ్డది. ఈ భయంకర సమరంతో జరిగిన రక్తపాతం జాతిని బలహీనము, హతబుద్ధిని చేసింది.

ఉత్తర భారతంలో గ్రామ గ్రామాన రైతులు తాత్యాను పరమ దేశభక్తునిగా గౌరవిస్తూ ఆయనకు, ఆయన అనుచరులకు స్వచ్ఛందంగా ఆనందంగా ఆహార పదార్థాలు సరఫరా చేసేవారు. కాని దురదృష్టం మహారాష్ట్ర ప్రాంతంలోనే ఆయన ఉద్యమానికి సహకరించేందుకు ప్రజలు జంకిపోయినారు. బంకారాణి నేతృత్వంలో ఇదిగాక మరేమి జరుగుతుంది? తన అద్భుతకృషికి ఈ మాదిరి విపరీత స్వాగతం ఎదురైనందుకు ఏ మాత్రం చెక్కు చెదరకుండా తాత్యా అక్కడే కొంత కాలం ఉండిపోయినాడు.

ఇంతలో ఆంగ్లసైన్యాలు అన్ని వైపుల నుండి తాత్యా ఉన్నస్థావరం చుట్టూ కేంద్రీకరింపబడ జొచ్చాయి. ఆంగ్లేయులు మేల్‌ఘట్‌వద్ద ఉన్నారు. అజీబ్‌ఘర్, గుజరాత్, ఖాందేశ్,నాగ్‌పూర్‌లుకూడా అతడికి సమీపంలోనే ఉన్నాయి. దక్షిణ భారతంలో అతడికి చొరపిలేకుండా పోయింది. ఉత్తరం నుండి శత్రుసైన్యాలు వెన్నంటివచ్చి నర్మదను కూడా దాటాయి. అయినా జంకులేని ఆ వీరుడు ఎంతమాత్రం అధైర్యం చెందలేదు. పైగా తిరుగులేని ఆ వీరయోధుడు అద్భుతమైన సైనిక సంచలనాలను ప్రదర్శించాడు,

కాని అతడిని వెన్నంటి బంధించేందుకు వస్తున్న ఆంగ్ల సైన్యము లనేకం. వారు అతడి అడుగులలో అడుగువేసుకుంటూ నడుస్తున్నారు. అంతటి చిక్కులవలను సైతం అతడు ఛేధిందుకు బయటపడుతుండడం ఆశ్చర్యంకలిగిస్తుంది.తాత్యాతన అనుచరులతో వాశ్వారారణ్యాలలోకివెళ్లాడు. కాని ఈసరికి, బందానవాబు విక్టోరియారాణి ప్రకటనను అవకాశంగా తీసుకొని ఆయుధ విసర్జన చేశాడు. డిశంబరు 11 వ తేదీన తాత్యా అడవుల నుండి వెలుపలికి వచ్చి ఉదయపూర్‌వైపు ప్రయాణం ప్రారంభించాడు. కాని వెంటనే అనేక మంది ఆంగ్లేయులు ఆయనపై విరుచుకు పడ్డారు.

ఆంగ్ల సైన్యాల సంచలనానికి సంబంధించి తాత్యాకు ఎప్పటికప్పుడు అతి సూక్ష్మమైన వివరాలుసైతం తెలుస్తూనే ఉండేవి శత్రుసైన్యాలు తనపై అన్ని వైపుల నుండి విరుచుకుపడుతున్నాయనే విషయం గుర్తించి తాత్యా ఉదటు ఉదటున దేవసా చేరాడు. ఇక ఆంగ్లేయులను తప్పించుకు బయట పడేందుకు ఒక సందు కూడా లేకపోయింది.

ఢిల్లీ యువరాజు మీర్జాషా అతడినీ సరికి చేరాడు. అయనతోపాటు గ్వాలియర్ మాన్‌సింగ్, పీష్వా రావ్‌సాహెబ్‌లుకూడా చిక్కుకు పోయి నారు. 1859 జనవరి 16 ఉదయం తాత్యా, రావ్‌సాహెబ్, ఫిరోజ్‌షాలు ముందుసంగతి చర్చించుకుంటుండగా అంతిమనినాదం వినవచ్చింది. ఆంగ్లే యుని హస్తం తాత్యా వెన్నును తాకింది. వెంటనే ఆంగ్లేయులు ఆనం దంతో కేకలు వేశారు: ''తాత్యా దొరికాడు, తాత్యా దొరికాడు" అంటూ! అయితే అత్యద్భుతం...తాత్యా మరుక్షణంలో మాయమైపోయినాడు !

అక్కడ మాయమైన తాత్యా జనవరి 21 న ఆల్వార్ వద్ద నున్న శిఖర్‌నగరంలో రావ్‌సాహెబ్ ఫిరోజ్‌షాలతో కలిసి మళ్ళీ ప్రత్యక్షమైనాడు! ఆంగ్ల సైనికులు పిచ్చివారివలె వారి వెంటపడ్డారు. అందొకడు - హోమ్స్ అనునాతడు-విప్లవకారుంతో తలపడి వారిని గెంటివేశాడు. శిఖర్‌లోకూడా పరాజయం ఎదురైన తర్వాత ఇక ఎదురుతిరగడం అనేది అసాధ్యమై

పోయింది. ఇక తాత్యా ఆ సైన్యాలనుండి, రావ్‌సాహెబ్ నుండి సెలవు తీసుకున్నాడు. వెంట రెండు స్వారీ గుఱ్ఱాలను, ఒక పొట్టిగుఱ్ఱాన్ని, ఇద్దరు వంట బ్రాహ్మణులను, ఒక సేవకుని వెంటతీసుకుని బయల్దేరాడు. వీరితో గ్వాలియర్ సర్దార్ మాన్‌సింగ్ వద్దకు వచ్చాడు. అతడప్పుడు పరాన్ అడవులలో ఉన్నాడు. "మీరు సైన్యాలు విడచిరాకుండా ఉండవలసింది" అన్నాడు మాన్‌సింగ్. "అది మంచికే చేశానో, చెడ్డకే చేశానో వదలివేయి. నేనిప్పుడు మీతో ఉండదలచాను. నిరంతర ప్రయాణంతో ఇక విసుగెత్తి పోయింది" అన్నాడు తాత్యా.

తాత్యా ఇప్పుడు మాన్‌సింగ్‌తో అడవులలో ఉన్నాడని విని ఆంగ్లేయులు అతడిని పట్టుకునేందుకు వచ్చారు. అయితే ధైర్యంగా ఢీకొని పట్టుకొనడం సాధ్యం కాదని భావించి ఈసారి కుటిలోపాయాలతో, ద్రోహంతో, వంచనతో బంధించాలనుకున్నారు. మొదట మాన్‌సింగ్‌కు కబురుపంపారు. తాను ఆంగ్లేయులకు లొంగిపోయి, తాత్యాను బంధించడంలో సహకరిస్తే, తమ పలుకుబడినంత ఉపయోగించి సిందియా చేత మాన్‌సింగ్‌ను క్షమింపజేయడమేగాక, నార్వాల్ రాజ్యం వప్పగింపజేస్తామని తెలియజేశారు. ఈ మాన్‌సింగ్ నిజంగా ఒక నీచుడు. ఇంతకు పూర్వం తన బాబాయిని స్వయంగా ఆంగ్లేయులకు పట్టించేందుకు ప్రయత్నించినట్టివాడు. ఆంగ్లేయుల ప్రతిపాదనకు వెంటనే అంగీకారం తెలిపాడు. అతడు తాత్యాను కలిసి తాను లొంగిపోబోతున్నానని తెలియజేశాడు.

ఇది విన్న తర్వాత కూడా తాత్యా లొంగిపోదామనుకోలేదు. అప్పుడే ఫిరోజ్ షా నుండి తాత్యాను తిరిగి తమ శిబిరానికి రమ్మని కోరుతూ లేఖ వచ్చింది. తాత్యా ఆ లేఖను మాన్‌సింగ్‌కు చూపి "అయితే నే నచటికి వెళ్ళనా? లేక ఈ అడవులలోనే ఉండిపోనా? నీ సలహా ప్రకారం చేస్తాను" అన్నాడు. అంతట ద్రోహియగు మాన్‌సింగ్ "కొంచెం ఆగండి. నా అభి

ప్రాయం తెలియజేస్తాను'' అని జవాబిచ్చాడు. మాన్‌సింగ్ ఆంగ్లేయులకు లొంగిపోయినాడని తెలిసికూడా తాత్యా అతడిపై ఇంకా నమ్మకముంచాడు. మాన్‌సింగ్ ఇంకా ఇలా అన్నాడు: ''నేను తిరిగివచ్చేవరకు మీరు నా అనుచరుని వెంట భద్రంగా తిరుగవచ్చు.''

తాత్యాను ఆ అనుచరునికి వప్పగించి ఈ నీచుడు ఆంగ్లేయుల వద్దకు వచ్చాడు. వారితో కరస్పర్శ చేశాడు. బొంబాయి దళానికి చెందిన సిపాయిలు కొందరు మాన్‌సింగ్ వెంట తిరిగి పంపబడ్డారు. భారత సిపాయి లందరికి తాత్యా అంటే ఎంతో సానుభూతి. ఆంగ్లేయులు ఏ భారత సిపాయిని పూర్తిగా నమ్మలేదు. అందువల్ల ఆంగ్లేయులు వారికి తాత్యా పేరే చెప్పలేదు. మాన్‌సింగ్‌ను అనుసరించి ఆయన ఆజ్ఞల మేరకు అనుమానితులను బంధించవలసిందిగా ఆదేశించి పంపారు. వారిని తీసుకుని మాన్‌సింగ్ పరోన్ అడవులలోనికి వెళ్ళాడు. మూడు రోజులలో తిరిగివచ్చి తాత్యా ఫిరోజ్ షా వద్దకు వెళ్ళవలెనో లేదో సలహా ఇస్తానని చెప్పి ఉన్నాడు. మూడవరోజు అర్థరాత్రి అయింది. మాన్‌సింగ్ సేవకుడు చూపిన స్థలంలో తాత్యా నిశ్చింతంగా నిద్రపోతున్నాడు. మాన్‌సింగ్ అచటికి చేరాడు. తన సిపాయీలకు సైగచేశాడు. తాత్యా కన్ను తెరిచేసరికి తాను ఆంగ్లేయుల బందీ అయినట్లు గుర్తించాడు.

మరునాడుదయం అతనిని సిప్రిలోని జనరల్ మీడ్ శిబిరానికి తీసుకువెళ్ళారు. వెంటనే కోర్టు మార్షల్ విచారణ జరిగింది. తాత్యామీద ఆంగ్లరాజ్యంపై యుద్ధం ప్రకటించిన నేరం మోపారు. బుధవారం నాడు తాత్యా తన జవాబును వ్రాసి ఉంచాడు. ''నేను ఏమి చేసినా నా యజమాని చెప్పిన మేరకు చేశాను. కల్పికి పూర్వం వరకు నానా సాహెబ్ క్రింద పని చేశాను. ఆ తర్వాత నా యజమాని రావ్ సాహెబ్. ప్రత్యక్ష సమరంలో తప్ప నేనుగాని, నానాగాని ఏ ఆంగ్లేయుని - స్త్రీనిగాని, పురుషునిగాని,

శిశువునిగాని - చంపలేదు, ఉరి తీయలేదు. ఈ విచారణలో ఇక నేను పాల్గొనదలచలేదు'' అని వ్రాశాడు.

ఆంగ్లేయుల ప్రత్యేక విజ్ఞప్తిపై తాత్యా విప్లవ ప్రారంభమునుంచి జరిగిన తన దినచర్యను తెలియజేశాడు. ఆయన చెప్తుండగా దానిని ఒక మున్షీ వ్రాశాడు. అనంతరము అది తాత్యాకు చదివి వినిపించబడ్డది. ఆ తర్వాత దాని క్రిందను, పైన ఉదహరించిన తన సంజాయిషీ క్రిందను ఆంగ్లములో ''తాత్యాతోప్'' అని సంతకం చేశాడు. తన నడిగిన ప్రశ్న లన్నిటికి అతడు హిందూస్థానీలో జవాబిచ్చాడు. ఆ జవాబులు సూటిగా, క్లుప్తంగా, భావయుక్తంగా ఉన్నాయి. ఎవరైనా ఆంగ్లములో ప్రశ్నిస్తే హిందూస్థానీలో ''మాలుమ్‌నహి'' (నాకు తెలియదని) జవాబిచ్చేవాడు.

విచారణ-బుధ, గురు, శుక్రవాములు మూడు రోజులు జరిగింది. ఆయన దర్శనానికి ఎందరో భారతీయులు వచ్చేవారు. తరచు వారికి అనుజ్ఞ ఇచ్చేవారు కాదు. అనుజ్ఞ పొందగలిగినవారు మాత్రం ఆయన దర్శనం లభించగానే గౌరవంతో, అభిమానంతో తలలువంచి నమస్కరించే వారు. ఆంగ్లేయు లతడితో-ఇక విచారణ ప్రారంభమవుతుందని, తన సాక్ష్యాలను సేకరించుకొనవచ్చునని చెప్పగానే తాత్యా ''ఆంగ్లేయులపై యుద్ధం చేయడంలో మృత్యువుకు సైతం సిద్ధపడి ఉండాలని నాకు తెలుసు. నాకీ న్యాయస్థానమూ వద్దు, ఈ విచారణలో పాల్గొనాలనే అభిలాషకూడా నాకు లేదు'' అని ధీర గంభీర స్వరంతో జవాబిచ్చాడు.

1859 ఏప్రిల్ 18 నాటికి ఈ విచారణ అనబడే తంతు ముగిసింది. తాత్యాకు ఉరిశిక్ష విధించారు. సాయంత్రం నాల్గు గంటల కాతడిని ఉరి కంబమునద్దకు తీసుకువెళ్ళారు. మూడవ బెంగాల్ యూరోపియన్ దళము వారు అతడిని శిబిరం నుండి తీసుకువెళ్ళారు. తాత్యా ఉరికంబంవద్ద చేరే సరికి సైనికదళాలు దానిచుట్టూ బారులుతీరి నిలిచి ఉన్నాయి. భారతీయ పదాతి సైనికులు, ఆంగ్లేయాశ్వికులు, ప్రేక్షకులు ఎందరో అక్కడ సమా

వేశమై యున్నారు. వారిలో అక్కడక్కడ గ్రామీణులు ఉన్నారు. తన తండ్రిని మాత్రం హింసించవద్దని తాత్యా మరల కోరాడు. నేరము, శిక్ష చదువబడ్డది. తాత్యా కాలి సంకెళ్ళు తెగకొట్టబడ్డాయి. అతడు స్థిరంగా ఉరి కంబపు మెట్లెక్కాడు. సంప్రదాయం ప్రకారం తలారులు అతని కాళ్ళు చేతులు కట్టి వేయబోతుండగా అతడు చిరునవ్వుతో "ఈ లాంఛనాలు అక్కర లేదులెండి" అని స్వయంగా ఉరిత్రాడును మెడలో తగిలించుకున్నాడు.

1857 స్వరాజ్య సమరవీరుడు. పీష్వాల పరమవిధేయుడు, అమర వీరుడు, ధర్మరక్షకుడు, ప్రేమాస్పదుడు, గర్వకారకుడు, మహోదాత్తుడు నగు తాత్యా ఆంగ్లేయుల ఉరి త్రాటిన సిద్ధివియై వ్రేలాడాడు. ఆ శరీరం సూర్యాస్తమయం వరకు వ్రేలాడుతునే ఉన్నది. కాపలాదారులు తొలగిపోగానే ఆంగ్లేయ ప్రేక్షకు లొక్కసారిగా కంబముమీదికి ఎగబడ్డారు. ఆ అమరవీరుని కేశము నొకదానిని స్మృతి చిహ్నంగా సంపాదించేందుకు ముందుకు త్రోసుకు వెళ్లారు.

1857 స్వాతంత్ర్య సమర మహాయజ్ఞంలో ఇది అంతిమ బలిదానం!

# ఉపసంహారం

తాత్యా టోపు విడచిన తర్వాత రావ్‌సాహెబ్ మరొక నెల పోరా డాడు. చివరకు మారువేషంలో అడవులలోనికి చేరిపోయినాడు. మూడేండ్ల తరువాత అతడు కూడా పట్టుబడి 1862 ఆగష్టు 20 వ తేదీన కాన్పూ రులో ఉరితీయబడినాడు.

ఫిరోజ్‌షా కూడ మారువేషంలో తిరుగాడి చివరకు భారతదేశం వదలి వెళ్ళి పర్షియాలోని మోర్చెలాలో జీవించాడు.

1857 మహావిప్లవం తరచు చర్చనీయాంశమైంది. ప్రయత్నాలు పూర్తి కారపూర్వమే విప్లవం ప్రజ్వరిల్లిందా ? అలా భావించజాలము అప్పుడు జరిగిన ప్రయత్నాలు అంతకు పూర్వం జరిగిన అనేక విజయ వంతమైన విప్లవాల ప్రయత్నాలకన్న కూడా చక్కగా జరిగాయి. వరు సగా సైనిక దళాలు, రాజాలు, ప్రభుత్వాధికార్లు, పోలీసులు, నగరాలకు నగరాలు విప్లవవాగ్దానాలు చేసిన తరువాత ఎవరు విప్లవం ప్రారంభించరు?

అయితే పరాజయ కారణమేమిటి? విప్లవములోని నిర్మూలనాత్మక పథకాలు చక్కగా యోజింపబడినప్పటికి నిర్మాణాత్మక భాగాలు అంత ఆకర్షణీయంగా లేవేమోనని భావించవలసి వస్తుంది. ఆంగ్లరాజ్య విధ్వంస నకు ఎవరూ వ్యతిరేకులు కానిమాట నిజమే. కాని భవిష్యత్తుకు సంబంధిం చిన యోజన ఏమిటి ? మళ్ళీ పాత పరిస్థితులే తిరిగి రావడంకోసం మళ్ళీ

అదే మొగల్బులు, మరాఠీలు, అవే తగాదాలు, అవే పరిస్థితులు - ఏ పరిస్థితులకు విసుగెత్తి ఒకానొక దుర్ఘడియలో విదేశీయుల ప్రవేశం యెడ జాతి ఉదాసీనత వహించిందో, అవే పరిస్థితులు పునరావృతం కావడానికే అయితే - ఇంత రక్తార్పణం చేయవలసిందేమీ లేదని అత్యధికులైన సామాన్యులు భావించారు.

ప్రజల హృదయాలను రంజింపజేయగల మహా లక్ష్యాలను వారి ముందు స్పష్టంగా ఉంచగలిగినట్లయితే విప్లవం ఎంత చక్కగా ప్రారంభమైందో అంత విజయవంతంగాను ముగిసి ఉండేది.

మహా ప్రళయం తర్వాత మళ్ళీ సృష్టి జరుగుతుందనే విషయాన్ని ప్రజలు సరిగ్గా అవగాహన చేసుకున్నప్పటికీ విప్లవం విజయవంతమయ్యేది. కాని ప్రధానంగా - పాతకాలపు పరిస్థితులకన్న ఆంగ్లేయ పరిపాలన ప్రమాదభూయిష్టమైనదని గుర్తించలేకపోయినవారి వల్లను; స్వదేశీయులకు వ్యతిరేకంగా విదేశీయులకు ఆశ్రయాన్నివ్వడాని విరోధించే నిజాయతీ, దేశభక్తి లేనివారివల్లను - విప్లవం విఫలమైందనిపిస్తుంది.

స్వాతంత్ర్యం వాంఛింపబడేది దేశం ఆర్థికంగా ప్రయోజనం పొందుతుందని కాదు, అందులోనే ఆత్మకు శాంతి అనేది ఉంటుంది కనుక లాభనష్టాలకన్నా ఆత్మగౌరవం గొప్పది. బంగారు బోనుకన్న స్వేచ్ఛారణ్యం మేలైనది. దీనిని అర్థం చేసుకొని, తమ దేశధర్మాల కోసం విధిని నిర్వహించి స్వధర్మ స్వరాజ్యాల కోసం కత్తిపట్టి, విజయంకోసం కాకపోయినా విధి నిర్వహణకోసం మృత్యువు నెదుర్కొన్న మహనీయుల పేర్లు చిరస్మరణీయాలు; ప్రాతఃస్మరణీయాలు.

భారతదేశంలో ఎంతవరకు ఐక్యత ఉన్నది? స్వరాజ్యానికి, అధికార నిర్వహణకు అది ఎంతవరకు పరిపక్వమై ఉన్నది? అంచనా వేసుకునే పరీక్ష 1857 మహావిప్లవం. దాని పరాజయ బాధ్యత—

సోమరులు, నపుంసకులు, స్వార్థపరులు, దేశద్రోహులు నైనవారిది. కాని స్వీయరక్తంలో తమ ఖడ్గాలను తడిపి అగ్నిజ్వాలలోకి, మృత్యుదేవి ఎదుట స్వైరవిహారం జరిపిన వీర యోధులను కించిత్తు అల్పంగా భావింప తగదు. వారంతా పిచ్చివారు కాదు; వారంతా తొందరపడ్డవారు కాదు; పరాజయ కారకులు వారు కాదు; వారాలోచన లేనివారుకాదు; అందువల్ల వారిని నిందించతగదు.

బహదూర్‌షా కవి. ఒక విప్లవ సమయంలో అతడొక గజల్‌ను వ్రాశాడు. ఎవరో ఆయనతో అన్నారు :

**దుంబుహూయ్ మేఁ దమ్ నహీఁ ఖైర్ మాంగో జాన్‌కి**
**హై జఫార్ థండీ హుయీఁ షంషేర్ హిందూస్తాన్ కీ**

"క్షణక్షణము మీరు బలహీనపడుతున్నారు. మీ ప్రాణాలకై ఆంగ్లేయులను ప్రాధేయపడండి. ఓ పాదుషా; భారతీయుల ఖడ్గం శాశ్వతంగా విరిగిపోయింది'' అని.

దానికి బహదూర్‌షా ఇలా జవాబిచ్చాడట :

**ఘాజియోం మేఁబూ రహేగీ జబ్ తక్ ఈమాన్ కీ**
**తబ్-తో లండన్ తక్ చలే తేగ్ హిందూస్థాన్ కీ**

"మా వీరుల హృదయాలలో విధేయత మిగిలి ఉన్నంతకాలం హిందూస్థానపు ఖడ్గం తీక్షణంగానే ఉంటుంది. ఒకానొకరోజున అది లండన్‌వరకు దూసుకుపోతుంది.''

—: వందేమాతరమ్ :—

1857 Swarajya Sangramam

ముద్రణకు పూర్వమే నిషేధింపబడి, అజ్ఞాతంగానే ఆరుసార్లు ముద్రింపబడి, నలభై సంవత్సరాలు ప్రభుత్వాధి కారుల దాడికి గురువుతూ చరిత్రను సృష్టించిన చారిత్రక గ్రంథమిది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో విప్లవకారులకు భగవద్గీతవంటిదని కీర్తింపబడిన విప్లవగాథ.

ఆంగ్లేయులు దురుద్దేశపూర్వకంగా సిపాయిల తిరుగు బాటుగా చిత్రించిన భారత ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ స్వరూప వాస్తవచిత్రం. అమరవీరులు నానాసాహెబ్, ఝాన్సీలక్ష్మీబాయి, తాత్యాతోప్ మొదలగు వారి సాహ సోపేతగాథలకు అక్షరరూపం.

వ్రాసిన ప్రతిమాటతో దేశ భక్తులకు ఉత్తేజాన్నీ, విదేశీ ప్రభుత్వానికి ఆగ్రహాన్నీ కలిగించిన స్వాతంత్ర్య వీర సావర్కార్ అపూర్వసృష్టి.

## చైతన్యమాల - 3

నవభారతి ప్రచురణలు



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B134 |
| పుస్తకం పేరు | స్వరాజ్య సంగ్రామం |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 239 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |